# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

VEEKSHANAM, TELUGU MONTHLY

సంపుటి : 18 సంచిక : 4-7 హైదరాబాద్ 225 ఏప్రిల్-జూలై 2020 పేజీలు : 84 రు. 25

- కొవిడ్ - 19 పై తొమ్మిది ప్రత్యేక వ్యాసాలు
- అనాలోచిత లాక్‌డౌన్ విపరిణామాలు
- వలస శ్రామికుల దయనీయ స్థితి
- వ్యాధి వ్యాప్తిపై తెలంగాణ హైకోర్టు ఆదేశాలు
- ఆంధ్రప్రదేశ్ బడ్జెట్ 2020-21
- ఎల్‌జి పాలిమర్స్ విషవాయు దుర్మార్గం
- అమెరికాలో ప్రజాగ్రహం - భారత్ నిశ్శబ్దం

### పాఠకులకూ, అభిమానులకూ వీక్షణం విన్నపం

## నాలుగు నెలల విరామానికి క్షమాపణలు

వీక్షణం మార్చ్ 2020 సంచిక తర్వాత నాలుగు నెలలకు పాఠకులతో మళ్లీ సంభాషించడం సాధ్యమవుతున్నందుకు సంతోషిస్తున్నాం. మా చేతుల్లో లేకుండా జరిగిపోయిన ఈ అనివార్య విరామానికి క్షమించవలసిందిగా కోరుతున్నాం. ఈ నాలుగు నెలల్లో పత్రిక గురించి ఆందోళన ప్రకటించిన, ఎప్పుడొస్తుందని పదే పదే అడిగిన, తప్పనిసరిగా రావలసిన అవసరం ఉందనే ఆకాంక్షను బలంగా వెల్లడించిన మిత్రులకూ, అభిమానులకూ, పాఠకులకూ అందరికీ సవినయ ధన్యవాదాలు.

వీక్షణం పద్దెనిమిది సంవత్సరాల జీవితంలో తొలి రెండు సంవత్సరాలు పక్షపత్రికగా ఉన్నప్పుడు మాత్రమే కొన్ని సంచికలు వెలువడడానికి అవాంతరాలు వచ్చి, ఆ రెండు సంవత్సరాలలో 48 సంచికలు రావలసింది 42 సంచికలు వెలువడ్డాయి. మాసపత్రికగా మారిన తర్వాత 2005 జనవరి నుంచి 2020 మార్చ్ సంచిక వరకు ఒక్క సంచిక కూడ ఆగిపోలేదు. ప్రతినెల సంచికా ఆ నెల మొదటి వారంలోనే పాఠకుల చేతికి అందింది.

కాని, కరోనా వైరస్, కొవిడ్-19 మహావిపత్తు వల్ల, ప్రభుత్వాల అనాలోచిత, ప్రణాళికా రహిత లాక్‌డౌన్ నిబంధనల వల్ల జనజీవనమే పూర్తిగా స్తంభించి, ప్రింటింగ్ ప్రెస్ నడవక, పోస్టల్ సేవలు లేక వీక్షణం నాలుగు నెలలుగా పాఠకులకు అందించడం సాధ్యం కాలేదు. ఆ నిర్వహణా సమస్యలతో పాటు ఆర్థిక సమస్యలు కూడ వీక్షణం వెలువడక పోవడానికి కారణమయ్యాయి. లాక్‌డౌన్ వల్ల ఉద్యోగుల జీతాల్లో కోత విధించడంతో, చిన్న వ్యాపారాలు దెబ్బతినడంతో వీక్షణంకు విరాళం ఇచ్చే ప్రధానమైన దాతల ఆదాయం తరిగిపోయి, విరాళాలు ఆగిపోయాయి. అంతకు ముందే ఇబ్బందికరంగా ఉన్న వీక్షణం ఆర్థిక స్థితి దీనితో మరింత దిగజారింది. లాక్‌డౌన్ పాక్షిక సడలింపు జరిగినప్పటికీ జూన్ సంచిక తేలేకపోవడానికి ఈ ఆర్థిక దుస్థితే కారణం. వీక్షణం నిరంతరాయంగా వెలువడడానికి అవసరమైన ఆర్థిక స్థితిని కల్పించడానికి, మెరుగుపరచడానికి మీలో ప్రతి ఒక్కరూ మీ చేతనైన సహాయం చేయాలని మరొకసారి అభ్యర్థిస్తున్నాం. చందాలు చేర్పించాలని, విరాళాలు, వ్యాపార ప్రకటనలు విరివిగా సేకరించాలని కోరుతున్నాం.

ఈ మధ్యలో ఏప్రిల్ - మే సంచికలు కలిపి ఎనభై పేజీలతో సాఫ్ట్ కాపీ తయారు చేసి ఇంటర్‌నెట్ మీద, వీక్షణం బ్లాగ్ మీద ప్రచురించాం. కాని అది వీక్షణం పాఠకులలో గణనీయమైన భాగానికి అందలేదు. అందువల్ల ఇప్పుడు అచ్చు ప్రతిని ఏప్రిల్ - జూలై 2020 సంచికగా వెలువరిస్తున్నాం. ఇంటర్‌నెట్ మీద వెలువడిన ఏప్రిల్-మే సంచికలోని ముఖ్యమైన వ్యాసాలను వీలైనంత వరకు వరుసగా పునర్ముద్రించి, ఆ సాఫ్ట్ కాపీ చూడని పాఠకులకు అందుబాటులోకి తేదలచుకున్నాం. ఈ విరామంతో చందాదారులు మూడు సంచికలు కోల్పోయారు గనుక ప్రతి సంవత్సర చందానూ అదనంగా మరొక మూడు సంచికల పాటు పొడిగిస్తాం.

వీక్షణం పట్ల మీ ఆదరాభిమానాలు యథాతథంగా కొనసాగుతాయని విశ్వసిస్తూ...

- వీక్షణం కలెక్టివ్

225
ISSN 2231-6892

# వీక్షణం

రాజకీయార్థిక, సామాజిక మాసపత్రిక

ఏప్రిల్-జూలై 2020
సంపుటి : 18
సంచిక : 4 - 7





**కొవిడ్ 19 - ప్రత్యేక వ్యాసాలు**





**'వీక్షణం' పేరిట రచనలు, ఎం.ఓలు, చెక్కులు,డి.డి లు పంపాల్సిన చిరునామా**

**వీక్షణం** VEEKSHANAM

మైత్రీ రెసిడెన్సీ, 3-6-394, స్ట్రీట్ నెం. 3, హిమాయత్‌నగర్,
హైదరాబాద్ - 500 029. ఫాక్స్, ఫోన్ : 040-66843495
Email : veekshanam2003@gmail.com
www.veekshanam.wordpress.com

ప్రింటర్స్ : **చరితా ఇంప్రెషన్స్**
ఆజామాబాద్, హైదరాబాద్. ఫోన్ : 040 - 27678411

**వీక్షణం చందా వివరాలు**

| | సంస్థలకు / లైబ్రరీలకు | వ్యక్తులకు |
|---|---|---|
| విడి ప్రతి | రు. 25 | రు. 25 |
| సంవత్సరం | రు. 300 | రు. 250 |
| మూడు సంవత్సరాలు | రు. 900 | రు. 650 |
| ఐదు సంవత్సరాలు | రు. 1500 | రు. 1100 |
| పది సంవత్సరాలు | రు. 3000 | రు. 2000 |

ఆన్‌లైన్ ఆంధ్రబ్యాంక్ ద్వారా డబ్బులు పంపేవారు బ్యాంక్ స్లిప్‌లపై '**VEEKSHANAM**' అని రాసి తమ పేరు కూడా రాయాలి. వీక్షణం అకౌంట్ నెంబర్ - **013911011002175** ఆంధ్రాబ్యాంక్, గగన్‌మహల్ బ్రాంచ్, హైదరాబాద్ పేరు మీద వేయాలి. ఇతర బ్యాంకులలో వేసేవారు **ANDB 0000139** నెంబర్‌తో పాటు తమ పేరు కూడా రాసి వేయాలి.

**వీక్షణం ఆర్థిక పరిస్థితిని వివరిస్తూ చేసిన విజ్ఞప్తికి స్పందిస్తూ వీక్షణంను నిలబెట్టుకోవాలనే తపనతో ఆర్థిక సహాయం అందించిన డా. తిరుపతయ్య, జమ్మికుంట - రు. 10,000, జి.ఎస్.కె. రాజా, హైదరాబాద్ - రు. 5,000; మిత్రులకు కృతజ్ఞతలు - సం.**

కరోనా వల్ల అన్ని వ్యవస్థలు దెబ్బతిన్నాయి. ముఖ్యంగా మధ్యతరగతి, పేదవారిపై దీని ప్రభావం చాలా తీవ్రంగా ఉంది. వీక్షణం పత్రిక ఆన్‌లైన్‌లో కరోనాపై వచ్చిన వ్యాసాలు చాలా విశ్లేషణాత్మకంగా ఉన్నాయి. అన్ని రంగాలపై కరోనా ప్రభావాన్ని విప్పి చెప్పాయి. అలాగే ప్రభుత్వాల వైఫల్యాలను కూడా ఎత్తి చూపింది. ముఖ్యంగా లాక్‌డౌన్ వల్ల వలస కార్మికుల దుస్థితి తీవ్రంగా కలచివేసింది. కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు తమ వైఫల్యాలను కప్పిపుచ్చుకోవడానికి కరోనాను సాకుగా చూపుతున్నారు. రోజురోజుకూ కరోనా బాధితులు పెరుగుతున్నారు. మరోవైపు అటు కేంద్ర ప్రభుత్వం, ఇటు రాష్ట్ర ప్రభుత్వం ఎటువంటి నియంత్రణా చర్యలు చేపట్టడం లేదు. కేసులు తక్కువగా ఉన్న సమయంలో లాక్‌డౌన్ పెట్టి పేద, మధ్యతరగతి ప్రజలను ఇబ్బందులకు గురిచేశారు. లాక్‌డౌన్ ఎత్తివేసి, నిత్యావసర, పెట్రోల్ డీజిల్ ధరలను విపరీతంగా పెంచి ఇంకా తీవ్రంగా ప్రజలను నష్టపరుస్తున్నారు. వీక్షణంలో వీటిపై సమగ్ర విశ్లేషణలతో వ్యాసాలు రావాలి. ప్రభుత్వాలు చేస్తున్న దుర్మార్గ విధానాలపై రాజకీయార్థిక కోణంలో వ్యాసాలు రావాలి. అటు తెలంగాణ, ఇటు ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలు బడ్జెట్‌లను ప్రవేశపెట్టాయి. ఈ బడ్జెట్ లెక్కలు నాలాంటి సామాన్యులకు అర్థం కావు. కాబట్టి సరళంగా అర్థమయ్యేలా వీక్షణం ఆ పనికి పూనుకోవాలి.

**– తుమ్మూరు కృష్ణ**
నల్లగొండ

పసుపు–ఎర్రజొన్న రైతులపై ప్రభాకర్ వ్యాసం బాగుంది. ప్రభుత్వాలు అధికారంలోకి రావడానికి ఎన్ని అబద్ధాలు, ఎన్ని వాగ్దానాలు చేస్తారనేది బహిర్గతం చేశారు. నిజామాబాద్ జిల్లా రైతులు ఎన్నో ఏళ్ల నుంచి పసుపు బోర్డు కోసం పోరాటం చేస్తున్నారు. తెలంగాణ రాష్ట్రం ఏర్పడిన తర్వాత అయినా ఆ కోరిక నెరవేరుతుందేమోనని ఎదురు చూశారు. కాని ప్రతిసారి ఎన్నికల హామీగానే మిగిలిపోతోంది తప్ప అది రూపుదాల్చడం లేదు. రైతులకు అండగా నిలిచి వారి పోరాటం వృథా కాకుండా చూడాల్సిన బాధ్యత ప్రజాస్వామ్యవాదులు అందరిపై ఉంది. అలాగే జైలుకు వెళ్లేముందు ఆనంద్ తేల్తుంబ్డే లేఖ కూడా బాగుంది. ఆర్ఎస్ఎస్–బిజెపి కూటమి చేస్తున్న దురాగతాలను ఎండగట్టింది. ప్రజల తరఫున మాట్లాడుతున్న మేధావులను ఒక్కొక్కరినీ ఇలా అక్రమ కేసులు బనాయించి జైల్లో పెట్టడం ద్వారా ఎవరు రాజ్యాంగం కల్పించిన వాక్ స్వాతంత్ర్యాన్ని రాజ్యం అణగదొక్కుతోంది.

**– బి. నాగరాజు**
నిజామాబాద్

వీక్షణం ఆన్‌లైన్ సంచికలో భీమా కోరేగాం కేసుపై వ్యాసం, కవి వరవరరావు ప్రాణాలు కాపాడండి అంటూ భారతీయ కవుల అప్పీలు చదివాను. పోలీసుల దమననీతికి అంతం లేదా. మేధావులను, అనారోగ్యంతో ఉన్నవారిని ఇంత దారుణంగా జైల్లో ఉంచడం అమానవీయం. కేసుకు సంబంధించిన కోర్టులో సరైన సాక్ష్యాలు ప్రవేశపెట్టకుండా, కేసును వాయిదాల మీద వాయిదాలు వేయిస్తూ వారిని మానసిక క్షోభకు గురిచేస్తున్నారు. వీరిని జైల్లో పెట్టి రెండు సంవత్సరాలు కావొస్తుంది. జైళ్లలో కరోనా వ్యాధి తీవ్రంగా ప్రబలుతోంది. ఈ పరిస్థితుల్లో సరైన వైద్య సదుపాయాలు కల్పించకుండా వారి ఆరోగ్య పరిస్థితిని దిగజారుస్తున్నారు. వీరి విడుదలకు మనమందరం కలిసి ఉద్యమించాలి.

**– కెంచర నరేందర్**
పెద్దపల్లి

వీక్షణం ఏప్రిల్–మే సంచికలను ఆన్‌లైన్‌లో చదివాను. వీక్షణంలో వచ్చే అన్ని వ్యాసాలు ప్రతి నెల క్రమం తప్పకుండా చదువుతుంటాను. కాని కరోనా ప్రభావం వల్ల అన్ని మూతపడడంతో వీక్షణం పత్రిక వస్తుందో రాదో అని ఎంతో ఆందోళన కలిగింది. ప్రింటింగ్ ప్రెస్‌లు బంద్ అవడంతో పత్రిక ప్రింట్ చేయడం సాధ్యం కాకున్నా ఆన్‌లైన్‌లో తీసుకురావడం చాలా సంతోషంగా ఉంది. కరోనా గురించి వీక్షణంలో వ్యాసాలు రావాలని అనుకున్నాను. కాని ఏకంగా 11 వ్యాసాలు రావడం అభినందనీయం. ఈ వ్యాసాలు కరోనా వైరస్ రావడానికి కారణాలు, పాలకుల అనాలోచిత విధానాల వల్ల వలస కూలీల అవస్థ, కరోనాను అడ్డుపెట్టుకొని పేద ప్రజలను పట్టించుకోకుండా కార్పొరేట్ కంపెనీల లాభాల కోసం ప్రభుత్వ విధానాల తీరుతెన్నుల గురించి ఈ వ్యాసాలలో చాలా బాగా వివరించారు. వలస కూలీలు తమ సొంత ఊళ్లకు వెళ్లడానికి ఎలాంటి సౌకర్యాలు కల్పించని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు కరోనా సమయంలో చప్పట్లు కొట్టమనడం, కొవ్వొత్తులు వెలిగించమనడం చూస్తుంటే చాలా ఆశ్చర్యంగా ఉంది. ఇలాంటి సమయంలోనే వీక్షణం లాంటి పత్రికల అవసరం ఎంతగానో ఉంది. కరోనాపై ఇంకా వ్యాసాలు రావాలని, ఈ సమయంలో పాలకులు అనుసరిస్తున్న విధానాల పట్ల సామాన్య ప్రజలు తెలుసుకోదగిన ఎన్నో విషయాలు తెలియజేస్తారని ఆశిస్తున్నాను.

**– కృష్ణహరి**
మహబూబ్‌నగర్

కరోనా ప్రభావం వల్ల అసలు పత్రిక వస్తుందో రాదో అని అనుకుంటున్న సమయంలో సమయానికి పత్రికను ప్రింట్ చేయడం వీలు కాకున్నా ఆన్‌లైన్‌లో తీసుకువచ్చారు. అసలు కరోనా వైరస్ ఎలా వచ్చిందో, కరోనా సాకుతో పాలకులు అనుసరిస్తున్న విధానాల గురించి, వలస కార్మికుల పట్ల వ్యవహరించిన తీరును గురించిన విషయాలను వివరంగా రాశారు. రోజూవారీ వార్తలలో తెలియని విషయాలను రచయితలు తమ వ్యాసాల్లో అందించారు. కరోనాపై అవగాహన లేని ప్రతి ఒక్కరు తప్పకుండా ఈ వ్యాసాలు చదవాలని కోరుకుంటున్నాను. పత్రికను ఇలాంటి సమయంలో కూడా మంచి వ్యాసాలతో తెస్తున్న సంపాదకులకు ధన్యవాదాలు.

**– మాధవ్‌కుమార్**
జహీరాబాద్

నేను ప్రతి నెల వీక్షణంతో పాటు దినపత్రికలు, అట్లాగే అభ్యుదయ పత్రికల్లో వచ్చే వ్యాసాలు చదివి ఒక అవగాహనకు వచ్చేవాన్ని. గత మూడు నెలలుగా వీక్షణం అందకపోయే సరికి అసలు ఏం జరుగుతుందో తెలియని పరిస్థితి ఎదురైంది. కరోనా వైరస్ వల్ల ఏర్పడిన లాక్‌డౌన్ కారణంగా అన్ని వ్యవస్థలు మూసుకుపోయాయి. టివిల్లో, దిన పత్రికల్లో వచ్చే వార్తలే దిక్కయ్యాయి. కాని వాటిని నమ్మే అవకాశం లేదు. ఎందుకంటే అధికారంలో ఎవరుంటే వారిని కీర్తించడమే వాటి పనిగా మార్చేశారు వాటి యాజమాన్యం. కరోనా కాలంలో అందరికి కష్టాలే వచ్చిపడ్డాయి. ఇది వరకే ఆర్థిక సమస్యతో నెట్టుకొస్తున్న వీక్షణంకు లాక్‌డౌన్ తోడుకావడంతో మరిన్ని ఇబ్బందుల్లో ఉండి ఉండవచ్చు. కాని ప్రభుత్వాలు అమలు చేస్తున్న విధానాల పట్ల నిష్పక్షపాతంగా విషయాలను వెల్లడిస్తున్న పత్రికలు చాలా తక్కువ. అలాంటి పత్రికల్ని కాపాడుకోవాల్సిన బాధ్యత నాలాంటి పాఠకులందరిపై ఉంది. కరోనా లాంటి వైరస్‌లు ఎలా వస్తున్నాయి? ప్రజలపై వాటి ప్రభావమెంత అనే విషయాలపై నా లాంటి వారికి అవగాహన కలిగేందుకు వీక్షణం లాంటి పత్రిక అవసరం ఎంతో ఉంది. పత్రికను ఆపకుండా తెస్తారని కోరుకుంటు వీక్షణం బృందానికి కృతజ్ఞతలతో...

**– వెంకటయ్య**
సిద్దిపేట

# దేశభక్తి ప్రజల మీద ఆయుధం



గురజాడ నూట పది సంవత్సరాల కింద దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుషులోయ్ అన్నాడు. భారత పాలకులు మాత్రం ఆ మనుషుల చేతనే దేశమంటే మట్టి అనీ, సొంత ఆస్తి అనీ, గట్ల కోసం తగాదాలు పడవలసిన, భావోద్వేగాలు పెంచుకోవలసిన మడిచెక్క అనీ నమ్మించడంలో విజయం సాధించారు. దేశమంటే తామేనని, తమ అభివృద్ధి మాత్రమే దేశాభివృద్ధనీ గుర్తించవలసిన మనుషులను ఇంత దారుణంగా వంచించడంలో, పక్కదారి పట్టించడంలో, దేశభక్తిని మత్తుమందుగా, సెంటిమెంట్‌గా మార్చి జాతీయోన్మాదాన్ని రెచ్చగొట్టడంలో పాలకులు కనీవినీ ఎరగని విజేతలయ్యారు. దేశభక్తి అనేదాన్ని ప్రశ్నించడానికీ, చర్చించడానికీ, మరొక కోణం ఉంటుందని ఊహించడానికీ వీలులేని పవిత్ర గోవుగా మార్చివేశారు. అంతకన్న ఘోరంగా దేశభక్తిని ప్రభుత్వ భక్తితో సమానం చేశారు. సాధారణంగా ప్రభుత్వ పనులను విమర్శించేవారు కూడ, అదే ప్రభుత్వం దేశం పేరుతో, దేశభక్తి పేరుతో చేసే పనులను ప్రశ్నించడానికి వీలులేని వాతావరణం తయారు చేసిపెట్టారు. అలా తయారైన దేశభక్తి పాలకవర్గాల చేతుల్లో, పాలక పక్షాల చేతుల్లో, ప్రభుత్వాల చేతుల్లో ఒక సాకుగా, పన్నాగంగా, కనికట్టుగా, ప్రజలను పక్కదారి పట్టించే సాధనంగా, ఆయుధంగా మారిపోయింది. నిజానికి ఈ ఆయుధం శత్రు దేశమని పిలవబడుతున్న పొరుగుదేశం మీదికి కాదు. అలా ఆ దేశం మీదికి ఆ ఆయుధం ఎక్కుపెట్టినా ఈ దేశానికి, ఈ దేశ ప్రజలకు ఒరగబోయేదేమీ లేదు. జరుగుతున్న పని ఆ దేశం పేరు చెప్పి, ఈ దేశ ప్రజల మీదికి, వారి ఆలోచనా శక్తి మీదికి ఆయుధం ఎక్కుపెట్టడమే. అసలు దేశంలో అంతర్గతంగా సమస్య వచ్చినప్పుడల్లా పొరుగు దేశాలతో సరిహద్దులలో ఏదో ఒక సమస్య రగుల్కొంటూ ఉండడం భారత చరిత్రలో కనీసం ఏడు దశాబ్దాల అనుభవం. సైన్యం మాత్రమే ఉండే ఆ సరిహద్దుల్లో, చాల చోట్ల మంచుకొండలు తప్ప నరమానవుడు లేని ఊసరక్షేత్రాల్లో ఏం జరిగిందో, జరుగుతున్నదో ఎవరికీ తెలియదు. సైనికాధికారులో, ప్రభుత్వాధికారులో, మంత్రులో, ప్రధానమంత్రో ఏమి చెపితే అదే వార్తగా ప్రచారంలోకి వస్తుంది. ఆ వార్త నిజమా అబద్ధమా అర్ధసత్యమా మరొక కోణం ఉందా అని తేల్చుకోవడానికి స్వతంత్ర పరిశీలనకు అవకాశమే లేదు. అలా సరైన, సంపూర్ణమైన సమాచారం లేని స్థితిలో, ప్రభుత్వం ప్రచారం చేసినదంతా నిజమేనని నమ్మవలసిన స్థితిలో హేతుబద్ధమైన, వాస్తవికమైన వైఖరి ఏర్పడడం కష్టం.

సాధారణ అర్థంలో చూస్తే ఏ దేశానికైనా సరిహద్దులు ముఖ్యమైనవే. రాచరిక పాలనల రోజుల నుంచీ కూడ సరిహద్దులు కాపాడడమే, విస్తరించడమే రాజుల కర్తవ్యంగా ఉండేది. ప్రజాస్వామిక యుగంలో కూడ అదే కర్తవ్యం కొనసాగుతున్నది. పెట్టుబడిదారీ విధానం వలసవాదంగా, ద్రవ్యపెట్టుబడిగా, సామ్రాజ్యవాదంగా మారిన తర్వాత నిజానికి సరిహద్దులను ముట్టుకోకుండానే దేశంలోకి ప్రవేశించి, ఆర్థిక ప్రయోజనాలు పొందడానికి అధికార పీఠాలనే శాసిస్తున్న పరిస్థితులు కూడ ఉన్నాయి. కనుక ఇరుగుపొరుగు దేశాల మధ్య సరిహద్దు అనే మాటకు సాంప్రదాయిక అర్థం చెరిగిపోయింది. అయినా అంతర్జాతీయ ఆయుధ వ్యాపారులకు, బహుళజాతి సంస్థలకు, సామ్రాజ్యవాద శక్తులకు ఆయుధాలు అమ్ముకోవడానికీ, ఆయా దేశాల మార్కెట్లను తమ అధీనంలో ఉంచుకోవడానికీ, ఒక దేశం మీదికి మరొక దేశాన్ని ఉసిగొలిపి యుద్ధాలు సృష్టించడం, యుద్ధ మేఘాలను వ్యాపింపజేయడం, నిత్యం శత్రుత్వాన్ని నిలిపి ఉంచడం అవసరం. ఆ పని దశాబ్దాలుగా జరుగుతూనే ఉంది. ఈ నేపథ్యంలో సరిహద్దులు కాపాడడానికి అనే పేరు మీద ఎన్నికైన ప్రభుత్వాలు చేసే పనులు నిజంగా సరిహద్దులు కాపాడడానికి చేస్తున్నవేనా అనే ప్రశ్న వేసుకోవలసి ఉన్నది.

ఇవాళ భారత – చైనా సరిహద్దులోని గల్వాన్ లోయ విషయంలో భారతీయ జనతా పార్టీ నాయకత్వంలోని ఎన్‌డిఎ ప్రభుత్వం, దానికి వంత పాడుతున్న ప్రతిపక్షాలు, అన్ని ప్రధాన స్రవంతి ప్రచార సాధనాలు ఆ దేశభక్తి అనే కుహనా ఆయుధాన్నే వాడుతున్నాయి. సరిహద్దుల్లో జరుగుతున్నాయని చెపుతున్న ఘర్షణలు, భారత సైనికుల మరణం, అంతకన్న హెచ్చు సంఖ్యలో చైనా సైనికులు మరణించారని భారత ప్రభుత్వ ప్రకటన, తమ వైపు మరణాలను నిర్ధారించని చైనా ప్రభుత్వం, సరిహద్దు రేఖకు ఇరువైపులా సైనిక మోహరింపు జరుగుతున్నదనీ, ఏ క్షణమైనా మళ్లీ సాయుధ ఘర్షణ జరగవచ్చుననీ, అది పూర్తి స్థాయి యుద్ధంగా మారవచ్చుననీ ఊహాగానాలు – మొత్తం మీద పరిస్థితి ఉద్రిక్తంగా ఉన్నది. ఈ సమయంలో ప్రభుత్వాలు ఏ ప్రయోజనాల కోసం ఎంత దేశభక్తిని, ద్వేషాన్ని రెచ్చగొట్టినా, ఆలోచనా పరులు, బుద్ధిజీవులు ఆలోచించవలసిన అంశాలెన్నో ఉన్నాయి. మొట్టమొదట, "మన" ప్రభుత్వం చెప్పినవన్నీ నిజాలు కాకపోవచ్చుననే ఆరోగ్యకరమైన సంశయం అవసరం. ప్రభుత్వాలు చాల సందర్భాలలో ప్రజలకు చెప్పవలసిన విషయాలు చెప్పవనీ, అబద్ధాలు చెపుతాయనీ, వాస్తవాలను కూడ తమ ప్రయోజనాలకు అనుకూలంగా మార్చి చెపుతాయనీ ఆలోచనాపరులందరికీ తెలుసు. కాని సాధారణ లోకజ్ఞానంలో భాగమైన ఈ అంశాన్ని యుద్ధం అనే మాట వినగానే చాలమంది మరిచిపోతుంటారు. అప్పటిదాకా అబద్ధాలకోరు, ప్రజల దృష్టిని మళ్లించే గారడీవాలా అని ప్రభుత్వాన్ని విమర్శించిన వారు కూడ దేశం, దేశభక్తి, యుద్ధం, పొరుగుదేశం అనే మాటలు వినగానే ప్రభుత్వం ఏమి చెప్పినా సిద్ధంగా ఉంటారు. ఈ చిత్త చాంచల్యం నుంచి బుద్ధిజీవులు బైటపడవలసి ఉంది. రెండు, ఈ ఘర్షణ వార్తలు ఏ సందర్భంలో వస్తున్నాయనేది ముఖ్యమైనది. ఏ వార్తకైనా, ఏ పరిణామానికైనా ఒక తక్షణ సందర్భం ఉంటుంది.

దేశం ఆర్థిక, రాజకీయ సంక్షోభంలో చిక్కుకొని ఉన్నప్పుడు, దానికి కొవిడ్ విషయంలో అసమర్థత కూడ తోడైనప్పుడు ప్రభుత్వం ఈ యుద్ధ మేఘాలను తీసుకువచ్చిందని గుర్తించవలసి ఉంది. మూడు, ఈ ఘర్షణలను చారిత్రక నేపథ్యంలో చూడడం అవసరం. సరిహద్దు రేఖలనేవి మన వలసవాద పాలన చరిత్ర వల్ల ఏర్పడినవి. వలసానంతరం ఇరుగుపొరుగు దేశాలతో సామరస్య పూర్వకమైన, దౌత్యపరమైన చర్చలు కాకుండా, వలస పాలకుల వారసత్వపు రేఖ ఆధారంగా ఘర్షణ పడడం అనుచితమని గుర్తించవలసి ఉంది. నాలుగు, ఇటువంటి ఉద్వేగాల వల్ల ఎవరికి ఏ ప్రయోజనం ఉందో, ఆ ప్రయోజనాల కోసమే ఉద్వేగాలు రెచ్చగొట్టబడుతున్నాయా ఆలోచించవలసి ఉంది. వీ

## సంపాదకీయ వ్యాఖ్య - తెలంగాణ

# దొర ఏది జెపితే గదే గత్తర!

జర్రాగు జర్రాగు. నా మాటకు నువ్వేదో కారెడ్డం దీస్తానవా ఏంది. దొర మాట్లాడేది గత్తర అని నేనంటలేను. గంత మాటంటనా? అని బతుకతనా? నేనన్నది ఏందంటే, దొర ఏది జెప్పినా మనం సై అనాలె అని. దొర గత్తర ఉన్నదంటె ఉన్నదనాలె. లేదంటె లేదనాలె. గదీ నా మాట. సమజైందా? దొర ఏది జెపితె గదే గత్తర. అసలు గత్తర లేదు, గిత్తర లేదు, ఆడోడు ఈడోడు మోపై ఊకూకె గాయి గాయి జేస్తాంద్రు అన్నడా లేదా దొర. ఊళ్లె కాంపోండరు సాబు, లేకపోతే మన ఆరెంపి మల్లేశం జెరం వచ్చిందంటె తెల్లగోలీలిస్తరు గద, గది ఒక్కటేసుకుంటె సరిపాయె, గత్తర లేదు గిత్తర లేదు అని దొర జెప్పనే జెప్పె. గంతే నేను ఒక్క శిత్తం జేస్కోని కూకున్న. ఢిల్లి దొర తమలపాకు తోటంటె మన దొర తలుపు చెక్కతోటనెటోడాయె. గాయినె జెప్పిందానికి మన దొర రెండాకులు ఎక్కువ జెప్పిండట. అది గుడ నివద్దె అని నేననుకుంటి. మల్ల నాలుగొద్దులకు ఏమాయెనో ఏమో దొర గత్తర ఉన్నది, కాని ఆరం పది దినాల్ల బోతది అనె. సరె మాయె, దొర జెప్పినంక తిరుగుంటదా అని అది గుడ ఖరారనుకుంటి. దొర జెప్పిన తారీఖు వచ్చె పాయె గని గత్తర పోకపాయె. తెల్శినోల్లు గుడ సావబట్టిరి. నవుసబట్టిరి. ఏందిరా ఇట్లొచ్చింది కత, దొర మాటకే ఎదురొచ్చెనా అని నాకు మస్తు రందయింది. ఇంతల బుడ్డ దొరచ్చి ఇంకో తారీఖు జెప్పె. పానం బాగున్నదా లేదా జూడనీకె ఒగ మంత్రి గుడున్నడట గద, గాయినె మూడో తారీఖు జెప్పె. ఒకదాని మీద ఓటి సిల్సిలా తారీఖులు వచ్చె పాయె గాని గత్తర పోకపాయె. చావులు ఎక్కువాయె. ఎహె, అసలు గీ దొరలు, మంత్రులు జెప్పేటియన్ని అబద్ధాలు, గత్తర మాజోరుగున్నది, గని అది బైట పడ్తదని పరీచ్చలు సరిగ్గ జేత్తలేరు, గత్తరున్నదని పరీచ్చల తేలితె గుడ బైటికి జెప్తలేరు. గత్తర తోటి సస్తె గుడ అది గత్తర చావంటలేరు, అన్ని అబద్ధాలే అని మా పోరడనబట్టె. కండ్లు మూసుకోని పాలు దాగితె ఎవరికి తెల్వదనుకున్నదట పిల్లి ఎనుకట. గట్లనే ఉన్నది తెలంగాణ శాత్రం అని మావోడన్నడు. గాయినెవలో పెద్ద మనిషి గదేదో పేపర్ల రాత్తడట, గాయినె గుడ గట్లనే అన్నడట. తెలంగాణ పద్ధతిల పరీచ్చలు జెయ్యాలె, తెలంగాణ పద్ధతంటె పరీచ్చలు జెయ్యకుంట ఉండుడే అని ఎటకారం జేశిండట. వారెవ్వా, ఏం ముచ్చట. మనం ఉన్నదనుకుంటె ఉన్నది, లేదనుకుంటె లేదు. ఇంతకన్న అవ్వల్ దర్జ మాటున్నదా? అబ్బ దొర ఏం ఇకుమతి జేసిండురా, ఇంత జోర్దార్ ఆలోశన ఎట్లొచ్చెనా అని నాకు మస్తు సంబురమయింది. గంతే గద. గత్తర ఉన్నది అనుకుంటె ఒక్క బాద గాదు, ఎవ్వనితో కలువద్దు, చెయ్యి ముట్టుకోవద్దు, దెగ్గరికి బొయి మాట్లాడొద్దు. ఒంటిపిల్లి రాకాసి లెక్కుండాలె. అసలు గత్తర లేనే లేదు అనుకుంటె ఒక్క శిత్తం, దిల్ దార్. అబ్బ, దొరా నీ తెలివికి మొక్కాలె అనుకున్న. గది తెలంగాణ తెలివంటె అనుకున్న. కాని నా గాచారం బాగలేదు. దొర మాటకు ఇలువ లేకుంట పోయింది. రోజు రోజుకు పీనుగలు పెర్గిపోతనే ఉన్నయి. రోజు రోజుకు గత్తర అంటుకున్నోల్ల లెక్క పెరుగుతనే ఉన్నది. దావఖాన్ల ఏశినోల్లను గుడ సూశెటోడు లేడు. గా పిలగాడెవడో పాపం దావఖాన్ల నుంచి సస్తాన అయ్యా అని ఫోన్ల మాట్లాడిండు, సావనే సచ్చిండు. అయినా సరె, దొరనే నమ్ముత. ఆయినె గత్తరంటె గత్తర. లేదంటె లేదు. గంతే.

వీ

## సంపాదకీయ వ్యాఖ్య - ఆంధ్రప్రదేశ్

# కక్ష విధానాలా, ప్రజాపక్ష విధానాలా?

దేశంలో, రాష్ట్రంలో పాలన నిర్వహిస్తున్న అన్ని ప్రభుత్వాలూ తమ పక్షానికి ఒక న్యాయం, ఇతర పక్షాలకు మరొక న్యాయం అమలు చేసేవే గాని, ఆ విద్యలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం చరిత్ర రికార్డులన్నిటినీ బద్దలు గొడుతున్నట్టున్నది. చట్టాన్ని అందరికీ సమానంగా నిష్పక్షపాతంగా అమలు చేయాలనే సహజ న్యాయసూత్రాన్ని ఉల్లంఘించడంలో అందరినీ మించిపోతున్నట్టున్నది. ఒకవైపు కరోనా వైరస్ పరీక్షలు అతి ఎక్కువ జరుపుతున్నామనీ, అదుపులో ఉన్నదనీ ప్రకటిస్తూనే, దూరం పాటించేలా చూడడం కోసం ప్రజా ప్రదర్శనలకు అనుమతి ఇవ్వబోమంటున్నారు. అధికారపక్ష బల ప్రదర్శనలు మాత్రం జరిగిపోతూనే ఉన్నాయి. దేశవ్యాప్తంగా జరిగిన అక్రమ నిర్బంధాల మీద పౌరహక్కుల సంఘం నాయకత్వంలో ఒక ప్రదర్శన జరిగితే ప్రదర్శనకారులు అవసరమైన దూరాన్ని పాటించినప్పటికీ వారి మీద లాక్ డౌన్ నిబంధనలను ఉల్లంఘించారని కేసు విధించారు. ప్రత్యేక ఆర్థిక మండలం ఏర్పాటు చేస్తామని ప్రభుత్వం నుంచి వందల ఎకరాలు భూమి సంపాదించిన వ్యాపారవేత్తలు ఎందరో ఉండగా, ఆ వ్యాపార వేత్తలలో అవతలి పార్టీకి చెందినవారుంటే, వారు భూమి తీసుకున్న ప్రయోజనం కోసం ఉపయోగించలేదనే పేరుతో ఆ భూమిని వెనక్కి తీసుకుంటున్నారు. కాని తమ పార్టీకి చెందినవారో, ఆశ్రితులో అయితే అటువంటి చర్యలు లేవు, అదనంగా భూపందారాలు కూడ జరుగుతున్నాయి. నిజానికి ప్రజా పక్ష విధానాలు అవలంబించదలచుకుంటే, ప్రత్యేక ఆర్థిక మండలాలనేవే ప్రజా వ్యతిరేకమైనవి గనుక, ఆ పేరు మీద అప్పనంగా భూమి ఆక్రమించిన ఏ వ్యాపారవేత్తా తీసుకున్న లక్ష్యం కోసం ఆ భూమిని వాడలేదు గనుక అటువంటి కేటాయింపులన్నిటినీ రద్దు చేయాలి. ఆ భూములన్నిటినీ వెనక్కి తీసుకోవాలి. అది సమర్థనీయమైన ప్రజా పక్ష విధానమవుతుంది. కాని ఉద్దేశపూర్వకంగా కొందరి మీద దాడి చేస్తూ, వారి నుంచి భూమి వెనక్కి తీసుకోవడమంటే, అవి కక్ష సాధింపు చర్యలే అవుతాయి. అంతే కాదు, అలా భూమి వెనక్కి తీసుకున్నంత మాత్రాన ప్రభుత్వమేదో కార్పొరేట్ వ్యతిరేక, ప్రజానుకూల విధానాన్ని అమలు చేయబోతున్నదనే హామీ కూడ లేదు. అలా ఒక కంపెనీ నుంచి భూమిని వెనక్కి తీసుకోవాలనే నిర్ణయం ప్రకటించిన రోజునే, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం జపాన్ కు చెందిన అనేక బహుళజాతిసంస్థలతో సమావేశమై పది కీలక రంగాలలో భారీ పెట్టుబడులకు, భాగస్వామ్యానికి తలుపులు బార్లా తెరిచింది. అంటే ఒక చేత్తో 250 ఎకరాలు వెనక్కి తీసుకుంటున్న ప్రభుత్వమే మరొక చేత్తో వేల ఎకరాలు విదేశీ కార్పొరేట్ శక్తులకు కట్టబెడుతున్నది. అవి తెలుగుదేశం అనుకూల కార్పొరేట్ శక్తులైనా, వైఎస్సార్ సిపి అనుకూల కార్పొరేట్ శక్తులైనా ఆంధ్రప్రదేశ్ ప్రజలకు ఒరిగేదేమీ లేదు. వాళ్లు అధికారంలో ఉన్న ఐదు సంవత్సరాలు వాళ్ల ఆశ్రితులకు, ముడుపులు ఇచ్చేవారికి రాష్ట్ర సంపదలు అప్పగించారు. ఇప్పుడు వీళ్లు అధికారానికి వచ్చిన ఏడాదిన్నరలో వీళ్ల ఆశ్రితులకు కట్టబెట్టడంతో పాటుగా, వీలైతే పాత పాలకుల ఆశ్రితులకు గతంలో కట్టబెట్టినవి లాక్కోవడానికి ప్రయత్నిస్తున్నారు. ప్రజల ప్రయోజనాల దృష్ట్యా దొందూ దొందే.

వీ

# కల్లోల కాలంలో కూడా మారని రాజ్య స్వభావం

- రాజేంద్రబాబుఅర్విణి

ప్రపంచం ఒక్కసారిగా ఉలిక్కిపడి చూసింది. అమెరికా మినియా పోలిస్ పోలీసుల జాత్యహంకారానికి బలవుతూ జార్జ్ ఫ్లాయిడ్ 'ఊపిరాడుత లేదు నాకు...చచ్చిపోతున్నాను నేను...' అన్న బలహీన శబ్దాలు భూగోళం నలుమూలలా ప్రతిధ్వనించాయి. ఈ వ్యాఖ్య రాసే సమయానికి అమెరికాలో దాదాపు 150 ప్రదేశాలలో దిక్కులు పిక్కటిల్లేలా నినాదాలు చేస్తున్న వేలాది మందితో కూడిన ర్యాలీలతో రోడ్లు దద్దరిల్లాయి. నిరసన జ్వాలలు యునైటెడ్ కింగ్డమ్, న్యూజీలాండ్ తదితర దేశాలకూ పాకాయి. వాషింగ్టన్‌లో ప్రజాందోళనకారులు శ్వేతసౌధం తూర్పు గేటును ఛేదించుకొని అధ్యక్ష భవనంలోకి చొచ్చుకు వస్తే అధ్యక్షుడు డోనాల్డ్ ట్రంప్ భూగృహం లోని బంకర్‌లో దాక్కోవాల్సి వచ్చింది. నలభై లక్షల మంది నల్లజాతి బానిసలకు స్వేచ్ఛను ప్రసాదించిన 19వ శతాబ్దపు అమెరికా అంతర్యుద్ధం తర్వాత కూడా అమెరికా సమాజంలో నల్ల వారి పట్ల వివక్ష వేళ్లూనుకొనే ఉంది. 2014 లో ఎరిక్ గార్నర్ అన్న నల్ల జాతీయుడు తెల్ల పోలీసుల దౌష్ట్యానికి బలవుతూ ఇదే రీతిలో 'నాకు ఊపిరాడడం లేదు... నన్ను చంపేస్తున్నారు... రక్షించండి' అని పెడబొబ్బలు పెడుతూ మృత్యువాత పడ్డప్పుడూ పెద్దఎత్తున అల్లర్లు చెలరేగాయి. ఆ సమయంలో ఆఫ్రికన్ అమెరికన్ అయిన బరాక్ ఒబామా అమెరికా అధ్యక్షుడు.

2014కు 2020కి తేడా ఏమిటంటే ఉవ్వెత్తున ఎగిసిపడ్డ ప్రజాందోళనలో తెల్లవర్ణం జనులు అధికసంఖ్యలో పాల్గొనడం. చాలా చోట్ల పోలీసులు, సైన్యం కూడా మోకాళ్ల మీద నిల్చొని తలలు వంచి జార్జ్ ఫ్లాయిడ్‌కు నివాళులర్పించారు. 19వ శతాబ్దం నాటి అంతర్యుద్ధంలో కొంత మంది అమెరికన్ కులీనవర్గాల ప్రజలు బానిసల పక్షాన నిలిచారు. ఆ కాలంలో భారత్‌లో సవర్ణ సంస్కృతికి వ్యతిరేకంగా ఉద్యమ నిర్మాణం చేస్తున్న జ్యోతిబా ఫూలే తన 'గులాంగిరి' పుస్తకాన్ని అమెరికా పౌరయుద్ధానికి మద్దతిచ్చిన 'మంచి అమెరికన్‌లకు' అంకితమిచ్చాడు. మరణించింది నల్లజాతి పౌరుడయినప్పటికీ, ఈసారి ఎగిసిపడింది కుళ్లిపోయిన పాత సమాజపు ఆలోచనా ధోరణికి వ్యతిరేకంగా పెల్లుబికిన ధర్మాగ్రహం. 21వ శతాబ్దంలో కూడా పోలీసులు ఇలాగే ప్రవర్తిస్తారా అన్న ప్రశ్న తెల్లవాళ్లను నల్లవాళ్లను ఏకంచేసింది. ఖంగుతిన్న ట్రంప్ ఉద్యమకారులను 'దోపిడీ దొంగల'న్నాడు, 'స్వదేశీ ఉగ్రవాదుల'న్నాడు. హాంకాంగ్ ప్రజలను హీరోలని పొగిడిన ట్రంప్ తన వాళ్లను దోపిడీ దొంగలని తిడుతున్నాడని ఓ వెకిలి నవ్వు నవ్వింది చైనా. స్వతహాగా నల్లజాతి ప్రముఖుడయిన బారక్ ఒబామా వెల్లివిరిసిన ప్రజా చైతన్యాన్ని ఎన్నికల ప్రహసనంలోకి దారిమళ్లించే ప్రయత్నం చేస్తున్నాడు. బ్యాలట్ ద్వారా పోలీసు వ్యవస్థ స్వభావాన్ని మార్చవచ్చునని సమస్యకు మసిపూసి మారేడుకాయ చేస్తున్నాడు. అమెరికాలో జరిగిన నల్లజాతి పౌరుని హత్య భారతదేశంలో ప్రజాస్వామ్య ప్రియుల మెదళ్లలో ఒక ప్రశ్న మొలకెత్తడానికి కారణమయ్యింది. ఆవు మాంసం తిన్నాడన్న నెపంతో అఖ్లాక్ మూకహత్య చేయబడ్డప్పుడు, రోహిత్ వేముల ఆత్మహత్య చేసుకొనే స్థితికి నెట్టబడ్డప్పుడు, ఎంతోమంది దళితులు, ముస్లింలు, ఆదివాసీలు, మహిళలు రోజూ విషపుకోరలలో చిక్కుకొంటూ ఉన్నప్పుడు మనదేశంలో నిరసన తెలపడానికి వేలాది మంది, లక్షలాది మంది ప్రజలు ఎందుకు ముందుకు రావడం లేదు అన్నది ఆ ప్రశ్న. అందుకు జవాబు హిందుత్వమనే మత్తు మందులో జనం జోగుతున్నారు అనే చెప్పుకోవాలి. సరిగ్గా ట్రంప్ కూడా బైబిల్ చేతబూని ఆందోళనకారులు తగలబెట్టిన చర్చ్ శకలాల ముందు నిలబడి ప్రార్థనలు చేస్తూ అమెరికన్లలో మత్తుమందు నింపాలని యత్నిస్తున్నాడు. వీ





❖ **నేరమే అధికారమైన చోట నేరస్థులకు నజరానా – అయోధ్య తీర్పు** – అరుణ్ – విరసం ప్రచురణ – 24 పేజీలు, 1/8 డెమీ, రు. 10, ప్రతులకు: పాణి, ఇ.నెం. 87/106, శ్రీలక్ష్మి నగర్, బి-క్యాంప్, కర్నూల్ – 518002, ఫోన్ : 9866129458



❖ **నా స్వప్నం** – కవిత్వం – బాలసాని రాజయ్య – విరసం ప్రచురణ – 80 పేజీలు, 1/8 డెమీ, రు. 60, ప్రతులకు: బాలసాని రాజయ్య, కొత్తపల్లి గ్రామం, కొలనూరు మండలం, పెద్దపల్లి జిల్లా – 505162, ఫోన్ : 9441970025



❖ **దగ్ధస్వప్నం** – కవిత్వం – ఇక్బాల్ – పాలమూరు అధ్యయన వేదిక ప్రచురణ – 110 పేజీలు, 1/8 డెమీ, రు. 120, ప్రతులకు: ఇక్బాల్, ఇక్బాల్ మంజిల్, ఇ.నెం. 6–29, జి.వి. ఎన్‌క్లేవ్, గవర్నమెంట్ స్కూల్ ప్రక్కన, గద్వాల్ – 509125, ఫోన్ : 9440775732



❖ **ఎవరమ్మా మీరు** – పాటలు – ఉదయమిత్ర – పాలమూరు అధ్యయన వేదిక ప్రచురణ – 127 పేజీలు, 1/8 డెమీ, రు. 150, ప్రతులకు: ఉదయమిత్ర, ఇ.నెం. 9–24, చైతన్య నగర్, జడ్చర్ల, మహబూబ్‌నగర్ – 509301, ఫోన్ : 9985203376



❖ **గుండెలో నదులు నింపుకొని...** – కవిత్వం – రావి రంగారావు – రావి రంగారావు సాహిత్య పీఠం ప్రచురణ – 126 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: నర్ర ప్రభావతి, రావి రంగారావు సాహిత్య పీఠం, 101, సంఖ చక్ర నివాస్, అన్నపూర్ణ నగర్, 5వ లైన్ తూర్పు, గోరంట్ల, గుంటూరు – 522034



❖ **నెత్తురోడుతున్న కాశ్మీర్** – చంద్రన్న – సి.పి.ఐ (ఎం-ఎల్) న్యూడెమోక్రసీ ప్రచురణలు – 216 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: కామ్రేడ్ సి.పి. భవన్, ఇ.నెం. 2-1-594 (బి-34, ఎఫ్-1), రైల్వే స్టేషన్ రోడ్, విజ్ఞానపురి కాలనీ, విద్యానగర్, హైదరాబాద్ – 500044



❖ **నిసర్గ** – సాహిత్య వ్యాసాలు – డాక్టర్ పాపినేని శివశంకర్ – నవచేతన పబ్లిషింగ్ హౌస్ ప్రచురణలు – 144 పేజీలు, 1/8 డెమీ, రు. 110



❖ **తెలుగు జానపద కళారూపాలు** – సంక్షిప్త వివరణ – డాక్టర్ బి. దామోదరరావు – నవచేతన పబ్లిషింగ్ హౌస్ ప్రచురణలు – 64 పేజీలు, 1/8 డెమీ, రు. 60,

పై మూడు ప్రతులకు: నవచేతన పబ్లిషింగ్ హౌస్, గిరిప్రసాద్ భవన్, బండ్లగూడ (నాగోల్), జి.ఎస్.ఐ. పోస్ట్, హైదరాబాద్ – 500068

ఫోన్ : 040 – 29884454



❖ **ఆమె తప్పిపోయింది** – కవిత్వం – గట్టు రాధిక మోహన్ (వెంకి) – వెంకి ప్రచురణలు – 110 పేజీలు, 1/8 డెమీ, రు. 100, ప్రతులకు: వలుగుల రామ్మోహన్, ఇ.నెం. 5-11-1105, ఎస్.ఎస్. కాన్సెప్ట్ హై స్కూల్ దగ్గర, పోచమ్మకుంట, హనుమాన్ నగర్, హన్మకొండ, వరంగల్ అర్బన్, ఫోన్ : 8790186340



❖ **నాలుగోపాదం – నిజం** – కవితలు – నిజం ప్రచురణలు – 148 పేజీలు, 1/8 డెమీ, రు. 125, ప్రతులకు: నిజం ప్రచురణలు, ఇ.నెం. ఎ-26, జర్నలిస్ట్ కాలనీ, జుబ్లీహిల్స్, హైదరాబాద్ – 500033

ఫోన్ : 9848351806



❖ **మతలబ్** – కవిత్వం – నిధి – అరసం వరంగల్ ప్రచురణ – 88 పేజీలు, 1/8 డెమీ, రు. 70, ప్రతులకు: నిధి, ఇ.నెం. 2-4-1449, అశోకా కాలనీ, హన్మకొండ, వరంగల్ – 506001, ఫోన్ : 97010 00306



❖ **అమ్జద్ రుబాయిలు** – అనువదం సదాశివ – తెలంగాణ సాహిత్య అకాడమి ప్రచురణలు – 76 పేజీలు, 1/8 డెమీ, రు. 30



❖ **సురవరం ప్రతాపరెడ్డి – జీవితం – రచనలు** – ముద్దసాని రామిరెడ్డి – తెలంగాణ సాహిత్య అకాడమి ప్రచురణలు – 152 పేజీలు, 1/8 డెమీ, రు. 70



❖ **సురవరం ప్రతాపరెడ్డి పీఠికలు** – సురవరం ప్రతాపరెడ్డి – సంపాదకుడు డా. ఎల్లూరి శివారెడ్డి – తెలంగాణ సాహిత్య అకాడమి ప్రచురణలు – 138 పేజీలు, 1/8 డెమీ, రు. 60



❖ **సిద్దిపేట జిల్లా సాహిత్య చరిత్ర** – పప్పుల రాజిరెడ్డి – తెలంగాణ సాహిత్య అకాడమి ప్రచురణలు – 96 పేజీలు, 1/8 డెమీ, రు. 40

పై నాలుగు ప్రతులకు: తెలంగాణ సాహిత్య అకాడమి, కళాభవన్, రవీంద్రభారతి ప్రాంగణం, హైదరాబాద్ – 500004, ఫోన్ : 040–29703142



❖ **కంచె మీద పక్షిపాట** – కవిత్వం – డా. నూకతోటి రవికుమార్ – సిక్కోలు బుక్ ట్రస్ట్ ప్రచురణలు – 120 పేజీలు, 1/8 డెమీ, రు. 110, ప్రతులకు: సిక్కోలు బుక్ ట్రస్ట్, ఎంఐజి-100, జిల్లాపరిషత్ ఎదురుగా, ఎపిఎచ్‌బి కాలని, శ్రీకాకుళం – 532 001. ఫోన్ : 9989265444

# విశ్వమారిల నుండి మానవజాతిని కాపాడాలి

***కరోనా వైరస్ నియంత్రణలో పూర్తిగా విఫలమైన అమెరికాలా కాకుండా మానవ జాతిని కాపాడడానికి ఇతర దేశాలకు సహకరిస్తున్న సోషలిస్టు దేశాల స్ఫూర్తిని విస్తరింపజేసుకోవాలని అంటున్నారు జార్జ్ ఫ్లాయిడ్***

ప్రపంచాన్ని గతంలో కొన్ని విశ్వమారి రోగాలు పీడించాయి. వీటిల్లో తాజాది కొవిడ్ 19. ఇది 2019 చివరలో మొదలయ్యి అంతకు ముందు కనీవినీ ఎరగని వేగంతో ప్రపంచమంతటా విస్తరిస్తోంది. విశ్వమారి రోగాలు మనకు కొత్త ఏమీ కాదు. ప్రస్తుతం వ్యాపిస్తున్నది అన్నిటి కంటే ప్రాణాంతకమైనదీ కాదు. పెట్టుబడిదారీ వ్యవస్థకి ముందు కాలంలో మహమ్మారీలు చాలానే ఉన్నప్పటికీ విశ్వమారి రోగాలు పెట్టుబడిదారీ కాలపు నాగరికతకు చెందినవని అనడంలో సందేహం లేదు. ప్రస్తుత విశ్వమారి రోగం ఎన్నో ప్రశ్నలను మన ముందుకు తెచ్చింది. జీవాయుధాల తయారీ క్రమంలో ఇది బయటకు తప్పించుకుందా అన్నది ఈ ప్రశ్నలలో సరికొత్తది. మొదట బయటపడిన ప్రదేశంతో ఆ రోగాన్ని పిలవడం ఆనవాయితీ అయినప్పటికీ డొనాల్డ్ ట్రంప్ దీనిని వూహాన్ వైరస్ అనడాన్ని ఐరోపా రాజకీయాలలో అతడి ప్రియ స్నేహితులు కూడా తీవ్రంగా వ్యతిరేకించారు.

చైనాలోని వూహాన్ నగరంలో మొదలైన ఈ విశ్వమారి రోగాన్ని అక్కడ విజయవంతంగా నియంత్రించారు. 2020 ఫిబ్రవరి చివరి నాటికి వైరస్ లేని దేశంగా చైనా ప్రకటించుకుంది. ఈ వ్యాసం రాసే సమయానికి వూహాన్ నగరాన్ని చైనా తిరిగి తెరిచింది. ఈ వైరస్‌ని ఒక్క నగరానికి పరిమితం చేయడంలో చైనా విజయం సాధించగా అది ప్రపంచమంతటా వ్యాపించసాగింది. 2020 మార్చ్ రెండవ వారానికి అది విశ్వమారిగా మారింది, ఆ మేరకు ప్రపంచ ఆరోగ్య సంస్థ ప్రకటన జారీ చేసింది. చైనా అధికారికంగా విడుదల చేసిన లెక్కల ప్రకారం 80,000 మందికి ఈ రోగం సోకింది, 4,000 మంది చనిపోయారు. అంకెలను చైనా తగ్గించి చూపుతోందని డొనాల్డ్ ట్రంప్‌తో మొదలుకొని ప్రపంచ వ్యాప్తంగా మితవాద రాజకీయ నాయకులు విమర్శలు చేశారు. చైనా అబద్ధాలు చెప్పడం వల్ల ప్రపంచం ముప్పునకు లోనయ్యిందని వాళ్లంతా గగ్గోలు పెట్టారు. చైనా అబద్ధాలు చెప్పిందన్నది ఒకవేళ నిజమే అయినా అది ఈ విశ్వమారికి ఎలా కారణమయ్యిందో ఎవరూ వివరించలేదు. ప్రపంచ ఆరోగ్య సంస్థకి నిధులు ఇవ్వమని ప్రకటించేంతవరకు ట్రంప్ వెళ్లాడు. అయితే ప్రస్తుత పరిస్థితులలో ఈ నిర్ణయం తీసుకోవడాన్ని ప్రపంచ రాజకీయాల్లో అతడి సహచరులలో చాలామంది ఖండించారు.

దాదాపు అన్ని దేశాలు ఈ విశ్వమారి బారిన పడ్డాయి. అయినప్పటికీ ఇది అంతటా సమంగా వ్యాప్తి చెందిందని అనడానికి లేదు. యూరపు, అమెరికా తీవ్రంగా ప్రభావితం అయ్యాయి. మరణాల శాతంలో అమెరికా అన్నింటికంటే ఎంతో ముందు ఉంది. మొట్టమొదట ప్రభావితమైన దేశం ఇటలీ. అధిక మరణాల కారణంగా ప్రపంచం అంతటా అది ప్రమాద ఘంటికలు మోగించింది. అయితే, ఆ తరవాత వ్యాధి సోకిన స్పెయిన్ వేగంగా మొదటి స్థానానికి చేరుకుంది. అమెరికాలో కూడా వ్యాప్తి సమంగా లేదు. అత్యధిక పీడితులు, మరణాలు న్యూయార్క్‌లో నమోదు అయ్యాయి. ఈ విశ్వమారి ఫ్రాన్స్‌లో తీవ్ర స్థాయిని చేరుకుంది. అయితే, పక్కనే ఉన్న జర్మనీలో అది అదుపులో ఉన్నట్టే ఉంది. ప్రపంచ పెట్టుబడిదారీకి గతంలో కేంద్రంగా ఉండి, తలసరి ఆదాయంలో అమెరికా తరవాత రెండవ స్థానంలో ఉన్న ఇంగ్లాండులో కూడా ఈ రోగం విస్తరిస్తూనే ఉంది. సింహాసనానికి వారసుడైన యువరాజు చార్లెస్‌కి వ్యాధి సోకడం, ప్రధాన మంత్రి ఐసియులో చికిత్స తీసుకోవలసి రావడంతో ఆ దేశం వార్తలకు ఎక్కింది.

గతంలో లేదా ప్రస్తుతం సోషలిస్టు ఆర్థిక విధానం ఉన్న దేశాలలో వ్యాధి చాలా తక్కువ స్థాయిలో సోకడం ఆశ్చర్య, కుతూహలాలను కలిగిస్తుంది. ఈ వ్యాధి సోకినప్పుడు ఉలిక్కిపడిన చైనా దానిని విజయవంతంగా నియంత్రించి, ఒక్క నగరానికి పరిమితం చెయ్యగలిగింది. ద్వితీయ సంక్రమణలను కూడా చైనా ఆరోగ్య అధికారులు తేలికగా ఎదుర్కోగలిగారు. రష్యాలో 47,000 మందికి ఈ రోగం సోకింది, అంటే అమెరికాతో (7,64,000) పోలిస్తే 10 శాతం కంటే చాలా తక్కువ; మరణాల శాతం అయితే అమెరికాతో (40,465) పోలిస్తే 1 శాతమే (405). ఈ రోగాన్ని విజయవంతంగా ఎదుర్కొన్న మరొక దేశం వియత్నాం – ఆధునిక పరీక్షా సామర్థ్యాలు లేనప్పటికీ కొన్ని వేల మందికి మాత్రమే రోగం సోకింది, అక్కడ ఒక్కరు కూడా చనిపోలేదు. నిషేధాలు విధించి, వేధించి ఒంటరి చేయబడిన చిన్న దేశమైన క్యూబా 30 దేశాలకు వైద్య బృందాలను పంపించి ప్రపంచాన్ని ఆశ్చర్యంలో ముంచెత్తింది. రష్యాలో కేసుల సంఖ్య మే నెలలో బాగానే పెరిగాయి కానీ అధికారిక లెక్కల ప్రకారం మరణాలు తక్కువగానే ఉన్నట్టు ఉన్నాయి.

జాతి, మత, ప్రాంత, భాషాపరమైన వివక్షతల భావోద్వేగాలకు లోను కాకుండా ఈ విశ్వమారి చిత్రాన్ని ఎలా వివరించాలి, దాని వ్యాప్తి తీరుతెన్నులను ఎలా అర్థం చేసుకోవాలి, మానవ భవిష్యత్తుకు వైద్య, సామాజిక పరిష్కారాలను ఎలా కనుగొనాలి? కొవిడ్ వైరస్‌ని ప్రయోగశాలలో సృష్టించారా, చైనాతో అమెరికా వాణిజ్య యుద్ధంలో భాగంగా సిఐఏ దానిని సృష్టించిందా, ఈ జీవాయుధాన్ని ప్రయోగించి ఒక్క క్షిపణిని కూడా పేల్చకుండానే మూడవ ప్రపంచ యుద్ధాన్ని చైనా గెలిచిందా వంటి అనేక ప్రశ్నలు వైరస్ కంటే వేగంగా విస్తరిస్తూ ఉన్నాయి. వీటికి సంబంధించి ఆధారపడ దగిన సమాచారం ఏమీ లేనందున నేను ఈ ప్రశ్నల జోలికి పోవడం లేదు. ఈ ప్రశ్నల కంటే శ్రామిక వర్గానికి ముఖ్యమైన, అత్యవసరమైన ఇంకెన్నో ప్రశ్నలను ఈ విశ్వమారి

లేవనెత్తింది. నిజం ఏదో నిలకడ మీద తప్పనిసరిగా తెలుస్తుంది. దోషులు అనే వాళ్లు ఉంటే చారిత్రక శక్తులు తప్పకుండా నిలదీస్తాయి.

ఈ విశ్వమారి నేపథ్యంలో పని చేస్తున్న శక్తులను విశ్లేషించడానికి, శ్రామిక వర్గ విధానాలు, కోరికలు రూపొందించడానికి దీనికి గురైన అత్యంత ఆధునిక దేశాలలోని పాలక వర్గాల ప్రతిస్పందనలను పరిశీలించాలి. పెద్ద ఎత్తున ప్రభావితమైన దేశాలలో ఇటలీ మొట్ట మొదటిది. ఆ దేశంలోని ఉత్తర ప్రాంతమైన లొంబార్డీలో ఈ వ్యాధి మొదలయ్యింది. అది చాలా వేగంగా దేశం అంతా వ్యాపించింది, మరణాల శాతం చాలా ఎక్కువగా ఉండి శవపేటికలకు, స్మశానాలలో స్థలాలకు కరువు ఎదురయ్యింది. యూరోపియన్ యూనియన్‌లో ఇటలీ సభ్య దేశం, దానితో ఒప్పందం కూడా ఉంది. సహాయం, ఉమ్మడి కార్యాచరణలకు ఆ దేశానికి హక్కు ఉంది. అయితే సహాయానికి ఇటలీ అర్థించినప్పటికీ యూరోపియన్ యూనియన్ స్పందన అరకొరగా ఉండడంతో దాని ఉనికే సవాలుగా మారింది. నాటో దేశాలతో రష్యాకి తీవ్రమైన సమస్యలు చాలానే ఉన్నప్పటికీ ఇటలీకి సహాయం చేసింది.

పెద్ద ఎత్తున వైద్య బృందాలను పంపించి క్యూబా ఆదుకుంది. బానిస వ్యాపారానికి అతి పెద్ద, అతి పురాతన కేంద్రమైన రోమ్‌లో మరణశయ్య మీద ఉన్న వేలాది శ్వేతజాతి స్త్రీ, పురుషులకు వైద్యం చెయ్యడానికి నల్లజాతి డాక్టర్ల బృందం ఆ నగరం చేరుకోవడం యాదృచ్ఛికమే. నిస్సహాయులైన నల్లజాతి వాళ్లను సింహాలతో తలపడేలా చేసి వినోదాన్ని పొందిన వాళ్ల ముని ముని మనుమలకు అత్యంత ఆధునిక వైద్య సేవలు అందించడానికి ఒకప్పటి బానిసల ముని ముని మనుమలు చేరుకోవడం ప్రపంచ చరిత్ర యవనిక మీద ఒక అద్భుత చిత్రంగా చెప్పుకోవాలి. పాశ్చాత్య ప్రపంచ అతి పెద్ద, అత్యంత ఆధునిక వైద్య సంస్థలన్నీ ఎందుకూ కొరగావని నిరూపితమైన తరవాత ఈ పొట్టి క్యూబన్ జ్వాలలు అక్కడికి చేరుకున్నాయి. వైరస్ సోకుతుందన్న భయంతో పనిలోకి వెళ్లడానికి ఇటాలియన్ డాక్టర్లే వెనకాడుతుండగా, అభివృద్ధి చెందుతున్న దేశాలు రక్షక దుస్తులు కావాలని కోరుతుండగా దూర దేశం నుంచి క్యూబన్ డాక్టర్లు వచ్చారు. కమ్యూనిజానికి భవిష్యత్తు లేదని దశాబ్దాలుగా సామ్రాజ్యవాద ప్రపంచం చేస్తున్న ప్రచారాన్ని ఏమాత్రం వాదనకి దిగకుండా ఒక్క చర్యతో, మానవత్వపు స్పందనతో కమ్యూనిస్టు క్యూబన్లు తుడిచేశారు.

ఇటలీలోని విస్తార తోలు పరిశ్రమలో అధిక సంఖ్యలో చైనీయులు ఉన్న కారణంగా ఇటలీ ప్రభావితం అయ్యిందని మొదట వాదించారు. చైనా విదేశాంగ విధానం కింది 70 దేశాలలో మౌలిక వ్యవస్థలు కల్పించడానికి పూనుకున్న తరవాత ఇటలీ జనాభాలో చైనా ప్రజల సంఖ్య గణనీయంగా పెరిగి ఆ దేశం మహమ్మారికి గురయ్యిందని అన్నారు. చైనా ప్రస్తుత విధానాలను నేను ఆరాధించను, చైనా ప్రభుత్వపు దుర్మార్గపు సామ్రాజ్యవాద వ్యూహాలను నేను సమర్థించను. కాబట్టి, వీటన్నిటికి నేను జవాబు ఇవ్వబోవడం లేదు. అయితే, ఆసుపత్రులలో నిస్సహాయంగా పడి ఉన్న వేలాది రోగులకు సహాయపడడానికి అమెరికన్ ప్రభుత్వం కాక చైనా ప్రభుత్వం రావడం ఆశ్చర్యం కొలుపుతుంది. రక్షక దుస్తులు, మందులు, వెంటిలేటర్లు వంటివి వైద్య సహాయంగా చైనా ప్రభుత్వం పంపించింది. దానికి బదులుగా కొన్ని వ్యాపార ప్రయోజనాలు పొంది ఉంటే అది వేరే విషయం.

ఇటలీ కోలుకోడానికి ఎంతో ముందుగానే పాశ్చాత్య ప్రపంచంలోని ప్రముఖ వార్తా పత్రికలన్నీ యూరోపియన్ యూనియన్ ఏ రకంగా చూసినా చచ్చిపోయిందని పెద్ద పెద్ద వ్యాసాలు ప్రచురించసాగాయి. ఒక నాటో దేశంలో రష్యన్ సైనిక దళం కవాతు చేస్తోందని వార్తలు రాసాగాయి, అయితే అది సైనిక చర్యగా కాకుండా మానవత్వ ఉద్దేశంతో వచ్చిన దళం. ఇటలీలో రోగాల సంఖ్య తగ్గక ముందే పక్కనున్న ఫ్రాన్స్, స్పేన్‌లలోనే కాకుండా దూరంగా ఉన్న న్యూ యార్క్ నగరంలో కూడా వైరస్ పెద్ద ఎత్తున వ్యాపించసాగింది. ఇటలీలో కొన్ని వారాలలోనే మరణాల సంఖ్య 10,000ను దాటింది, అంటే మొత్తం రోగం సోకిన వారిలో 10 శాతం చనిపోయారు. చైనాలో మరణాల సంఖ్య అధికారిక లెక్కల ప్రకారం 4 శాతాన్ని మించలేదు.

అన్ని అంచనాలు, ఆశలు, ఊహలు, నిబంధనలను ఉల్లంఘించి మానవ చరిత్ర మొత్తంలో ఏ యుద్ధ ట్యాంకు చేరని, ఏ యుద్ధ విమానం ఊహించని, ఏ క్షిపణి తాకని ప్రదేశాలను కొవిడ్ వైరస్ చేరుకుంది. అట్లాంటిక్ సముద్రాన్ని దాటి కొవిడ్ వైరస్ న్యూ యార్క్ నగరంపై ఎంతో తీవ్రంగా, ఎంతో వేగంగా విరుచుకునిపడింది. ఆ దెబ్బకి అగ్ర రాజ్యం దిమ్మతిరిగి పీకల లోతు సంక్షోభంలో కూరుకుని పోయింది – అది వైద్యపరంగా స్పందించలేకపోయింది, నైతికంగా ఎవరినీ నిందించలేకపోయింది, రాజకీయంగా సమర్థ పరిష్కారాన్ని ఇవ్వలేకపోయింది. పెట్టుబడిదారీ చరిత్రలో సామ్ మామ ఎటువంటి సన్నద్ధం లేకుండా ఇంతలా ఎప్పుడూ దొరికిపోలేదు. దాంతో ఆ సామ్రాజ్య నిర్మాతలు విస్మయ పడుతుండగా, ప్రపంచం మొత్తం నోరు వెళ్లబెట్టి చూస్తుండగా సామ్రాజ్యవాద నైతిక సౌధం కూలిపోసాగింది.

పరిస్థితికి తగినట్టుగా స్పందించి న్యూ యార్క్ నగరం నుంచి విశ్వమారి బయటకి వ్యాపించకుండా నిరోధించడంలో అమెరికా సామ్రాజ్యవాదం విఫలమయ్యింది. మౌనంగా, నిస్సిగ్గుగా అది దేశం నలుమూలలా వ్యాపించనిచ్చి పాపాన్ని మూటగట్టుకుంది. బలీయమైన శత్రువు, గ్రహాంతరవాసులు దాడి చేస్తేనో, అపార సాంకేతిక ప్రతిభ గల ప్రత్యర్థితో తలపడాల్సి వస్తేనో కాకుండా ఒక చిన్న శత్రువు, ఒక చిన్న ఆరోగ్య సమస్య, జీవం ఉందని కూడా చెప్పడానికి లేని కంటికి కనపడని సూక్ష్మజీవిని చూసి స్టార్ వార్స్ గురించి గొప్పలు పోయిన అగ్ర రాజ్యం, అమెరికాకి గురిపెట్టిన ఏ క్షిపణినైనా లక్ష్యాన్ని తాకేలోపే మట్టుబెట్టేస్తామని ప్రకటించిన సైన్యం, తమ డాలరుని అయిదు దశాబ్దాలుగా ప్రపంచ కరెన్సీగా చెయ్యగలిగిన ప్రభుత్వం వంటివన్నీ నిర్ఘాంతపోయి, నోరు వెళ్ల బెట్టి, పక్షవాతం సోకినట్టు చూస్తూ ఉండిపోయాయి.

ప్రపంచంలోకెల్లా అత్యుత్తమ వైద్య సంస్థలు, ఉన్నత విశ్వవిద్యాలయాలు, పరిశోధనా సౌకర్యాలు ఉన్నాయని అమెరికా సామ్రాజ్యవాదం గొప్పలు పోతూ ఉంటుంది. ప్రపంచ ఆరోగ్య సంస్థ, ప్రపంచ బ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్య నిధి, ఐక్య రాజ్య సమితి వంటి ప్రపంచ సంస్థలన్నిటికీ అది నిధులు, ఆతిథ్యం ఇస్తుంది. రోగిని తాకకుండానే ఏ అవయవాన్నైనా మార్చగలం, అత్యంత క్లిష్టమైన శస్త్ర చికిత్సలు సైతం రోబోలతో చేయించగలం అని గొప్పలు చెప్పుకునే ప్రఖ్యాత శాస్త్రవేత్తలు, డాక్టర్లు, సర్జన్లు అందరూ ఏమైపోయారు? అవన్నీ నిజమే, అయితే ప్రస్తుత సంక్షోభంలో అవేవీ ఎందుకూ కొరగావు. గత అనేక దశాబ్దాలుగా అమెరికా కూడబెట్టిన ఆయుధాలు, సాధనాలతో

ప్రస్తుత శత్రువు అయిన వైరస్‌ని ఓడించలేం. పూర్తిగా భిన్నమైన ఆయుధాలు, వ్యూహంతో మాత్రమే ఈ వైరస్‌ని అరికట్టగలం. దీనికి వాక్సిన్ కనుక్కొని ప్రస్తుత పరిస్థితులలో ప్రజా ఆరోగ్యం, నివారణ మాత్రమే పనిచేస్తాయి. అయితే దురదృష్టవశాత్తు పెట్టుబడిదారీ దేశాలలో ప్రజా ఆరోగ్యం అన్నది అరుదై, భోగ వస్తువై మాయమైపోయింది. దాంతో శక్తిమంతమైన యూరపు, అమెరికాలు దారితెన్నూతోచక, దిక్కూమొక్కూ లేకుండా అయిపోయాయి.

ఈ బలమైన దేశాలు విఫలం కావడానికి, అత్యంత ఆధునిక విజ్ఞాన సంస్థలు నిస్సహాయంగా మిగిలిపోడానికి, జీవం ఉంది అని కూడా చెప్పుకోడానికి లేని చిన్న జీవి విషయంలో చేసిన భవిష్యవాణులన్నీ వమ్ము కావడానికి కారణాలను ఇప్పుడు విశ్లేషిద్దాం. ప్రజా ఆరోగ్యంలో ఆసక్తిలేని పెట్టుబడిదారీ వ్యవస్థలోనే ఈ వైఫల్యం మూలాలు ఉన్నాయి. పెట్టుబడిదారీ సంస్థలు అంతిమంగా లాభాలను కోరుకుంటాయి. అవి ప్రజా స్థాయిలో చర్యలు తీసుకోడానికి కాకుండా వ్యక్తికి చికిత్స చెయ్యటంలో, రోగాలను నివారించటంలో కాకుండా అవి వచ్చాక వాటికి చికిత్స చెయ్యడంలో ఆసక్తి చూపిస్తాయి. వ్యాధి నిర్ధారణ వైద్యంతో పోటీలో ప్రజా వైద్యం, సామాజిక-నివారణ వైద్యం వంటివన్నీ ఎప్పుడో కొట్టుకుపోయాయి.

పెట్టుబడిదారీ సంస్థలు తమ 'లాభాలు తెచ్చిపెట్టే విజ్ఞాన శాస్త్రం'తో వైద్య సంస్థలన్నింటినీ క్రమబద్ధీకరించాయి, పరిమితం చేశాయి. ఆ ప్రకారంగా లాభాలను గరిష్ఠంగా ఉంచడానికి ఆసుపత్రి పడకలు, వెంటిలేటర్లు, ఇతర అత్యవసర పరికరాలను కనిష్ఠంగా ఉంచుతారు.

ప్రస్తుత విశ్వమారిని ఎదుర్కోడానికి, భవిష్యత్తులో రాబోయే వాటిని నివారించడానికి జాతీయ, పెట్టుబడిదారీ వ్యవస్థలను అంతర్జాతీయ, సోషలిస్టు వ్యవస్థలుగా మార్చాల్సి ఉంటుంది. తమ ప్రజల మీద విశ్వమారి లేదా ఏదైనా తీవ్ర ఆరోగ్య సమస్య దాడి చేసే మొదటి సంకేతాలు కనపడగానే సోషలిస్టు వ్యవస్థ కింది చర్యలను చేపట్టి ఉండేది.

1. విశ్వమారి వ్యాప్తికి ప్రవేశ మార్గాలైన విమానాశ్రయాల వంటి ప్రదేశాలలో నివారణ చర్యలను ముందుగా చేపట్టటం.
2. ప్రభుత్వ పూర్తి ఆర్థిక సహకారంతో అనుమానం ఉన్న వాళ్లనందరిని గుర్తించి, పరీక్ష చెయ్యడానికి, రోగం సోకే ప్రమాదమున్న వాళ్లని క్వారంటైన్ చెయ్యడానికి వైద్య యంత్రాంగాన్ని సమీకరించటం.
3. కార్మికుల ఆరోగ్యం విషయంలో రాజీపడకుండా ఉత్పత్తి ప్రక్రియను కొనసాగించడం.
4. బడులు, మార్కెట్ వంటి అన్ని ప్రజా ప్రదేశాలను కనీస అవసరాలను బట్టి నియంత్రించడం, ప్రజలు ఎక్కువగా గుమిగూడే మతపరమైన ఊరేగింపులు వంటివి వాటిని పూర్తిగా నిలిపివెయ్యడం.
5. ఈ ఆరోగ్య సంక్షోభాన్ని అధిగమించడానికి తక్షణ, దీర్ఘకాల పరిష్కారాలను కనుగొనడానికి శాస్త్రీయ కార్యాచరణను ముమ్మరం చెయ్యడం.

అయితే, అనేక దేశాలలో ఈ వ్యాధి సామాజిక వ్యాప్తి దశను చేరుకుంది కాబట్టి ఇప్పుడు నివారణ చర్యల గురించి మాట్లాడి ప్రయోజనం లేదు. మానవాళి పెను ఆరోగ్య ముప్పును ఎదుర్కొంటున్న ఈ సందర్భంలో ఏం చెయ్యాలో చర్చించుకుందాం.

1. అనవసర, అశాస్త్రీయ, ప్రత్యేకించి మతపరమైన ప్రజా సమూహాలను ఎట్టి పరిస్థితులలోనూ అనుమతించకూడదు.
2. సినిమా హాళ్లు వంటి అన్ని వినోద కార్యక్రమాలను, బడులను మూసివెయ్యాలి. బడులను తాత్కాలికంగా ఆన్‌లైన్ పద్ధతిలో నడపాలి, పేద వ్యక్తులు, సమూహాల విషయంలో శ్రద్ధ వహించాలి.
3. షాపింగ్ మాల్స్‌ని మూసివేసి, చిన్న రిటేల్ వ్యాపారాలనే అనుమతించాలి. ప్రతి ఇంటికీ అత్యవసర సరుకులను ప్రణాళికాబద్ధంగా అందించాలి.
4. అన్ని వైద్య సదుపాయాలను ప్రభుత్వం తీసుకుని వాటిని వెంటనే ప్రజా ఆరోగ్య సదుపాయాలుగా మార్చాలి. ఉన్నత వైద్య సంస్థలన్నింటినీ ఆయా ప్రత్యేక ఆరోగ్య సమస్యలకు స్పెషలిస్టు కేంద్రాలుగా మార్చాలి. మిగిలిన చిన్న సంస్థలన్నింటినీ ఈ కేంద్రాల మార్గదర్శకత్వంలో, నాయకత్వంలో ఉంచాలి.
5. అత్యవసరం కాని సరుకుల ఉత్పత్తినంతటినీ వైద్య పరికరాలు, ఉపకరణాల ఉత్పత్తి కేంద్రాలుగా మార్చాలి. యుద్ధ ప్రాతిపదికన వీటిని ఉత్పత్తి చెయ్యాలి.
6. స్వల్ప కాలిక బోధన, శిక్షణలతో జనాభాలో 3 నుంచి 5 శాతం మందిని ఆరోగ్య కార్యకర్తలుగా వెంటనే తయారు చెయ్యాలి. ఆరోగ్య సంరక్షణ, సాధారణ పరిపాలనలలో నైపుణ్యంలేని పనులను వెంటనే వాలంటీర్లుగా చేపట్టడానికి జనాభాలో పది శాతం మందిని సంసిద్ధం చెయ్యాలి.
7. స్థూల జాతీయోత్పత్తిలో పది శాతాన్ని విశ్వమారి నివారణ చర్యలకు వినియోగించాలి.
8. ప్రత్యేక విశ్వమారి కోసం కొత్త స్పెషలైజ్‌డ్ ఆసుపత్రిని వారం - రెండు వారాల లోపు నిర్మించాలి. ప్రతి జిల్లా/ మండల స్థాయిలో క్వారంటైన్ సదుపాయాలను ప్రభుత్వ ఖర్చుతో ఏర్పాటు చెయ్యాలి.
9. వైద్య సిబ్బందికి కేవలం పూలతో నివాళులతో సరిపెట్టకుండా అత్యధిక వేతనం, అత్యంత గౌరవం ఇవ్వాలి. వైద్యపరంగా, ఇతరత్రా జరిగే నిర్లక్ష్యాన్ని నిష్పక్షపాతంగా, కఠినంగా ఎదుర్కోవాలి.
10. అత్యవసర పరిస్థితిని ఎదుర్కోడానికి అవసరమైన దానికంటే రెట్టింపు స్థాయిలో రోగ నిర్ధారణ కిట్లు, మందులు, ఇతర వైద్య పరికరాలు అందుబాటులో ఉంచాలి.
11. అన్ని ఉత్పత్తి సౌకర్యాలను హేతుబద్ధీకరించి తగు రక్షణ చర్యలు చేపట్టాలి.
12. దిగువ ఆర్థిక స్థాయి ప్రజలు ఉండే ఇళ్ల కాలనీలను కొత్త, శాస్త్రీయ పద్ధతులలో తిరిగి కట్టాలి.
13. నిరుద్యోగం, పేదరికం వంటి సమస్యలను నిర్మూలించాలి అని ప్రత్యేకంగా పేర్కొనాల్సిన అవసరం లేదు.

తమ ఆర్థిక వ్యవస్థ లాభాపేక్షకి ఇది వ్యతిరేకం కాబట్టి ఏ పెట్టుబడిదారీ దేశమూ దీనిని చేపట్టడానికి సంసిద్ధంగా ఉండదని స్పష్టంగా తెలుస్తోంది. ఇప్పుడు ఉన్న ప్రజలందరికీ అమెరికా ప్రవర్తన ఒక జీవితకాల సాక్ష్యంగా నిలుస్తుంది. వెంటిలేటర్లు తయారు చెయ్యమని జనరల్ మోటర్స్‌ని ఆదేశించడానికి అమెరికా ప్రభుత్వం సుముఖంగా లేదన్నది విషయాన్ని తేటతెల్లం చేస్తోంది. నిజానికి, వెంటిలేటర్లను మూడవ పార్టీ మరమ్మతు చేయకూడదన్న నియమాన్ని తాత్కాలికంగా రద్దు చెయ్యడానికి కూడా అమెరికా ప్రభుత్వం ఇష్టపడలేదు. ఉత్పత్తి సాధనాలన్నీ శ్రామిక వర్గ చేతిలో ఉన్న సోషలిస్టు వ్యవస్థలో మాత్రమే

# కొవిడ్-19 రాజకీయార్థిక పరిచయం

***పెట్టుబడిదారీ యాంత్రిక మాంసోత్పత్తిలో ప్రారంభమైన కరోనా వైరస్ వ్యాప్తిలో ఉన్న రాజకీయార్థిక కోణాలను విశ్లేషిస్తున్నారు* మనీష్ ఆజాద్**

**నా**జీ జర్మనీలో సోఫీ అనే మహిళనూ, ఆమె పిల్లలిద్దరినీ గ్యాస్ చాంబర్ దగ్గరికి తీసుకు వచ్చినప్పుడు, ఆమె ఏడుపులూ మొత్తుకోళ్లూ అభ్యర్థనలూ విని నాజీ సైనికులు ఆ ఇద్దరు పిల్లలలో ఒకరిని విడుదల చేస్తామని హామీ ఇచ్చారు. కాని ఎవరిని విడుదల చేయాలో నిర్ణయం తీసుకునే అధికారం ఆమెకే ఇస్తున్నామన్నారు. ఈ కథ మీద ఆధారపడి రాసిన సోఫీస్ చాయిస్ అనే నవల 1979లో వెలువడిన తర్వాత, సోఫీస్ చాయిస్ అనేది ఇంగ్లిష్ నుడికారాల్లో ఒకటిగా మారింది. ఇవాళ కరోనా వైరస్‌తో సంపూర్ణ భయోత్పాతంలో మునిగి లాక్ డౌన్‌లో ఉన్న ప్రపంచాన్ని చూస్తుంటే నాకు ఆ నుడికారమే గుర్తొస్తున్నది. లాక్ డౌన్‌ను కొనసాగిస్తే ప్రపంచ ఆర్థిక వ్యవస్థ కుప్పకూలిపోతుంది, కోట్లాది మంది మనుషుల మనుగడే సంక్షోభంలో పడిపోతుంది. లాక్ డౌన్‌ను సడలిస్తే, కరోనా వైరస్ మహావిపత్తు కోట్లాది మందిని బలిగొంటుంది. ప్రతి దేశంలోనూ ఈ సవాల్ నిలువెత్తుగా నిలిచి ఉంది.

కాని వాస్తవమైన సమస్యేమంటే, అసలు మనం ఇక్కడికి ఎలా చేరాం? ఈ గమ్యం అనివార్యమైనదా? కరోనా తప్పనిసరిగా రావలసిందేనా? లేక, దీనివెనుక చైనా కుట్ర ఉందా, అది మొదట తన జనాన్ని తానే చంపుకొని, ఆ తర్వాత యావత్ ప్రపంచాన్ని చంపి ప్రపంచ అగ్రరాజ్యంగా మారదలచిందా? లేక చైనాను బలహీన పరచడానికి ఒలింపిక్ క్రీడల సమయంలో అమెరికానే చైనాలో ఈ వైరస్‌ను ప్రవేశపెట్టిందని చైనా చెపుతున్న మాట సత్యమా? లేక మరేదైనా కారణముందా? కాస్త పరిశోధించవలసి ఉంది.

మొట్టమొదట, స్క్రిప్స్ రిసర్చ్ ఇన్ స్టిట్యూట్‌తో సహా ఎన్నో ప్రతిష్ఠాత్మక పరిశోధనా సంస్థలు కొవిడ్-19 జన్యు నిర్మాణం మీద అధ్యయనాలు చేసి, దాన్ని ఒక రసాయనశాలలో తయారు చేయడం అసాధ్యమని రుజువు చేశాయి. అంటే పరివర్తన (మ్యుటేషన్) ద్వారా సహజంగా దానంతట అదే రూపొందింది. దాని వెనుక ఏదో ఒక దేశం ఉందని అనుకోనక్కర లేదు. కరోనా కుటుంబంలో ఇది తాజా వైరస్ మాత్రమే. ఇదే కుటుంబానికి చెందిన ఎస్ఎఆర్ఎస్ (సార్స్) అనే వైరస్ 2003-04ల్లో ప్రపంచంలో ఎన్నో దేశాలను అల్లకల్లోలం చేసింది. ప్రస్తుత వైరస్‌ను కొవిడ్-19 సార్స్-2 అంటున్నారు.

ఈ వైరస్ చైనాలోని వుహాన్ నగరంలో ప్రారంభమైందని అంటున్నారు. అయితే సుప్రసిద్ధ వైద్యశాస్త్ర పత్రిక లాన్సెట్ తొలి 43 కరోనా వ్యాధి పీడితులలో 13 మంది వుహాన్ నగరానికి బైటి వారేనని, వుహాన్‌లో కరోనా సోకినవారితో గాని, అక్కడి 'పచ్చి మార్కెట్'తో గాని ఎటువంటి

---

సాధారణ పౌరుల మేలు కోసం ఇటువంటి చర్యలను అమలు చెయ్యగలుగుతారు.

ఈ స్థాయిలోని విశ్వమారిని ఎదుర్కోడానికి అంతర్జాతీయ వ్యూహం అవసరం అవుతుంది. అందరూ కలిసి సమన్వయంతో పని చెయ్యడంలో సంకుచిత దేశ సరిహద్దులు అవరోధంగా పరిణమిస్తాయి. ఇటీవల ఇటలీకీ యూరోపియన్ యూనియన్‌కీ మధ్య, కెనడాకి చెందవలసిన సామగ్రిని అమెరికా కాజేసిందన్న ఆరోపణల నేపథ్యంలో ఆ రెండు దేశాల మధ్య చెలరేగిన వివాదాలు ప్రపంచం మొత్తం చూసింది. అమెరికాకీ చైనాకీ మధ్య వాణిజ్య యుద్ధాలు, ఆ దేశాలు రెండూ పరస్పరం నిందించుకోవడం కూడా అందరికీ తెలిసినదే. కొవిడ్ తీవ్ర స్థితిలో సైతం క్యూబా, ఇరాన్, వెనిజులా దేశాలకి వ్యతిరేకంగా అమెరికా చేపట్టిన చర్యలు చూస్తే తమ సంకుచిత లక్ష్యాలు, ప్రయోజనాలు సాధించుకోడానికి పెట్టుబడిదారీ, సామ్రాజ్యవాద దేశాలు ఎంతకైనా దిగజారతాయన్న దానికి నిలువెత్తు సాక్ష్యంగా నిలుస్తాయి.

ప్రస్తుత కాలంలో, భవిష్యత్తులో విశ్వమారీలను ఎదుర్కోటానికి ఈ చర్యలను చేపట్టాలంటే యుద్ధ యంత్రాలను అన్నింటినీ పూర్తిగా నిర్మూలించిన తరువాతే సాధ్యం అవుతుంది. అన్ని సైన్యాలను రద్దు చేసి వాటి స్థానంలో ఆరోగ్య సంరక్షక దళాలను నిర్మించాలి. ఆయుధాలు, యుద్ధ సామగ్రిని తయారు చేసే అన్ని ఉత్పత్తి సౌకర్యాలను రద్దు చేసి వాటి స్థానంలో ఆరోగ్య రక్షణకు దోహదం చేసే ఉత్పత్తులను చేపట్టాలి. అన్ని ఆసుపత్రులు సదుపాయాలను పరిమితం చెయ్యడానికి బదులు అత్యవసర పరిస్థితుల్లో ఎప్పుడూ ఉండే అవసరాలకు కనీసం రెండింతలు ఏర్పాట్లు చెయ్యడానికి సిద్ధంగా ఉండాలన్నది అన్నింటికంటే ముఖ్యమైన చర్య.

ఇదే చివరి విశ్వమారి కాబోవడం లేదు. ప్రస్తుత కొవిడ్ 19 విశ్వమారి నుంచి ప్రపంచం బయటపడినప్పటికీ ఇంతకంటే ప్రమాదకరమైనది ఎంతో దూరాన లేదు. జీవ జాతులను కాపాడడానికి పర్యావరణాన్ని కాపాడటమన్నది తక్షణ, ముఖ్య కర్తవ్యంగా మారింది. పోటీతత్వ సామాజిక-ఆర్థిక వ్యవస్థ అని చెప్పుకునే ప్రస్తుత దురాశపూరిత, స్పందించని శిలా హృదయ వ్యవస్థని కూలదోసి దాని స్థానంలో సోషలిస్టు ఆర్థిక వ్యవస్థని నెలకొల్పే శ్రామిక వర్గం మాత్రమే ఈ చర్యలను చేపట్టగలదు. ప్రపంచంలోకెల్లా ఎంతో ముందు ఉన్న శ్రామిక వర్గమైన యూరపు, అమెరికాలోని శ్రామిక ప్రజలు నాయకత్వం వహించి మానవ జాతిని కాపాడతారని ఆశిస్తున్నాను. మానవాళికి పెను సవాలు విసిరిన ఈ సందర్భంలో ప్రపంచవ్యాప్తంగా ఉన్న ఆసియా, ఆఫ్రికా, లాటిన్ అమెరికా ప్రజలు ముందు అడుగు వేస్తారని ఆశిస్తున్నాను.

*(రచయిత వైద్య నిపుణులు)*

*(అనువాదం: కె. సురేశ్)*

వీ

సంబంధం లేనివారేనని రాసింది. వుహాన్‌లోని పచ్చి మార్కెట్ (మన దగ్గరి చేపల బజారులలాగ, వుహాన్‌లో చేపలు, మాంసం అమ్మే మార్కెట్) నుంచే ఈ వైరస్ ప్రపంచమంతా వ్యాపించిందని ప్రచార సాధనాలలో రెండో కథనం ప్రచారంలోకి వచ్చింది. ఈ కథనాన్ని కూడ క్రిప్స్ రిసర్చ్ ఇన్ స్టిట్యూట్ అధ్యయనం ఖండించింది.

ఆ అధ్యయనం ప్రకారం కొవిడ్-19 జన్యు నిర్మాణం పరివర్తన చెందడానికి, రూపొందడానికి జంతువుల సంఖ్యా సాంద్రత చాల ఎక్కువగా ఉండే ప్రాంతం కావాలి. అంటే జంతువుల ఉత్పత్తి పారిశ్రామిక పద్ధతులలో జరిగే చోట, వాటిని కిక్కిరిసినట్టుగా ఉంచే చోట మాత్రమే ఈ వైరస్ పుట్టడానికి అవకాశం ఉంది. కోళ్లను, సీమ పందులను మాత్రమే అటువంటి పరిస్థితుల్లో ఉత్పత్తి చేస్తారు. పందులలో రోగ నిరోధక వ్యవస్థ సాపేక్షికంగా మానవులలో ఉన్నట్టుగానే ఉంటుంది గనుక కొవిడ్-19 పందుల నుంచి మనుషులకు సంక్రమించడానికి అవకాశం ఉందని ఆ అధ్యయనంలో రాశారు.

ఈ విషయాల మీద పని చేసే గ్రేన్ డాట్ ఆర్గ్ అనే సుప్రసిద్ధ వెబ్ సైట్ కరోనా అనే సాకుతో వుహాన్ పచ్చి మార్కెట్‌ను మూసివేయడానికి జరుగుతున్న కుట్రలో భాగంగానే ఈ ప్రచారాలు సాగుతున్నాయని కూడ అంది. ఎందుకంటే ఈ పచ్చి మార్కెట్ చౌక మాంసాన్ని పేద ప్రజలకు అందుబాటులో ఉంచుతున్నదనీ, తమ జీవిక కోసం ఈ మార్కెట్ మీద ఆధారపడుతున్న లక్షలాది మంది పేద ప్రజలు ఆ మార్కెట్‌ను నడుపుతున్నారని ఆ వెబ్ సైట్ అంది. ఈ పేద ప్రజలు కొద్దికాలం కిందివరకూ తమ సొంత 'సహకార సంఘాల'లో, కమ్యూన్‌లలో ఉండేవారు. అక్కడ సోషలిజం కూలిపోయిన తర్వాత, వారి భూములు లాక్కోబడిన తర్వాత వారు పొట్ట చేత పట్టుకుని ఇటువంటి మార్కెట్లకు చేరి, వాటి మీద ఆధారపడవలసి వస్తున్నది. ఆ భూములలో ఇప్పుడు కబేళాలతో సహా భారీ మాంస పరిశ్రమలు, భారీ వ్యవసాయ-పారిశ్రామిక క్షేత్రాలు తలెత్తాయి. ఈ భారీ మాంస పరిశ్రమల ప్రయోజనాల కోసం పచ్చి మార్కెట్‌ను మూసివేయాలని, తద్వారా తమ మార్కెట్‌ను ఇతోధికంగా విస్తరించుకోవాలని ఆ భారీ పరిశ్రమలు ప్రయత్నిస్తున్నాయి.

గతంలో 2003-04ల్లో ఇదే కరోనా కుటుంబానికి చెందిన సార్స్ కరోనా ఎంతో మంది ప్రాణాలు తీసింది. ఈ వైరస్ జంతువుల నుంచి మనుషులకు వ్యాపిస్తుంది. ఇంతకు ముందు స్వైన్ ఫ్లూ (ఎచ్1ఎన్1) కూడ ప్రపంచవ్యాప్తంగా లక్షలాది మందిని చంపింది. ఒక్క అమెరికాలోనే 1200 మంది చనిపోయారు. అది మెక్సికోలో పుట్టిందనే అభిప్రాయంతో మొదట దాన్ని మెక్సికన్ ఫ్లూ అని పిలిచారు. సరిగ్గా ఇప్పుడు కొవిడ్-19ని కూడ చైనీస్ కరోనా అని పిలుస్తున్నారు.

కాని ఆ తర్వాత స్వైన్ ఫ్లూ గురించి చాల వివరాలు బైటపడ్డాయి. అది పారిశ్రామిక ఉత్పత్తిలో తయారైన పందుల నుంచి మనుషులకు వ్యాపించింది. అది మెక్సికోలోని ఒక పంది మాంసం కర్మాగారంలో ప్రారంభమైంది. ఆ కర్మాగారం పేరు స్మిత్ ఫీల్డ్ ఫుడ్ కంపెనీ. అది ఒక అమెరికన్ కంపెనీ. ఆ కంపెనీ ప్రపంచంలోని అతి పెద్ద పంది మాంసపు ఉత్పత్తి, శుద్ధి కంపెనీలలో మూడో స్థానంలో ఉంది. ఆ కంపెనీకి సంబంధించిన వేరు వేరు కార్ఖానాలలో సాలీనా రెండు కోట్ల ఎనభై లక్షల పందులను చంపి, హామ్, సాసేజి, బేకన్ వగైరా అనేక రూపాలలో ప్రపంచమంతటికీ సరఫరా చేస్తారు. ఈ కంపెనీ నుంచి ఆ మాంస ఉత్పత్తులను కొనుగోలు చేసే పెద్ద కంపెనీలు మెక్ డొనాల్డ్స్, కెఎఫ్‌సి వగైరాలు. అవన్నీ కూడ అమెరికన్ కంపెనీలే. ఆపిల్, పెప్సి, నైకి, జనరల్ మోటర్స్, వంటి అనేక అమెరికన్ కంపెనీలు చైనా చౌక శ్రమను దోపిడీ చేయడానికి చైనాలో తమ కర్మాగారాలు తెరిచినట్టుగానే, స్మిత్ ఫీల్డ్ ఫుడ్ కంపెనీ కూడ చైనాలో ఒక భారీ కర్మాగారాన్ని తెరిచింది.

అలాగే ప్రపంచంలోకెల్లా ఎక్కువ పంది (సీమ పంది) మాంసాన్ని ఉత్పత్తి చేసే కంపెనీల్లో ఐదవ స్థానంలో ఉన్న డానిష్ క్రౌన్ అనే డానిష్ కంపెనీ, ఏడో స్థానంలో ఉన్న జర్మనీకి చెందిన టోనీ కంపెనీ కూడ చైనాలో మాంసాన్ని ఉత్పత్తి చేసే, శుద్ధి చేసే భారీ కర్మాగారాల్ని తెరిచాయి. ఇక్కడినుంచి ఆ మాంసం చైనా దేశీయ మార్కెట్‌లోకీ, అంతర్జాతీయంగా అన్ని మార్కెట్లలోకీ సరఫరా అవుతుంది. ఈ మాంసాన్ని అతి ఎక్కువగా కొనుగోలు చేసేది మెక్ డొనాల్డ్స్, కెఎఫ్‌సి వంటి కంపెనీలు.

ఈ మాంస ఉత్పత్తి పరిశ్రమ పందెంలో చైనీయ కంపెనీల పాత్ర కూడ ఉందనేది స్పష్టమే. 2008 మాంద్యం తర్వాత, ప్రపంచంలోకెల్లా అతి పెద్ద మదుపు సంస్థ గోల్డ్ మాన్ సాక్స్ తన మదుపును అనేక రంగాలకు విస్తరించడంలో భాగంగా 300 మిలియన్ డాలర్లు ఖర్చుపెట్టి చైనాలోని పది అతి పెద్ద కోళ్ల ఫారంలను కొన్నది. దానికి తోడుగా, అదే సంస్థ చైనాలోని పంది మాంసం పరిశ్రమలో 200 మిలియన్ డాలర్లు మదుపు పెట్టింది.

వీటితోపాటు ఒఎస్ఐ అనే అమెరికన్ బడా కంపెనీకి సంబంధించిన ఉదంతం ఒకటి ఇటీవల విపరీతంగా వార్తల్లోకెక్కింది. కోడి మాంసాన్ని ప్రాసెస్ చేసే ఈ కంపెనీకి చైనాలో పది భారీ కర్మాగారాలున్నాయి. ఇది తయారు చేసే మాంసం మెక్ డొనాల్డ్, కెఎఫ్‌సి వంటి కంపెనీల ద్వారా చైనాతో సహా ప్రపంచ మార్కెట్లన్నిటికీ చేరుతుంది. ఇది కుళ్లిపోయిన కోడి మాంసాన్ని ప్రాసెస్ చేసి, చైనా మార్కెట్‌కు సరఫరా చేసింది. అది బైట పడడంతో చైనా ప్రభుత్వం ఈ కంపెనీ మీద భారీ జరిమానా విధించడం మాత్రమే కాక, పది మంది కంపెనీ సిబ్బందిని జైలుకు పంపింది. ఈ సందర్భంలో ఈ వివరాలన్నీ ఎందుకు అవసరమంటే, 945 మిలియన్ డాలర్ల విలువైన ప్రపంచ మాంసం వ్యాపారంలో అమెరికాకూ, ఇతర యూరపియన్ దేశాలకూ ఉన్న భాగస్వామ్యమేమిటో, ఆ వ్యాపారంతో చైనాకు ఉన్న సంబంధమేమిటో మనం అర్థం చేసుకోవలసి ఉంది.

ఇప్పుడిక, ఈ మాంస ఉత్పత్తి ఎలా జరుగుతుందో కూడ చూద్దాం. అప్టన్ సింక్లేర్ రాసిన సుప్రసిద్ధ నవల 'జంగిల్' 1906లో వచ్చింది. అమెరికన్ మాంస పరిశ్రమ ఎలా పనిచేస్తుందో అది సవివరమైన చిత్రణను ఇచ్చింది. ఆయన రాసిన ఒక వాక్యం నాకింకా గుర్తుంది. అక్కడ పందుల మృత్యుభయపు అరుపులు తప్ప ప్రతిదీ అమ్మకానికి సిద్ధంగా ఉన్నాయంటారు సింక్లేర్. కాని నూట పదిహేనేళ్లు గడిచాక ఇవాళ పరిస్థితి 'జంగిల్' నవలలో వర్ణించినదానికన్న చాల ముందుకు వచ్చింది. ఇవాళ పరిశ్రమల్లో ఉత్పత్తి చేసే చెప్పుల లాగే, బట్టల లాగే, పందులు, కోళ్లు వంటి సజీవ జంతువులను కూడ అదే పద్ధతిలో ఉత్పత్తి చేస్తున్నారు. అనేక ఆంటీ బయోటిక్ మందులు, హార్మోన్లు, జెనెటిక్ ఇంజనీరింగ్ వాడి వాటిని ఉత్పత్తి చేస్తున్నారు. అందువల్ల ఇవాళ ఆ పందులు, కోళ్లు అరవడం కూడ లేదు. ఎందుకంటే వాటి జన్యువులలోంచి అరవడం అనే లక్షణాన్ని తొలగించారు. తొందరగా ఎదగడానికీ, ఎక్కువ మాంసం ఇవ్వడానికీ వాటికి అన్ని రకాల మందులూ ఇస్తున్నారు. అవి ఎదగడం ఎంత ఆలస్యమైతే అంత ఎక్కువ ఖర్చవుతుంది గనుక ఆ

ఖర్చును తగ్గించడానికి ప్రయత్నిస్తున్నారు. ఎక్కువ స్థలంలో ఉంచితే ఎక్కువ ఖర్చవుతుంది గనుక వాటిని ఇరుకు స్థలాలలో కిక్కిరిసేలా పెట్టి, అవి కదలడం కూడ సాధ్యం కాకుండా చేస్తున్నారు. పెట్టుబడిదారీ తర్కం ప్రకారం, ఉత్పత్తి వ్యయాన్ని తగ్గించడానికి క్రమబద్ధంగా వాటి జన్యు నిర్మాణాన్ని మారుస్తున్నారు. ఉదాహరణకు, కోడి ఈకలు తీయడం అనేది ఎక్కువ మంది శ్రామికులూ సమయమూ వెచ్చించవలసిన అదనపు అనవసర ఖర్చుగా భావించిన పరిశ్రమ ఈకలు తగ్గిపోయే శాస్త్ర అన్వేషణలు చేసి వాటి జన్యువులను మార్చింది. అదే విధంగా, కోడి కాళ్లు అమ్మినట్టుగా, కోళ్లలో, పందులలో, ఇతర జంతువులలో అనేక ప్రత్యేక అవయవాలను వేరు చేసి, విడిగా ప్యాక్ చేసి అమ్మే ప్రపంచ మార్కెట్ ఉంది గనుక, ఈ ప్రత్యేక అవయవాలు తొందరగా బరువు పుంజుకునేలా జన్యు నిర్మాణాలు మారుస్తున్నారు. మిగిలిన శరీరమంతా ఎంత బరువు ఉన్నదో, ఈ ప్రత్యేక అవయవాలు అంతే బరువుండే జన్యు నిర్మాణాలు తయారయ్యాయి. అంతే కాదు, వాటిని విడివిడిగా తూయడం, కొలవడం వంటి అదనపు శ్రమలు లేకుండా, అమ్మే జంతువులూ, పక్షులూ అన్నీ ఒకే బరువు ఉండేలా జన్యు నిర్మాణాలు మారుస్తున్నారు.

ఇలా పారిశ్రామికంగా తయారైన జంతువులు సహజ వాతావరణంలో మనుగడ సాగించజాలవు. వాటి కోసం కృత్రిమ వాతావరణం సృష్టించవలసిందే. ఉదాహరణకు, ఈకలు లేని కోడి ఒక నిర్దిష్ట ఉష్ణోగ్రతలో మాత్రమే బతుకుతుంది. అంటే ఇక్కడ జంతువులను ఒక కృత్రిమ పద్ధతిలో తయారు చేయడం మాత్రమే కాదు, అవి బతకడానికి కృత్రిమ వాతావరణాన్ని కూడ సృష్టిస్తున్నారు.

కాని ఈ ప్రక్రియలో ఏమవుతుందంటే ఈ జీవులకు సహజంగా ఉండే రోగ నిరోధక శక్తి, రక్షణ శక్తి అంతరించిపోతాయి. అంటే డార్విన్ చెప్పిన 'సహజ ఎంపిక' నియమం ఇక్కడ వర్తించకుండా పోతుంది. 'సహజ ఎంపిక' స్థానాన్ని 'పెట్టుబడిదారీ ఎంపిక' ఆక్రమిస్తుంది. ఇటువంటి పరిస్థితిలో కరోనా వంటి వైరస్‌లు ఈ జంతువులకు సోకినప్పుడు, ఆ వైరస్‌లు ఇబ్బడి ముబ్బడి కావడానికి (పరివర్తన చెందడానికి) సులభమవుతుంది. అంతేగాక, వేలాది జంతువులు ఒకేచోట కిక్కిరిసిన మందగా ఉన్నప్పుడు ఆ వైరస్‌లు వ్యాపించడం సులభమవుతుంది.

ఇందుకు భిన్నంగా, జంతువులు, జీవజాతులు సాపేక్షికంగా ఒకదానికొకటి దూరంగా, తమ సహజ వాతావరణాలలో, సహజ పద్ధతులలో జీవిస్తున్నపుడు వాటి రోగ నిరోధక శక్తి బలోపేతమవుతుంది. ఒక్కొక్క దానిలో వ్యక్తిగత స్థాయిలో రోగ నిరోధక శక్తి భిన్నంగా ఉంటుంది. అటువంటి స్థితిలో ఒక జంతువుకు వైరస్ సోకినప్పటికీ ఆ వైరస్ వేగంగా పెరగడానికి గాని, వ్యాపించడానికి గాని అవకాశం ఉండదు. ఒకరకంగా చెప్పాలంటే ఆ సహజ వాతావరణంలో వైరస్ దాటలేని అవరోధాలెన్నో ఉంటాయి. వైరస్‌తో పోరాటంలో మెరుగ్గా ఉండే జంతువులు 'సహజ ఎంపిక' నియమం ద్వారా ఎంపిక అయి అవే మనుగడ సాగిస్తాయి. కాని జంతువులను పారిశ్రామికంగా, మార్కెట్ ఒత్తిళ్లకు లోబడి ఉత్పత్తి చేసినప్పుడు వైరస్‌లు వ్యాపించడానికీ, వేగంగా పెరగడానికీ, పరివర్తన చెందడానికీ 'ఎర్ర తివాచీ' పరిచినట్టవుతుంది. ఈ పరిశ్రమలలో పనిచేసే మనుషుల ద్వారా వైరస్ మొత్తం సమాజానికీ వ్యాపిస్తుంది. చివరికి ఈ ప్రపంచీకరణ యుగంలో ప్రపంచమంతా వ్యాపిస్తుంది.

ఈ జంతువుల ఉత్పత్తి పారిశ్రామిక స్థాయిలో జరుగుతున్నది గనుక, లక్షలాది మంది, ముఖ్యంగా ఈ పరిశ్రమల్లో పనిచేసే కార్మికులు వాటితో నిరంతర సంబంధంలో ఉంటారు. రోజులో 12-14 గంటలు వైరస్‌ల తోనే ఉంటారు. అటువంటి పరిస్థితుల్లో, అంత సుదీర్ఘకాలం చాల మంది ఒక్క చోటే ఉండడం వల్ల, వారిలో కూడ వైరస్ పరివర్తన చెందడానికి అవకాశాలు పెరుగుతాయి. కొవిడ్-19 వైరస్‌కూ, ఇంతకు ముందరి సార్స్, ఇబోలా, స్వైన్ ఫ్లూ, జికా, ఎంఇఆర్, వగైరా వైరస్ లకూ సంబంధం నేరుగా పారిశ్రామిక మాంస ఉత్పత్తితోనే ఉన్నదని ఇప్పటికే తేటతెల్లమయింది.

జంతు శాస్త్రవేత్త రాబ్ వాలేస్ 'బిగ్ ఫార్మ్స్ మేక్ బిగ్ ఫ్లూ' (పెద్ద వ్యవసాయ క్షేత్రాలు భారీగా ఫ్లూను తయారు చేస్తాయి) అనే పుస్తకం రాశారు. ఆ పుస్తకంలో ఆయన, "వైరస్‌లు అంతకంతకూ ఎక్కువ ప్రమాదకరంగా ఎందుకు మారుతున్నాయో తెలుసుకోదలచిన వారెవరైనా వ్యవసాయాన్ని పారిశ్రామిక పద్ధతిలో చేసే నమూనాను పరిశోధించాలి. ప్రత్యేకించి పశుగణ ఉత్పత్తి పరిశ్రమను పరిశోధించాలి. ఒక్క మాటలో చెప్పాలంటే పెట్టుబడిదారీ విధానాన్ని పరిశీలించాలి" అన్నారు.

ఈ కంపెనీలు మాంసం ఉత్పత్తి చేయడం మాత్రమే కాదు, తీవ్రమైన వ్యాధులకు కారణమయ్యే వైరస్‌లను కూడ సాగు చేస్తాయని రాబ్ వాలేస్ మరో చోట రాశారు.

ఇదే పరిస్థితి వ్యవసాయంలో కూడ సాగుతున్నది. నిజానికి వృక్ష జాతుల జన్యు నిర్మాణం అంత క్లిష్టమైనది కాదు గనుక, సులభతరమైనది గనుక వ్యవసాయంలో జన్యు సాంకేతిక పరిజ్ఞానాన్ని చాల విస్తృతంగా వాడుతున్నారు. దానితో పాటు వ్యవసాయంలో పురుగుల మందులు, కలుపు మందులు (క్రిమి సంహారకాలు, గుల్మ నాశనులు) విపరీతంగా వాడుతున్న తీరు వల్ల, అవి భూమండల ఉష్ణోగ్రతలు పెరగడానికి మాత్రమే కాక, మొత్తంగా భూగోళపు సమస్త వాతావరణంలో నిర్ణయాత్మకమైన, గుణాత్మకమైన మార్పులకు దారి తీశాయి.

పందులకు ఆహారంగా సోయాబీన్ పిండి పెడుతున్నారు గనుక, సోయాబీన్ సాగు విస్తీర్ణం పెంచడానికి బ్రెజిల్‌లో అమెజాన్ అడవులను నరికి సాగు భూమిగా మార్చారు. తత్ఫలితంగా, అక్కడి పర్యావరణ సమతుల్యత దెబ్బతినడంతో పాటు, అప్పటివరకూ ఆ అరణ్యాలలో ఇతర జీవజాతులతో సంబంధం లేకుండా స్థానికంగా ఉండిపోయిన వైరస్‌లతో మనుషులు ప్రత్యక్ష సంబంధంలోకి వచ్చారు. ప్రకృతి ఎంత సంక్లిష్ట నిర్మాణంతో ఉంటుందంటే ఎన్నో ప్రమాదకరమైన వైరస్‌లను అది స్థానికతా 'గృహాలలో' నిర్బంధించి పెడుతుంది.

ఒక శాస్త్రీయ పరిశోధన ప్రకారం, అమెజాన్ అరణ్యాల నరికివేత ఏ పద్ధతిలో జరుగుతున్నదంటే, రానున్న 15 సంవత్సరాలలో అమెజాన్ ప్రాంతంలో కార్బన్‌ను స్వీకరించే విశాల క్షేత్రమంతా కార్బన్‌ను విడుదల చేసే ప్రాంతంగా మారిపోతుంది. పెట్టుబడిదారీ లాభాపేక్షతో మనం ఈ ప్రకృతి సహజమైన సంక్లిష్ట నిర్మాణంలో జోక్యం చేసుకుని, దాన్ని ఏకరూపకంగా మార్చినప్పుడు, మనం కచ్చితంగా వైరస్‌లకు రాజమార్గాలు నిర్మిస్తున్నామన్నమాట.

ఇదే పద్ధతిలో పెట్టుబడిదారీ పారిశ్రామిక వ్యవసాయం ప్రపంచవ్యాప్తంగా కోట్లాది మందిని తమ భూముల నుంచి బేదఖలు

చేసింది. అప్పుల ఊబిలో దించిన ఫలితంగా రైతులు ఆత్మహత్యలు చేసుకునే స్థితి వచ్చింది. అది మొత్తం పర్యావరణాన్ని విషపూరితం చేసింది.

ఇవాళ విత్తనాల, పురుగుమందుల రంగంలో ఉన్న కంపెనీలలో అత్యధికం మొదటి, రెండో ప్రపంచ యుద్ధ కాలాల్లో, వియత్నాం యుద్ధ కాలంలో విషపూరిత వాయువులను ఉత్పత్తి చేస్తూ ఉన్నాయనేది ఒక ఆశ్చర్యకరమైన వాస్తవం. డ్యుపాంట్, మోన్సాంటో, డౌ కెమికల్ వంటి కంపెనీలు అమెరికాకూ, మిత్ర రాజ్యాలకూ విష వాయువులను సరఫరా చేయగా, బేయర్ వంటి అగ్రశ్రేణి పురుగుల మందుల కంపెనీలు హిట్లర్‌కు విషవాయువులను సరఫరా చేశాయి. డౌ కెమికల్, మోన్సాంటో వంటి కంపెనీలు వియత్నాం యుద్ధ సమయంలో అమెరికన్ సైన్యానికి 'ఏజెంట్ ఆరెంజ్' అనే కుఖ్యాతి పొందిన విషవాయువునూ, నాపామ్ బాంబునూ సరఫరా చేశాయి.

ఇక 'శాంతి కాలం'లో, ప్రస్తుతం, ఈ కంపెనీలు అదే విషపూరిత రసాయనాలను పురుగుల మందులుగా మార్చి పర్యావరణాన్ని దెబ్బతీయడానికి వాడుతున్నాయి. ఒక ప్రతిష్ఠాత్మక పత్రికలో ప్రచురితమైన పత్రాన్ని ఉటంకిస్తూ, పంటల మీద కొట్టే పురుగుల మందులలో 99.9 శాతం నేరుగా పర్యావరణంలోకి వెళతాయని, కేవలం 0.1 శాతం మాత్రమే లక్ష్యాన్ని చేరుతాయని సుప్రసిద్ధ వ్యవసాయ శాస్త్రవేత్త దేవిందర్ శర్మ అన్నారు. ఈ 99.9 శాతం విష రసాయనాల వల్ల జీవజాతులకు సహకారిగా, స్నేహంగా ఉండే ఎన్నో రకాల బాక్టీరియా, వానపాముల వంటి ప్రయోజనకరమైన జీవజాతులు అంతరిస్తాయి.

మన దేశంలో పంజాబ్‌లో పంటపొలాల్లో వాడిన పురుగుల మందులకూ అక్కడ పెరుగుతున్న కాన్సర్ వ్యాధి పీడితుల సంఖ్యకూ ఉన్న సంబంధం ఇప్పటికే అందరికీ తెలిసిందే. భటిండా నుంచి బికనేర్ కాన్సర్ ఆస్పత్రికి వెళ్లే రైలును అక్కడ 'కాన్సర్ ఎక్స్ ప్రెస్' అని పిలుస్తున్నారు. దీనికి 'జియో ఇంజనీరింగ్'నూ యుద్ధ పరిశ్రమనూ జోడిస్తే పరిస్థితి భయానకంగా మారిపోతుంది.

ఇది ఎంగెల్స్ ద్విశత జయంతి సంవత్సరం. మార్క్స్, ఎంగెల్స్‌లు తమ కాలంలో పెట్టుబడిదారీ విధానపు ధోరణిని అర్థం చేసుకుని, పెట్టుబడిదారీ విధానం గురించి తమ అధ్యయనాలలో దాన్ని ప్రస్తావించారు. "ప్రకృతితో వ్యవహరించేటప్పుడు, ఓడించిన విదేశీ ప్రజల పట్ల ప్రవర్తించే విజేత లాగ, ప్రకృతి నుంచి బైట నిలబడినవారిలాగ, అధికారం చలాయించలేమని ప్రతి అడుగునా మనకది గుర్తు చేస్తుంది. అందుకు భిన్నంగా, మనం మన రక్తమాంసాలతో, మెదడుతో ప్రకృతికి చెందినవాళ్లం. దాని మధ్య మనుగడ సాగించవలసిన వాళ్లం. దాని మీద మన ఆధిపత్యమంతా కేవలం మిగిలిన అన్ని జీవజాతులకన్న భిన్నంగా దాని నియమాలను అర్థం చేసుకోగలమనీ, ఆ నియమాలను సరిగ్గా అన్వయించగలమనీ మాత్రమే" అని ఎంగెల్స్ అన్నాడు.

పెట్టుబడిదారీ విధానానికి ముందు ఉన్న వర్గ వ్యవస్థలేవైనా కేవలం శ్రమను మాత్రమే దోపిడీ చేసేవి. శ్రమతో పాటు ప్రకృతిని కూడ దోపిడీ చేసే మొట్టమొదటి వర్గవ్యవస్థ పెట్టుబడిదారీ విధానం. కాని దాని దుష్ఫలితాలను మాత్రం యావత్తు మానవ జాతి అనుభవించవలసి వస్తుంది.

2011కూ 2018కీ మధ్య 172 దేశాల్లో మొత్తం 1,483 విస్తృతమైన అంటువ్యాధులు ప్రబలాయని ప్రపంచ ఆరోగ్య సంస్థ గుర్తించింది. ఇందుకు కారణమైన వైరస్‌లను, ప్రధానంగా ఇన్‌ఫ్లుయెంజా, సార్స్, ఎంఇఆర్ఎస్, ఇబోలా, జికా, ప్లేగ్, ఎల్లో ఫివర్ వగైరాలను, అధ్యయనం చేసిన గ్లోబల్ ప్రిపేర్డ్‌నెస్ మానిటరింగ్ బోర్డ్ (జిపిఎంబి), ఇవాళ్టి కరోనా లాంటి మహా విపత్తు త్వరలో బైటపడనున్నదని కచ్చితమైన హెచ్చరికను 2019 సెప్టెంబర్‌లోనే ఇచ్చింది. 'ప్రమాదంలో ప్రపంచం' (ఎ వరల్డ్ ఎట్ రిస్క్) అనే శీర్షికతో వెలువడిన ఆ నివేదికను పరిగణనలోకి తీసుకునేవాళ్లు ఒక్కరూ లేకపోయారు.

అంతే కాదు, 2003-04లో వచ్చిన సార్స్ మహమ్మారికి ముందే శాస్త్రవేత్తలు కరోనా కుటుంబానికి చెందిన ఒక వైరస్ భవిష్యత్తులో మహా ప్రమాదకరంగా మారనున్నదని హెచ్చరిక విడుదల చేశారు. ప్రపంచ ఆరోగ్య సంస్థ అన్ని దేశాల ప్రజా ఆరోగ్య వ్యవస్థలకు మూడు సంవత్సరాల కిందనే ఒక హెచ్చరిక జారీ చేసింది. ఒకానొక వైరస్ మహా భయానకమైన మహమ్మారిని సృష్టించబోతున్నదని, అన్ని ప్రభుత్వాలు ఆ సవాలును ఎదుర్కోవడానికి సమాయత్తం కావాలని ఆ హెచ్చరిక చెప్పింది.

ఈ హెచ్చరికలను విని ఉంటే పరిశోధనా కార్యక్రమాలు చేపట్టవలసి ఉండింది. తమ ప్రజారోగ్య సేవల వ్యవస్థలను బలోపేతం చేసి భవిష్యత్తు అవసరాలకు సంసిద్ధం చేసి ఉండవలసింది. కాని ఆ పనులు చేయవలసిన సామ్రాజ్యవాద – పెట్టుబడిదారీ వ్యవస్థ 2007-08 సంక్షోభం తర్వాత తానే స్వయంగా ఐసియులో ఉన్నప్పుడు అది భవిష్యత్తుకు ఎలా సంసిద్ధం కాగలుగుతుంది? 90 ట్రిలియన్ డాలర్ల విలువైన ప్రపంచ పెట్టుబడిదారీ విధానం తనంతట తానే 270 ట్రిలియన్ డాలర్ల రుణభారం కింద మూలుగుతున్నప్పుడు అది ఏ జాగ్రత్తలు తీసుకోగలుగుతుంది?

ప్రపంచంలోని అనేక దేశాలలో అంతవరకూ ఎంతో కొంత ఉండిన "ప్రజా" రంగం కూడ ప్రైవేటీకరణ తుపానులో ధ్వంసమైపోయింది. ప్రతి వ్యవస్థనూ, నిర్మాణాన్నీ ప్రైవేటు రంగానికి అప్పగించారు. చాల దేశాల్లో ప్రభుత్వ వైద్య ఆరోగ్య సేవా రంగాలు ధ్వంసమైపోయాయి. అమెరికా, బ్రిటన్‌లలో ప్రభుత్వ ఆరోగ్య సేవల రంగాలను ఎట్లా ధ్వంసం చేశారో మైకేల్ మూర్, జాన్ పిల్జర్‌లు తీసిన డాక్యుమెంటరీలు చూస్తే అర్థమవుతుంది.

మరొక వంక, తక్షణ లాభాలు లేని రంగాలలో ప్రైవేట్ కంపెనీలు పరిశోధనలు ఎందుకు సాగిస్తాయి? ఇది స్పష్టంగా అర్థం కావాలంటే ఒక ఉదాహరణ చూడాలి. జన్యు చికిత్స మీద పరిశోధన చేస్తున్న ఒక కంపెనీకి సంబంధించిన ఇమెయిల్స్ పొరపాటున బైటపడ్డాయి. ఆ కంపెనీలో మదుపు పెట్టిన గోల్డ్ మాన్ సాక్స్ రాసిన ఇమెయిల్‌లో జన్యువులో మార్పులు చేసి అసలు అనారోగ్యమే రాకుండా చేయడానికి పరిశోధనలు జరపడం 'సుస్థిరమైన వ్యాపార తర్కం' కాదు అని మందలించారు. జబ్బు అనేది ఎప్పుడూ వస్తూ ఉండడమే ఎప్పుడూ లాభాలు తెచ్చి పెడుతుంది. అసలు జబ్బే రాకుండా చేయడమంటే లాభాలు రాకుండా చేయడమే. అంటే అది సుస్థిరమైన వ్యాపార తర్కం కాదు.

ఇంతకూ వాస్తవమేమంటే, 2020 ప్రారంభంలో అల్లకల్లోలం చేయడానికి వచ్చిన కరోనా సంక్షోభాన్ని ఎదుర్కోవలసిన ప్రపంచాన్ని అప్పటికే ముప్పై సంవత్సరాలుగా ప్రపంచీకరణ చెదలు తినేస్తున్నది.

ఆ ప్రపంచపు వాస్తవ దృశ్యాన్ని గుర్తించడానికి మీరు కేవలం రెండు అంశాలు చూస్తే చాలు:

ఒకటి, ఈ భూమిని తొమ్మిది సార్లు ధ్వంసం చేయడానికి తగిన ఆయుధ సామగ్రి మన దగ్గర ఉంది గాని, అదే సమయంలో మన దగ్గర జీవితాన్ని నిలపడానికి అవసరమైన వెంటిలేటర్లు మాత్రం కావలసినన్ని లేవు. ఈ వెంటిలేటర్ల తీవ్రమైన కొరతే ఇవాళ కరోనా వల్ల జరిగే మరణాలకు ప్రధాన కారణం కానుంది.

రెండోది, ఇవాళ ప్రపంచంలోని 2,153 మంది సహస్ర కోటీశ్వరుల దగ్గర ఉన్న సంపద, 406 కోట్ల మంది దగ్గర ఉన్న సంపదతో సమానం. ఈ ప్రపంచీకరణ వ్యవస్థకు నిర్మాత అయిన అమెరికా ప్రస్తుతం అత్యంత దారుణమైన దుస్థితిని అనుభవిస్తున్నదంటే కారణం అదే. అందుకు భిన్నంగా, ఒక భిన్నమైన సామాజిక ఆర్థిక వ్యవస్థ ఉన్న క్యూబా మెరుగైన స్థితిలో ఉన్నది. క్యూబా కరోనాను అదుపులో పెట్టడం మాత్రమే కాదు, కరోనా వ్యతిరేక పోరాటంలో ప్రపంచంలోనే అగ్రశ్రేణిలో ఉండి 62 దేశాలకు తన వైద్యులను, ఔషధాలను పంపిస్తున్నది. ఇతర దేశాలకు సైన్యాన్ని, ఆయుధాలను పంపించే పని అమెరికా చేస్తుండగా, వైద్యులను, ఔషధాలను పంపించే పని క్యూబా చేస్తున్నది. రెండు భిన్నమైన సామాజిక వ్యవస్థల మధ్య తేడా ఇదే. ఒకటి మృత్యువును ఎగుమతి చేసే వ్యవస్థ, మరొకటి జీవితాన్ని ఎగుమతి చేసే వ్యవస్థ.

వాస్తవానికి, ప్రఖ్యాత రచయిత నౌమి క్లీన్ అన్నట్టు, భూకంపం, తుపాను, మహమ్మారి వంటి ఉత్పాతం వచ్చినపుడు పాలకవర్గాలు తమ భావజాలాన్ని వదులుకోవు, మరింత గట్టిగా అంటిపెట్టుకుంటాయి. అందువల్లనే ఇంతటి ఉత్పాతంలో కూడ అవి తమ వర్గ ప్రయోజనాల మీద, భవిష్యత్తు లాభాల మీద దృష్టి పోగొట్టుకోవడం లేదు. అవి ఇంతకాలమూ అణచిపెట్టుకున్న అత్యాశలు కూడ ఇటువంటి సమయంలోనే బైటపడతాయి. వాటిని తీర్చుకోవడానికి అన్ని ప్రయత్నాలూ చేస్తాయి.

గత సంవత్సరం, 2019 ఒక గొప్ప నిరసన ప్రదర్శనల, ఉద్యమాల సంవత్సరం. చాల మంది రాజకీయ విశ్లేషకులు ఆ సంవత్సరాన్ని 1848తో, 1968తో పోల్చారు. ఆ సంవత్సరం భూగోళం మీద ఏ ఒక్క మూల కూడ భారీ ప్రజా ప్రదర్శనలు చూడకుండా లేదు. భారతదేశంలో కూడ ఈ కాలంలోనే సిఎఎకు వ్యతిరేకంగా బ్రహ్మాండమైన ప్రదర్శనలు జరిగాయి. కరోనా సాకుతో పాలకవర్గాలు ఈ ఉద్యమాలన్నిటినీ తక్షణమే మూసివేయడంలో విజయం సాధించాయి. ప్రపంచ వ్యాప్తంగా అంతటి భారీ స్థాయి ప్రజా రాజకీయ ఉద్యమాలు కరోనా సాకుతో మరణించడం, కరోనా మరణాల కన్న తక్కువదేమీ కాదు. ఇవాళ ప్రపంచమంతటా కరోనా మరణాల గురించి పత్రికలు హోరెత్తుతున్నాయి. మన దేశంలో షాహీన్ బాగ్ నిరసన ప్రదర్శనలు ఎలా ముగిసిపోయాయో ప్రతి ఒక్కరికీ తెలుసు.

ప్రపంచమంతటా మాంద్యం ముసురుకుంటున్నప్పుడు, తమ లాభాల వాటాను కాపాడుకోవడానికి కంపెనీలు తమ కార్మికులను, ఉద్యోగులను ఉద్యోగాల నుంచి తొలగించడానికి కంకణం కట్టుకున్నాయి. కాని అవి ఆ పని చేయడానికి తీవ్రమైన వ్యతిరేకత ఎదురవుతూ ఉండింది. ఇప్పుడు కరోనా వారికి మహా అవకాశం ఇచ్చింది. ఈ కాలంలో మొత్తం ఎంత మందిని ఉద్యోగాల నుంచి తొలగించారో వాస్తవ గణాంకాలు తర్వాత బైటపడతాయి. కాని ఈలోగా మనం వాస్తవాల ఆధారంగా కొన్ని అంచనాలు వేయవచ్చు. ఒక్క అమెరికాలోనే ఒక కోటీ ఎనభై లక్షల మంది గత రెండు నెలల్లో కొత్తగా నిరుద్యోగ భృతికి దరఖాస్తు పెట్టుకున్నారు. 1929–30 నాటి మహా సంక్షోభం తర్వాత ఇంతమంది నిరుద్యోగులు కావడం ఇప్పుడే.

ఈ కరోనా మహావిపత్తు కాలంలో అనేక దేశాల ప్రభుత్వాలు ఎటువంటి నిరంకుశ పద్ధతులను అమలు చేస్తున్నాయో చూస్తే, అవి వాళ్ల పీడనా కాంక్షను వ్యక్తీకరిస్తున్నాయనిపిస్తున్నది. హంగరీతో సహా ఎన్నో దేశాలు నేరుగానే అత్యవసర పరిస్థితిని ప్రకటించాయి. మన దేశంలో కూడ, మోడీ స్పష్టంగానే 'సామాజిక అత్యవసర పరిస్థితి' గురించి మాట్లాడాడు. నిజానికి ఇది భారత్ వంటి మూడో ప్రపంచ దేశాలలో దారుణంగా ఉంది. మార్చ్ 21న, కొలంబియాలోని బొగొటా జైలులో కరోనాతో వ్యవహరించడానికి తగిన మెరుగైన పరిస్థితులు కల్పించమని అడిగిన ఖైదీల మీద పోలీసులు దాడిచేసి, కాల్పులు జరిపి 23 మంది ఖైదీలను చంపేశారు. కెన్యాలో వీధుల్లో పోలీసు కాల్పుల్లో చనిపోయిన వారి సంఖ్య కరోనాతో చనిపోయినవారి సంఖ్య కన్న ఎక్కువ. మామూలు సందర్భాల్లోనైతే ఇవి ప్రధాన వార్తలు అయి ఉండేవి. కాని కరోనా కాలంలో ఈ వార్తలకు దిక్కే లేదు.

వివిధ దేశాల ప్రభుత్వాలు, ఇంటర్నెట్ కంపెనీలు కలిసి కరోనా సాకుతో తమ దేశాలను అక్వేరియంలలాగ మార్చేశాయి. పౌరుల ప్రతి చర్యా నిఘాకు గురవుతున్నది. మామూలు సమయాల్లోనైతే ఇంత నిఘా ఉంటే తీవ్రమైన వ్యతిరేకత వచ్చేది, కాని ప్రస్తుత స్థితి ఒక "కొత్త సాధారణ స్థితి" లాగున్నది. ఇవాళ మన ముందర గూఢచారి పెట్టుబడిదారీ విధానం దాని నగ్నరూపంలో ఉన్నది. జార్జి ఆర్వెల్ రాసిన 1984 ఇవాళ ఇంకెంతమాత్రమూ ఒక నవల కాదు, ఒక కఠోర వాస్తవం. విచిత్రమైన విషయమేమంటే ఆ నవల రాసినప్పుడు, దాన్ని సినిమాగా తీసినప్పుడు సోషలిజం మీద విమర్శగా వెలువరించారు. ఇవాళ పెట్టుబడిదారీ విధానమే ఆ నవలలో, సినిమాలో చూపినదానికన్న ఘోరంగా ఉండగలనని చూపుకుంటున్నది. ఆలోచనల మీద నిఘా, ఆలోచనల మీద పోలీసులు అనే మాటలు ఇవాళ కనీసం భారతదేశంలో అక్షరాలా నిజాలయ్యాయి. నేనీ వాక్యం రాస్తున్నప్పుడే, కరోనా విషయంలో ప్రభుత్వ వైఫల్యం గురించి ఫేస్ బుక్ మీద వ్యాఖ్య రాసినందుకు ఇంఖిలాబి మజ్దూర్ కేంద్ర కు చెందిన కైలాష్ భట్‌ను అరెస్టు చేశారని వార్త వస్తున్నది.

కరోనా ధనికులకూ పేదలకూ మధ్య వ్యత్యాసం చూపదని ప్రధానస్రవంతి ప్రచార సాధనాలు పదే పదే చెపుతున్నాయి. కాని అన్ని సందర్భాలలో లాగనే ఈ సందర్భంలో కూడ ప్రధానస్రవంతి ప్రచారసాధనాల మాట తప్పు. అన్ని రకాల ఆర్థిక సామాజిక విభజనలను కరోనా పూర్తిగా బలోపేతం చేస్తున్నది. మనం అమెరికాలోని అంకెలనే పరిశీలిస్తే, మరణాలలో 70 శాతం నల్లజాతి వారివి, ఆఫ్రికన్ అమెరికన్లవి. ఇప్పుడు కరోనా సమయంలో ఫోన్ ఎక్కడెక్కడికి వెళ్లిందనే దాన్ని బట్టి వారి సామాజిక చలనాన్ని చెప్పే సమాచారాన్ని ఎన్నో సంస్థలు బైటపెడుతున్నాయి. ఆ సమాచారాన్ని బట్టి అమెరికా, యూరప్‌లలో దాదాపు పది శాతం జనం అసలు ఎక్కడికీ కదలడమే లేదు. అంటే వాళ్లు పూర్తిగా తమ ఇళ్లలోనే ఉంటున్నారు. అదే సమయంలో ఆర్థిక స్థాయిలో అట్టడుగు 30 శాతం జనాభాలో విపరీతమైన చలనం ఉన్నట్టు

తెలుస్తున్నది. ఈ చలనంలో ఉన్న ప్రజానీకమే కరోనాకు అతి పెద్ద బాధితులుగా ఉన్నారు. అంటే తమ జీవిక కోసం బైట తిరగక తప్పని జనం కరోనా బాధితులుగా ఉన్నారన్నమాట. వారు ఇంట్లో ఉండడం అసాధ్యం. ఈ సందర్భంలో రానా అయ్యూబ్ రాసిన 'సామాజిక దూరాన్ని పాటించడం ఒక విలాసం' అనే వ్యాసం చూడడం మంచిది. భారత దేశంలో గాని, ప్రపంచంలో ఎక్కడైనా గాని మురికివాడల్లో సామాజిక దూరం, సోషల్ డిస్టెన్సింగ్ అనేది ఒక క్రూర పరిహాసం.

వాస్తవంగా వరదనీరు అంతా తీసిన తర్వాత మాత్రమే ఆ ప్రాంతపు నిజమైన చీదర అంతా కనబడుతుంది. ఈ కరోనా వెళ్లిపోయిన తర్వాతనే మన వ్యవస్థ ఎంత దుర్మార్గమైనదో బైటపడుతుంది. అయితే వరద నీరు ఉన్నప్పుడు కూడ మీరు చూడగలిగినవి కొన్ని ఉంటాయి. స్పానిష్ ఆరోగ్య మంత్రిత్వ శాఖ ఇచ్చిన రహస్య ఆదేశాల ప్రకారం 60 సంవత్సరాల వయసు దాటినవాళ్లను ఐసియులలో చేర్చుకోవద్దని అన్నారు. వారికి బదులుగా యువ వ్యాధి పీడితులకు ప్రాధాన్యత ఇవ్వాలని అన్నారు. అమెరికాలో టెక్సాస్ రాష్ట్ర గవర్నర్ డాన్ పాట్రిక్ మరింత నిర్దాక్షిణ్యంగా ముసలివాళ్లు తమ జీవితాలను అమెరికన్ ఆర్థిక వ్యవస్థ కోసం, యువతరం కోసం త్యాగం చేయాలని అన్నాడు. వ్యాపార పత్రిక బ్లూంబర్గ్‌కు ఇచ్చిన ఇంటర్వ్యూలో అమెరికన్ శత కోటీశ్వరుడు టాం గాలిసానో ఈ మాటనే మరింత గట్టిగా చెప్పాడు. ఆర్థిక వ్యవస్థను మూసివేయడం కన్న కొందరు వ్యక్తులు చనిపోవడం మంచిది అని ఆయన అన్నాడు. ఇంగ్లండ్ ప్రధానమంత్రి మరొక అడుగు ముందుకు వేసి జనం చచ్చిపోతేనే కరోనాకు వ్యతిరేకంగా సమూహ రోగ నిరోధకశక్తి పెరుగుతుందని అన్నాడు. కరోనాకు ఈ మాట చాల నచ్చినట్టుంది, అది వెంటనే ఆయనకే సోకింది. ఇవాళ ఆయన లండన్‌లో ఒక ఆస్పత్రిలో ఐసియులో ఉన్నాడు. ఈ మాటలన్నీ కూడ 1942 భారత్ క్షామం సమయంలో చర్చిల్ చేసిన ప్రకటనను గుర్తుకు తెస్తున్నాయి. భారతీయులు తమ జనాభాను ఎలుకల్లాగ ఇబ్బడి ముబ్బడిగా పెంచుతున్నారనీ, ఆ జనాభా ఆ క్షామంతో అదుపులోకి వస్తుందని చర్చిల్ అన్నాడు.

ఇప్పుడిక మనం భారతదేశం సంగతి చూద్దాం. ఏప్రిల్ 5న అకాలంగా వచ్చిన దీపావళిని భక్తితో చూడని వాళ్లెవరయినా ఈ దేశంలోని నామమాత్రపు ప్రజాస్వామ్యం ఇవాళ్టికి మూర్ఖస్వామ్యంగా మారిపోయిందని గుర్తించగలరు. మర్జ్ బఢ్తా హి గయా జో జో దవాకి (ఎట్లెట్ల మందులు వేసుకుంటానో అట్లట్లా వ్యాధి పెరుగుతూ పోతున్నది) అని మీర్జా గాలిబ్ రాసిన కవితా వాక్యం ఇవాళ్టి భారత పాలకవర్గాలకు సరిగ్గా సరిపోతుంది.

మొదట పెద్ద నోట్ల రద్దును గుర్తు చేసుకుందాం. నల్లధనాన్ని అరికట్టడానికనే పేరుతో పెద్దనోట్ల రద్దు జరిగింది. కాని పెద్ద నోట్ల రద్దుతో నల్ల ధనమంతా తెల్ల ధనమైపోయింది. ఉన్న నోట్ల కన్న ఎక్కువ నోట్లు తిరిగివచ్చాయి. కాని నియంత చూపిన ఈ ఉన్మాదం వల్ల కోట్లాది భారతీయుల బతుకుతెరువు ధ్వంసమైపోయింది. భారత ఆర్థిక వ్యవస్థ పట్టాలు తప్పింది. అదే విధంగా మార్చ్ 24 లాక్ డౌన్ తర్వాత ఏర్పడిన పరిస్థితులు కరోనా మరింత వ్యాపించడానికి దారి తీశాయి. లక్షలాది మంది వలస కార్మికులు 'వెనుకకు లాంగ్ మార్చ్' చేయవలసిన పరిస్థితికి నెట్టబడ్డారు. ఎండలో, వానలో, దప్పికగొన్న ఈ వలస కార్మికులు కరోనాకు అత్యంత సులభంగా దొరికే ఎరలుగా మారారు. కొన్ని షెల్టర్ హోమ్స్‌లో జనాన్ని ఎట్లా కుక్కేశారంటే, అవి వారి కార్మిక శిబిరాల్లో లాంటి దుస్సహమైన పరిస్థితినే కొనసాగించాయి. రహదారుల పక్కనా, గ్రామాల్లో ఏర్పాటు చేసిన క్వారంటైన్ కేంద్రాల్లో ఎన్నో పాములకూ తేళ్లకూ మండ్రగబ్బలకూ నిలయాలయ్యాయి. మరెన్నో క్వారంటైన్ కేంద్రాలు జైళ్ల కన్న హీనంగా ఏ నేరం చేయని లక్షలాది మందిని నిర్బంధించాయి. వీరందరూ కరోనాకు అందుబాటులో ఉన్న బాధితులే. ఔను, ఈ సమయంలో ఉన్నత వర్గాలు, మధ్యతరగతి వర్గాలు కచ్చితంగా సుఖంగా, భద్రంగా ఉండిపోయారు. భారతదేశంలో సామాజిక దూరం అంటే వాస్తవంగా వర్గ దూరమే. దీని అసలు ఉద్దేశం ఉన్నత, మధ్యతరగతి వర్గాలకూ, పేద వర్గాలకూ దూరాన్ని పెంచి, కరోనాను పేద వర్గాలవైపు పంపించడమే.

అలా రహదారుల మీదికి వచ్చిన కార్మికులందరూ తమ ఇంటర్వ్యూల్లో తాము కరోనా కన్న ఆకలికీ, పోలీసు లాఠీకీ ఎక్కువ భయపడతామని చెప్పారు. ఈ నిస్సహాయ కార్మికులు తమ గ్రామాలకు సంతోషంగా ఏమీ తిరిగి వెళ్లడం లేదు. వారు తిరిగి వెళుతున్న గ్రామసీమల్లో ప్రతి రోజూ 31 మంది రైతులు ఆత్మహత్యలు చేసుకుంటున్నారు. ఇటువంటి సంక్షోభ సమయంలో కూడ ఈ రహదారుల మీది వలస కార్మికులతో పోలీసులు ప్రవర్తిస్తున్న తీరు, వారి మీద కురిపిస్తున్న లాఠీ దెబ్బలు, వారికి శిక్షలు విధిస్తున్న తీరు, మన పాలకవర్గాల వర్గ/కుల దురభిప్రాయాలనూ, వారి పైశాచిక మనస్తత్వాన్నీ అత్యంత దారుణంగా, అసహ్యకరంగా బైటపెడ్తున్నాయి.

కరోనా సందర్భంలో ఖైదీలను విడుదల చేయమని సుప్రీం కోర్టు ఇచ్చిన ఆదేశాలకు అనుగుణంగా 11000 మంది ఖైదీలను విడుదల చేయాలని నిర్ణయించిన ఉత్తర ప్రదేశ్ ప్రభుత్వమే లాక్ డౌన్‌ను ఉల్లంఘించారనే పేరుతో, అంతకన్న ఎక్కువమందితో జైళ్లను నింపుతున్నదంటే ఈ ప్రభుత్వపు దివాళాకోరుతనానికి అంతకన్న మంచి ఉదాహరణ ఉండదు. ఈ దేశంలో ప్రభుత్వాలు ఎంత దివాళాకోరుతనంతో పనిచేస్తున్నాయో దీనితో అర్థం చేసుకోవచ్చు. వాస్తవానికి భారత ప్రభుత్వానికి ఎటువంటి వ్యూహమూ లేదు, ఎటువంటి ముందస్తు ఏర్పాటూ లేదు. వారి దగ్గర అసలు నమ్మదగిన అంకెలే లేవు. కాని మోడీ ప్రభుత్వానికి ప్రతి సందర్భాన్నీ ఒక ఉత్సవంగా ఎట్లా మార్చాలో తెలుసు. చివరికి కలుపు మొక్కలకు సంస్మరణ ఉత్సవాలు కూడ జరపగలరు. అది చాల బాగా కూడ చేస్తున్నారు.

యూరపియన్ దేశాలను అనుకరిస్తూ, భారత ప్రభుత్వం ఎటువంటి ముందస్తు ఏర్పాట్లు లేకుండా హఠాత్తుగా లాక్‌డౌన్ ప్రకటించింది. చివరికి అనుకరణలోనైనా కొంత మెరుగు పరచవలసి ఉంటుంది. రాత్రి ఎనిమిది గంటలకు లాక్‌డౌన్ ప్రకటించగానే, జనం విపరీతంగా దుకాణాలను చుట్టుముట్టారు. ప్రకటిత సామాజిక దూరపు నియమాలన్నిటినీ ఉల్లంఘించారు. హాస్టళ్లలోని విద్యార్థులు, యువజనులు, తాత్కాలిక కార్మికులు పెద్ద ఎత్తున బస్ స్టేషన్లకూ, రైల్వే స్టేషన్లకూ తరలి వచ్చారు. ఉన్నత మధ్యతరగతి వర్గాలను మాత్రం రక్షించి, పేద కార్మికులను కరోనా అనే సింహానికి అప్పగించడానికే ఇది జరిగిందని చెప్పవచ్చు.

భారతదేశంలో సాలీనా నాలుగు లక్షల మంది క్షయవ్యాధితో చనిపోతున్నారు. దానికి ప్రధాన కారణాలలో ఒకటి పేదరికం. ప్రస్తుత లాక్ డౌన్ ఆ పేదరికాన్ని మరింత పెంచుతుంది. అంతర్జాతీయ కార్మిక

సంస్థ తాజా నివేదిక ప్రకారం, లాక్ డౌన్ తర్వాత దేశంలో 40 కోట్లమంది మరింత పేదరికంలోకి దిగజారనున్నారు. అంటే ఈ సంవత్సరం క్షయవ్యాధితో మరణించేవారి సంఖ్య పెరగనున్నది. మరి కరోనా బారిన పడకుండా ఒకరిని రక్షించడంలో, క్షయవ్యాధితో మరణించే నలుగురిని తయారు చేయడం ఎంత సమర్థమైన వ్యూహం? ఈ కరోనా సమయంలో దాదాపు అన్ని ఆస్పత్రులలోనూ ఔట్ పేషెంట్ శాఖలను మూసేశారు. ఢిల్లీలోని ఎఐఐఎంఎస్ వంటి ఆస్పత్రి కూడ తన ఔట్ పేషంట్ విభాగాన్ని మూసేసింది. చివరికి వ్యాధి తీవ్రత ఎక్కువగా ఉన్న కాన్సర్ పేషంట్లకు కూడ చికిత్స చేయడం లేదు. ఢిల్లీలో కాన్సర్ వ్యాధి గ్రస్తులందరూ ఎఐఐఎంఎస్ దగ్గరా, ఇతర ఆస్పత్రుల దగ్గరా మృత్యువు కోసం ఎదురుచూస్తూ పడిఉన్నారు. ప్రైవేట్ క్లినిక్‌లు నడిపే చాల మంది డాక్టర్లు తమ క్లినిక్‌లు మూసేశారు. తమ సొంత భద్రత తాము చూసుకుంటున్నారు. ఎంతమంది కరోనా పేషంట్లను కాపాడే క్రమంలో మరెంతమంది ఇతర వ్యాధిగ్రస్తులను మనం చంపేస్తున్నామో లెక్కలు బహుశా ఎప్పటికీ బైటికి రాకపోవచ్చు.

మరి పాపం, భారతదేశం ఏం చేయగలుగుతుంది? గత కొన్ని దశాబ్దాలుగా మన సమయమంతా హిందూ – ముస్లిం ఘర్షణలు రెచ్చగొట్టడంలోనే సరిపోయింది. ఇక మిగిలిపోయిన మన పనిని ప్రపంచ బ్యాంకు, ఐఎంఎఫ్ వంటి సామ్రాజ్యవాద సంస్థలో, అమెరికానో చేసిపెట్టాయి. అలా మనం నిర్వహించిన 'బహు సుందరమైన' కార్యక్రమాల ఫలితంగా ఇవాళ మనం ప్రతి 10,000 మందికి ఒక ఎంబిబిఎస్ డాక్టర్ ఉండే స్థితికి చేరుకున్నాం. అలాగే ప్రతి వెయ్యి మందికి ఆస్పత్రిలో సగం మంచం ఏర్పాటు చేశాం. ఇదేమీ హాస్యం కాదు, అత్యంత తీవ్రమైన జబ్బులు ఉన్నవారిని కూడ ఇద్దరు వ్యక్తులను ఒకే బెడ్ మీద పడుకోబెట్టడం ఎన్నో ఆస్పత్రుల్లో జరుగుతున్నది. బీహార్‌లోని 18 జిల్లాల్లో ఒక్కటంటే ఒక్క వెంటిలేటర్ కూడ లేదు. ఈ పరిస్థితుల వల్ల, కేవలం ఆరోగ్య సేవల మీద ఖర్చుల వల్ల, ప్రతి సంవత్సరం దేశంలో ఐదు కోట్ల ఐదు లక్షల మంది దారిద్ర్యరేఖ కిందికి జారిపోతున్నారు. కరోనా వంటి మహమ్మారిని ఎదుర్కోవడానికి తగిన స్థితిలో భారతదేశం ఏరకంగా చూసినా లేదు.

కాని ఇక్కడి ప్రచార సాధనాలు మాత్రం అన్నిటికీ అన్ని సమయాల్లోనూ సిద్ధంగా ఉంటాయి. ఇక కరోనాకైతే అవి సంసిద్ధంగా ఉండడం కంటే ఎక్కువ సంసిద్ధంగా ఉన్నాయి. అవి మొదట కరోనా విషయంలో చైనా మీద గురి పెట్టాయి. అమెరికా అన్న మాటనల్లా తిరిగి పలికాయి. కాని భారత ప్రభుత్వమే వెంటిలేటర్లు కావాలనీ, టెస్టింగ్ కిట్స్ కావాలనీ చైనాను అడగవలసి వచ్చేసరికి, మన ప్రచార సాధనాలు అప్పటిదాకా పాడుతున్న పాటను మధ్యలో ఆపేసి, ఎల్లప్పుడూ ఇష్టపూర్వకమైన శత్రువైన ముస్లింల మీదికి తమ గురిని తిప్పాయి. కరోనా మొత్తానికీ నిందను ముస్లింల మీద మోపడం మొదలుపెట్టాయి. సంఘ్ ఐటి సెల్స్ లాక్ డౌన్‌ను సంపూర్ణంగా వినియోగించుకుని, తామే కరోనా పాత్రను పోషించడం మొదలుపెట్టాయి. ప్రజలకు తమ విషం అంటించడానికి ఏ ఒక్క అవకాశాన్నీ వదులుకోవడం లేదు. సిఎఎ వ్యతిరేక ఆందోళనలో ముస్లింలు నిర్వహించిన పాత్రకు ప్రతీకారం తీసుకోవడానికి ప్రభుత్వానికి ఒక అవకాశం దొరికింది. మసీదు నుంచి బైటికి వస్తున్న ముస్లింల మీద పోలీసులు లాఠీల వర్షం కురిపిస్తున్న వీడియో, రానా అయ్యూబ్ ట్విట్టర్ మీద చూపిన వీడియో ఎవరు మరిచిపోగలరు? ఎంతమంది ముస్లింలను, లేదా ముస్లిం మొహల్లాలను కరోనా కారణంగా క్వారంటైన్ చేశారో, కేవలం వారు ముస్లింలైనందువల్లనే క్వారంటైన్ చేశారో, ఇప్పుడెవరికీ రహస్యం కాదు. మొత్తం ప్రపంచమంతా కరోనా వైరస్ జన్యు నిర్మాణం ఏమిటని అధ్యయనం చేస్తున్న సమయంలో మనం కరోనా మతమేమిటో కనిపెట్టడంలో తలమునకలై ఉన్నాం.

నిజం చెప్పాలంటే భారతదేశం వంటి పేద దేశంలో, శ్రామిక జనాభాలో 94 శాతం అసంఘటిత రంగంలోనే పనిచేస్తున్న చోట, సగం కన్న ఎక్కువ జనాభా దుర్భర దారిద్ర్యంలో మగ్గిపోతున్న చోట, సంపూర్ణ లాక్ డౌన్ సరైన నిర్ణయం కాజాలదు. ఇంకా ఇంకా ఎక్కువ పరీక్షలు జరపవలసింది. ఆ పరీక్షా ఫలితాలను బట్టి స్థానిక లాక్ డౌన్‌లు, స్థానిక క్వారంటైన్‌లు ఏర్పాటు చేయవలసింది. కాని వాస్తవమేమంటే, భారతదేశం ఇప్పటికి పది లక్షల మంది ప్రజలకు 137 పరీక్షలు మాత్రమే జరపగలిగింది. కనికా కపూర్‌కు ఇప్పటివరకూ ఏడు సార్లు పరీక్షలు జరిగాయనేది గుర్తుంచుకుంటే, ఈ లెక్క కూడ సరికాదని, ఒకే వ్యక్తికి ఒకటి కన్న ఎక్కువ పరీక్షలు జరిగి ఉండవచ్చునని తేలుతుంది. చివరికి పాకిస్తాన్, శ్రీలంక కూడ పరీక్షల విషయంలో మనకంటె మెరుగుగా ఉన్నాయి. పాకిస్తాన్‌లో పది లక్షల మందికి 262 పరీక్షలు, శ్రీలంకలో 152 పరీక్షలు జరిగాయి. ఇటలీ, జర్మనీలలోనైతే పది లక్షల మందికి 15,000 పరీక్షల దాకా జరిగాయి.

ఇవాళ ఈ కరోనా సమయంలో, అంతకు ముందు క్రమబద్ధంగా పర్యావరణ, ఆరోగ్య, దారిద్ర్య, జల్ జంగల్ జమీన్ సమస్యలు లేవనెత్తుతుండిన, ఈ అమానవీయ వ్యవస్థలో మానవ మనుగడకు సంబంధించిన మౌలిక ప్రశ్నలు లేవనెత్తుండిన, తమకు తోచిన పద్ధతులలో పోరాటాలు జరుపుతుండిన గళాల మీద, శక్తుల మీద నిర్బంధం అమలవుతున్నది. కాని కరోనానంతర సమయంలో ఈ గళాలు మరింత ఎక్కువగా, మరింత బలంగా వినబడతాయి. పద్నాలుగో శతాబ్దిలో యూరప్‌లో ప్లేగ్ అనే మహమ్మారి దాడిచేసి, నాటి యూరప్ జనాభాలో మూడో వంతును చంపేసింది. ఆ మహమ్మారి ప్రధాన ఫలితం ఏమంటే సాధారణ ప్రజానీకం చర్చ్‌లో విశ్వాసం కోల్పోయారు. అదే యూరప్‌లో పునరుజ్జీవనానికి అత్యంత కీలక దోహదం చేసింది. ఆ వరుసలో బూర్జువా ప్రజాస్వామిక విప్లవాలు చెలరేగాయి. ఈసారి కూడ అలా జరుగుతుందా?

ఎడువార్డో గలియనో అన్నట్టు చరిత్ర ఎప్పుడూ వీడ్కోలు అనే మాట అనదు. చరిత్ర ప్రతిసారీ, మళ్లీ కలుద్దాం అనే అంటుంది.

రాత్రి ఎంత గాఢమైన చీకటి అలముకున్నా, ఎల్లప్పుడూ అందులో ఉదయానికి సంబంధించిన ఒక ఆశారేఖ ఉంటుంది. ఈ సందర్భంలో చార్లెస్ డికెన్స్ సుప్రసిద్ధ నవల రెండు మహానగరాలులోని బహుళార్థ బోధకమైన ప్రారంభవాక్యాలు మళ్లీ ఒకసారి చెప్పాలనిపిస్తున్నది: "అది ఒక వైభవోజ్వల మహాశకం. అది అధ్వాన్నపు వల్లకాటి కాలం. అది వివేక సంపన్న యుగం, అది మూర్ఖత్వపు సామ్రాజ్యం. అది మూఢ విశ్వాసాల కాలం, అది మహా సంశయాల కాలం. అది వెలుగులీనిన యుగం, అది మహాంధకారపు సమయం. అది ఆశల ఊట, అది నిరాశల కోట."

*(మనీష్ ఆజాద్ రాజకీయ కార్యకర్త. మావోయిస్టు కార్యకర్తలు అనే ఆరోపణతో ఆయననూ ఆయన సహచరినీ అరెస్టు చేసి ఎనిమిది నెలల నిర్బంధం తర్వాత ఫిబ్రవరి 29న బెయిల్ మీద విడుదల చేశారు.)*
*(హిందీ నుంచి ఇంగ్లిష్: హసన్ ప్రీత్; తెలుగు: ఎన్ వేణుగోపాల్)* వీ

# కోపంలేని మనుషులపై కనికరం లేని దేశం

***హైదరాబాద్‌లో వలస శ్రామికుల సహాయ కార్యక్రమాల్లో పాల్గొన్న అనుభవంతో మొత్తంగా వలస శ్రామికుల సమస్యలో ఇమిడి ఉన్న కోణాలను చర్చిస్తున్నారు* సి. వనజ**

దేశంలో కొవిడ్ కేసులు 340 ఉన్న రోజే తెలంగాణాలో జనం మీద లాక్‌డౌన్ బాంబు పడితే మరో రెండు రోజులకు అది దేశమంతా పడింది. ఒక డిమానెటైజేషన్ లాగా, ఒక జిఎస్‌టి లాగ ఇది కూడా ముందూ వెనకా చూడకుండా ప్రణాళిక లేకుండా వేసిన, భారత ప్రజల మీద పడిన మరో బాంబు అన్నది ఒక వాస్తవమైతే ఇది ఆ రెండింటికీ మించిన సంక్షోభాన్ని సృష్టించింది. స్తంభించిపోయిన జనజీవితంలో ఒకవైపు మధ్యతరగతి ఇళ్లలో కూర్చుని అంట్లు తోముకోవలసి రావటం మీద, వండుకుని తినడం మీదా విసుక్కుంటూ, మిగిలిపోయిన టైమ్ గడవటానికి రకరకాల ఆటలు ఆడుతూ సోషల్ మీడియాలో సరదా సవాళ్లు విసురుకుంటూ ఉంటే, మరోవైపు కొన్ని కోట్లమంది ప్రజలు అన్నిటికీ తెగించి వందల కొద్దీ మైళ్లు నడవటానికి రోడ్డున పడ్డారు. వాళ్లే వలస కార్మికులన్నది ప్రత్యేకంగా చెప్పాల్సిన పని లేదు. అప్పటిదాకా ప్రతి నగరంలోనూ అన్నేసి లక్షల మంది వలస కార్మికులు ఉన్నారని, వాళ్లే భారత దేశ నిర్మాణాలన్నీ చేస్తున్నారని, దేశంలో పరిశ్రమలను కారుచౌకగా తమ రక్తమాంసాలతో నడిపితే వాటినుంచి తయారయిన చౌక వస్తువుల మోజులో పడి సుఖంగా పౌరుల నుంచి వినియోగదారులుగా మారిపోయే ప్రక్రియలో ఉన్న భారత ప్రజానీకానికే కాదు ప్రభుత్వాలకు కూడా తెలియదని అర్థమయింది. కేవలం నాలుగు గంటల సమయం ఇచ్చి మొత్తం దేశాన్ని మూసేసిన ఏలినవారికి ఇన్ని కోట్లమంది ఇరుక్కుపోతారన్న కనీస అవగాహన మాత్రమే కాదు, వారెలా బతుకుతారన్న అక్కర కూడా లేదు. పని ఇస్తామని తెచ్చిన వాళ్లు గాలికి వదిలేస్తే, ప్రభుత్వాలు పట్టించుకోకపోతే కేవలం అప్పటిదాకా తమ చేతులను నమ్ముకున్న కార్మికులు ఇప్పుడిక తమ కాళ్లను నమ్ముకున్న విషాదం దేశమంతా చూసింది.

ఇలా వందల వేల సంఖ్యలో మనుషులు తెగించి నడవటం భారత దేశం విడిపోయినప్పుడు సరిహద్దుల దగ్గర కనపడిందట. అలాంటి దృశ్యాలు మళ్లీ లాక్‌డౌన్‌లో దేశమంతా కనిపించాయి. ముందు తెలియకపోవటం, ఊహించకపోవటం ఒకటైతే ఒకసారి సమస్య వచ్చాక దాన్ని పరిష్కరించటానికి ప్రభుత్వాలు ఏం చేసాయన్నది మరో ప్రశ్న. ఏమీ చేయకపోగా అది తమ సమస్య కాదంటే తమ సమస్య కాదని అందరూ దాటెయ్యటానికి ప్రయత్నం చేసారు. అది రాష్ట్రాల సమస్య అని కేంద్రం తప్పించుకుంటే, తమ ఓటర్లు కాని వాళ్లను తామెందుకు పట్టించుకోవాలని అతిథి రాష్ట్రాలు విసుక్కున్నాయి. వాళ్లు వచ్చిందే వెనకబడిన రాష్ట్రాల నుంచి కనుక ఒక్కసారి వెనక్కి వచ్చిపడితే మేం మాత్రం ఏ చెయ్యగలం కాబట్టి పంపించొద్దన్న రాష్ట్రాలు మరికొన్ని. మీరెళ్లిపోతే ఆ తర్వాత మా పరిశ్రమలు, భవన నిర్మాణాలు నడవవు కనుక తిండి లేకపోయినా, ప్రాణం పోయినా మా రాష్ట్రం వదలనివ్వమని హుకుం జారీ చేసిన రాష్ట్రాలు మరికొన్ని. అందరూ కలిసి ఎవరికి పుట్టిన బిడ్డలురా ఈ వలస కూలీలు అన్న పాట మాత్రం కోరస్‌గా పాడారు.

దాదాపు 10 వారాల పూర్తి లాక్‌డౌన్‌లోనూ ఆ తర్వాత సడలించిన లాక్‌డౌన్ లోనూ పత్రికల్లో, టీవీల్లో ప్రతిరోజు చర్చకు వచ్చిన విషయం వలస కార్మికులు, వాళ్ల సమస్యలు, రవాణా పూర్తిగా స్తంభించిన పరిస్థితుల్లో వాళ్లు ఇంటికి చేరటానికి పడుతున్న పాట్లే. ఇంత సంక్షోభం తలెత్తితే దాదాపు రెండునెలల పాటు దాన్ని పరిష్కరించటానికి ప్రభుత్వాలు ఏవో చిత్తశుద్ధి లేని కంటితుడుపు చర్యలు చేపట్టి, మరో వైపు కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు సహాయనిధులు తెరిచి, టార్గెట్లు పెట్టి మరీ వసూళ్లకు పూనుకున్నారు. ప్రాణాలకు తెగించి పిల్లాపాపలతో మూటాముల్లెలతో నడుస్తున్న జనాన్ని చూసి వాళ్లకేదో ఒరగబెడతారని పిల్లలు తమ కిడ్డీబాంకులనుంచి తీసిచ్చిన డబ్బులను కూడా మింగిన ప్రభుత్వాలు ఆ డబ్బులేం చేసారో చెప్పాల్సిన అవసరం లేదని నిస్సిగ్గుగా చెప్పేసాయి. అది అత్యంత ప్రభుత్వ రహస్యాల్లో భాగమట. సంక్షోభ సమయాల్లో జనం కోసం జనం ఇచ్చిన డబ్బులు మింగెయ్యటానికి సిద్ధపడే ప్రభుత్వాల మురికి రహస్యాలు ఏమయి ఉంటాయన్నది ఊహకు అందని విషయం కాదు.

లాక్‌డౌన్ అయిపోయేసరికి దేశంలో దాదాపు 16 కోట్ల మంది వలస కార్మికులున్నారన్న ఒక లెక్క వచ్చింది. 135 కోట్లకు పైబడి జనాభా ఉన్న దేశంలో ఇది పది శాతం కంటే కొంచెం ఎక్కువ. కానీ ఈ పదహారు కోట్ల మంది ఇంత వేదన పడుతుంటే మిగిలిన 120 కోట్లమంది ఏం చేశారన్న ప్రశ్న కూడా వేసుకోవాలి. ముందు ఒక సంక్షోభ సమయంలో దేశ పౌరులుగా మన వైఫల్యం గురించి మాట్లాడుకుందాం. మనం ఈ మధ్య కాలంలో "పౌరులుగా" చాలా వాటిలో విఫలమయినట్లుగానే ఇక్కడా విఫలం అయ్యాం. మొత్తం ప్రజలకు జవాబుదారీ తనంతో ఉండాల్సిన ప్రభుత్వాలను కానీ, పని కోసం తెచ్చుకుని సంక్షోభం రాగానే గాలికి వదిలేసిన నిర్మాణ, పారిశ్రామిక రంగాలను గానీ ప్రశ్నించటంలో, వాళ్లకు బాధ్యత అప్పచెప్పటంలోనూ ఘోరంగా విఫలమయ్యాం.

**ప్రభుత్వాలు విఫలమయిన చోట...**

కాని ఒక జాతిగా విఫలమయిన చోట వ్యక్తులుగా, చిన్న సమూహాలుగా వలస కార్మికుల కష్టం పంచుకోవటానికి కొన్ని వేల చేతులు ముందుకు వచ్చాయి. ఇంత పెద్ద సంక్షోభంలో కూడా వలస కార్మికుల్లో గానీ, లాక్‌డౌన్‌తో పని పోయిన అనేక సమూహాల్లో గానీ ఆకలి మరణాలు కేవలం వందల్లోనే ఉన్నాయంటే అది పూర్తిగా పౌర సమాజం వల్లనే అని చెప్పొచ్చు. దేశంలో అనేకచోట్ల స్పందించిన మనుషులు, ఒంటరిగా, బృందాలుగా ఎవరికి తోచిన సహాయాలు వాళ్లు చేసారు. కొంతమంది ఇళ్లలో వండుకుని ఆకలి ఉన్నదనిపించిన చోటికల్లా వెళ్లి ఆకలి తీరిస్తే, మరికొందరు కుటుంబాలతో ఉన్న వలస కార్మికులు గౌరవంగా వండుకుని తినడానికి కిరాణా సామాను ఇచ్చారు. అది

ఆకలి తీర్చటం అనే ఒక చిన్న సహాయంగా మొదలయి, కొనసాగుతున్న లాక్ డౌన్లతో కొనసాగుతూ పోయి, దేశమంతా అనేక రకాల సహాయ రూపాలు తీసుకుంది.

లాక్‌డౌన్ విధించిన మూడో రోజే అలా హైదరాబాద్ లో ఏర్పడిన ఒక పౌరసమాజ బృందంలో భాగంగా వలస కార్మికులతో దాదాపు రెండున్నర నెలలపాటు పని చేసిన కాలంలో కలిగిన అనుభవాలు ఇక్కడ పంచుకుంటున్నాను. దేశంలో మార్చ్ 24న పిడుగు లాగా లాక్‌డౌన్ విధిస్తే పౌరసమాజంగా మనం ఏం చెయ్యగలమన్న ఆలోచనతో ఒక వాట్సప్ గ్రూపుగా ఏర్పాటు అయిన మా ముందుకు వచ్చిన తక్షణ సమస్య వలస కార్మికులు. అప్పటికే దేశమంతా నగరాలకు పని కోసం వచ్చి, పని పోయి ఆశ్రయం కూడా పోయి, ఊరు చేరటానికి పిల్లా జెల్లలతో పాటు వందల కిలోమీటర్లు నడవటానికి సిద్ధపడిన వలసకార్మికుల సమూహాల వార్తలు టీవీల్లో, పత్రికల్లో కనపడటం మొదలయింది. వాళ్లు వెళ్లిపోవటానికి ఏ సహాయం చెయ్యని ప్రభుత్వాలు వాళ్ల మీద లాఠీచార్జీలు చెయ్యటం, వాళ్లను ఊరు దాటకుండా దిగ్బంధం చెయ్యటం వంటి దుర్మార్గమైన పనులు చేసాయి. కాని ఉండిపోయిన వాళ్లు ఎలా బతకాలన్న ప్రశ్నకు మాత్రం ఆ లాఠీల దగ్గర గానీ, లాఠీలనే నమ్ముకుని రాజ్యం చేసే ప్రభుత్వాల దగ్గర గానీ జవాబు లేదు. లాక్‌డౌన్ కి దాదాపు వారం ముందే పనులు ఆగిపోవటం, డబ్బులిస్తే వెళ్లిపోతారన్న దుర్మార్గపు ఆలోచనతో అప్పటికి జరిగిన పనికి కూడా డబ్బులు ఇవ్వకపోవటంతో ఊరుగాని ఊరిలో తమతో తమలాగే పనికి వచ్చిన కొందరు, తమను తెచ్చి ముఖం చాటేసిన కాంట్రాక్టరు తప్ప ఎవరూ తెలియని చోట ఆకలి హాహాకారాలు మొదలయ్యాయి. అప్పుడు ఆ ఆకలి తీర్చటం తక్షణ అంశంగా మారింది. దాంతో అనేకమంది వ్యక్తులు, కొన్ని సంస్థలు అట్లా పని లేక, ఇంటికి వెళ్లే దారిలేక హైదరాబాద్ నగరంలోనూ, చుట్టుపక్కలా భవన నిర్మాణ ప్రాంతాల్లో చిక్కుకున్న వారి దగ్గరికి ఎవరి శక్తి మేరకు వాళ్లు బియ్యం, పప్పులు, నూనె వంటి డ్రై రేషన్ తీసుకుని వెళ్లటం మొదలుపెట్టారు. ఎక్కడ నీలం పట్టాలు కప్పిన భవన నిర్మాణం కనిపించినా వెళ్లి సహాయం అవసరమా అని అడగటం, లేదా ఎవరో ఒకరు ఇంతమంది ఇక్కడ ఉన్నారంటే అక్కడికి వెళ్లటం చేశాం. అట్లా వెళ్లినప్పుడు మాకు ఎదురైన అనుభవాలు చెప్పాలి.

భవన నిర్మాణ రంగంలో మాకు ఎక్కువగా కనిపించిన వాళ్లు చత్తీస్ గడ్ ఆదివాసీ కార్మికులు. అడగటం, అబద్ధం ఆడటం రాని, మానవ జాతికి బాల్యం లాంటి వాళ్లయిన ఈ ఆదివాసీలకు సహాయం కోసం చెయ్యి చాచటం కూడా తెలియదు. పదే పదే పిలిస్తే కానీ వచ్చే వాళ్లు కాదు. గుచ్చి గుచ్చి అడిగితే కానీ సమస్య చెప్పేవాళ్లు కాదు. అప్పుడు కూడా తమకు ఏం సహాయం కావాలో చెప్పేవాళ్లు కాదు. వాళ్ల కోసం ఎవరూ రాకపోతే అలాగే కడుపులో కాళ్లు పెట్టుకుని కూచునే వాళ్లు. కాకపోతే తట్టా బుట్టా సర్దుకుని, పిల్లా జెల్లా వేసుకుని తెగించి నడిచిపోవటానికి తయారయ్యేవాళ్లు. పదే పదే అడిగితే 'మమ్మల్ని ఇంటికి పంపండి' అని మాత్రం అడిగే వాళ్లు. మొదటి రెండు లాక్‌డౌన్ ల కాలంలో అది సాధ్యం కాదు కాబట్టి లాక్‌డౌన్ అయ్యేదాక ఉండండి ఎలాగోలా అని నచ్చచెప్పి తినటానికి రేషన్ ఇచ్చి వచ్చేవాళ్లం. మొదటి లాక్‌డౌన్ కాలంలో మేము ఎక్కువగా కలిసింది సీజనల్ వలసకార్మికులు. పని ఉన్న దగ్గర తాత్కాలిక నివాసాలు ఏర్పరుచుకుని, అక్కడ పని కాగానే ఇంకో పని జరిగే చోటకో లేదా ఇంటికో వెళ్లిపోయేవాళ్లు. వీళ్లు ప్రధానంగా భవన నిర్మాణ రంగంలో, వ్యవసాయ రంగంలో కనిపించేవాళ్లు. ఇందులో చత్తీస్ గడ్, ఒరిస్సా వంటి రాష్ట్రాలనుంచి వచ్చినవాళ్లు కుటుంబాలతో ఉంటే, జార్ఖండ్, బీహార్, యూపీ నుంచి వచ్చినవాళ్లు ఎక్కువగా ఒంటరి కుర్రవాళ్లు. కుటుంబాలతో ఉన్నవాళ్లలో ఒక నిర్వేదం లాంటి భావం కనిపించేది. కానీ ఒంటరిగా ఉన్న యువకుల్లో ఒకవైపు పని లేకపోవటం, మరోవైపు అనిశ్చితి వల్ల ఒక అలజడి కనిపించేది. మూడు వారాల్లో ముగుస్తుందనుకున్న లాక్‌డౌన్ కొనసాగటం, ఇది ఎంతకాలం కొనసాగుతుందో తెలియని పరిస్థితి ఏర్పడటంతో ఆ అలజడి మరింత పెరిగింది.

సహాయ పనులు చెయ్యటం ఒకటయితే సహాయం అవసరం అయిన వాళ్లను గుర్తించటం మరొక సమస్య. దాన్ని అధిగమించటానికి మొదటి లాక్‌డౌన్ మొదలయిన వారానికే రైతు స్వరాజ్య వేదిక ఒక సహాయ హెల్ప్ లైన్ ను ప్రారంభించి ఆ ఫోన్ నంబర్ ను పత్రికల్లో ప్రకటించింది. దానికి ఫోన్ కాల్స్ వెల్లువెత్తాయి. దాదాపు నలభై మంది వలంటీర్లు ఆ హెల్ప్ లైన్ ద్వారా కాల్స్ తీసుకుని, వెరిఫై చేసుకుని, ఆ వివరాలు రేషన్ ఇచ్చే వ్యక్తులకు, సంస్థలకు అందించేవాళ్లు. మాలో చాలామందిమి వ్యక్తిగతంగా చెయ్యగలిగినంత చేశాక, స్నేహితులు, బంధువుల నుంచి నిధులు సేకరించి సహాయ కార్యక్రమాలు కొనసాగించాల్సి వచ్చింది.

**మరి ప్రభుత్వం వలస కార్మికులకు ప్రకటించిన సహాయం?**

బాధ్యతారహితంగా లాక్‌డౌన్ ప్రకటించిన ప్రభుత్వాల అసమర్థతకు చిహ్నంగా రోడ్డున పడ్డ వలస కార్మికుల సమస్య కళ్లముందుకు రావటంతో ప్రభుత్వాలు స్పందించక తప్పలేదు. దేశమంతా వచ్చిన సమస్యకు పరిష్కారం చూపించాల్సిన కేంద్రం భాధ్యతను రాష్ట్రాల మీద తోసేసింది. రాష్ట్రాలు తమ ఓటర్లు కాని వాళ్ల బాధ్యత తీసుకోవటానికి సిద్ధంగా లేవు. ఆ మాట ప్రధానితో జరిగిన వీడియో కాన్ఫరెన్స్ లో అనేసాయి కూడా. కాని తప్పనిసరి పరిస్థితుల్లో కొన్ని సహాయాలేవో ప్రకటించాయి. తెలంగాణలో అది ప్రతి వలసకార్మికునికి 500 రూపాయలు, 12 కిలోల బియ్యం. దానికోసం జీవో నెంబరు 13 విడుదల చేశారు. దాని ప్రకారం వలసకార్మికుల భాధ్యత ప్రధానంగా వాళ్లను తెచ్చిన కాంట్రాక్టర్లు, కంపెనీలదే. వాళ్లు పట్టించుకోకపోతే కేసులు పెట్టొచ్చు. వలస కార్మికులుగా వచ్చిన వాళ్లకు కంపెనీలు, యజమానులు ఎవరో తెలియదు. లాక్‌డౌన్ తర్వాత వాళ్లెవరూ కనపడలేదు. తమను తెచ్చిన కాంట్రాక్టరు ఫోన్ నంబర్ మాత్రమే వాళ్లదగ్గర ఉండేది. అది ఇవ్వటానికి కూడా చాలమందికి భయం. వాళ్లను ఎలాగోలా పట్టుకుని అడిగితే తాము పెద్ద కూలీలమేనని, అంత పెద్ద బాధ్యత తీసుకోవటం తమ వల్ల కాదని చెప్పేసేవాళ్లు. సంస్థలను పట్టుకుని అడిగితే, కొందరు బాధ్యత కాంట్రాక్టర్ల మీద తోస్తే, తమను పీడించి పీఎం కేర్ ఫండ్ కు, సీఎం ఫండ్ కు నిధులు తీసుకున్నారని, కాబట్టి ఈ కష్టకాలంలో ఇంతకంటే ఏమీ చెయ్యలేమని చెప్పిన వాళ్లు కొందరు. ప్రభుత్వం ప్రకటించిన సాయం కేవలం కంటితుడుపే. కేవలం హైదరాబాద్ జిహెచ్ ఎంసి పరిధిలోనే దాదాపు 30 లక్షల మంది ఉండవచ్చన్న అంచనా ఉంటే, రెండో లాక్‌డౌన్ ముగిసే సమయానికి, ప్రభుత్వ సాయం అందులో 10 శాతానికి కూడా అందలేదు. చాలాసార్లు స్థానికంగా వలసకార్మికులకు బాధ్యత వహించాల్సిన రెవెన్యూ శాఖను సంప్రదిస్తే, మొదట అది కాంట్రాక్టర్ల బాధ్యత కనుక వాళ్లు ఎవరో చెప్తే కేసులు పెడతామని, లేదా తమ దగ్గర డేటా లేదు కనుక సాయం అందించలేమనీ చెప్పేవాళ్లు. చాలామందికి ప్రభుత్వ సహాయం ప్రతి కార్మికుడికి 500 రూపాయలు అన్న విషయం కూడా తెలియదు. తెలియదో లేక తెలియనట్లు నటించారో. కొన్ని "కుటుంబాలకు" మాత్రం 500 రూపాయలు, 12 కిలోల బియ్యం ఇచ్చారు. మరికొంతమందికి ఉన్న బియ్యాన్ని ఐదో పదో కిలోలు ఇచ్చేసి డబ్బులు మాత్రం ఇవ్వలేదు. 500 మంది

కార్మికులున్న ఫరీద్ బస్తీలో రెండు రోజులు లైన్‌లో నిలబడితే కేవలం 100 మందికి 5,10 కిలోల బియ్యం ఇచ్చి అయిపోయిందని చెప్పేసారు. మేము సంబంధిత ఎమ్మార్వోకి ఫోన్ చేస్తే అది వాళ్లను తెచ్చిన కాంట్రాక్టర్ల బాధ్యత అని దాటెయ్యటానికి ప్రయత్నించారు. గట్టిగా అడిగితే తమకు వచ్చిన బియ్యం పంచేసామని, ఇంకేం చెయ్యలేమని చేతులెత్తేసారు.

ఇంకా హాస్యాస్పద విషయం ఏమిటంటే సహాయం ప్రకటించిన ప్రభుత్వం చెయ్యకపోగా, వ్యక్తులు, స్వచ్ఛంద సంస్థలు చేస్తున్న సహాయం తమకే తెచ్చి ఇవ్వాలని, అది అందించే పని తామే చేస్తామనీ, కాదని సహాయం చేస్తే కేసులు పెడతామనీ జిహెచ్ ఎంసి మేయర్ ప్రకటన కూడా చేసారు. ఒకవైపు వెళ్లిపోతున్న వలసకార్మికులను పట్టుకొచ్చి పశువులను బందెలదొడ్లో తోలినట్లుగా ఫంక్షన్ హాళ్లలో తోలిన ప్రభుత్వం, సరుకుల పంపిణీలో సామాజిక దూరం పాటించటం లేదన్న సాకు చూపింది. దాంతో సహాయం చెయ్యటానికొచ్చిన చాలమంది కేసులకు భయపడి వెనక్కు వెళ్లిపోయారు. అందరూ భయపడి పాల పాకెట్లు కూడా సబ్బునీళ్లలో కడుక్కుంటూ, వాట్సప్పుల్లో, ఫేసుబుక్కుల్లో, టీవీల్లో కాలక్షేపం చేస్తుంటే, ఒంటరిగా స్పందించి మానవత్వంతో బయటకు వచ్చిన అనేకమంది వెనక్కు పోవలసి వచ్చింది. అమ్మ పెట్టదు, అడుక్కు తిననివ్వదు అన్న సామెతకు ఇది చక్కటి నిదర్శనం.

కాని సమూహాలుగా ఉన్న బృందాలు ప్రభుత్వంతో వాదించి, పర్మిషన్లతో సహాయం కొనసాగించాయి. మానెయ్యనైనా మానేస్తాం కానీ, ఎవరికి అవసరం ఉందో అన్న డేటా కూడా లేని మీకు మాత్రం ఇచ్చేది లేదని మొండికేసాం.

**లాక్‌డౌన్ 2.0**

లాక్‌డౌన్ 2.0 ప్రకటించేసరికి సమస్య మరింత తీవ్రమయింది. అప్పటివరకు వలసకార్మికులకు పరిమితంగా ఉన్న ఆకలి సమస్య అనేక మంది చిన్న చిన్న పనులు చేసుకునే వాళ్లకు కూడా విస్తరించింది. రేషన్ కార్డు ఉన్నవాళ్లకు 1500 రూపాయలు, 15 కిలోల చొప్పున బియ్యం ప్రకటించిన ప్రభుత్వం చాలా చోట్ల ఉత్త బియ్యంతో సరిపెట్టింది. రేషన్ కార్డు ఉన్న వాళ్లకు వాళ్ల బాంక్ ఎకవుంట్ లింక్ అయి ఉండకపోవటం ఒక సమస్య అయితే, ఇంకే మార్గంలోనూ వాళ్లను చేరుకోవటానికి ప్రభుత్వం ప్రయత్నించకపోవటం మరో సమస్య. ఆ సందర్భంగా చాలా విషయాలు మా ముందుకు వచ్చాయి. నగరాల్లో రోజువారీ కూలి పనులు, చిన్న చిన్న ఉద్యోగాలు చేసుకునే స్వరాష్ట్రీయులు కూడా గ్రామాల నుంచి నగరాలకు వలస వచ్చినవాళ్లే. వాళ్లలో చాలా మంది తమ రేషన్ కార్డును ఊళ్లో ఉండిపోయిన తల్లితండ్రులకు వదిలేసి వచ్చారు. చాలా మందికి అసలు రేషన్ కార్డే లేదు. అప్లై చేసి చాలా కాలమయినా ఇంకా రాలేదు. దాంతో హైదరాబాద్ లో ఉండి పనులు చేసుకుంటున్న తెలంగాణ, ఆంధ్రా తెలుగు వలస కార్మికులకు ఏ ఆధారం లేకుండా పోయింది. ఇతర రాష్ట్రాల వలస కార్మికులకు కేవలం తిండి, ప్రయాణం సమస్య అయితే వీళ్లకు ఇంటి అద్దె కట్టటం ఒక సమస్య. లాక్‌డౌన్ లో ఇంటి అద్దె అడగొద్దు అని ప్రభుత్వాలు ప్రకటించినా అది వాస్తవంలో జరగలేదు. దాంతో మా హెల్ప్ లైన్‌కు వీరి నుంచి కూడా సహాయం కోసం ఫోన్‌కాల్స్ వెల్లువెత్తాయి. అందరికీ ఎంతో కొంత సహాయం అందించటం కోసం పనిచేస్తున్న వాళ్ల మీద విపరీతమైన భారం పడింది. అప్పటికే చాలమందికి ఉద్యోగాలు పోవటం కూడా ప్రారంభం అవటంతో నిధుల సేకరణ కూడా కష్టంగా మారింది. అందులోనూ పూర్తిగా వ్యక్తిగతంగా సేకరించి పనిచేసేవాళ్లకు మరింత కష్టంగామారింది. అయినా కూడా చాలామందిమి ఈ పని కొనసాగిస్తూ పోయాం.

ఈ సందర్భంలో మాకు చాలాకష్టంగా అనిపించిన కొన్ని అనుభవాలు చెప్పాలి. లాక్‌డౌన్ కొనసాగించటం దాదాపు రోజువారీ చిన్న పనులు, చిన్న ఉద్యోగాలు చేసుకునే వాళ్లందరినీ తీవ్రంగా దెబ్బ కొట్టినప్పటికీ కొద్దిగా చదువుకుని 8 వేలకు, 10 వేలకు మాల్స్ లో, షాపుల్లో, చిన్న నర్సింగ్ హోముల్లో పనిచేసేవాళ్లకు సహాయం అడగటం నామోషీగా ఉండేది. ఎక్కువగా ఆటో డ్రైవర్లు, రోజుకూలీ పని చేసుకునే వాళ్లనుంచి ఫోన్‌కాల్స్ వచ్చేవి. అవి కూడా స్త్రీల నుంచి వచ్చేవి. ఈ కాల్స్ తీసుకునే వాలంటీర్లుగా పనిచేసేవాళ్లంతా సమాజం పట్ల కన్సర్న్ ఉన్న యువతీ యువకులు. అడిగిన వాళ్లందరికీ ఇవ్వగలిగితే బాగుండునని వాళ్లకూ, మాకూ ఉండేది. చెయ్యగలిగిన సహాయం తక్కువ కనుక వచ్చిన కాల్స్ అవసరం, తీవ్రత, తొందర నిర్ణయించటానికి వాలంటీర్లు చాలా ప్రశ్నలు అడగాల్సి వచ్చేది. అడిగిన వాళ్ల అవసరం నిర్ణయించాల్సి రావటం అనే ప్రక్రియ చాలామందికి బాధ కలిగించేది. ఒక్కోసారి ఇది సరైనదేనా అన్న నైతిక మీమాంస కలిగేది. వారం వారం జరిగే జూమ్ కాల్స్‌లో ఇవన్నీ చర్చకు వచ్చేవి. ఈ సందర్భంగా బోలెడన్ని సమస్యలు బయటికి వచ్చేవి. తాగుడు అలవాటు ఉన్న ఇళ్లలో మగవాళ్లకు అది దొరకక వచ్చే మానసిక సమస్యలు, ఎప్పటికీ అందరూ చిన్న ఇళ్లలోనే తప్పనిసరిగా ఉండాల్సి రావటంతో పెరిగిన హింస, ఇవన్నీ మమ్మల్ని తాకుతుండేవి. మేము వాళ్లకోసం రేషన్ తీసుకుపోయినప్పుడు కూడా ఈ కథలన్నీ వినేవాళ్లం. మేం ఇవ్వగలిగేది కేవలం తిండిగింజలు. అప్పుడప్పుడూ పసిపిల్లలు ఉన్నవాళ్లకు పాలకో, మందులకో ఏదో కాసిన్ని డబ్బులు ఇవ్వగలిగేవాళ్లం. దానికి మించిన అవసరాలు చాలా ఉండేవి వాళ్లకు.

**ఒంటరి మహిళలు-పిల్లలు**

ఇక ఒంటరి మహిళల కష్టాలు చెప్పనలవి కాదు. తెలంగాణలో ఒంటరి మహిళల సంఖ్య చాలా ఎక్కువన్నది తెలిసిందే. అందులో చాలామంది ఇళ్లలో పనిచేసుకునేవాళ్లు లేదా చిన్నచిన్న పనులు చేసుకునేవాళ్లు. ఇళ్లలో పనులు చాలమందికి మార్చి మొదటి వారం నుంచే ఆగిపోయాయి. ఇతర పనులు చేసుకునే వాళ్లది కూడా అదే పరిస్థితి. పిల్లలతో వాళ్ల ఇబ్బందులు దారుణంగా ఉండేవి. కాల్ చెయ్యటానికి ఫోన్ లో చార్జింగ్ లేక వాళ్లని వీళ్లని అడిగి ఫోన్ చేసేవాళ్లు కొందరు. మేము రేషన్ తో వెళ్లినప్పుడు ఆ ఇంకెవరికో ఫోన్ చేస్తే వాళ్లు సరిగా రెస్పాండ్ కాక ఇబ్బందయ్యేది. ఇక ఏక్ మినార్ నుంచి కిందకు ఆసిఫ్ నగర్ వైపు వెళ్లినప్పుడు మాకు చాలా మంది స్త్రీలు పిల్లలను పట్టుకుని రోడ్ల మీద అడుక్కుంటూ కనిపించేవారు. వాళ్లను ఎవరిని పలకరించినా ఒకటే కథ. పిల్లలతో సహా వదిలేసిన భర్తలు. వాళ్లకు ఇలా ఫోన్ చేసి సహాయం అడగొచ్చన్న విషయం తెలిసేది కాదు. దాదాపు అందరికి నలుగురు లేదా ఐదుగురు పిల్లలు. ఇలా ఎక్కువమంది పిల్లలు ఉండటం అన్నది దాదాపు అన్నిచోట్ల చూసాం. కులంతో, మతంతో సంబంధం లేకుండా పేదరికం ఉన్న అన్నిచోట్లా ఎక్కువ మంది పిల్లలు ఉండటం కనిపించింది. పిల్లలు ఆస్తి అన్న భావన నుంచి ఇంకా చాలామంది బయటపడకపోవటం ఒకటైతే, మగపిల్లల కోసం కంటూ పోవటం మరో కారణం అని మాకర్థమయింది. ఇది స్థానికుల్లోనూ, వలస కార్మికుల్లోనూ కూడా కనిపించింది.

**అడుక్కునే వాళ్లుగా...**

పని చేసుకుని గౌరవంగా బతికే చాలామందిని అడుక్కునే వాళ్లుగా మార్చిన కాలం కూడా ఇదే. ముఖ్యంగా ఏప్రిల్ చివరికి వచ్చేసరికి ఇది బాగా కనిపించింది. ముఖ్యంగా పేదలు నివసించే బస్తీల దగ్గరకు

వెళ్లినప్పుడు మాకు చాల సార్లు కనిపించిన దృశ్యం ఏంటంటే కొంత మంది ఒక మోస్తరు బట్టలు వేసుకున్న మగవాళ్లు కూడా ఒక చేతిసంచి పట్టుకుని రోడ్డుమీద తిరుగుతూ ఉండేవారు. మధ్యాహ్నం పూట చాలమంది ఇళ్లలో ఏదో ఒకటి వండుకుని పాకెట్లు చేసుకుని వచ్చి పంచుతుండేవారు. వాటి కోసం వచ్చి ఎదురు చూస్తూ ఉండేవారు. అదే సమయానికి మేము అక్కడ ఎవరికయినా సరుకులు ఇవ్వటానికి పోతే ఆశగా వచ్చి నిలబడేవారు. వాళ్లందరికీ ఇవ్వలేక, లేవని చెప్పలేక మాకు కడుపులో మెలిపెట్టినట్లుగా అయ్యేది. అందరికీ హెల్ప్ లైన్ నుంబర్ ఇచ్చి ఫోన్ చెయ్యండి తప్పకుండా వచ్చి ఇస్తాం అని చెప్పేవాళ్లం. అలా ఒకే ప్రాంతానికి మళ్లీ మళ్లీ చాలసార్లు వెళ్లేవాళ్లం. అలా అడిగితే కూడా ఇవ్వలేకపోయిన వాళ్ల మొహాలు మమ్మల్ని వెంటాడేవి.

**లాక్‌డౌన్ 3.0 – శ్రామిక్ రైళ్ల ప్రహసనం**

లాక్‌డౌన్ ను మే 4 నుంచి 17 దాకా కొనసాగింపుతో పాటు అనేక చోట్ల చిక్కుకున్న వలస కార్మికులను ఇళ్లకు పంపటానికి శ్రామిక్ రైళ్లను నడుపుతారన్న వార్త కూడా వచ్చింది. అయితే దానికి దగ్గరున్న పోలీసు స్టేషన్ కు వెళ్లి నమోదు చేయించుకోవాలి. అలా నమోదు చేసుకుని ఎదురుచూస్తూ ఉంటే ఏ రోజు వాళ్లకు అవకాశం వస్తే ఆ రోజు రెండు గంటల ముందు మాత్రమే ఫోన్ చేసి పిలుస్తారు. అప్పటికే రెండు నెలలుగా ఎవరికీ కాని వాళ్లుగా బిక్కు బిక్కుమంటూ ఉన్న వలసకార్మికులు పోలీసుస్టేషన్లకు వెల్లువెత్తారు. ఆలోచన లేకుండా ప్రకటనలు చేసే ప్రభుత్వాలు ఎప్పుడైనా తమ అసమర్థతను నిరూపించుకోవటానికి వాడే ఆయుధం హింస. ఎతమంది ఉంటే అంతమంది వచ్చి నమోదు చేయించుకోవాలని చెప్పిన ప్రభుత్వాలు పిల్లా పాపలతో వచ్చి గంటలు గంటలు తిండి కూడా లేకుండా ఎండలో నిలబడిన వాళ్లకు లాఠీచార్జీలు రుచి చూపించాయి. ఎందుకు రావాలని చెప్పారో, ఎందుకు నమోదు చెయ్యకుండా లాఠీ చార్జ్ చేస్తున్నారో తెలియని అయోమయం వాళ్లది. అలా అని వాళ్లంత వాళ్లు వెళ్లిపోదామంటే రైళ్లు లేని, బస్సులు లేని పరిస్థితి.

అన్నట్లు దేశంలో తొలి శ్రామిక రైలు హైదరాబాద్ నుంచే మే 2న వెళ్లింది. అయితే అతిథులైన కార్మికులను సాదరంగా వెనక్కి పంపటం కోసం కాదు. కంది ఐఐటి ప్రాంగణంలో భవన నిర్మాణాలు చేపడుతున్న ఎల్ అండ్ టి కంపెనీ కింద దాదాపు 2000 మంది వలస కార్మికులు పని చేస్తున్నారు. ప్రధానంగా వాళ్లు బిహార్, జార్ఖండ్, యూపీలకు చెందినవాళ్లు. వాళ్లకు మార్చ్ 25 నుంచి పని లేదు. అప్పటికే చేసిన పనికి కూడా డబ్బులు లేవు. లాక్‌డౌన్ 3లో భవన నిర్మాణ రంగం పని చెయ్యొచ్చని చెప్పటంతో అప్పటిదాకా రాష్ట్ర ప్రభుత్వం ఇచ్చిన జీవో 13 ను ఖాతరు చెయ్యని కంపెనీ, తిరిగి వాళ్లందరినీ పనిలో చేరమని చెప్పింది. దాంతో తమకు ఇవ్వవలసిన డబ్బులు ఇస్తే గాని పనిలో చేరమని అంటూ కార్మికులు ధర్నా చేసారు. బహుశా దేశం మొత్తంలో వలసకార్మికులు తిరగబడిన ఏకైక సంఘటన ఇదే కావొచ్చు. అన్నట్లు జీవోలను పట్టించుకోని కంపెనీ అటు పీఎం కేర్ కి, ఇటు సీఎం రిలీఫ్ కి బాగానే ముట్టచెప్పిందట. ఇంకేం, కంపెనీని రక్షించటానికి రాత్రికిరాత్రి శ్రామిక్ రైలు ఏర్పాటుచేసి కార్మికులను రహస్యంగా తెల్లవారు జామున పంపించేసారు. ప్రతి చిన్న పనికి పెద్ద డబ్బా కొట్టుకునే ప్రభుత్వం ఈ పని అత్యంత రహస్యంగా చెయ్యటమే కాక దాని గురించి ఒక ప్రకటన కూడా చెయ్యలేదు.

ఆ తర్వాత కొన్నిరోజులకు శ్రామిక్ రైళ్లు మొదలయ్యాయి. కాని అదొక పెద్ద గందరగోళం. ఏ రోజు ఎన్ని ట్రైన్లు ఉంటాయో, ఎక్కడికి వెళ్తాయో ఎవరికీ చెప్పరు. రాష్ట్ర ప్రభుత్వ ప్రధాన కార్యదర్శి ముందు చిట్స్ తీసి వివిధ పోలీసు డివిజన్లకు వాళ్ల కోటా పంపుతారు. అప్పుడిక పోలీసులు ఆదరాబాదరాగా వాళ్లదగ్గర ఉన్న లిస్టుల్లోంచి కొంతమందికి ఫోన్లు చేసి కేవలం గంట సమయం ఇచ్చి ఒక ప్రాంతానికి రప్పించి అక్కడి నుంచి బస్సుల్లో ఎక్కించి రైల్వే స్టేషన్ కి తెస్తారు. నమోదు చేసుకున్న వాళ్ల సంఖ్య లక్షల్లో ఉంటే రోజుకు 3–4 రైళ్లు వేసి 4,5 వేల మందిని మాత్రం పంపేవారు. ఆ పద్ధతిలో అందరినీ పంపటానికి కనీసం ఏడాది పడుతుంది. ఎందుకు సరిపోయినన్ని రైళ్లు వెయ్యరు అంటే దానికి వంద కారణాలు. ఒకటి ఈ రైళ్లకయ్యే ఖర్చు ఎవరు పెట్టుకోవాలన్నది. నిజానికి కేంద్రం పరిధిలోకి వచ్చే విషయం ఇది. కానీ మీరూ మీరూ చూసుకోండి అని చేతులు దులుపుకుంది కేంద్రం మిగిలిన అన్ని విషయాల్లో దులుపుకున్నట్లుగానే. ఇక్కడ రాష్ట్ర ప్రభుత్వాలను అడిగితే వలస కార్మికుల హోమ్ స్టేట్ వాళ్ల కార్మికులను పంపటానికి అనుమతి ఇవ్వటం లేదు కాబట్టి మేము ఏమీ చెయ్యలేము అనేవాళ్లు. నిజంగానే యూపీ లాంటి రాష్ట్రాలు అనుమతి ఇవ్వకపోగా, బస్సుల్లో వచ్చిన వాళ్లను కూడా నాలుగు రోజులపాటు సరిహద్దు దగ్గర ఆపేసి తమ రాష్ట్ర ప్రజలకు తమ ఇంటికి వెళ్లే హక్కు లేదని వెనక్కి పంపించేసింది. కర్నాటక వంటి రాష్ట్రాలు నిర్మాణ రంగం లాబీ అడిగిందని అసలు రైళ్లే వెయ్యలేదు. అయితే అది అన్నిసార్లు నిజం కాదు. చత్తీస్ గడ్ వంటి కొన్ని రాష్ట్రాలు తమ కార్మికులని ఆహ్వానించటానికి సిద్ధపడ్డాయి. తమ రాష్ట్రానికి ఏ మార్గంలో వచ్చినా, వచ్చిన వాళ్లను రిసీవ్ చేసుకుని, పరీక్షలు చేసి వాళ్ల వాళ్ల ఊళ్లకు పంపటానికి అన్ని ఏర్పాట్లు చేసుకున్నాయి. భవన నిర్మాణంలో, వ్యవసాయ రంగంలో చత్తీస్ గడ్ వాళ్లే అధికం.

ఈ శ్రామిక్ రైళ్ల గందరగోళంలో ఇళ్లకు వెళ్లిపోవాలనుకున్న వలస కార్మికులకు ఎప్పటికీ పిలుపురాక మరొకసారి కాళ్లను నమ్ముకుని తెగించి ఇల్లు చేరే ఆలోచన మొదలయింది. అప్పటికి కొంతకాలంగా తగ్గిన నడిచి వెళ్లే వలస కూలీల దృశ్యాలు మళ్లీ మొదలయ్యాయి. మేము అప్పటిదాకా పనిచేస్తూ ఉన్న వలస కార్మికుల బృందాలు మమ్మల్ని పదే పదే ఇదే విషయం అడిగేవారు. చాలామంది ఊరు బయటకు 30–40 కిలోమీటర్లు నడిచి వెళ్లి అక్కడ రవాణాకోసం వచ్చిన ట్రక్కుల్లో పిల్లా పాపలతోసహా ఇరుక్కుని మండే ఎండల్లో మాడుతూ వెళ్లిపోయేవాళ్లు. నాకు తెలిసిన ఒక బృందం కూడా అట్లానే వెళ్లిపోవటానికి తయారయింది. అయితే అందులో ఒక జంటకు అప్పుడే ఆ భవన నిర్మాణ స్థలంలోనే పుట్టిన వారం రోజుల పాపతో పాటు, ఇంకా ఐదారుగురు చిన్న పిల్లలు ఉన్నారు. అన్నట్లు అదొక విషాదం. ఇలా వచ్చిన వలస కార్మికుల కుటుంబాల స్త్రీలకు ప్రసవ సమయంలో కానీ, పుట్టిన పిల్లల పోషణకు గానీ మన రాష్ట్ర ప్రభుత్వాల నుంచి ఏ సహాయం అందదు. వాళ్లు ప్రసవానికి ప్రభుత్వ ఆస్పత్రికి పోతే ఆషా వర్కర్ నుంచి కార్డు లేదని చేర్చుకోరు. ఆ పిల్లలదగ్గరకు ఏ అంగన్ వాడీ వర్కర్లు కూడా రారు. వాళ్లకు ఐదేళ్లయినా పదేళ్లయినా స్థానికంగా ఏ గుర్తింపు ఉండదు కనుక స్థానిక ప్రభుత్వాల నుంచి అందే ఏ సహాయం అందదు. ఒక రకంగా వాళ్లు లెక్కల్లో లేని, కనిపించని మనుషులు. కాబట్టి పిల్లలు పుడితే అక్కడే అలాగే పుట్టాలి. మాకు తెలిసిన బృందం అలా పిల్లలతో పాటు నడిచి, ట్రక్కుల్లో పోవడానికి సిద్ధపడితే చూడలేక, వాళ్లను సరియైన పర్మిషన్లతో సురక్షితంగా పంపుదామన్న ప్రయత్నంలో ఆపి, పర్మిషన్ల కోసం ప్రయత్నిస్తే అది జరగలేదు. పోలీసులు వందసార్లు ఆ పేపర్, ఈ పేపర్ అని తిప్పి రెండు రోజుల తర్వాత పర్మిషన్ నిరాకరించారు. అప్పటికే అసహనంగా ఉన్న వాళ్లు ఎలాగైనా వెళ్లిపోవాలని సామాన్లు

తీసుకుని నడవటం మొదలుపెట్టారు. వాళ్లతోపాటు పసిబిడ్డ తల్లిని, మిగిలిన పిల్లలను తీసుకుని వాళ్లు ట్రక్కు ఎక్కడానికి వెళ్తున్న మేడ్చల్ కి వాళ్లతో పాటు వెళ్లాను. టాంక్ బండ్, సికిందరాబాద్ స్టేషన్ నుంచి మొదలుకొని మేడ్చల్ దాక దాదాపు 30 కిలోమీటర్ల దూరం రోడ్ల మీద బారులు బారులుగా నడిచిపోతున్న కార్మికులే. అందులో కొందరు కర్నాటక, తమిళనాడు వంటి రాష్ట్రాలనుంచి వచ్చి హైదరాబాద్ ఒక చివరన దిగి ఇంకో కొసన ఇంకో ప్రయాణ మార్గం కోసం వస్తున్నవాళ్లు. ఈ దారంతా 30 కిలోమీటర్లు అయినా, 50 కిలోమీటర్లు అయినా తాగటానికి నీళ్లు కానీ, తినడానికి తిండి కానీ లేని పరిస్థితి. మామూలుగా ఎండాకాలంలో పెట్టే చలివేంద్రాలు కూడా సామాజిక దూరం పేరుతో ఎవరూ పెట్టలేదు. అది చూసి మా గ్రూపులో అలర్ట్ చెయ్యగానే అందులో కొందరు, అయితే మన సహాయం అక్కడ ఉందని గుర్తించారు. దాంతో మే 9 నుంచి మాలో కొందరం నీళ్లు, బిస్కట్లు, బ్రెడ్డు, పండ్లు తీసుకుని మేడ్చల్ కు వెళ్లటం ప్రారంభించాం. కాని మేము ఎంత తీసుకెళ్లినా 15-20 నిమిషాల్లో ఖాళీ అయిపోయేవి, అప్పటికే ఆ ప్రాంతంలో ఇతరులు కూడా ఇలా బ్రెడ్లు, నీళ్లు పంచుతున్నారు. కాని వెళ్తున్నవాళ్ల సంఖ్యకు అవి సరిపోని స్థితి. చెక్ పోస్టు దగ్గర కనుక్కుంటే రోజుకు 15,000 మంది నగరం నుంచి వెళ్తున్నారని చెప్పారు. ఆదిలాబాద్ దగ్గర రాష్ట్ర సరిహద్దులో కనుక్కుంటే అక్కడ కూడా అదే చెప్పారు. అప్పుడు ప్రభుత్వంలో ఉన్న మిత్రుల సహకారంతో మేడ్చల్ మునిసిపాలిటీతో, జిల్లా యంత్రాంగంతో సంప్రదించి ఔటర్ రింగ్ రోడ్ (ఓఆర్ ఆర్) దగ్గర టెంట్లు వేసి ఫుడ్ కాంప్ పెట్టాం.

### మానవత్వం పరిమళించిన ఓఆర్ఆర్

అలా ఫుడ్ కాంప్ ఒక స్థలం అంటూ ఏర్పడ్డ తర్వాత దానికి ఆహారం పంపమని, వాలంటీర్లుగా రమ్మని సోషల్ మీడియాలో అభ్యర్థన చేయటంతో దానికి విశేషమైన స్పందన వచ్చింది. అక్కడకు వచ్చిన ఒక వలంటీర్ చెప్పినట్లు అప్పటికి నెలన్నరగా నానాకష్టాలు పడుతున్న వలసకార్మికులను టీవీలో చూస్తూ, వాళ్ల గురించి పత్రికల్లో చదువుతూ ఏమీ చెయ్యలేక నిస్సహాయతకు, అపరాధ భావనకు గురయిన వాళ్లకు అది ఒక అవకాశంగా మారింది. మేడ్చల్ కాంప్ ఎంత పాపులర్ అయిందంటే కేవలం అనేకమంది తమ ఇళ్లలో వండుకుని తెచ్చిన ఆహారంతో, లేదా కొని తెచ్చిన ఇతర ఆహారాలతో రోజుకు సుమారు 15 వేల మందికి ఆహారం అదించటంతో పాటు వాళ్లకు వెళ్లేదారిలో తినటానికి పనికొచ్చే ఆహారం కూడ మూటలు కట్టి ఇవ్వగలిగే వాళ్లం. ఈ పని మే 11 నుంచి మే 28 దాకా పూర్తిగా వ్యక్తుల చొరవతో జరిగింది. అక్కడ చాలా అద్భుతంగా అనిపించిన విషయం ఏమిటంటే అక్కడికి వచ్చిన ఎవరూ కూడా తాము ఏదో దాన కార్యక్రమం చేస్తున్నట్లు భావించలేదు. తమ దగ్గర ఉన్నదేదో ఇవ్వటం కాక, వాళ్లకు ఏం కావాలో తెలుసుకుని ఇవ్వటం, ఏం తింటారో తెలుసుకుని తేవటం చేసేవాళ్లు. రకరకాల అన్నాలు, రొట్టెలు, కూరలు, మజ్జిగలు, పండ్లు, పండ్ల రసాలు, బన్నులు, చల్లటి మంచినీళ్లు ఇలా బల్లల మీద ఖాళీ అవుతూ ఉంటే అలా మళ్లీ మళ్లీ నిండుతూ ఉండేవి, వెళ్లేదారిలో తినటానికి ఏమి ఉపయోగం అని ఆలోచించి నానపెట్టిన సెనగలు, బెల్లం లాంటివి కూడా తెచ్చేవాళ్లు. కార్పొరేట్ కంపెనీలలో ఉన్న స్నేహితులు కూడా తమ కంపెనీలనుంచి స్పాన్సర్ చేయించి భోజనాలు పంపారు. ముఖ్యంగా అది రంజాన్ కాలం కావటంతో ఇక్కడ కాంప్ గురించి తెలిసిన ముస్లిం సోదరులు జకాత్ కింద పెద్ద ఎత్తున ఆహారాన్ని, పండ్లను, పండ్ల రసాలను పంపారు. దాదాపు అందరూ అది ఒక బాధ్యత లాగ చేసారు. అక్కడ మేము పెట్టిన బానర్లు రెండే, అదీ ఎవరి పేరూ లేకుండా. "ఆహారం, నీళ్లు అందరి హక్కు". "వాళ్లను గౌరవంగా, సురక్షితంగా ఇళ్లకు పంపండి".

### గౌరవంగా, సురక్షితంగా పంపుదాం

ఒకసారి తిండి, నీళ్ల సమస్య పరిష్కారమయ్యాక మా దృష్టి వలస కార్మికుల సురక్షిత ప్రయాణం వైపు మళ్లించాం. దాదాపు అక్కడ కాంప్ మొదలయిన నాటి నుంచే వచ్చినవాళ్లతో మాట్లాడుతుంటే మాకు అర్థమయిందేంటంటే వాళ్ల అవసరాన్ని చూసి లారీలవాళ్లు విపరీతంగా డిమాండ్ చేస్తున్నారని. మేము కలగచేసుకుని ఆ రేట్లు తగ్గించటానికి ప్రయత్నం చేశాం. డబ్బులు లేక నడిచివెళ్లటానికి ప్రయత్నం చేసేవాళ్లకు మేము చందాలు వేసుకుని పంపించటానికి ప్రయత్నం చేశాం. మా దగ్గరే భోజనం చేసి, దారిలో తినటానికి ఆహారం తీసుకున్న (ఎందుకంటే డబ్బులు ఉన్నా, కొనుక్కుందామనుకున్నా, లాక్‌డౌన్ వల్ల ఎక్కడా తిండి దొరకని రోజులు అవి) లారీ డ్రైవర్లు కూడా మేం నచ్చచెప్తే వినేవాళ్లు. అలాంటి పరిస్థితుల్లో ఉత్తరప్రదేశ్ లో ఇలాగే వలస కార్మికులతో వెళ్తున్న ఒక లారీకి, తెలంగాణా సరిహద్దులో ఒక లారీకి ప్రమాదం జరగటంతో అది సురక్షితం కాదని భావించాం. అప్పటికే ఫుడ్ కాంప్ కి అవసరమైన ఆహారానికి మించి సహాయానికి చాలామంది ముందుకు రావటంతో వాటిని వలస కార్మికుల ప్రయాణాలకు మళ్లించాం. అప్పటికే ఒకటి రెండు సంస్థలు వాళ్ల ప్రయాణాలకు బస్సులు స్పాన్సర్ చేస్తామని ముందుకు రావటం, ఫుడ్ కాంప్ కి వచ్చిన విరాళాలతో మేము బస్సులు ఏర్పాటు చెయ్యటంతోపాటు చాలమంది వ్యక్తులు తామే స్పాన్సర్ చెయ్యటానికి, మరికొందరు కేవలం బస్సుల కోసమే విరాళాలు సేకరించి బస్సులు వెయ్యటానికి కూడా ముందుకు వచ్చారు. ఒకటి రెండు ఘర్షణల తర్వాత స్థానిక పోలీసులతో కూడా సమన్వయం కుదిరి వాళ్లు మాకు బస్సులకు పర్మిషన్లు తేలిగ్గా సంపాదించిపెట్టటంతో ఆ కాంప్ దగ్గర నుంచి దాదాపు 150 బస్సులు చత్తీస్ గడ్, ఒరిస్సా, బీహార్, జార్ఖండ్, యూపీ వంటి రాష్ట్రాలకు పంపగలిగాం. ఇవి రాష్ట్ర ప్రభుత్వం నడుపుతున్న శ్రామిక్ రైళ్లకు అదనం. ఆ బస్సులు వేసి వలస కార్మికులను ఇళ్లకు పంపటం అనేది ఫుడ్ కాంప్ తో మొదలు పెట్టిన కొందరు, వెళ్లిపోయే వలస కార్మికుల సంఖ్య బాగా తగ్గిపోయి కాంప్ తీసేసిన తర్వాత కూడా దాదాపు జూన్ నెల ఆఖరి వరకూ కొనసాగించారు.

### అభిమానం కల్ల మనుషులు

లాక్‌డౌన్ లో వలస కార్మికులతో పని చెయ్యటం మొదలయినప్పటి నుంచి గమనిస్తూ ఉన్న విషయం అయినా మేడ్చల్ లో బాగా గమనింపుకు వచ్చిన విషయం వలస కార్మికులు చాల అభిమానవంతులు అన్నది. ముఖ్యంగా ఆదివాసీ రాష్ట్రాల నుంచి వచ్చిన వాళ్లలో ఇది కనిపించింది. మేము కేవలం కొన్ని బన్నులు పట్టుకుని వెళ్లి హైవే మీద కనపడినవాళ్లకు ఇస్తున్నప్పుడు కూడా గమనించింది ఏమిటంటే వాళ్లలో చాలమందికి లాక్కోవడం, అవసరం కన్న ఎక్కువ తీసుకోవటం, కూడబెట్టటం అన్న భావాలు లేవు. ఒక బన్ను తీసుకున్న వాళ్లకు రెండో బన్ను ఇవ్వబోతే, "మై లియా, కిసీ ఔర్ కో దేదో" (నేను తీసుకున్నా, ఇంకెవరికన్నా ఇవ్వండి) అనేవాళ్లు. రెండో మంచినీళ్ల పాకెట్ కోసమో, ఎప్పుడైనా తీసుకుని వెళ్లటానికి మంచినీళ్ల బాటిల్ దొరుకుతుందా అనో తప్ప వాళ్లంతట వాళ్లు మమ్మల్ని ఇది కావాలని అడిగింది లేదు. కాంప్ దగ్గర సరిపోయినంత ఆహారం ఉంది, వద్దు అంటే, సహాయం చేద్దామని వచ్చిన వాళ్లే వాళ్లకు చెప్పులు అవసరమనో, తువ్వాళ్లు అవసరమనో గుర్తించి తెచ్చారు కాని వాళ్లు ఎప్పుడైనా అడిగితే ఇంటికి పంపటానికి

ఏమైనా చెయ్యగలరా అని తప్ప మరొకటి అడగలేదు. అది కూడా మనం అడిగితేనే. తింటున్నప్పుడు కానీ, బస్సుల్లో ఎక్కుతున్నప్పుడు కానీ ఒక తోపులాట లేదు, ఒక గొడవ లేదు. రోజూ 10-15 వేలమంది వచ్చినా ఫుడ్ కాంప్ అంత ప్రశాంతంగా జరిగింది అంటే ఆ క్రెడిట్ వాళ్లదే. ఇదే లాక్‌డౌన్ సమయంలో స్థానిక బస్తీలకు వెళ్లినప్పుడు మాకు కలిగిన అనుభవాలకు ఇది పూర్తిగా భిన్నం. నిజానికి వలస కార్మికులెవరూ కూడా తమ పట్ల ఇంత నిర్దయగా వ్యవహరించిన ప్రభుత్వాల పట్ల కానీ, కంపెనీ యజమానుల పట్ల గానీ ఎప్పుడూ ఆగ్రహంగా కనిపించలేదు. అలా అని దుఃఖం కూడా కనిపించలేదు. టీవీ విజువల్స్ లో చూస్తే వాళ్ల కష్టానికి చలించిపోయిన బైటివాళ్ల దుంఖం కనిపిస్తుంది కాని వాళ్లలో అలాంటి బేలతనం కనిపించదు. అక్కడ కూడా మాకు అదే కనిపించింది. 'ఒక కష్టం వచ్చింది దీన్ని మనం ఎదుర్కోవాలి' అన్న సంకల్పం, ఒక నిర్వికారత. నడిచి నడిచి వచ్చి కుటుంబాలన్నీ కలిసి గుంపులుగా కూర్చుండే వాళ్లు, వాళ్ల పిల్లలు, వాళ్ల లోకమే. లేస్తే సామాను వేసుకుని వెళ్లిపోవటమే. అలాంటి స్థితప్రజ్ఞత, సంకల్ప బలం వాళ్లకు బహుశా తమ మీద తాము తప్ప ఇంకెవరి మీదా ఆధారపడకపోవటం అనే జీవనవిధానం వల్ల వచ్చిందా? ఏమో?

**తిరిగొస్తారా?**

లక్షలాదిగా ఊళ్లు ఖాళీ చేసిపోతున్న వలస కార్మికులను మీడియాలో చూసిన చాలమందికి వచ్చిన సందేహం వాళ్లు మళ్లీ వెనక్కి వస్తారా లేదా అని. ఇప్పుడు చాలామందికి అర్థం అయింది. ఈ దేశం చౌకగా దొరికే వాళ్ల శ్రమ మీదనే బతుకుతోందని. కాబట్టి ఇటు చౌక వస్తువులకు వినియోగదారులుగా మారిన మధ్యతరగతిని, అటు నోరులేని కార్మికుల చెమట మీద సంపద పోగేసుకుంటున్న పారిశ్రామికవేత్తలను సమానంగా కలవరపెడుతున్న ప్రశ్న ఇది. మేడ్చల్ ఫుడ్ కాంప్ దగ్గరకు కంపెనీల నిధులతో నడిచే కొన్ని స్వచ్ఛంద సంస్థలు వచ్చి వెళ్లిపోతున్న కార్మికులకు నచ్చచెప్పి వెనక్కు తీసుకువెళ్లటానికి కొన్ని విఫలప్రయత్నాలు కూడా చేసాయి. రెండు నెలల పాటు తమ మధ్య ఉండి నానా యాతనలు పడుతున్నప్పుడు, వైరస్ వచ్చిపడితే ఎట్లా అని మానసికంగా నలిగిపోతున్నప్పుడు పట్టించుకోని వాళ్లు ఇప్పుడు వచ్చి మీరు ఇంటికి వెళ్తే అక్కడ మాత్రం ఏముంది అని నచ్చచెపితే వింటారనుకుంటే అది భ్రమ. బహుశా వాళ్లకు ఇంటి దగ్గర బతుకు తెరువు లేకపోవచ్చు. నిజానికి లేదు కూడా. వెళ్లిపోయిన చాలా మంది అదే విషయం చెప్తున్నారు కూడా. కాని వాళ్లిక్కడ చావుకు భయపడి వెళ్లిపోయారు. ప్రసవం జరిగితేనే ఆషా కార్డు లేదని హాస్పిటల్ లో చేర్చుకోని చోట, రేపు నిజంగా వైరస్ వస్తే ఎవరు పట్టించుకుంటారన్న భయం వాళ్లది. ఈ రెండు నెలల్లో ప్రభుత్వాలు ఆ విషయం స్పష్టం చేసాయి కూడా. మీరు మా వాళ్లు కాదు అని. ఏమైనా జరిగితే శవం కూడా ఇల్లు చేరదన్న విషయం కూడా తెలిసిపోయింది వాళ్లకి. అందులోనూ ఇక్కడ నగరాల్లో ఉన్నట్లుగా వాళ్ల గ్రామాల్లో ఈ వైరస్ లేదు. ఉన్నా కూడా నగరాల్లో లాగా తీవ్రత కాని వ్యాప్తి కాని లేదు. కాబట్టి ఎవరూ వెనక్కి తిరిగి నగరంలోకి రావటానికి ఇష్టపడలేదు. బహుశా ఈ కాలెండర్ సంవత్సరంలో వాళ్లెవరూ వెనక్కి తిరిగి రారు. అంతా బాగుంటే మళ్లీ 2021లోనే వస్తాం అని మాకు చెప్పిన వాళ్లే ఎక్కువ. బహుశా కష్ట కాలంలో ఏ అండా అందని వాళ్లు తిరిగి వచ్చే సాహసం కూడా చెయ్యరేమో.

చెయ్యాల్సిందంతా చేసి వలస కార్మికుల వల్లనే దేశమంతా వైరస్ వ్యాప్తి చెందిందన్న ఒక నింద ఇవ్వాళ వలస కార్మికుల మీద వేస్తున్నారు. అదే నిజమైతే దానికి పూర్తిగా ప్రభుత్వాలదే భాధ్యత. నిజానికి లాక్‌డౌన్ ప్రకటించే నాటికి ఇన్ఫెక్షన్లు చాల ప్రాథమికదశలో ఉన్నాయి. ఈ వర్గాలేవీ వైరస్‌కి దగ్గరలో కూడా లేరు. అప్పటికి ఉన్న ఇన్ఫెక్షన్లు కేవలం 500. వేరే కొన్ని దేశాలు చేసినట్లుగా వారం రోజులు వ్యవధి ఇచ్చి ఎక్కడి వాళ్లు అక్కడ వెళ్లిపోయే అవకాశం ఇచ్చి ఉంటే ఇంత పెద్ద మానవ విషాదాన్ని దేశం చూసి ఉండేది కాదు. ఇంతమంది వలస కార్మికులు ఉన్నారన్న విషయం కూడా తెలియని అజ్ఞాన ప్రభుత్వాలు మనకున్నాయి. కనీసం తెలిసాక అయినా వాళ్లందరికీ ఎవరి ఊళ్లకు వాళ్లు వెళ్లిపోయే అవకాశం కల్పించి ఉండాల్సింది. 500 నాడు దేశాన్ని మూసేసి ఇన్ఫెక్షన్లు లక్షకు చేరువలో ఉన్నప్పుడు శ్రామిక్ రైళ్లు నడిపిన ఘనత మన ప్రభుత్వాలది, ఆ రైళ్లేవో వెంటనే నడిపి ఉంటే వాళ్లు టికెట్లు కొనుక్కుని వెళ్లిపోయేవాళ్లు. శ్రామిక్ రైళ్లలో వెళ్లినవాళ్లకన్నా ట్రక్కుల్లో, ఇతర మార్గాల్లో, టికెట్ డబ్బుకు రెండు మూడు రెట్లు ఎక్కువ చెల్లించి వెళ్లిపోయిన వాళ్ల సంఖ్య ఎన్నో రెట్లు. ఇంతా చేసి చాలా రాష్ట్రాలు శ్రామిక్ రైళ్లలో కూడా మామూలు టికెట్ కంటే ఎక్కువ డబ్బులు కార్మికుల దగ్గర వసూలు చేసాయి. ఆ విషయంలో తెలంగాణా రాష్ట్రం నయం. ఎన్ని రైళ్లు వేసినా కార్మికుల దగ్గర డబ్బులు తీసుకోలేదు. ఇక్కడి నుంచి రైళ్లల్లో వెళ్లిన వాళ్లు కూడా ఎవరూ ఆకలితో మాడలేదు.

**అయినా అంతా వెళ్లిపోలేదు**

నడిచిపోయిన వాళ్లు, లాక్‌డౌన్ ఎత్తివేసిన తర్వాత వెళ్లిపోయిన వాళ్లు కొందరే. వాళ్లంతా సీజనల్ కార్మికులు. పని ఉన్నప్పుడు వచ్చి, పని స్థలం దగ్గరే ఉండి పని కాగానే వెళ్లిపోయేవాళ్లు. వీళ్లుకాక ఊళ్లో ఉండి, ఇళ్లు అద్దెకు తీసుకుని రకరకాల పనులు చేసే వలస కార్మికుల సంఖ్య చాలా అధికం. హోటళ్లలో, ప్రింటింగ్ పరిశ్రమలో, మగ్గం పనిలో, రంగులు వెయ్యటం, కర్రపని చెయ్యటం వంటి పనుల్లో ఉన్నవాళ్ల సంఖ్య మొత్తం వలస కార్మికుల్లో మూడింట రెండు వంతులు. వాళ్లంతా ఇక్కడే ఉన్నారు. ఇది ఉపాధి పథకంలో పని వెతుక్కునే వర్గం కాదు. వాళ్లకు అలా దులుపుకుని పోవటమూ కుదరలేదు. ఇళ్ల అద్దెలు బకాయి. వెళ్తే అక్కడ ఎలాగూ పని లేదు. ఇక్కడ ఇంకా పనులు ప్రారంభం కాలేదు. పని ప్రారంభం అయిన వాళ్లకు కూడా గతంలో దొరికిన పనిలో పది శాతం కూడా దొరకటం లేదు. హైదరాబాద్ లో పశ్చిమ బెంగాల్‌కి చెందిన మగ్గం పనివాళ్ల సంఖ్య చాలా చాలా ఎక్కువ. వాళ్ల దురదృష్టం ఏమిటంటే చాలామందికి అక్కడ మే నెలలో వచ్చిన తుపానులో ఊళ్లలో ఉన్న ఇళ్లు కూడా పోయాయి. వినదలచుకుంటే ఉండిపోయిన వాళ్ల వెతలు ఎన్నో. వాళ్లెవరూ ఇక్కడ ఓటర్లు కాదు కనుక వాళ్లకు ప్రభుత్వాల నుంచి ఏదైనా సహాయం దొరికే అవకాశం లేదు. కూలిపోయిన ఎకానమీలో వీళ్లు ఎలా బతుకుతారన్నది పెద్ద ప్రశ్న.

**విమర్శలు-వివాదాలు**

ఒక పని జరుగుతున్నప్పుడు కొన్ని విమర్శలు రావటం సహజమే. అందులో కొన్ని అయినా న్యాయమైనవై ఉంటాయి కాబట్టి వాటికి సమాధానం చెప్పాలి. ఇలా లాక్‌డౌన్ లో చిక్కుకున్న వలస కార్మికులకు రేషన్ ఇవ్వటం, అహారం అందించటం అనేది దాన కార్యక్రమం అని, ఉద్యమాల వైపు మళ్లించాల్సిన ప్రజలను యాచకులుగా మారుస్తున్నారని, అది ప్రభుత్వానికి ఉపయోగపడే విధంగా సమస్య తీవ్రతను తగ్గించే కార్యక్రమం అన్నది మొదటి విమర్శ. రెండవది ఇది అగ్రవర్ణ అర్బన్ ఫెమినిస్టులు (ఈ సహాయ కార్యక్రమంలో ఎక్కువమంది స్త్రీలే పాల్గొన్నారు) నడుపుతున్న బూర్జువా కార్యక్రమం అని. కాకపోతే ఈ విమర్శ చేసినవాళ్లు కూడా ఆ తర్వాత అదే బూర్జువా కార్యక్రమంలో పాల్గొన్నారు.

కాని మొదటి విమర్శ మాత్రం కొంత సమాధానం చెపాల్సిన వర్గాలనుంచే వచ్చింది. స్థూలంగా చూస్తే ఆ విమర్శ నిజమే. దీర్ఘకాలంలో ఇది మనుషుల జీవితాలను మౌలికంగా మార్చటానికి పనికొచ్చే పని కాదన్నది లాక్‌డౌన్ కాలంలో ఈ పని చేసిన మాలో కొంతమందికి స్పష్టత ఉంది. కానీ విపత్తులు సంభవించినప్పుడు వాటికి మినహాయింపులు ఉంటాయి. వరదలు వచ్చినప్పుడు, భూకంపాలు సంభవించినప్పుడు ఎదురయ్యే విషాదాల వంటిదే లాక్‌డౌన్ సమయంలో వలస కార్మికులకు ఎదురయిన విపత్తు. మూడు నెలల పాటు ఈ పని జరుగుతున్నంత సేపూ నేను కలిసి పనిచేసిన పౌర సమాజ బృందం సభ్యులు సమాంతరంగా వలస కార్మికుల పట్ల ప్రభుత్వాలు పాటిస్తున్న పద్ధతిని పశ్నించటం, విమర్శించటం, అవసరమైతే కోర్టులకు వెళ్లి కావలసిన డైరెక్షన్ తేవటం వంటి పనులు చేస్తూనే ఉన్నారు. వలస కార్మికులకు తిండి, ఆశ్రయం, ప్రయాణ సౌకర్యం కల్పించటం ప్రభుత్వ బాధ్యతే అన్న హైకోర్టు తీర్పు కూడా ఈ బృందం వేసిన పిల్ నుంచి వచ్చిందే.

ఈ సందర్భంగా ఒక విషయం చెప్పాలి. 15 ఏళ్ల క్రితం దండకారణ్యానికి జనతన సర్కార్ మీద వార్తా కథనం రాయటానికి వెళ్లినప్పుడు దాదాపు నేను కూడా ఇలాంటి ప్రశ్నే అడిగాను. మీరిక్కడికి వచ్చింది దేశంలో విప్లవం తేవటానికి కదా, మరి ఇక్కడ మీరు చెరువులు పొయ్యటం, అదివాసీలకు సుస్థిర వ్యవసాయం నేర్పించటం, రవిక వేసుకోవాలా లేదా అన్నది నిర్ణయించుకునే హక్కు స్త్రీలకే ఉండాలనటం, ఇందుకోసం విప్లవానికి ఉపయోగపడాల్సిన ఇంత సమయాన్ని, వనరులను ఎందుకు వినియోగిస్తున్నారు అని అక్కడ డివిజన్ కార్యదర్శి గణేష్ ఉయికె ను అడిగాను. అప్పుడాయన చెప్పిన సమాధానం ఇది: ఇక్కడ మనుషులు, మలేరియాలతోనూ, సరైన తిండి లేకపోవటం వల్లా 40 కూడా దాటకుండా చనిపోతున్నారు. ముందు మనుషులు బతికి ఉండాలి కదా విప్లవం సాధించాలంటే అన్నారు. ఆశయం పెద్దదైనప్పుడు, యుద్ధం దీర్ఘకాలమయినప్పుడు, తక్షణ సమస్యలను పరిష్కరించకుండా రాజకీయ తరగతులు చెప్పటం కుదరుతుందనుకోను. అది సమాంతర ప్రక్రియ.

అలాగే వలస కార్మికులను చైతన్యవంతులను చేసి ఉద్యమాలు చేయించటం వాళ్లు రోడ్డున పడ్డ పరిస్థితుల్లో జరుగుతుందనుకోను. అప్పటికి వాళ్లలో ఆ చైతన్యం కలిగించే పని జరిగి ఉండాలి. అది జరగలేదు. విమర్శలు చేసిన వాళ్లందరికీ ఇప్పటికీ ఆ పని చెయ్యటానికి అవకాశం ఉంది. ఈ 16 కోట్ల వలస కార్మికులే కాదు ఇంకా ఎన్నో కోట్ల పేద, దిగువ మధ్య తరగతి కూడా ఈ కూలిపోయిన అర్థిక వ్యవస్థలో అష్టకష్టాలు పడుతున్నారు. వాళ్లను ఆర్గనైజ్ చెయ్యటానికి ఇది సమయం కూడా. దివిసీమ ఉప్పెన సమయంలో సహాయ కార్యక్రమాలు చేపట్టిన ఎమ్ ఎల్ పార్టీల మీద కూడా దాదాపు ఇదే రకం విమర్శలు వచ్చాయి. విమర్శించిన వాళ్లు ఎక్కడున్నారో కానీ పని చేసిన వాళ్లు మాత్రం ఇప్పుడు జైళ్లలో ఉన్నారు. ప్రజలను ఎప్పుడూ వదిలి పెట్టలేదు. వాళ్లతో పోల్చుకునేంత గొప్ప పని చెయ్యకపోవచ్చు గాని, దేశం కనీ వినీ ఎరగని సంక్షోభంలో ఉన్నప్పుడు ఆ సంక్షోభంలో అత్యంత దారుణంగా దెబ్బతిన్న వాళ్ల పక్క నిలబడటం మనుషులుగా చెయ్యవలసిన పని అని నమ్మి చేసిన పని. అది మనుషులుగా సాటి మనుషుల పట్ల బాధ్యత.

**కృతజ్ఞతలు**

వలస కార్మికుల బాధలు చూస్తూ ఏమి చెయ్యాలో తెలియక నిస్సహాయంగా దుఃఖపడిన చాలామంది నాకు తెలుసు. అలాంటి దుఃఖం నుంచి తప్పించటానికి నాకు వ్యక్తిగతంగా సహాయం చేసిన పని ఇది. అందుకు అవకాశం కల్పించిన కొవిడ్ అడ్వొకసీ గ్రూపుకు, ఒక వాట్సప్ గ్రూపుతో అంతమందిని లాక్‌డౌన్ ప్రకటించిన రెండో రోజే ఒక చోటకి చేర్చిన సజయకు, తొలిరోజులనుంచీ కలిసి పనిచేసిన వసుధా నాగరాజ్, అన్వేషి సునీత, కొండవీటి సత్యవతి, సుజాత సూరేపల్లి, ఖలీదా పర్వీన్, పద్మజా షా, మాలిని సుబ్రమణ్యం, మీరా సంఘమిత్ర, అంబిక, భూమిక ప్రశాంతి, బ్రదర్ వర్గీస్, జర్నలిస్టు వి వి జ్యోతి, లిస్సీ జోసెఫ్, సఫా సంస్థకు చెందిన రుబీనా, ఏంజెల్, ఇంకా నాకు తెలియని కొందరు (వర్చువల్ గా తప్ప బయట కలవలేదు చాలా మందిని), ఇందులోనే ఒక ఉప బృందంగా నాతోపాటు ఉన్న స్నేహితులు లలిత, రాణి, వారం రోజులకు మాతో కలిసి 'సహాయ' పేరుతో హెల్ప్ లైన్ ప్రారంభించి మా పని ఒక పద్ధతిలో జరగటానికి సహాయపడిన రైతు స్వరాజ్య వేదికకు చెందిన రవి కన్నెగంటి, నవీన్, సంయుక్త, శ్రుతి, హర్ష, విస్సా కిరణ్, స్వప్న, హెల్ప్ లైన్ కు వాలంటీర్లుగా పనిచేసిన 40కి పైగా నాకు పేరు తెలియని వాలంటీర్లు, రాధికా దేశాయ్, ఆయేషా, శ్వేత, ఇంకా నాకు పరిచయంలేని కొందరికి, డబ్బులివ్వొద్దు, మీరే మీ చుట్టుపక్కల ఉన్నవాళ్లకు సహాయం అందించండి అంటే ఈ పని కొత్త అయినా బ్రహ్మాండంగా చేసిన సుమాంజరి గుర్రం, చైతన్య పైడిపల్లి, జ్యోతి గూడవల్లి... అందరికీ కృతజ్ఞతలు. చిన్నపని చేసి పెద్ద ప్రమోషన్ చేసుకునే ఈ రోజుల్లో ఇందులో చాలామంది ఈ పని చేస్తున్నట్లు ఎక్కడా చెప్పుకోలేదు. వాళ్ల కుటుంబ సభ్యులకూ, వాళ్లకు డబ్బు రూపేణా సహాయం చేసిన కొందరికి తప్ప. వీరంతా సోషల్ మీడియాలో, ఇతర వేదికల్లో దొరికిన అవకాశాన్ని, స్పేస్ ను కూడా విధానాల గురించి మాట్లాడటానికే వాడుకున్నారు.

మేడ్చల్‌లో ఫుడ్ కాంప్ ప్రారంభించగానే సోషల్ మీడియాలో వాలంటీర్లు కావాలన్న పిలుపుకు స్పందించి దాని బాధ్యతలను భుజాలమీదకు ఎత్తుకున్న శ్రీరాం కంచర్ల, శ్రీనివాసరావు సజ్జా, అప్పటికే హైవే మీద పనిచేస్తూ ఉండి వెంటనే ఫుడ్ కాంప్ లో భాగంగా మారిన శ్యామ్ ప్రసాద్, గౌతమ్, అరుణ్ , ఎల్వీ, అభి, తవీ కృష్ణ, వాలంటీర్లుగా వచ్చి, తర్వాత కాంప్ లో భాగంగా మారిన అనితా మేస, రేణుకా దేవి, కృష్ణ పీల, రాధా పంతుల, భార్గవి, విజయలక్ష్మి, మాధవీకళ, ఫుడ్ కాంప్ కు పెద్ద ఎత్తున ఆహారపదార్థాలు రావటానికి సహాయపడిన ప్రొఫెసర్ ఇప్సిత, డాక్టర్ కల్యాణ్, రాజ్ జంగం, జకాత్ ఫౌండేషన్‌కి చెందిన ముజాహిద్, షహీద్ అలీఖాన్, చాలా సహాయాలను ఇటు మళ్లించటానికి పనిచేసిన బేగ్ ఫరాతుల్లా, మహనూర్, సోషల్ మీడియాలో ఫుడ్ కాంప్ గురించి తెలుసుకుని వచ్చిన చైతన్య పింగళి, మిర్చి మహేష్, రఘు మాదాటి, శంకర్ పటోల్ల, సందీప్, కవితా పులి, మహేందర్, కవితా చక్ర, సబిత, ఇంకా నేను పేర్లు మర్చిపోయిన కొందరు, వలస కార్మికులను బస్సుల్లో ఇళ్లకు పంపటం అనే ప్రక్రియ ప్రారంభించిన సంస్థలు హీలింగ్ ఫీల్డ్స్, టీఎస్ఐజి, ఆ తరవాత నిధులు సేకరించి ఆ పనులు కొనసాగించిన ఇండస్ మార్టిన్, అరుణాంక్ లత, మోషే దయాన్, ఉషా జ్యోతి. ఈ ప్రయాణాలతో పాటు వాళ్లు సురక్షితంగా ఇల్లు చేరే దాకా కార్మికుల హోమ్ స్టేట్స్‌తో కూడా కో ఆర్డినేట్ చేసిన శరత్ ధవళ, ఫుడ్ కాంప్‌కు కూడా తరలివచ్చి పని కొనసాగించిన, ఇంకా కొనసాగిస్తున్న కొవిడ్ అడ్వొకసీ గ్రూప్, ఫుడ్ కాంప్ ఏర్పాటు చెయ్యటానికి

# వ్యవస్థ స్వభావాన్ని బయటపెట్టిన కరోనా

***పిడికెడు మంది 'అభివృద్ధి'నే దేశ ప్రజలందరిదిగా భావించేలా అంకెల గారడీతో భ్రమింపజేస్తున్న పాలకుల నమూనా అంచులను కూడా తాకని కోట్ల మంది ప్రజలు ఉన్నారనే చేదు నిజాన్ని కరోనా బైటపెట్టిందని అంటున్నారు*** **వై. రామచంద్రం**

చైనాలోని వూహాన్ నగరంలోని పచ్చి మాంసం మార్కెట్‌లో కరోనా కోవిడ్–19 వైరస్ బయటపడింది. ఈ వైరస్ ప్రపంచీకరణ వల్ల పెట్టుబడి ఎక్కడెక్కడికి విస్తరించిందో దాదాపుగా అన్ని దేశాలకు విస్తరించింది. ప్రపంచీకరణ దుష్పరిణామాల్లో ఈ వ్యాధి ఒకటి. కరోనా లాంటి వైరస్‌లు రావడానికి ప్రధాన కారణం ప్రపంచ వ్యాప్తంగా ఉన్న సముద్రాల్లో, అడవుల్లో జరుగుతున్న విధ్వంసం. ఆ విధ్వంసం వల్ల అక్కడ జీవించే అనేక జీవరాసుల్లో ఉండే వైరస్‌లు జనారణ్యంలోకి వచ్చాయనేది ప్రకృతి శాస్త్రవేత్తలు, పర్యావరణ వేత్తలు చెపుతున్న వాస్తవం. ఇప్పుడు గ్రామాల చుట్టూ ఉండే అడవులు అంతరించడం వల్ల అడవి జంతువులు ఆహారం కోసం గ్రామాల్లోకి ఎలా వస్తున్నాయో వైరస్‌లు కూడా అలాగే వస్తున్నాయి. ఈ వైరస్‌కు ఇప్పటివరకు వ్యాక్సిన్ లేకపోవడంతో దాని నియంత్రణ కోసం బాధిత దేశాలు నెలల తరబడి లాక్‌డౌన్ ప్రకటించి భౌతిక దూరాన్ని పాటించాలనే నియమాన్ని అమలు చేస్తున్నాయి. ఇప్పటివరకు ప్రపంచ వ్యాప్తంగా ఈ వ్యాధి సోకిన కారణంగా జూన్ 30 నాటికి 5 లక్షల మందికి పైగా అసహజ మరణాలకు గురికాగా ఒక కోటి మందికి పైగా బాధితులు ఉన్నారు. ఈ వ్యాధి నిర్మూలనకు వ్యాక్సిన్ వచ్చేనాటికి ఎంత మందిని ఈ వైరస్ బలి తీసుకుంటుందో తెలియడం లేదు. ఈ వ్యాధి కారణంగా అత్యధికంగా మరణించింది 'అభివృద్ధి'లో ముందుంది అనుకుంటున్న అమెరికాలోనే. అక్కడి ఆస్పత్రుల్లో శవాలు కుప్పలుగా పోగయ్యి దాని 'అభివృద్ధి' నమూనాకు కరోనా సవాలు విసిరింది.

ఈ వ్యాధి నియంత్రణ కోసం భారతదేశంలో కూడా ప్రధాన మంత్రి లాక్‌డౌన్ ప్రకటించారు. గతంలో ముందు వెనక ఆలోచించకుండా, స్థానిక పరిస్థితులను గుర్తించకుండా అమలుచేసిన డిమానిటైజేషన్, జిఎస్‌టి వల్ల నెలల తరబడి ప్రజలను రోడ్ల మీదకు తెచ్చిన సందర్భాన్ని గుర్తుకు తెచ్చారు. ఇప్పుడు తేడా ఇంటికే నెలల తరబడి పరిమితం చేశారు. ప్రజలకు శాస్త్రీయమైన అవగాహనను ఇవ్వాల్సిందిపోయి ప్రధాని కరోనా నియంత్రణకు దేశ ప్రజలను చప్పట్లు కొట్టమని, జ్యోతులు వెలిగించమనడం హాస్యాస్పదం. కరోనా నియంత్రణకు కూడా హిందూ మత భావజాలమే పరిష్కారంగా చూపుతున్నారు దేశ ప్రధాని. ఆర్థిక సంక్షోభంలో ఉన్న దేశానికి కరోనా కూడా తోడయి తీవ్ర ఆర్థిక ఊబిలో చిక్కుకుంది. ఈ సంక్షోభం నుంచి గట్టెక్కడానికని 20 లక్షల కోట్ల ప్యాకేజీని కేంద్ర ప్రభుత్వం ప్రకటించింది. ఈ ప్యాకేజీ ప్రధాన ఉద్దేశం కార్పొరేట్ సంస్థలను నిలబెట్టడానికే తప్ప ఉపాధి కోల్పోయిన కోట్లాది ప్రజల కొనుగోలు శక్తి పెంచడానికి ఉపయోగపడేది కాదు.

కరోనా బారిన పడ్డ దేశాలు లాక్‌డౌన్‌ను ప్రకటించి వ్యాధిని కట్టడిచేసే ప్రయత్నం చేస్తున్నాయి. అదే విధానాన్ని భారత పాలకులు యథావిధిగా అమలుచేశారు. దేశంలోని ప్రజల జీవన పరిస్థితులు గుర్తించకుండా రాత్రికి రాత్రే లాక్‌డౌన్ ప్రకటించారు. కొద్ది రోజులకే బతుకుదెరువు లేక కోట్ల మంది వలస కూలీలు రోడ్లపైకి వచ్చారు. ఉన్నదగ్గర కూలీ దొరకక, తినడానికి తిండి లేక అటు కాంట్రాక్టర్లు గానీ ఇటు ప్రభుత్వాలు గానీ ఆదుకోకుండా తమ బాధ్యత ఏమి లేదన్నట్టు ప్రవర్తించాయి. వలస కూలీలను ఆదుకొనే విషయంలో ఈ దేశంలోని ప్రభుత్వ వ్యవస్థలన్నీ విఫలమయ్యాయి. చేసేదేమి లేక లక్షల మంది వలస కూలీలు పట్టణాలను వదిలి సొంత ఊళ్లకు వెళ్లడానికి రవాణా సదుపాయం లేకపోవడంతో మండుటెండల్లో నెత్తిన మూట, చంకన పిల్లలతో, మనుసు నిండా దుఃఖంతో కాలినడకన పయనమయ్యారు. వందల, వేల కిలోమీటర్ల ప్రయాణంలో ప్రమాదాల వల్ల, ఆకలితో, డిహైడ్రేషన్‌తో రాలిపోయిన ప్రాణాలకు లెక్కలేదు. దారి పొడుగునా తమ చెమటను, నెర్రెలు బాసిన పాదాల నుంచి వచ్చిన రక్తంతో దారులను ఎరుపెక్కిస్తూ – 'చస్తే మా ఊళ్లనే చస్తామ'ని వెళ్లిపోయారు.

ఇంత దుఃఖాన్ని మోసుకెళుతున్న కార్మికులు కనీసం మనుషులన్న

---

స్థానిక యత్రాంగంతో మాట్లాడి పర్మిషన్లతో పాటు సదుపాయాలు కలగచెయ్యటానికి అవసరమైన సహాయం చేసిన దిలీప్ కొణతం, అక్కడ ఉన్నంత కాలం సదుపాయాలకు సంబంధించి ఏ అవసరం అయినా వెంటనే స్పందించిన జిల్లా యంత్రాంగం, కాంప్ ను శుభ్రం చెయ్యటానికి, ఎప్పటికప్పుడు నీళ్లు ఏర్పాటు చెయ్యటానికి పని చేసిన 35 మంది గుండ్ల పోచంపల్లి మునిసిపల్ సిబ్బంది, గుండ్లపోచంపల్లి, మేడ్చల్ కమిషనర్లకు, ఎప్పుడంటే అప్పుడు ఏదంటే ఆ సహాయం చేసిన స్థానిక రాజకీయ నాయకుడు నర్సింహారెడ్డి తో పాటు మా పనిలో అనవసరంగా కల్పించుకోకుండా సహాయం చేసిన ఇతర స్థానిక రాజకీయ నాయకులకు ధన్యవాదాలు.

ఇక మార్చి చివరి వారం నుంచీ చేస్తున్న సహాయ కార్యక్రమాలకు, ఫుడ్ కాంప్ దగ్గరా, ఆ తర్వాత కూడా బస్సులకు స్పాన్సర్లుగా వచ్చిన వాళ్లు వందల్లో ఉంటారు, అందులో వెయ్యి రూపాయలు ఇచ్చిన వాళ్లు, లక్ష రూపాయలు ఇచ్చిన వాళ్లు కూడా మామీద నమ్మకంతోనే ఇచ్చారు. అలాంటి నమ్మకాన్ని మామీద ఉంచినందుకు ధన్యవాదాలు. అన్నిటికి మించి ఈదేశం, ఈ సమాజం కూడా మీ కష్టంతో బతుకుతూ మిమ్మల్ని ఇంత కష్టపెట్టినా కూడా ఉండాల్సిన కోపం కూడా లేకుండా నిర్వికారంగా మీరు నడిచివెళ్లే దారిలో ఉడతా సాయం చెయ్యటానికి అవకాశం ఇచ్చిన భారతదేశ నిజమైన నిర్మాతలు వలస కార్మికులకు ధన్యవాదాలు.

*(రచయిత స్వతంత్ర పాత్రికేయులు)* వీ

సోయి కూడా పాలకులకు లేకుండా పోయింది. వారు మనుషుల్లా ఆలోచిస్తే అలా వ్యవహరించి ఉండేవారు కాదేమో. దేశ ప్రజలు ఈ దుర్భరమైన పరిస్థితిని చూసి మానవతా వాదులు వ్యక్తులుగా తమకు తోచిన మేరకు అన్నపానీయాలు అందించి వలస కార్మికుల ఊపిరిని నిలిపారు. ప్రభుత్వాలు నడుస్తున్నది ప్రజలు చెల్లిస్తున్న పన్నులతోనే, కాని పాలకులు మాత్రం వలస కూలీలకు స్వంత ఊళ్లకు వెళ్లడానికి కనీస రవాణ సదుపాయం కల్పించలేదు. వలస కార్మికులు రోడ్డున పడడానికి చేయాల్సిందంతా చేసి, ఇప్పుడు కరోనా మహమ్మారి వల్ల వారు తీవ్రంగా నష్టపోయారని, వారి బాధను మాటల్లో వర్ణించలేమని మన్‌కీబాత్ కార్యక్రమంలో ప్రధాని మోది మొసలికన్నీరు కారుస్తున్నారు. ప్రస్తుతం దేశవ్యాప్తంగా రోజు రోజుకు వైరస్ తీవ్రంగా ప్రబలుతుంటే దేశవ్యాప్తంగా లాక్‌డౌన్ ఎత్తేసి పాలకులు ప్రజలను వారి చావుకు వాళ్లను వదిలేశారు.

విద్య, వైద్యం, ఉపాధి ప్రభుత్వ రంగంలో ఉండాల్సిన అవసరాన్ని ప్రకృతి వైపరీత్యాలు, కరోనా వంటి మహమ్మారులు నొక్కి చెపుతున్నాయి. ప్రజల జీవన ప్రమాణాల మెరుగుదలకు కీలకమైన విద్య, వైద్య, ఉపాధి రంగాలను ప్రభుత్వాలు ప్రైవేట్ సంస్థలకు అప్పగించి, కొనగల వారికి మాత్రమే పరిమితం చేసి, సామాన్య ప్రజల జీవితాలను గాలికొదిలేసింది. కరోనా సందర్భంలో ప్రభుత్వ ఆసుపత్రుల్లో రోగులకు, వైద్య సిబ్బందికి వసతులు లేక తీవ్ర ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. ప్రభుత్వం చెబుతున్న దానికి ప్రభుత్వ ఆసుపత్రుల్లో ఉన్న సౌకర్యాలకు చాలా వ్యత్యాసం ఉంది. ఆస్పత్రుల్లో రోగులకు చికిత్స చేయాల్సిన వైద్య సిబ్బంది వైరస్ నుంచి రక్షించుకునే పరికరాలు లేక వాటికోసం రోడ్లపై ధర్నాలు చేస్తున్న అధ్వాన్న పరిస్థితిని చూశాం. ప్రభుత్వ రంగంలో వైద్యాన్ని అందించడంలో పాలకులు పూర్తిగా విఫలమయ్యారు. రోగులకు వైద్యం చేయడానికి సరిపడా వైద్య సిబ్బంది లేక సమయానికి వైద్యం అందక రోగులు మరణించడంతో పేషెంట్ బంధువులు వైద్య సిబ్బంది నిర్లక్ష్యం వల్లే రోగి చనిపోయాడని వారిపై దాడులు చేస్తున్నారు. సమస్య ఒకచోట ఉంటే మరోదగ్గర పరిష్కారాలు వెతికే పరిస్థితికి పాలకులు ప్రజలను నెట్టివేశారు. లాభాల కోసమే పుట్టుకొచ్చిన ప్రైవేట్ విద్యాలయాలను, ఆసుపత్రులను జాతీయం చేసి ప్రభుత్వాలే అర్థవంతంగా నిర్వహించాలి. అప్పుడు మాత్రమే పేద ప్రజలకు విద్య, వైద్యం ఉచితంగా అంది దేశ ప్రజలు ఆరోగ్యంగా ఉండడానికి తోడ్పడుతుంది. ఇటువంటి మహమ్మారులను మరింత సమర్థవంతంగా ఎదుర్కోవడానికి తోడ్పడుతుంది.

లాభాల్లో నడుస్తున్న ప్రభుత్వ రంగ సంస్థలను కూడా ప్రైవేట్ రంగానికి అప్పగించి పాలకులు చేతులు దులుపుకున్నారు. ప్రైవేట్ సంస్థలు లాభాలే ధ్యేయంగా తమ ఇష్టారీతిన కార్మికుల శ్రమను దోచుకుంటున్నాయి. కరోనా కారణంగానే ఆర్థిక వ్యవస్థ చితికిపోయిందని, దాన్ని నిలబెట్టడానికి అని చెబుతూ కార్పొరేట్ సంస్థల ప్రయోజనాల కోసం 20 లక్షల కోట్ల ప్యాకేజీని ప్రకటించింది. అంతేకాకుండా కార్మికులు పోరాడి సాధించుకున్న 8 గంటల పనిదినాన్ని ఇప్పుడు 12 గంటలకు పెంచింది. ఇది మూడు సంవత్సరాల వరకు ఉంటుందని దీనికోసం కార్మిక చట్టాల్లో సవరణలు చేశారు. వైఫల్యాలను కప్పిపుచ్చుకోవడానికి ప్రభుత్వం ప్రజలను భావోద్వేగాలతో రెచ్చగొడుతోంది. వీటిని ఎత్తి చూపుతూ మేధావులు ప్రజల పక్షాన మాట్లాడితే దేశద్రోహులని చెప్పి నిర్బంధాలకు గురిచేస్తున్నారు. ఇదీ నేడు సాధారణ ప్రజల పట్ల పాలకులు వ్యవహరిస్తున్న తీరు.

పాలకులు సాధించగలమన్న రెండంకెల అభివృద్ధి పేకమేడలా కూలిపోయింది. పాలకులు చెపుతున్న అభివృద్ధి నమూనా అంచుల్లో కూడా ఈ దేశ ప్రజలు లేరనే విషయం ఈ సందర్భంగా మరోసారి బహిర్గతమైంది. ఈ ఆర్థిక అసమానతల వల్లే పట్టణాలు విస్తరించి కరోనా లాంటి వైరస్‌లు విస్తరించడానికి కారణమవుతోంది. వలస కూలీలు, అసంఘటిత కార్మికుల జీవితాలు ఊహకందనంత అగాధంలోకి వెళ్లిపోయాయి. గతంలో ఉన్న ఆర్థిక ఇబ్బందులకు తోడు ఇప్పుడు ఏర్పడిన పెను ఆర్థిక ప్రమాదం నుంచి ఎప్పుడు బయటపడుతామో తెలియని పరిస్థితికి నెట్టేశారు. ఈ సంక్షోభకాలంలో ఎంత మంది ఆకలి చావులకు గురవుతారో తెలియని పరిస్థితి. ఇప్పటికైనా ప్రస్తుత పరిస్థితిని, రాబోయే అగాధాన్ని ఊహించి పాలకులు తగిన చర్యలు తీసుకోకుంటే వైరస్ బారినపడి చనిపోయే వారికన్న కూడా ఆకలితో చనిపోయే సంఖ్య ఎక్కువగా ఉండే ప్రమాదం పొంచి ఉంది. ప్రపంచాన్ని చుట్టుముట్టిన కరోనా వైరస్ ఈ సమాజం మౌలికంగా మారాల్సిన అవసరాన్ని హెచ్చరిస్తోంది.

అభివృద్ధి పేరుతో పెట్టుబడి విస్తరించే క్రమంలో విచ్చలవిడిగా ప్రకృతి విధ్వంసం కొనసాగుతోంది. ఈ విధ్వంసాన్ని అభివృద్ధిగా భ్రమింప చేస్తున్న పాలకులు, కార్పొరేట్ సంస్థలు ప్రజల్ని నమ్మించే ప్రయత్నం చేస్తున్నాయి. ఈ విధ్వంసం మొత్తం మానవాళికే ప్రమాదకరమని, దీన్ని ఆపాలని ప్రజల పక్షాన ప్రశ్నిస్తున్న పర్యావరణ వేత్తలను, మేధావులను, ఆదివాసులను అణచివేతకు గురిచేస్తున్నారు. వేల మందిని జైళ్లలో నిర్బంధించి కార్పొరేట్‌లు ప్రకృతి వనరులను కొల్లగొట్టడానికి సాయుధ పహారాతో సహకరిస్తున్నారు. ప్రకృతి వనరులను కొల్లగొట్టి విలాసవంతమైన జీవితాలు గడుపుతున్న ఒక వర్గం కరోనా లాంటి మహమ్మారులు తమ వరకు రావనుకున్నారు. ఇప్పుడు కరోనా ఆ ఆలోచనను కొంతవరకు చెరిపేసింది. ఇకముందు ప్రకృతి విధ్వంసం వల్ల రాబోయే దుష్పరిణామాలను ప్రపంచం చూడనుంది. కరోనాను మించిన విలయం రాబోతుందని ఐక్యరాజ్య సమితి హెచ్చరించింది. కరోనా వైరస్ విజృంభణ ఇదే విధంగా కొనసాగితే రానున్న మూడు నెలల్లో ప్రపంచవ్యాప్తంగా ఆకలి చావులు పెరిగిపోతాయని వరల్డ్ ఫుడ్ ప్రోగ్రామ్ చీఫ్ డేవిడ్ బిస్లే హెచ్చరించారు. తీవ్ర ఆర్థిక సంక్షోభంలో చిక్కుకున్న ప్రస్తుత సమయంలో ప్రపంచం ఆహార సంక్షోభం దిశగా పయనిస్తోందని అన్నారు. పరిస్థితి ఇదే విధంగా కొనసాగితే రోజుకు 3 లక్షల ఆకలి చావులు సంభవించే అవకాశముందని ఆయన అంచనా వేశారు. ఈ లెక్కన మొత్తం 3 కోట్ల మంది వరకూ చనిపోవచ్చున్నారు. ఈ సందర్భంలో మెజారిటీ ప్రజలు జీవన్మరణ సమస్యను ఎదుర్కొంటుంటే అంబానీ లాంటి వారి ఆస్తులు ఊహకందని విధంగా పెరుగుతున్నాయి. ఇదే ఈ దేశంలోని పిడికెడు మంది 'అభివృద్ధి' చెందిన మరో భారతదేశం.

దేశంలో అట్టడుగు ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యల పరిష్కారం కోసం అభివృద్ధి పేరుతో పాలకులు అమలుచేస్తున్న సంస్కరణలు ప్రజల మౌలిక సమస్యలను పరిష్కరించడంలేదు. దీంతో ప్రజలు ఎక్కడికక్కడ ఆందోళనలకు దిగుతున్నారు. వీరి దృష్టి మళ్లించడం కోసం పాలకులు ప్రజల మధ్య కుల, మతాల పేరుతో భావోద్వేగాలను రెచ్చగొడుతున్నారు. దేశ సరిహద్దు భద్రత వివాదం రేపుతున్నారు. ఇంత ప్రయత్నం చేసినా పాలకుల మంచుతెరలను తొలగిస్తూ వలస కూలీలు రోడ్లమీదకొచ్చి దేశ ప్రజలకు మరో భారతదేశాన్ని చూపిస్తున్నారు. కరోనాను

# కొవిడ్‌కు ముందూ తర్వాతా ఆర్థిక సంక్షోభం

*భారత ఆర్థిక వ్యవస్థలో అంతకు ముందు నుంచే సాగుతున్న సంక్షోభం మీద పెద్ద నోట్ల రద్దు, జిఎస్‌టి అనే వైరస్‌ల తర్వాత కరోనా వైరస్ ఏ ప్రభావం వేసిందో వివరిస్తున్నారు* **డి. నరసింహారెడ్డి**

కొవిడ్ ప్రవేశించిన తర్వాత ఆత్మనిర్భర్ భారత్ అభియాన్ రూపంలో మోడీ ప్రభుత్వ స్పందన స్వభావం గురించీ, ఆర్థిక కార్యకలాపాలకు ఉద్దీపన కలిగించడంలో దాని ప్రభావం గురించీ పరీక్షించబోయే ముందు, తక్షణ సందర్భంలో భారత దేశం ఎదుర్కొంటున్న ఆర్థిక సంక్షోభ స్వభావం గురించి నిశితంగా పరిశీలించడం అవసరం. స్పష్టత కోసం ఆర్థిక సంక్షోభం అనేదాన్ని సన్నిహిత సంబంధం ఉన్న రెండు కోణాలలో విభజించి చూడాలి. మొదటిది వృద్ధి సంక్షోభం. అంటే స్థూల జాతీయోత్పత్తిలో విపరీతమైన పతనం, దాదాపుగా ప్రతికూల, రుణాత్మక వృద్ధి. రెండవది, ఉద్యోగ, శ్రమ రంగాలలో సంక్షోభం. అంటే కేవలం ఉద్యోగాలు తరిగిపోవడం మాత్రమే కాక, అసంఘటిత రంగ కార్మికుల, ప్రత్యేకంగా వలస శ్రామికుల దారిద్ర్యం, వేదన కొట్టవచ్చినట్టుగా కనబడడం. ఈ సంక్షోభానికి తక్షణ కారణం కొవిడ్ -19 వల్ల జరిగిన లాక్‌డౌన్ అనే మాట నిజమే. కాని కొవిడ్-19 కన్న ముందు నుంచే ఉన్న లోతైన కారణాలున్నాయి. ఆ కారణాలకు అంతకు ముందరి విధానాలూ, మోడీ పాలనా కాలపు విధానాలు బాధ్యత వహించాలి. ఈ విధానాలన్నీ కూడ భారత ఆర్థిక వ్యవస్థ మీద వైరస్ లాంటి ప్రభావాన్ని వేశాయి. అవి పేరుకుపోయాయి. మొదటి వైరస్ నయా ఉదారవాద విధానాలనీ, రెండో వైరస్ పెద్ద నోట్ల రద్దు, జి ఎస్ టి వంటి అనాలోచిన విధానాల రూపంలో వచ్చిందనీ, కొవిడ్ 19 లాక్‌డౌన్ మూడో వైరస్ అనీ నేను భావిస్తాను. ఈ మూడు వైరస్ లూ ఆర్థిక వ్యవస్థ మీద ఎటువంటి ప్రభావం వేశాయో అవి వచ్చిన క్రమంలోనే చూద్దాం.

**నయా ఉదారవాద వైరస్ ప్రభావం**

వలస శ్రామికులనూ, అసంఘటిత రంగ కార్మికులనూ మనం ఒకే మొత్తంగా పరిగణిద్దాం. ప్రణాళికా విధానం ప్రారంభమైన 1950ల తొలిదశ నుంచీ 1970ల వరకూ కూడ భారత ఆర్థిక వ్యవస్థ పెరుగుదలతో, శ్రమ, ఉద్యోగ రంగాలలో వచ్చే వ్యవస్థాత్మక మార్పులతో, వ్యవసాయం నుంచి పరిశ్రమ వైపు ప్రగతిశీల బదిలీ జరుగుతుందని, దానితోపాటే, ఉద్యోగాలు క్రమక్రమంగా అసంఘటిత రంగం నుంచి సంఘటిత రంగ స్థాయికి మారుతాయనీ ఒక అభిప్రాయం ఉండేది. ఉద్యోగాలు అసంఘటిత స్థితి నుంచి సంఘటిత స్థితికి మారుతాయంటే అర్థం నిరుద్యోగ పరిహారంతో సహా ఉద్యోగ భద్రత ఉంటుందనీ, పెన్షన్, ఆరోగ్య సౌకర్యాలు వంటి విస్తృతమైన సామాజిక భద్రత ఉంటుందనీ అర్థం. కాని 1980లు వచ్చేటప్పటికి ఉద్యోగాలలో వ్యవస్థాత్మక మార్పులు

---

కట్టడిచేయడంలో విఫలమైన అమెరికా చైనా పై మండిపడుతుంటే, భారత పాలకులు ఢిల్లీలో ముస్లీంలు ప్రార్థన మందిరంలో సమావేశం కావడం వల్లనే కరోనా వ్యాపించిందని ఆ సమూహాన్ని మొత్తం బదనాం చేస్తున్నారు. అంతేకాకుండా ఆ సమావేశానికి వెళ్లి వచ్చిన వారిని కాల్చిచంపాలనే దాక వెళ్లాయి వీరి ప్రకటనలు. హిందూ మత ఉన్మాదులు ముస్లీంలు వైరస్‌ను వ్యాప్తి చేయడం కోసమే సమావేశాన్ని ఏర్పాటుచేశారనే ఆరోపణలు చేస్తున్నారు. సిఏఎను వ్యతిరేకించారన్న అక్కసుతో కరోనా కాలంలో కూడా ముస్లీంలను అరెస్టులు చేస్తున్నారు.

సొంత ఊళ్లకు వెళుతున్న వలస కార్మికులను దారి పొడవున పోలీసుల అడ్డగింతలు, లాఠీ దెబ్బలు, రసాయనాల పిచికారి చేసి, హీనంగా ప్రవర్తించిన పోలీసులనే సకల సమస్యలకు పరిష్కారంగా ఎంచు కుంటున్నారు. పాలకులకు వాళ్లు మనుషులుగా కనబడలేదు. ఎందుకంటే వీళ్లు మనుషులైతే కదా వాళ్లు మనుషులుగా కనబడడానికి. కాని వారంతా ఈ దేశ పునాది రాళ్లు, కొద్ది మంది గడుపుతున్న విలాసవంతమైన భవనాలు నిర్మించింది వాళ్లే. సకల ఉత్పత్తులకు కారకులు వాళ్లే అలాంటి వారి పట్ల ఈ దేశ పాలకులు ఎంత అమానవీయంగా ప్రవర్తించారో వాళ్లు బతికినంత కాలం వాళ్ల మస్తిష్కాల నుంచి ఈ అనుభవాన్ని చెరిపేస్తారని కలలో కూడా ఊహించలేము.

రెక్కాడితే కాని డొక్కాడని ప్రజలు లాక్‌డౌన్ కారణంగా మొత్తంగా రెక్కాడని పరిస్థితిలోకి నెట్టేయబడ్డారు. వారంతా ఇప్పుడు గ్రామాలకు చేరుకున్నారు. భూమి, వనరులు కొద్ది మంది ఆధిపత్య వర్గాల చేతుల్లో ఉండడం, దీనికి తోడు వ్యవసాయ రంగంలోకి ప్రవేశించిన యాంత్రీకరణ కారణంగా తోసివేయబడ్డ వారే వలస కూలీలు. వీరినే మరో మాటలో మిగులు మనుషులు అంటున్నాము. ఇప్పుడు ఏ పనులు లేక దిక్కుతోచని పరిస్థితిలోకి నెట్టివేయబడ్డారు. దీంతో కరోనా వైరస్ ఆకలికంటే ప్రమాదకరమైంది కాదని వారు మళ్లీ పట్టణాలకు తిరుగు పయణమయ్యారు. ఇదీ నేడు భారత దేశంలోని అట్టడుగు వర్గాల ప్రజల దీన స్థితి. ప్రజలకు నిలువనీడ లేకుండా చేసి వారిని అప్రకటిత బానిసల్ని చేసిన పరిస్థితి దేశ వ్యాప్తంగా కొనసాగుతోంది. లాక్‌డౌన్ ప్రకటించడంతో దిక్కుతోచక సొంత ఊళ్లకు వెళ్లే దారిలో చనిపోయిన వాళ్లెందరో, ఇప్పుడు తిరిగి వస్తే కరోనా బారిన పడి చనిపోయే వారెందరో, ఎటుపోయినా సామాన్యులకు చావు తప్పని స్థితి ఈ దేశంలో నెలకొని ఉంది. ఒక్కోదగ్గర ఒక్కో రకంగా మరణిస్తున్నారు. ఒక దగ్గర వ్యాధులు వెంటాడితే, మరో దగ్గర ఆకలి, ఇంకో దగ్గర అత్యాచార, కుల, మత వైషమ్యాల పేరుతో వేటాడబడుతున్నారు. అంతటా అసహజ అర్ధాంతర మరణాలే. ఈ అసహజ అర్ధాంతర మరణాలు లేని సమాజం నిర్మాణమయ్యేంత వరకు అట్టడుగు ప్రజల బతుక్కు భరోసా లేదు.

*(రచయిత వీక్షణం సహాయ సంపాదకులు)* వీ

ఏమంత ఎక్కువ రాలేదనీ, వ్యవసాయేతర రంగాలలో కూడ అసంఘటిత ఉద్యోగాలే పెరిగాయనీ స్పష్టమైపోయింది. 1990 దశకం వచ్చేనాటికి భారతదేశం నయా ఉదారవాద పాలనలోకి మారిపోయి ఎల్ పి జి మార్గం చేపట్టింది. కాని ఈ నయా ఉదారవాద మోజు వల్ల ఉద్యోగ కల్పనతో కూడిన వృద్ధి గాని, మెరుగైన పంపిణీతో కూడిన వృద్ధి గాని జరగలేదు సరిగదా, వృద్ధి, వృద్ధి మాత్రమే అభివృద్ధికి ఏకైక సూచికగా మిగిలింది. అలా జరిగిన వృద్ధి ఫలితాలు శ్రామికవర్గానికి జారిపడతాయనే నమూనా అది. నయా ఉదారవాదం కింద వృద్ధి రేటు పెరుగుతూ వచ్చింది గాని అది ఉద్యోగ రహిత వృద్ధిగా, చివరికి సంఘటిత రంగంలోకూడ అసంఘటిత, భద్రతారహిత ఉద్యోగాలు పెరగడంగా మారింది. ధనవంతులకూ పేదలకూ మధ్య మాత్రమే కాదు, ప్రాంతాల మధ్య, పట్టణ ప్రాంతాలకూ గ్రామీణ ప్రాంతాలకూ మధ్య కూడ అసమానతలు పెరుగుతూ వచ్చాయి. వ్యవసాయ రంగంలో, గ్రామీణ ప్రాంతాలలో కూడ ఉద్యోగకల్పన దిగజారుడు ధోరణిని చూపడం మొదలుపెట్టింది. ఏమైనా ఉద్యోగాలు పెరిగాయంటే అవి ఎక్కువగా పట్టణ కేంద్రాలలో పెరిగాయి. ఆ పట్టణ ఉద్యోగ పెరుగుదల కూడ వలస శ్రామికుల మీద ఆధారపడి అసంఘటిత రంగంలో జరిగింది.

ఈ సంక్షోభం పెద్ద ఎత్తున ఉన్న చిన్న, సన్నకారు రైతులతో, వ్యవసాయ శ్రామికులతో సహా అసంఘటిత, భద్రతారహిత శ్రామికుల రూపంలో ఉంది. వారికి ఉద్యోగం, పని దొరికినప్పటికీ వారు దారిద్ర్యం నుంచి బైట పడలేకపోయారు. వారిలో గణనీయమైన జనాభా 'పనిలో ఉన్న పేదలు' గా నమోదయ్యారు. ఇటువంటి పరిస్థితులలోనే భారత ప్రభుత్వం 2000ల మొదట్లో అసంఘటిత రంగ సంస్థల జాతీయ కమిషన్ (నేషనల్ కమిషన్ ఆన్ ఎంటర్‌ప్రైజెస్ ఇన్ ది అనార్గనైజ్డ్ సెక్టర్ – ఎన్‌సిఇయుఎస్) ను నియమించింది. ఆ కమిషన్ నివేదికలు దేశంలో పెరిగిపోతున్న అసంఘటిత రంగ ఉద్యోగాల సమస్య మీద కేంద్రీకరించాయి. అప్పటికి దేశంలోని శ్రామిక జనాభాలో 93 శాతం అసంఘటిత రంగంలోనే ఉన్నారు. వలస శ్రామికులతో సహా ఈ శ్రామిక జనాభా ఎటువంటి ఉద్యోగ భద్రత, సామాజిక భద్రత లేని ప్రమాదకర స్థితిలో, ఏ నష్టమైనా సంభవించగల స్థితిలో ఉన్నారని కమిషన్ గుర్తించింది. శ్రామికులందరికీ పని పరిస్థితులు మెరుగుపరచాలనీ, ఉద్యోగ భద్రత కల్పించాలనీ, జాతీయ కనీస వేతనాలు అమలు చేయాలనీ, సామాజిక భద్రత కల్పించాలనీ కమిషన్ సిఫారసు చేసింది. ఈ సిఫారసులను అమలు చేసి ఉంటే కచ్చితమైన కనీస భద్రత, నిరుద్యోగాన్ని పరిహరించే వేతనాలు శ్రామికులకు దక్కి ఉండేవి. కాని నయా ఉదారవాద విధానాలలో కూరుకుపోయిన అప్పటి యుపిఏ ప్రభుత్వం ద్రవ్య పరిమితుల సాకు చూపి ఈ సిఫారసులలో అత్యధికం అమలు చేయలేదు. తత్ఫలితంగా ఇవాళ మనం చూస్తున్న ప్రమాదకరమైన ఉద్యోగ పరిస్థితులు కొనసాగాయి. ఉన్నతస్థాయి వృద్ధి ఉన్నప్పటికీ నయా ఉదారవాద విధానాలలో అసంఘటిత రంగ శ్రామికులను పరిరక్షించడానికి, మొత్తంగా విద్య, ఆరోగ్య సౌకర్యాల నాణ్యత పెంచేందుకు అవసరమైన పెట్టుబడులు సేకరించడానికి సంపన్నుల మీద పన్నులు విధించే బదులు పన్ను రాయితీలు ఇవ్వడానికే నయా ఉదారవాద విధానాలు మొగ్గు చూపాయి. ఫలితంగా శ్రామికుల వలసలు నిరాటంకంగా పెరిగిపోయాయి. శ్రామిక ప్రజానీకపు స్థితిగతులు నానాటికీ దిగజారాయి. అసమానతలు పెరిగిపోవడం కొనసాగింది. 2014లో మోడీ అధికారానికి వచ్చే సమయానికి, దొరుకుతున్న సమాచారం ప్రకారం, స్థూల జాతీయోత్పత్తి ప్రతి రూపాయిలో 55 పైసలు కేవలం పది శాతంగా ఉన్న సంపన్న గృహాలకు చేరుతుండగా, మధ్యతరగతిగా ఉన్న 40 శాతం జనాభాకు 30 పైసలు, అట్టడుగున ఉన్న 50 శాతం జనాభాకు కేవలం 15 పైసలు అందుతున్నాయి.

**రెండో వైరస్**

ఇటువంటి రక్షణ లేని శ్రమ, పెరుగుతున్న అసమానతల వాతావరణంలోకి రెండో వైరస్ ప్రవేశించింది. ఆ వైరస్ మోడీ ప్రవేశపెట్టిన అనాలోచితమైన జనాకర్షక ఆకస్మిక విధాన చర్యలు. వాటిలో మొదటిది ఐదు వందల రూపాయల, వెయ్యి రూపాయల నోట్లను రద్దు చేయడం. అప్పటికి చలామణీలో ఉన్న మొత్తం ద్రవ్యంలో అవి 86 శాతం. డబ్బుకూ ఆర్థిక వ్యవహారాలకూ సంబంధించిన సంస్థలైన రిజర్వ్ బ్యాంక్ ఆఫ్ ఇండియా, ఆర్థిక మంత్రిత్వ శాఖలతో ఈ ప్రక్రియ ఎలా జరపాలనే సంప్రదింపులేమీ లేకుండానే ఈ చర్య తీసుకున్నారనేది సుస్పష్టమే. ఎటువంటి పర్యవసానాలుండవచ్చుననే అంశంపై ఎటువంటి విశ్లేషణ జరగలేదు. అమలు ప్రక్రియకు పథకం రచించే ప్రయత్నమేమీ జరగలేదు. సాధారణ ప్రజానీకానికి ఆ చర్య కలిగించిన ఇబ్బందులు, నల్ల డబ్బును బైటికి లాగడంలో ఆ చర్య వైఫల్యం ఇటీవలి భారత ఆర్థిక చరిత్రలో అందరికీ తెలిసిన చీకటి అధ్యాయం. కాని వ్యాపారాలకు, ప్రత్యేకించి సూక్ష్మ, చిన్నతరహా వ్యాపారాలకు, అది కలిగించిన విఘాతం ఆ తర్వాత కూడ కొనసాగింది. ఎంత విస్తృతమైన సంఖ్యలో వ్యాపార సంస్థలు మూతపడ్డాయో, ఎన్ని ఉద్యోగాలు కోల్పోయామో పెద్ద ఎత్తున నమోదైన వాస్తవాలే. మోడీ విధాన వైరస్ లలో రెండవది సంక్లిష్టమైన వస్తు, సేవల పన్ను వ్యవస్థను అనాలోచితంగా రుద్దడం. లక్షలాది చిన్న, సూక్ష్మ వ్యాపారాల మీద రుద్దిన ఈ చర్యకు ఏ ప్రణాళికా లేదు, క్రమబద్ధమైన అమలూ లేదు. ఏ విధమైన తగిన శిక్షణ, సంసిద్ధత లేకుండా కొత్త వ్యవస్థను రుద్దినందువల్ల ఆ వ్యాపారాలు ఈ కొత్త వ్యవస్థ పద్ధతులను గ్రహించే సామర్థ్యం లేక కుప్పకూలిపోయాయి. అంతేకాదు, ఈ జిఎస్‌టి కల్పించిన విఘాతం, అంతకుముందు నుంచే కొనసాగుతున్న పెద్ద నోట్ల రద్దు దుష్పరిణామాలతో కలిసి మరింత పెద్ద ప్రతికూల ప్రభావానికి దారితీసింది. భారత ఆర్థిక వ్యవస్థలోని మౌలికకోణాలన్నీ ఆ దుష్ప్రభావానికి లోనయ్యాయి. తత్ఫలితంగా, కొవిడ్–19 రావడానికి ముందే వృద్ధి జారుడుబల్ల మీద దిగజారుతూ ఉండింది.

పొదుపు పతనం 2011-12 లోని 35 శాతం నుంచి కిందికి జారుతూ, 2017–18 నాటికి కనిష్ట స్థాయికి, 30.5 శాతానికి చేరింది. మదుపులో మరింత పతనం కనబడింది. అది 2011-12లోని 40 శాతం నుంచి 2017–18లో 31 శాతానికి దిగజారింది. ప్రభుత్వ రంగ మదుపు కుంచించుకుపోయింది. ఉదాహరణకు కేంద్ర ప్రభుత్వ వ్యయం, స్థూల జాతీయోత్పత్తిలో నిష్పత్తిగా చూసినప్పుడు 2014–15లో 15 శాతం ఉన్నదల్లా, 2018–19కి 12 శాతానికి దిగజారింది. వ్యవసాయ రంగపు స్థూల జాతీయోత్పత్తితో పోలిస్తే వ్యవసాయంలో మదుపు నిష్పత్తి 2011-12లో 18 శాతం ఉన్నదల్లా 2016–17 నాటికి 13.8 శాతానికి దిగజారింది. అందులో కూడ 85 శాతం రైతులు తమ సొంతంగా పెట్టుకున్న పెట్టుబడే. చివరికి కార్పొరేట్ పెట్టుబడులు కూడ 2011-12లో స్థూల జాతీయోత్పత్తిలో 15 శాతంగా ఉన్నవల్లా 2016–17 నాటికి విపరీతంగా పతనమై 2.5 శాతానికి చేరాయి. తక్కువ వేతనాల వల్ల, పడిపోతున్న వేతనాల వల్ల డిమాండ్‌లో విపరీతమైన తరుగుదల

నమోదైంది. మహాత్మా గాంధీ జాతీయ గ్రామీణ ఉపాధి హామీ పథకం వంటి కార్యక్రమాలలో జాతీయ కనీస వేతనాన్ని నిపుణుల కమిటీ రు. 375కు పెంచమని సిఫారసు చేసినప్పటికీ రు. 178గా నిర్ధారించారు. 2019 తొలి రోజుల నాటికి గ్రామీణ వ్యవసయ వేతనాలలోనూ, వ్యవసాయేతర వేతనాలలోనూ గణనీయమైన పతనం కనబడింది. వ్యవసాయ ధరల మీద ఒత్తిడితో, వ్యవసాయానికీ పరిశ్రమకూ మధ్య వాణిజ్య సంబంధం వ్యవసాయానికి ప్రతికూలంగా మారింది. వ్యవసాయ రంగ ఆదాయాలు తగ్గిపోయాయి. ఇలా గ్రామీణ ప్రాంతాలలో తరిగిన వేతనాలు, ఆదాయాలు కూడ పట్టణ ప్రాంతాలకు వలసలు సాగడానికి ఒక కారణం. మొత్తం మీద వేతనాల ఆదాయం తక్కువగా ఉండిపోయింది. శ్రామికులలో దాదాపు 81 శాతం మంది నెలకు రు. 15,000 కన్న తక్కువ సంపాదనతో ఉండిపోయారు. 2017-18లో లేబర్ బ్యూరో జరిపిన కుటుంబ సర్వే ప్రకారం, క్రమబద్ధమైన శ్రామికుల సగటు నెలసరి ఆదాయం రు. 10000గా, స్వయం ఉపాధి శ్రామికుల ఆదాయం రు. 8,000 గా, రోజుకూలీల వేతనం రు. 5,000 గా ఉండింది.

ఎన్నో సంవత్సరాలుగా లాభాలు పెరుగుతున్నప్పటికీ వేతనాల వాటాను తక్కువగా ఉంచుతున్నవి నయా ఉదారవాద విధానాలే. వార్షిక పారిశ్రామిక సర్వే ప్రకారం, సంఘటిత పారిశ్రామిక రంగంలో ఉత్పాదకత పెరుగుతూ ఉన్నప్పటికీ, వేతనాల వాటా 1991లో 25 శాతం ఉన్నదల్లా, 2014-15 నాటికి 15 శాతానికి పడిపోయింది. మరొక వంక లాభాల వాటా 18 శాతం నుంచి 50 శాతానికి పెరిగింది. మొత్తంగా ఆర్థిక వ్యవస్థలో హెచ్చు వృద్ధి నమోదైనప్పటికీ, గ్రామీణ, పట్టణ రంగాలు రెంటిలోనూ 2014-15 కూ 2017-18కీ మధ్య నెలసరి వాస్తవ వినియోగ వ్యయం తగ్గిపోతూ వచ్చింది. మోడీ అమలు చేసిన ఆకస్మిక విధానాలు సూక్ష్మ, చిన్న, మధ్యతరహా వ్యాపార సంస్థల మీద గొడ్డలివేటు వేసినందువల్ల, సంఘటిత రంగ పరిశ్రమల డిమాండ్ ను కూడ కుంచించుకుపోయి మొత్తంగా ఆర్థిక వ్యవస్థలో డిమాండు కుంచించుకుపోయింది. అలా, భారతదేశాన్ని కొవిడ్-19 ఢీకొనే సమయానికి, భారత ఆర్థిక వ్యవస్థ అప్పటికే దిగజారుడు పథంలో ఉంది. 2019-20 చివరి త్రైమాసికంలో (అంటే జనవరి - మార్చ్ 2020)లో శక్తి, విద్యుత్తు, ఉక్కు, సిమెంట్ వగైరా ఎనిమిది ప్రధాన కీలక రంగాలు రుణాత్మక వృద్ధి రేటును, మైనస్ 6.5 శాతం వృద్ధి రేటును చూపుతున్నాయి. ఈ చివరి త్రైమాసికంలో స్థూల జాతీయోత్పత్తి పెరుగుదల రేటు 3.1 శాతానికి పడిపోయింది. అందువల్ల మొత్తం వార్షిక వృద్ధి రేటు 4.2 శాతానికి పడిపోయింది. అంతకు ముందరి ఉద్యోగ రహిత వృద్ధికి దారి తీసిన నయా ఉదారవాద విధానాలు, మోడీ పాలనలో వాస్తవంగా ఉద్యోగ రహిత వృద్ధిగా మారాయి. 2011-12 కూ, 2017-18 కీ మధ్య మొత్తంగా నికర ఉద్యోగాల తరుగుదల పదహారు లక్షలుగా ఉంది. లాక్‌డౌన్ ప్రారంభమైన మార్చ్ 2020 చివరికి నిరుద్యోగ రేటు 8.7 శాతానికి పెరిగిపోయింది. మోడీ పాలనకు ప్రత్యేకమైన అంశమేమంటే, మౌలిక సాధన సంపత్తి మీద అదనపు ప్రభుత్వ వ్యయం, సూక్ష్మ, చిన్న, మధ్యతరహా వ్యాపార సంస్థలను పునరుద్ధరించడం ద్వారా ఉద్యోగ కల్పన వంటి చర్యల ద్వారా డిమాండ్ పెరుగుదల సాధించాలని అన్ని వైపుల నుంచీ సలహాలు వస్తుండగా, వాస్తవంగా అమలు లోకి తెచ్చిన విధానాలు సరఫరా పెంచేలా వడ్డీ రేట్ల తగ్గింపు, ప్రభుత్వ రంగ సంస్థల ప్రైవేటీకరణ వంటివి. కొవిడ్-19 వల్ల ఏర్పడిన ఆర్థిక సంక్షోభాన్ని పరిష్కరించడానికి కూడ సరిగ్గా ఇటువంటి సరఫరా పెంచే చర్యలు చేపట్టే ధోరణే వ్యక్తమయిందని ముందు ముందు చూస్తాం.

**భారత ఆర్థిక వ్యవస్థపై మూడో వైరస్ - కొవిడ్-19 ప్రభావం**

భారత ఆర్థిక వ్యవస్థలో సంక్షోభం గురించి చర్చిస్తున్నప్పుడు, కొవిడ్-19 ని మనం ఒక వరుసలో ప్రభావితం చేసిన మూడో వైరస్ గా పరిగణిస్తున్నాం. భూగోళమంతా చుట్టుముట్టి, కనీవినీ ఎరగని ప్రాణ నష్టాన్ని, మృత్యు భయాన్నీ కలిగించిన కరోనా వైరస్ ఈ రోజుల్లో అనూహ్యమైనది. అది కలిగించిన దిగ్భ్రాంతి ప్రపంచ వ్యాప్తంగా అన్ని ప్రభుత్వాలనూ వణికించింది. దాన్ని అదుపు చేసే మార్గాలేవీ ఇంతకు ముందు తెలిసినవి కావు. భయం పెరిగినకొద్దీ ఆంక్షల పద్ధతుల తీవ్రత పెరిగిపోయింది. ఎటువంటి ప్రణాళిక లేకుండా, ప్రజలను అందుకు సంసిద్ధం చేసే హెచ్చరిక ఏదీ లేకుండా, హఠాత్తుగా, దేశవ్యాప్తంగా ప్రకటించిన లాక్‌డౌన్ రూపంలో భారత దేశపు ప్రతిస్పందన బహుశా అత్యంత దారుణమైన చర్యలలో ఒకటి. అది ఆర్థిక వ్యవస్థ మీద వినాశకర ఫలితాలకు దారి తీసింది. పేద శ్రామికులకు, ప్రత్యేకించి వలస శ్రామికులకు అది చెప్పరాని బాధలకు కారణమయింది. పాక్షికంగా ప్రభావితమైన వ్యవసాయం వంటి అతి కొద్ది రంగాలను మినహాయిస్తే, దేశ ఆర్థిక కార్యకలాపాలలో దాదాపు 70 శాతం ఆక్రమించే పారిశ్రామిక, నిర్మాణ, గనుల, సేవా రంగాల కార్యకలాపాలలో అత్యధిక భాగం 67 రోజుల పాటు మూతపడ్డాయి.

మనం ఇంతకుముందే చూసినట్టు, కొవిడ్-19 కన్న ముందు తక్షణ గతంలో భారత ఆర్థిక వ్యవస్థ హఠాత్తుగా జరిగిన పెద్ద నోట్ల రద్దు, అనాలోచితంగా జరిగిన జిఎస్ టి అమలు వంటి తపుడు వైరస్ విధానాల వల్ల సంక్షోభంలో పడి, ఆర్థిక వృద్ధి చాల తక్కువ స్థాయికి జారిపోయి ఉంది. కొవిడ్-19 ప్రవేశించక ముందే ఆర్థిక పతన క్రమం ప్రారంభమై ఉంది గనుక ఆ సంక్షోభాన్ని లాక్‌డౌన్ తీవ్రతరం చేసింది. మార్చ్ 2020 చివరినుంచి ఇప్పటివరకు జరిగిన కాలంలో ఉత్పత్తి, ఉద్యోగ కల్పనలలో వచ్చిన మార్పుల మీద అధికారిక అంచనాలు లేవు గనుక సెంటర్ ఫర్ మానిటరింగ్ ఇండియన్ ఎకానమీ (సిఎంఐఇ) వంటి సంస్థల త్వరిత సర్వేల మీద, పౌర సమాజ సంస్థలు, రేటింగ్ ఏజెన్సీలు, పరిశోధనా సంస్థలు చేసిన అధ్యయనాల మీద ఆధారపడక తప్పదు. ఈ అంచనాలు, అధ్యయనాలు ఎక్కువలో ఎక్కువ ఏప్రిల్ 2020 చివరి వరకూ మాత్రమే జరిగాయి. అంటే మొత్తం 67 రోజుల లాక్‌డౌన్‌లో మొదటి 40 రోజుల వివరాలు మాత్రమే తెలుస్తున్నాయి. ఆర్థిక వ్యవస్థ పాక్షిక సడలింపు మేలో లాక్‌డౌన్ చివరి దశలో ప్రారంభమయింది గనుక, ఏ రంగమైనా దాని పూర్తి సామర్థ్యంతో పని చేసేలా పునరుద్ధరణ జరిగి ఉండడం అసాధ్యం. అలాగే పర్యాటక రంగం, విద్యారంగం వంటి ఎన్నో కార్యకలాపాలు ఇంకా పూర్తి మూసివేతలోనే ఉన్నాయి. అన్ని రంగాల లోనూ ఉత్పత్తి, ఉద్యోగాలు పతనమయ్యాయనేది నిశ్చితమే అయినప్పటికీ, వాటిలో ఏవి ఎంతవరకు, ఎంత తొందరగా పునరుద్ధరణ జరుగుతాయనేది అనిశ్చితమే.

ఉదాహరణకు, ఆటోమొబైల్ పరిశ్రమలోని పరిస్థితి ఉదాహరణ పాయమైనది. ఆటోమొబైల్ పరిశ్రమలో ఉత్పత్తి 2020-21లో 50 శాతం కుంచించుకుపోతుందని భారత పారిశ్రామిక సమాఖ్య (కాన్ఫెడరేషన్ ఆఫ్ ఇండియన్ ఇండస్ట్రీ - సిఐఐ) అధ్యక్షుడు సూచించాడు.

మే 2020 నుంచి పరిశ్రమ పాక్షికంగా పనిచేయడం ప్రారంభించినప్పటికీ, సరఫరా గొలుసు పునరుద్ధరణలో సమస్యలు ఉన్నాయని ఆయన అన్నాడు. ఆటోమొబైల్ పరిశ్రమకు అవసరమైన చిన్న యంత్ర పరికరాల సరఫరాదారులలో కొందరు తమ సంస్థలు మూసివేశారు. వారి కార్మికులు వెళ్లిపోయారు. అద్దెలు, విద్యుత్ ఛార్జీలు, వేతనాలు చెల్లించలేక ఆ యూనిట్లు మూతబడ్డాయి. డిమాండ్ పునరుద్ధరణ జరగడం ఒక ఎత్తయితే, ఇటువంటి చిన్న, సూక్ష్మ యూనిట్ల పునరుద్ధరణ జరగడం మరొక ఎత్తు. కొన్ని కీలక పరిశ్రమల్లో ఈ పతనం ఏ స్థాయిలో ఉందో సిఎంఐఇ అంచనా వేసింది.

విద్యుదుత్పత్తి 30 శాతం పడిపోయింది. ఓడరేవుల్లో సరుకుల లావాదేవీలు 51 శాతం పడిపోయాయి. చమురు డిమాండ్ 70 శాతం పడిపోయింది. రైల్వే సరుకుల రవాణా 36 శాతం పడిపోయింది. విమానయానంతో సహా ప్రయాణ, పర్యాటక రంగంలో తరుగుదల వల్ల నష్టాలు 400 కోట్ల డాలర్లు ఉండవచ్చు. ఈ నష్టాలన్నీ కూడ ఇంకా పెరుగుతున్నాయి. అఖిల భారత మోటర్ ట్రాన్స్ పోర్ట్ కాంగ్రెస్ (ఎఐఎంటిసి) అంచనా ప్రకారం దేశవ్యాప్తంగా రవాణాలో ఉండే ఒక కోటి ట్రక్కుల్లో 10 శాతం మాత్రమే తిరుగుతున్నాయి. ట్రక్కులను నిలిపి ఉంచడం వల్ల రోజుకు ట్రక్కుకు రు. 2200 చొప్పున నష్టం లెక్క వేస్తే ఈ రంగంలో మొత్తం నష్టాలు రు. 35,000 కోట్ల పైచిలుకే. లాక్‌డౌన్ ఎత్తివేసిన తర్వాత కూడ సాధారణ స్థితికి చేరువకు రావాలన్నా కనీసం రెండు మూడు నెలలు పడుతుంది. అది కూడ ఇతర రంగాల పరిస్థితి మీద ఆధారపడుతుంది. జాతీయ రియల్ ఎస్టేట్ డెవలప్ మెంట్ కౌన్సిల్ ఆ రంగానికి జరిగిన నష్టం ఒక లక్ష కోట్ల రూపాయలని ప్రకటించింది. కన్ఫెడరేషన్ ఆఫ్ ఆల్ ఇండియా ట్రేడర్స్ ఏడు కోట్ల చిన్న, మధ్య తరహా, పెద్ద వ్యాపారస్తులు ఉన్న రిటెయిల్ రంగంలో 3000 కోట్ల డాలర్ల నష్టం వాటిల్లిందని ప్రకటించింది. సానుకూల ఫలితాన్ని చూపిన ఒకే ఒక్క రంగం వ్యవసాయ రంగం. అక్కడ 2020-21లో 3 శాతం వృద్ధి ఉండవచ్చునని అంచనా వేస్తున్నారు.

అందరిలోకీ ఘోరమైన నష్టాన్ని చవి చూస్తున్నది సూక్ష్మ, చిన్న, మధ్య తరహా వ్యాపార సంస్థలు. అవి మొత్తం ఆరు కోట్ల ముప్పై మూడు లక్షలు. వాటిలో 95 శాతం సంస్థలు పది మంది కంటె తక్కువ మంది శ్రామికులతో పనిచేస్తున్నాయి. మొత్తం తయారీరంగ ఉత్పత్తిలో 40 శాతం ఈ సంస్థల్లోనే తయారు అవుతున్నది. ఈ సంస్థలు దేశపు మొత్తం ఎగుమతుల్లో 45 శాతాన్ని, స్థూల జాతీయోత్పత్తిలో 33 శాతాన్ని ఆక్రమిస్తున్నాయి. ఈ సూక్ష్మ, చిన్న, మధ్య తరహా పరిశ్రమల్లో కొన్ని, ఉదాహరణకు 90 శాతం మానవ శ్రమ ఆధారితమైన తోలు పరిశ్రమ వంటివి, నలభై నాలుగు లక్షల ఇరవై వేల మందికి ఉపాధి కల్పిస్తున్నాయి. వారిలో అత్యధికులు బలహీన వర్గాల నుంచి వచ్చినవారు. అవి ప్రస్తుతం ఘోరంగా ప్రభావితమయ్యాయి. కౌన్సిల్ ఫర్ లెదర్ ఎక్స్ పోర్ట్స్ చెపుతున్న ప్రకారం, పాదరక్షలు, దుస్తులు వంటి తోలు ఉత్పత్తులలో అంతర్జాతీయంగా రెండో పెద్ద ఎగుమతిదారుగా ఉన్న దేశం అమెరికా నుంచీ, యూరప్ నుంచీ పెద్ద ఎత్తున ఆర్డర్లు రద్దయినందువల్ల, ఇప్పటికే జరిగిన రవాణాలకు చెల్లింపులు ఆలస్యమైనందువల్ల దెబ్బతిన్నాయి. చైనా, వియత్నాం లనుంచి పెద్ద ఎత్తున పూర్తి సామర్థ్యంతో పోటీ రావడం వల్ల, ఈ పరిశ్రమ ఏదైనా ఉద్దీపన పథకం కోసం ఎదురు చూస్తున్నది. ఎలక్ట్రానిక్స్ వంటి ఇతర మానవ శ్రమ ఆధారిత పరిశ్రమ కూడ ఎగుమతులు పెద్ద ఎత్తున పడిపోవడం వల్ల సంక్షోభంలో ఉంది. దుస్తుల పరిశ్రమ కూడ ఎగుమతుల ఆర్డర్లు దెబ్బతినడం వల్ల, చెల్లింపుల ఆలస్యం వల్ల ఇబ్బందుల్లో ఉన్నది. అలాగే వజ్రాలకు మెరుగు పెట్టే పరిశ్రమ ఎగుమతులు పడిపోవడంతో (ఉదాహరణకు 2020 ఫిబ్రవరిలో 79 శాతం తరుగుదల), ధరలు పడిపోవడంతో, చెల్లింపులలో ఆలస్యాలతో దారుణమైన పతనాన్ని చవి చూస్తున్నది. ఈ పరిశ్రమలన్నీ కూడ పునరుద్ధరణ సహాయం అందకపోతే ఏడాది లోపు సాధారణ స్థితికి వస్తాయని అనుకోవడం లేదు.

సారాంశంగా చెప్పాలంటే మొత్తంగా ఆర్థిక మాంద్యం తీవ్రతరమైన స్థితి కొవిడ్-19 వల్ల మరింత దిగజారనున్నది. 2020-21లో స్థూల జాతీయోత్పత్తి ఎంత రుణాత్మక వృద్ధి నమోదు చేస్తుందనే అంచనాలు వేరువేరుగా ఉన్నాయి. వర్తమాన సంవత్సరంలో వృద్ధి రేటు రుణాత్మకంగా ఉంటుందని రిజర్వ్ బ్యాంక్ ఆఫ్ ఇండియా మేలో ప్రకటించింది. ఆసియన్ డెవలప్ మెంట్ బ్యాంక్ 2020-21లో వృద్ధి రేటు 4 శాతం రుణాత్మకంగా ఉంటుందని అంచనా వేయగా, ఫిచ్, మూడీస్, ఎస్&పి వంటి రేటింగ్ ఏజెన్సీలు 4 నుంచి 5 శాతం రుణాత్మకంగా ఉంటుందని అంచనా వేశాయి.

కొవిడ్-19 వల్ల తీవ్రతరమైన ఆర్థిక పతనానికి నిజమైన మానవ కోణపు కథ చెప్పాలంటే, అది ఉద్యోగాలలో, ఆదాయాలలో, కనీస భద్రతతో జీవించడానికి అవసరమైన కొనుగోలు శక్తిలో ఎంతమేరకు కోతకు దారి తీసిందనేది చూడవలసి ఉంటుంది. సి ఎం ఐ ఇ అంచనాల ప్రకారం కొవిడ్-19 కన్న ముందు, 2020 జనవరిలో నిరుద్యోగం 7.16 శాతం ఉండింది. అది మార్చ్ నాటికి 8.7 శాతానికి పెరిగి, మే చివరి నాటికి 27 శాతానికి ఎగబాకింది. ఆ స్థాయి నిరుద్యోగాన్ని స్వతంత్ర భారత చరిత్రలో ఎప్పుడూ చూడలేదు. ఇక బీహార్, జార్ఖండ్ వంటి రాష్ట్రాలలో అది 47 శాతానికి కూడ చేరింది! నిరుద్యోగం గురించి ఈ విహంగావలోకనంతో పాటు, అసంఘటిత రంగ శ్రామికుల కడగండ్లు, ప్రత్యేకించి వలస శ్రామికుల సమస్యలు విశాల సమాజపు మనస్సాక్షి మీద లోతైన గాయం చేస్తూ బహిరంగంగా కనబడ్డాయి. ఈ వలస శ్రామికుల బాధల గాథలను చెప్పే ప్రయత్నం ఎంత చేసినా, అది సమగ్ర కథనాన్ని చెప్పజాలదు. దిగ్భ్రాంతికరమైన అంశమేమంటే, గత రెండు దశాబ్దాలుగా పని కోసం వలసలు వెళ్లడమనేది విపరీతంగా పెరిగినప్పటికీ, అలా వలస వెళుతున్న శ్రామికుల సంఖ్యను నమోదు చేయడానికి కూడ భారత ప్రభుత్వం ఎటువంటి ప్రయత్నమూ చేయలేదు. నయాఉదారవాద విధానాల కింద, వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధిని నిర్లక్ష్యం చేయడంతో, ప్రాంతీయ అసమానతలు పెరిగిపోవడంతో ఈ వలసలు పెరిగాయి. జనగణన, జాతీయ నమూనా సర్వే వంటి అందుబాటులో ఉన్న వనరులు స్పష్టమైన చిత్రాన్ని ఇవ్వడం లేదు. అందువల్ల చాలసార్లు ఈ రంగంలో పనిచేస్తున్న పరిశోధకుల అంచనాలనే తీసుకోవలసి వస్తుంది. ఆ అంచనాలు ఐదు కోట్ల నుంచి పది కోట్లవరకు ఉన్నాయి. ఇక పని పరిస్థితులు, వేతనాలు, ఉద్యోగంలోకి తీసుకునే ప్రక్రియ, పనిస్థలంలో వారి ఆశ్రయాలు వగైరాల కోసం క్షేత్ర స్థాయి పరిశోధనలే వనరు. ఈ వలస శ్రామికుల కడగండ్ల గురించి పాఠకుల ఊహకూ, అనుభవానికీ వదిలేసి, మోడీ ప్రభుత్వం చూపిన స్పందన, సహాయ కార్యక్రమాలు, ఉద్దీపన పథకాల గురించి పరీక్షించే ముందు ఒక పరిశీలన మాత్రం చెప్పవలసి ఉంది. చూడడానికి ఉద్దీపన పథకం జాబితా చాల పొడుగ్గా ఉంది గాని, ఇలా తమ పని నుంచి నిర్వాసితులైన, లాక్‌డౌన్ వల్ల ఆదాయాలు పోగొట్టుకున్న కోట్లాది వలస శ్రామికులకు

ప్రత్యక్ష ప్రయోజనం కలిగించే చర్య ఒక్కటి కూడ అందులో లేదు. ఉచిత ఆహారధాన్యాల బిచ్చం ప్రస్తావన ఉంది గాని, అది కూడ ప్రతి ఒక్కరికీ చేరేలా జాగ్రత్తలు ఏమీ లేవు.

వలస శ్రామికులకు ఆహార పదార్థాల రూపంలో ప్రభుత్వం అందించిన సహాయం (పట్టిక 1), లాక్‌డౌన్ వల్ల సంభవించిన వలస శ్రామికుల మరణాలు (పట్టిక 2) వంటి ఒకటి రెండు వాస్తవాలను వలస శ్రామికుల మహా మానవ సంక్షోభం గురించి ప్రచారంలో ఉన్న విషాద కథనాలకు కలుపుకోవాలి.

**టేబుల్ 1 – వలస కూలీలకు అందిన సహాయం (ఏప్రిల్ 20, 2020 వరకు)**

| సహాయం | స్వాన్* కలిసిన వలస కార్మికులు (శాతం %) |
|---|---|
| ప్రభుత్వం నుంచి రేషన్ అందనివారు | 81.6 |
| ఎవరి నుంచి వండిన ఆహారం అందనివారు | 68.2 |
| ఒక్క రోజు మించి రేషన్ లేనివారు | 49.9 |
| ఆహారం, డబ్బు లేకుండా ఎస్ఒఎస్ కాల్స్ చేసిన వారు | 46.3 |
| లాక్‌డౌన్ కాలంలో జీతాలు అందనివారు | 78.0 |

* స్వాన్ – స్టాండర్డ్ వర్కర్స్ యాక్షన్ నెట్‌వర్క్
మూలం: హెటెరొడాక్స్ ఎకనామిస్ట్స్ కలెక్టివ్

భారత ప్రభుత్వం 26 మార్చ్ 2020 న 'ప్రధాన మంత్రి గరీబ్ కల్యాణ్ యోజన' పేరుతో ప్రతి పేద కుటుంబానికీ ఉచిత రేషన్ పంపిణీ, రు. 1000 నగదు చెల్లింపు అందజేస్తామని ప్రకటించినప్పటికీ, ఏప్రిల్ నెల చివరి నాటికి కూడ వలస శ్రామికులకు పెద్దగా సహాయం అందలేదని పట్టిక 1 చూపుతున్నది. అందుకు కారణం, ఎక్కడా వారి గురించి సమాచారం లేకపోవడం, వారికి ఇతర రాష్ట్రాల్లో ఉన్న రేషన్

**టేబుల్ 2 – లాక్‌డౌన్ వల్ల సంభవించిన మరణాలు (మే 30, 2020 వరకు)**

| కారణం | మరణాల సంఖ్య |
|---|---|
| ఆకలి, ఆర్థిక ఇబ్బందులు | 132 |
| వైద్య సదుపాయం కొరత, నిరాకరణ | 59 |
| రోడ్డు, రైలు ప్రమాదాలు | 209 |
| శ్రామిక్ రైళ్లలో మరణాలు | 25 |
| కాలినడక వల్ల అలసి చనిపోయిన వలస కూలీలు | 46 |
| ఆత్మహత్యలు | 126 |
| మద్యం అందక | 50 |
| పోలీసు ఆకృత్యాల వల్ల | 12 |
| లాక్‌డౌన్‌కు సంబంధించిన నేరాలు | 17 |
| ఇతరాలు | 66 |
| **మొత్తం** | **742** |

మూలం: హెటెరొడాక్స్ ఎకనామిస్ట్స్ కలెక్టివ్

కార్డులను ఆమోదించకపోవడం. అలాగే, వలస శ్రామికుల్లో చాలమంది తమ స్వగ్రామాలకు వెళ్లడానికి ప్రయత్నించే క్రమంలో మృత్యువాత పడ్డారని పట్టిక 2 చూపుతున్నది. ఇది ఈ విషాదంలో మరింత దారుణం.

**మోడీ ప్రభుత్వ స్పందన – ఆర్థిక ఉద్దీపన – ఆత్మ నిర్భర్ భారత్ అభియాన్**

(ఇక్కడ ప్రభుత్వం ప్రకటించిన ప్యాకేజీ స్వభావం గురించీ, లక్షణాల గురించీ మాత్రమే చర్చిస్తున్నాను. దాని అవకాశాల గురించీ అమలు గురించీ ప్రత్యేకంగా చర్చించవలసి ఉంటుంది)

మోడీ విధాన వైరస్ అని మనం పిలుస్తున్న విధానపు పద్ధతి ఏమంటే, అది విధానాన్ని మొదట ప్రకటిస్తుంది. ఆ తర్వాత దాని పర్యవసానాల గురించీ, అమలు పద్ధతుల గురించీ ఆలోచిస్తుంది. కొవిడ్-19 విషయంలో అమలు చేసిన పద్ధతి – ఒకవేళ దాన్ని పద్ధతి అని పిలవదలచుకుంటే – కూడ అదే. మహా విపత్తు వ్యాప్తి విషయంలో ప్రత్యేకమైన చర్యలతో ప్రభుత్వం రంగంలోకి దిగవలసి ఉన్నదని స్పష్టమైన తర్వాత, మార్చ్ 24న కొద్ది గంటల ముందస్తు సూచనతో, ఆర్థిక వ్యవస్థలో నాలుగింట మూడు వంతుల భాగాన్ని పూర్తిగా మూసివేస్తూ సంపూర్ణ లాక్‌డౌన్ ప్రకటించారు. అది మార్చ్ 25 నుంచి 21 రోజులు అమలయింది. గరీబ్ కల్యాణ్ యోజన పేరుతో సహాయ పథకాన్ని ఆ మర్నాడు మార్చ్ 26న ప్రకటించారు. రు. ఒక లక్షా డెబ్బై వేల కోట్లరూపాయలతో ఈ పథకపు ఆర్థిక వ్యయ ప్రణాళికను ఆ తర్వాత ప్రకటించారు. కాని త్వరలోనే స్పష్టమైనదేమంటే ఈ ప్యాకేజిలో జాతీయ గ్రామీణ ఉపాధి హామీ పథకపు కనీస వేతనాలను రు. 182 నుంచి రు. 202 కు (రు. 20) పెంచుతూ తీసుకున్న నిర్ణయం, ప్రధాన్ మంత్రి కిసాన్ యోజన కింద రైతుల ఖాతాలకు రు. 2000 చెల్లించాలని తీసుకున్న నిర్ణయం కలిసి రు. 97,000 కోట్లు అవుతున్నాయని, ఈ రెంటినీ గతంలోనే 2020-21 బడ్జెట్ లోనే కేటాయించారని. అంటే కొత్తగా ప్రకటించిన ప్యాకేజిలో వాస్తవంగా ఇచ్చిన అదనపు నిధులు కేవలం రు. 73,000 కోట్లు మాత్రమే అన్నమాట. అది స్థూల జాతీయోత్పత్తిలో కేవలం 0.6 శాతం మాత్రమే. అంటే దానికదిగా ఎటువంటి ప్రేరణకూ దారితీసే ఉద్దీపన పథకం కాదు. అంతేకాదు, ఈ రు. 73,000 కోట్లలో కూడ ప్రావిడెంట్ ఫండ్ ఖాతాలలోకి చెల్లింపులను 12.5 శాతం నుంచి 10 శాతానికి తగ్గించడం ద్వారా, అంటే అంకెల గారడీ ద్వారా సాధించిన నిధులున్నాయి. రు. 15000 కన్న ఎక్కువ నెలసరి ఆదాయం ఉన్న ఉద్యోగుల పి ఎఫ్ తగ్గింపు వారికి అదనపు కొనుగోలు శక్తిని కల్పిస్తుందని అంకెల గారడీ మాత్రమే. ప్రావిడెంట్ ఫండ్ కు తక్కువ వాటా చెల్లించడం అంటే భవిష్యత్తు కోసం చేసే ఆదా తగ్గించడమే అని ప్రతి ఒక్కరికీ తెలుసు. మూడు నెలల కోసం ఐదు కిలోల ఆహారధాన్యాలు, ఒక కిలో పప్పుదినుసులు ఉచితంగా ఇవ్వడం వంటి ఇతర చర్యలు చాల అవసరమైనవే గాని అది అమలు చేయడంలో సమస్యలున్నాయి. ముఖ్యంగా పప్పుదినుసులు ఇవ్వడంలో సమస్యలున్నాయి. అలాగే వేరు వేరు ప్రాంతాల్లో చిక్కుబడిపోయిన వలసశ్రామికులకు ఈ ఉచిత రేషన్లు అందించడం ఎలా అన్నది సమస్యే. నిరుపేద శ్రామికుల వినియోగాన్ని మెరుగుపరచడంలో గాని, సూక్ష్మ, చిన్న, మధ్యతరహా వ్యాపార సంస్థలను పునరుద్ధరించడంలో గాని ఈ సహాయం సముద్రంలో కాకిరెట్టలా ఉండిందని త్వరలోనే తేటతెల్లమైంది.

వలస శ్రామికులకు ఆశ్రయం, ఆహారం, వెళ్లిపోదలచుకున్నవారికి రవాణా వంటి సౌకర్యాలు కల్పించడంలో బాధ్యత ఎవరిదని పేచీలు

**టేబుల్ 3 – మోడీ ప్రభుత్వ ఆర్థిక “ఉద్దీపన” ప్రతిస్పందన**
**(ఆత్మనిర్భర్ భారత్ అభియాన్ – ఎబిఎ)**

| ఆర్థిక ప్యాకేజి | | ప్రకటించిన మొత్తం | జిడిపిలో శాతం | వాస్తవ ఆర్థిక వ్యయం (మూలధనం) | జిడిపిలో శాతం |
|---|---|---|---|---|---|
| **I)** | **ఎబిఎ ప్రకటించక ముందు** | | | | |
| 1. | ప్రధానమంత్రి గరీబ్ కళ్యాణ్ యోజన (పిఎంజికెచ్‌వై) (మార్చ్ 26, 2020) | 1,92,000 | 1.8 | 73,000 | 0.6 |
| **II)** | **ఎబిఎ ప్రకటన తర్వాత** | | | | |
| 2. | మొదటి విడత (13 మే) (ఎంఎస్ఎంఇ, ఎన్‌బిఎఫ్‌సి, ఎంఎఫ్ఐ, ఇపిఎఫ్ కంట్రిబ్యూషన్, డిస్కమ్ లిక్విడిటీ, మొదలైనవి) | 5,94,000 | 2.97 | 25,000 | 0.13 |
| 3. | రెండో విడత (14 మే) (వలస కార్మికులకు ఉచిత ఆహార ధాన్యాలు, వీధి వ్యాపారులకు రుణాలు, రైతులకు అదనపు పని మూలధనం, కిసాన్ కార్డులు, మొదలైనవి) | 3,10,000 | 1.55 | 5,000 | 0.025 |
| 4. | మూడో విడత (15 మే) (వ్యవసాయం, పశుసంవర్ధక, మౌలిక సదుపాయాలు, మైక్రోఫుడ్ ఎంటర్ప్రైజెస్, మత్స్యకారులకు నిధులు మొదలైనవి) | 1,50,000 | 0.75 | 30,000 | 0.15 |
| 5. | నాలుగో విడత (16 మే) (వయబిలిటీ గ్యాప్ ఫండింగ్) | 8,100 | 0.04 | 8,000 | 0.04 |
| 6. | ఐదో విడత (17 మే) (ఎంజిఎన్ఆర్ఇజిఎస్‌కు అదనపు కేటాయింపు, ప్రభుత్వ రంగ విధానం, 3 నుండి 5 శాతం రాష్ట్ర జిఎస్‌డిపిలో లోటు పరిమితి) | 40,000 | 0.2 | 40,000 | 0.2 |
| **III)** | **ఆర్‌బిఐ లిక్విడిటీ ఇంజెక్షన్** (మార్చ్ 27 నుండి ఏప్రిల్ 29 వరకు) | 5,70,000 | 2.8 | లేదు | లేదు |
| | **మొత్తం** | **18,64,000** | **10.01** | **1,81,000** | **1.14** |

మూలం: 1) ప్రకటించిన మొత్తం ప్రెస్ నివేదికల నుంచి,
2) ‘అసలైన ద్రవ్య ప్రవాహం’ లేదా బదిలీ ‘నగదు’, అంచనాల కోసం మింట్, ఇండియన్ ఎక్స్‌ప్రెస్, వైర్, స్క్రోల్.ఇన్ మొదలైన వాటి నివేదికల నుండి అనేక అంచనాల సగటు.

పెట్టడం మినహా, ఆ నిస్సహాయ స్థితి విస్తృతంగా కనబడుతున్నప్పటికీ ప్రభుత్వం వైపు నుంచి వచ్చిన స్పందన ఏమీ లేదనే చెప్పాలి. స్థూల జాతీయోత్పత్తిలో దాదాపు 5 శాతం, అంటే రు. పదిలక్షల కోట్లు నేరుగా నిరుపేదల, చిన్న, సూక్ష్మ సంస్థల చేతికి అందేలా నిధులు కేటాయిస్తే డిమాండ్‌లో ఉద్దీపన సాధ్యమవుతుందని ఎన్నో వైపుల నుంచి సూచనలు వచ్చాయి. దాదాపు 48 రోజులు గడిచిన తర్వాత, ఎంతమాత్రమూ సరిపోని గరీబ్ కల్యాణ్ యోజన తర్వాత, లాక్‌డౌన్ ను మరొక మూడు సార్లు పొడిగించిన తర్వాత, వలస శ్రామికుల తిరుగుప్రయాణాల వెల్లువల తర్వాత, మే 12న ప్రధాన మంత్రి మోడీ ఒక బ్రహ్మాండమైన ప్రకటనతో ముందుకు వచ్చాడు. ఆ ప్రకటనకు ఆయన ఆత్మనిర్భర్ భారత్ వైపు, స్వావలంబన వైపు ప్రయాణం అని పేరు పెట్టాడు. ఈ పథకం మొత్తం ఇరవై లక్షల కోట్ల రూపాయలతో, అంటే స్థూల జాతీయోత్పత్తిలో 10 శాతంతో ఆర్థిక వ్యవస్థకు ఉద్దీపన కలిగిస్తుందని అన్నాడు. ఈ ఆత్మనిర్భర్ భారత్ అభియాన్ ఆర్థిక వ్యవస్థకు మూలస్తంభాలైన ఐదు రంగాల్లో – ఆర్థిక వ్యవస్థలో, మౌలిక సాధన సంపత్తిలో, వ్యవస్థాగతనిర్మాణంలో, జనాభాలో, డిమాండ్‌లో – అవసరమైన చర్యల గురించి ప్రధాని కంటున్న స్వప్నమని అన్నారు. కాని ఆ తర్వాత ఐదు రోజుల పాటు, మే 13 నుంచి 17 వరకు వరుసగా ఆర్థిక మంత్రి ప్రకటించిన ప్యాకేజి వివరాలను

నిశితంగా పరిశీలిస్తే, ఎన్నో విడివిడి చర్యలున్నాయి. వాటిలో కొన్ని అంతకు ముందే రిజర్వ్ బ్యాంక్ ఆఫ్ ఇండియా ప్రకటించినవే గాని ప్రభుత్వ కార్యక్రమాలు కావు. ఉద్దీపన పథకం పేరుతో అనేక కార్యక్రమాలను కలిపి కుట్టిన బొంతగా దీన్ని పరిశీలకులు వ్యాఖ్యానించారు. ఇది బట్టతలనూ మోకాలిని ముడివేసి ఎలాగోలాగ ఇరవై లక్షల కోట్ల రూపాయల అంకెకు చేరడానికి జరిగిన ప్రయత్నమని నీతీ ఆయోగ్ మాజీ ఉపాధ్యక్షులు అరవింద్ పనగారియా అన్నారు.

ఈ కార్యక్రమంలో అంతకుముందే గరీబ్ కల్యాణ్ యోజనలో ప్రకటించిన చర్యలు, మార్చ్, ఏప్రిల్ లలో రిజర్వ్ బ్యాంక్ ప్రకటించిన చర్యలు కలిసిపోయి ఉన్నాయని పట్టిక 3 చూస్తే అర్థమవుతుంది. వీటిలో ఎక్కువ చర్యలు రుణ పరపతి సౌకర్యాలు పెంచడం ద్వారా ఆర్థిక వ్యవస్థలో ద్రవ్య లభ్యతను పెంచడానికి ఉద్దేశించినవి. మనం ఇంతకుముందే గరీబ్ కల్యాణ్ యోజన విషయంలో చూసినట్టుగా, ఈ ద్రవ్య చర్యల్లో అత్యధిక భాగం డిమాండ్ ను పెంచడానికి, మదుపును పెంచడానికి, తద్వారా ఎన్నోరెట్ల గుణక ప్రభావం ద్వారా ఉద్యోగాలు పెంచడానికి వీలుగా వనరులను నేరుగా ప్రజల చేతుల్లో, సంస్థల చేతుల్లో పెట్టేవి కావు. వడ్డీ రేట్లు తగ్గించడం, రుణ పరపతి సౌకర్యాలను పెంచడం అనే ద్రవ్య చర్యలకు మాత్రమే మోడీ ప్రభుత్వం మొండిగా కట్టుబడి ఉంది. కాని విపరీతమైన నిరుద్యోగం, తరిగిపోయిన ఆదాయాలు, కుంచించుకుపోయిన డిమాండ్ ఉన్న పరిస్థితుల్లో ఉత్పత్తిదారులకు ఎక్కువ పరపతి కలిపించినా మదుపు పెరగబోదనేది అందరికీ తెలిసిన అర్థశాస్త్ర సత్యం. ఎందుకంటే తగిన డిమాండ్ లేకుండా సరఫరా పెంచడానికి మదుపు పెంచితే కేవలం నష్టాలు రావడం తప్ప మరేమీ జరగదు. అందువల్ల, కుంచించుకుపోయిన, సంక్షోభంలో ఉన్న ఆర్థిక వ్యవస్థలో ప్రజల చేతుల్లో వనరులు పెట్టడం మౌలిక అవసరం. తద్వారా డిమాండ్ పెరుగుతుంది. అది ఎక్కువ మదుపుకు, ఉద్యోగాలకు, ఆదాయాలకు పురికొల్పుతుంది. ఇవి బహు గుణక ఫలితాన్ని చూపడం ప్రారంభిస్తాయి. అందువల్లనే శ్రామికులు కోల్పోయిన ఆదాయానికి పరిహారం చెల్లించేందుకు కార్మికులకు, రైతులకు, ఇతర చిన్న ఉత్పత్తిదారులకు ప్రత్యక్ష నగదు చెల్లింపులు జరపాలని చాల మంది ఆర్థికవేత్తలు వాదిస్తూ వచ్చారు.

భారీ ఇరవై లక్షల కోట్ల రూపాయల ప్యాకేజిలో వాస్తవంగా ఉన్న ద్రవ్య భాగం (నగదు చెల్లింపు భాగం) కేవలం ఒక లక్షా ఎనభై వేల కోట్ల రూపాయలు, అంటే స్థూల జాతీయోత్పత్తిలో 1.14 శాతం మాత్రమే. మిగిలినవన్నీ ధనసంబంధమైన పరపతి ఆధారిత చర్యలు మాత్రమే. వాటికి బ్యాంకులు, నాన్ బ్యాంకింగ్ ఫైనాన్స్ కంపెనీలు వంటి భాగస్వామ్య సంస్థల ప్రవర్తనా సరళి మీద ఆధారపడిన పరోక్ష ఫలితాలు మాత్రమే ఉంటాయి. ఉదాహరణకు రిజర్వ్ బ్యాంక్ నుంచి బ్యాంకులు తీసుకునే ధనం మీద వేసే వడ్డీ రేటు – రెపో రేట్ అంటారు – ను పదే పదే తగ్గిస్తూ పోవడం, బ్యాంకులు రుణంగా ఇచ్చే వనరులను పెంచడానికి రుణ–నిలువల నిష్పత్తి (సిఎఆర్) తగ్గిస్తూ పోవడం బ్యాంకుల రుణ దాన సామర్థ్యాన్ని పెంచిన మాట నిజమే గాని, అందువల్ల బ్యాంకులు ఎక్కువ రుణాలు ఇచ్చిన దాఖలాలేమీ లేవు. అందుకు భిన్నంగా బ్యాంకుల దగ్గర నిలువలు పెరిగిపోయాయి. ఆ నిలువలను రుణం ఇచ్చి ప్రమాదంలో పడడం ఆ బ్యాంకులకు ఇష్టం లేకపోవచ్చు. లేదా డిమాండ్ కుంచించుకుపోయి ఉన్నప్పుడు మదుపు పెట్టి నష్టంలో పడడం ఎందుకని ఆలోచించిన సంస్థలు రుణాలు తీసుకోవడానికి ముందుకు రాకపోవచ్చు.

అంతకు ముందరి చాల విధానాల లాగనే, ఆత్మ నిర్భర్ భారత్ అభియాన్ కూడ ఆర్థిక వ్యవస్థలో సరఫరా వైపు ఎక్కువ శ్రద్ధ పెడుతుంది. డిమాండ్ కు సంబంధించిన అంశాల మీద శ్రద్ధ లేదు. డిమాండ్ పెంచాలంటే మౌలిక సాధన సంపత్తి మీద పెట్టుబడులు, కుటుంబ ఆదాయాలను పెంచడానికి నగదు చెల్లింపులతో సహా అదనపు సహాయాల బదిలీలు వంటి వాటి ద్వారా ప్రభుత్వ ప్రత్యక్ష వ్యయం పెరగవలసి ఉంటుంది. మోడీ ప్రభుత్వం ఇచ్చిన ఆదాయపు పన్ను రాయితీలు, కార్పొరేట్ పన్నుల తగ్గింపు, ద్రవ్యలోటు మీద సంకుచితమైన పరిమితులు వంటి విధానాల వల్ల ప్రభుత్వం డిమాండ్ పెంచే ప్రత్యక్ష చర్యలు తీసుకునే సామర్థ్యాన్ని కోల్పోయింది. తత్ఫలితంగా గత మూడు నెలల్లో ఆదాయాలు కోల్పోయిన అసంఘటిత శ్రామికులకూ, సంస్థలకూ ఆదాయాన్ని పెంచే చర్యలను ఆత్మ నిర్భర్ అభియాన్ తీసుకోలేకపోయింది. ద్రవ్యలభ్యత పెంచడానికి తీసుకున్న ఈ చర్యలలో ప్రతి ఒక్క చర్యనూ నిశితంగా పరిశీలిస్తే వాటి వల్ల భారత ఆర్థిక వ్యవస్థలో సమీప భవిష్యత్తులో ఎటువంటి పునరుద్ధరణ అయినా జరుగుతుందా అనుమానించవలసిందే.

మోడీ పాలనలో జరిగిన అన్ని ప్రహసనాల లాగనే, ఆత్మ నిర్భర్ అభియాన్ కూడ ప్రహసనమేనని దానికి వచ్చిన తక్షణ ప్రతిస్పందనల నుంచి అర్థం చేసుకోవచ్చు. అమెరికా నుంచి జర్మనీ నుంచి జపాన్ వరకూ ఎన్నో దేశాలు తమ ఉద్దీపన పథకాలను భారీగా, తమ స్థూల జాతీయోత్పత్తిలో పది శాతం దాకా ప్రకటించాయని మనందరమూ చూశాం.

ఈ ఉదాహరణలను చూపుతూ, భారత ప్రభుత్వం మార్చ్‌లో ప్రకటించిన ప్యాకేజి మన స్థూల జాతీయోత్పత్తిలో ఒక శాతం కన్న తక్కువ ఉన్నదని విమర్శలు వచ్చాయి. వనరుల ప్రత్యక్ష బదిలీ ద్వారా కనీసం స్థూల జాతీయోత్పత్తిలో 5 శాతమైనా ప్యాకేజీ ప్రకటించాలని సూచనలు వచ్చాయి. అవతలివాళ్ల కంటె తానొకటి ఎక్కువ అని చూపదలచుకుంటాడు గనుక మోడీ తన విమర్శకులను బోల్తా కొట్టించడానికి 10 శాతం ప్యాకేజీ ప్రకటించాడు గాని, నిజంగా ఆర్థిక వ్యవస్థను కాపాడడానికో, బాధిత శ్రామికులను ఆదుకోవడానికో కాదు. కాని ప్రభుత్వం తెలుసుకోవలసినదేమంటే అమెరికా, జర్మనీ, జపాన్ లలో ప్రకటించిన ప్యాకేజీలు బాధిత శ్రామికులకు నేరుగా చెప్పుకోదగిన ఆదాయాన్ని బదిలీ చేశాయి.

"ప్రభుత్వాలు అంతకు ముందెన్నడూ లేనంత ఉదారంగా ఈ మహావిపత్తు సమయంలో భద్రతా సౌకర్యాలను కలిగించాయి. బ్రిటన్‌లో పని పోగొట్టుకున్న డెబ్బై ఐదు లక్షల కార్మికుల వేతనాలలో అతి ఎక్కువ భాగాన్ని ప్రభుత్వమే చెల్లించింది. ఆరోగ్య రంగం మీద ప్రభుత్వ వ్యయం కన్న ఇది ఎక్కువ. ఫ్రాన్స్‌లో ప్రైవేట్ రంగ కార్మికుల పని గంటలు తగ్గించిన తర్వాత అత్యధిక సంఖ్యాక కార్మికులకు ఆ కోల్పోయిన ఆదాయాలను ప్రభుత్వమే అందజేస్తోంది. అమెరికా ప్రతి వ్యక్తికీ, ప్రతి వారానికీ 800 డాలర్ల నిరుద్యోగ భృతి ఇవ్వడం ద్వారా, సగటు చెల్లింపులను నాలుగు రెట్లు చేసింది. మార్చ్ నుంచి ఇప్పటివరకూ ఇటువంటి సహాయాలు 34 పైన వెలువడ్డాయి. జర్మనీ, జపాన్ లు ఉద్యోగం కోల్పోయిన, లేదా పాక్షికంగా కోల్పోయిన కార్మికులకు ఇప్పటికే ఉన్న సబ్సిడీ పథకాలను మరింతగా పెంచాయి" అని ది ఎకనమిస్ట్ మే 16 సంచికలో రాసింది.

*(రచయిత సుప్రసిద్ధ అర్థశాస్త్రవేత్త. హైదరాబాద్ కేంద్రీయ విశ్వవిద్యాలయంలో ప్రొఫెసర్‌గా పని చేశారు)* వీ

# కార్పొరేట్ అనుకూల ప్యాకేజీ

***కరోనా వల్ల ఏర్పడిన ఆర్థిక సంక్షోభం నుంచి గట్టెక్కడానికి కేంద్ర ప్రభుత్వం ప్రకటించిన ప్యాకేజీ స్వదేశీ, విదేశీ కార్పొరేట్లకు ప్రయోజనం చేస్తుంది తప్ప దేశ సాధారణ ప్రజలకు ఏమాత్రం ఉపయోగపడదని అంటున్నారు* సంతోష్**

కరోనా వైరస్ వ్యాప్తి జరగకముందే భారత ఆర్థిక వ్యవస్థ మాంద్యంలో కూరుకుపోయింది. 2015-16 ఆర్థిక సంవత్సరంలో జిడిపి వృద్ధిరేటు 8.2 శాతం ఉండగా, 2016-17లో 7.1 శాతానికి, 2017-18లో 6.7 శాతానికి, 2018-19లో 6.1 శాతానికి, 2019-20లో 4.2 శాతానికి క్రమంగా పడిపోయింది. ఈ సందర్భంలో కరోనా వచ్చింది. 2020-21 ఆర్థిక సంవత్సరానికి వృద్ధిరేటు 2 శాతానికి మించదని ప్రపంచబ్యాంకు, ఐక్యరాజ్యసమితి, పలు రేటింగ్ సంస్థలు అంచనా వేస్తున్నాయి. కరోనా ప్రభావంతో మార్చి 24 నుండి దేశవ్యాప్తంగా లాక్‌డౌన్ ప్రకటించడంతో అనేక ఉత్పాదక కంపెనీలు మూతపడ్డాయి. నిర్మాణరంగం, సేవారంగం, రవాణా రంగం మూతపడ్డాయి. పనులు కోల్పోయి ఎక్కడివారు అక్కడ చిక్కుబడి పోయారు. రవాణా సౌకర్యం లేదు. ఆదుకునే వారు లేక ఆకలితో శ్రామికులు అలమటించారు.

ఈ దుస్థితిలో ఆకలితో, అవమానంతో వందల వేల కిలోమీటర్లు కాలినడకతోనే ప్రాణాలు కడతేరిపోతున్న కోట్లాది మంది వలస కార్మికులు ఊరిబాట పట్టారు. పని స్థలాలకు, స్వస్థలాలకు మధ్య ఎంత నడిచినా దూరం తగ్గని కష్టపు బాటలో చిక్కుకొని, ఆకలి మరణాలకు తోడు తాము పయనిస్తున్న వాహనాలు ప్రమాదాల బారినపడి మరణిస్తున్న అసంఖ్యాక వలస కార్మికుల మృత్యు రోదనలు మిన్నంటుతున్నా కేంద్ర ప్రభుత్వం చెవికెక్కించుకోలేదు. 'ద వైర్' పత్రిక సమాచారం ప్రకారం 528 మంది వలస కార్మికులు ఆర్థిక ఇబ్బందుల వల్ల గానీ, సామాజిక కారణాల వల్ల గానీ, ప్రమాదాల వల్ల గానీ చనిపోయారు. 40 కోట్ల మంది అసంఘటితరంగ కార్మికులు ఉపాధి కోల్పోయి అనాథలుగా మారారు. వారి భవిష్యత్తు అగమ్యగోచరంగా ఉంది. మరోవైపు దేశ ఆర్థిక వ్యవస్థ మరింతగా కుదేలయింది.

మొత్తం ఆర్థిక వ్యవస్థను నెలల తరబడిగా స్తంభింపజేసే ఇటువంటి విపత్తులు ఎదురైనప్పుడు ఉత్పత్తులు నిలిచిపోయి, ఉపాధులు కోల్పోయి, కొనుగోలు శక్తి దారుణంగా సన్నగిల్లిపోయి, కూడు, గూడు, గుడ్డకు దూరమై కఠిక దారిద్ర్యంలోకి అత్యధికులు కూరుకుపోతారు. ఆదాయాలు లేక చేతిలో చిల్లిగవ్వ కరువైనందున కొనుగోలు శక్తి అడుగంటిపోయిన సందర్భంలో మోడీ ప్రభుత్వం ప్రకటించిన 20.9 లక్షల కోట్ల రూపాయల ప్యాకేజీతో నిరుపేదల పెదవులపై చిరునవ్వు తెప్పించేదేమైనా ఉన్నదా? అని ఆలోచనపరులు శోధించడం సహజం. అత్యధిక శాతం వలస కూలీలు, వ్యవసాయ కార్మికులు, ఎంఎస్ఎంఇ లలో పనిచేసే కార్మికులు ఉండడానికి గూడు, ఒంటి మీద నిండైన బట్ట, కడుపు నిండ తిండిలేక అలమటిస్తున్న వారికి ఇంత భారీ ప్యాకేజీ ఏమైనా ఉపశమనం కల్గించిందా? అంటే నామమాత్రం అని చెప్పవచ్చు. కరోనా లాక్‌డౌన్‌ను అవకాశంగా మలుచుకొని ఎప్పటి నుంచో అవకాశం కోసం ఎదురు చూస్తున్న ప్రభుత్వం భారీ సంస్కరణలకు తెరలేపింది.

ఆర్థిక మంత్రి ప్రకటించిన రు. 20.9 లక్షల కోట్ల ప్యాకేజీలో అసంఘటిత రంగ కార్మికులు, వలస కార్మికులు ఎదుర్కొంటున్న సమస్యలకు పరిష్కారాలు ఏమైనా ఉన్నాయా? గ్రామాలను, వ్యవసాయాన్ని, చేతివృత్తులను స్వయం పోషకంగా బలోపేతం చేసే దిశగా ప్రతిపాదనలు ఏమైనా ఉన్నాయా? అని పరిశీలిస్తే ఒకపక్క అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడి స్వప్రయోజనాలకనుకూలంగా మన విధానాలను రూపొందిస్తూ మరోపక్క విదేశీ, స్వదేశీ గుత్త సంస్థలకు దేశ వనరులను కట్టబెడుతూ స్వావలంబన గురించి గొప్పగా మాట్లాడడం మోడీ ప్రభుత్వ వంచనా శిల్పానికి పరాకాష్ఠగా గమనించవచ్చు. ఇంత భారీ ప్యాకేజీలో బడుగు జీవులకు దక్కింది బహుస్వల్పం. ప్రజలకు స్థానికత, స్వయం సమృద్ధి మాటల గారడితో 20.9 లక్షల కోట్ల ప్యాకేజీని కార్పొరేట్ ప్యాకేజీగా మార్చి వేశారు. ప్రజల కొనుగోలు శక్తిని అడ్డుకునే దోపిడీ వ్యవస్థను నిర్మూలించే చర్యలు ఏమైనా ఈ ప్యాకేజీలో ఉన్నాయా? అంటే దోపిడీని మరింత పెంచేదిగానే ప్యాకేజీ ఉంది.

**ప్రజలను బురిడీకొట్టించే ఆర్థిక ప్యాకేజీ**

కరోనా వైరస్ సృష్టించిన ఆర్థిక సంక్షోభానికి, మోడీ ప్రభుత్వం ప్రకటించిన సంస్కరణలకు ఏమైనా సంబంధం ఉందా? కరోనా కష్టాలకు ప్రధాని మోడీ చెప్పిన 'ఆత్మ నిర్భర' ప్రవచనాలకు, ఆర్థిక మంత్రి నిర్మలా సీతారామన్ ప్రకటించిన ప్యాకేజీకి ఏమైనా సంబంధం ఉందా? మోడీ ప్రసంగంలోని స్వావలంబనకు, ఆర్థికమంత్రి ఐదు విడుతలుగా ప్రకటించిన ప్యాకేజీలకు ఏమైనా సంబంధం ఉందా? వరుసపెట్టి వెల్లడించిన సుదీర్ఘ ప్రకటనలకు ఛిద్రమైన ఆర్థిక వ్యవస్థను పునరుజ్జీవింప చేయడానికి ఏమైనా పొంతన వుందా? రోజువారి కూలీలు, అసంఘటిత కార్మికులు, కాంట్రాక్ట్, ఔట్ సోర్సింగ్ కార్మికులు, వ్యవసాయ కార్మికులు, రైతులు బాగుపడేది ఏమైనా ప్యాకేజీలో ఉందా? ప్రభుత్వ ఖజానా నుండి పైసా తీయకుండా, బాధితులకు తక్షణ నగదు సహాయం చేయకుండా ప్రభుత్వం చేసే ప్రచారాలకు ఏమైనా అర్థముందా? ముచ్చటగా ఐదు విడతలుగా ప్రకటించిన విధాన ప్రకటనల తర్వాత దేశంలో ఏ వర్గానికి ఎంత సహాయం, ఎప్పుడు, ఏ విధంగా అందుతుందో ఎవరికైనా అంతుపట్టిందా? ఇదంతా ఒక ప్రయోజనం లేని ప్రచారార్భాటం తప్ప మరొకటి కాదు. ఆత్మవంచన చేసుకునే వారు ఏ నినాదమైనా సృష్టించగలరు. ప్రజల్ని సులభంగా మభ్య పెట్టగలరు. అందులో మోడీ ప్రభుత్వం అగ్ర పీఠాన ఉంది.

మోడీ ప్రభుత్వం 'స్వావలంబన, స్వయం సమృద్ధి' లక్ష్యంగా ప్రకటించిన 20.9 లక్షల కోట్ల ప్యాకేజీలో గతంలో బడ్జెట్‌లో పేర్కొన్నవి, రిజర్వ్ బ్యాంకు ప్రకటించిన ఉద్దీపనలు కలగలసి ఉన్నాయి. ఇంకా

విచిత్రమేమిటంటే రుణాలను ప్యాకేజీగా ప్రకటించడం జరిగింది. పూచికత్తు లేకుండా 12 నెలల మారిటోరియంలో రుణాలు ఇస్తున్నట్లు ఆర్థిక మంత్రి ప్రకటించారు. సూక్ష్మ, చిన్న, మధ్యతరహా సంస్థల (ఎంఎస్ఎంఇ) నిర్వచనం మార్చడం ద్వారా కార్పొరేట్ల దురాక్రమణకు వీలు కల్పించింది. ఈ ప్యాకేజీ దేశంలోని పేదలు, అసంఘటిత కార్మికులకు ఏమాత్రం ఉపయోగపడదు. కాబట్టి కార్మికుల కొనుగోలు శక్తి పెరుగదు. ఉత్పత్తిని పెంచినా ప్రజలకు కొనుగోలు శక్తి లేనప్పుడు ప్రయోజనం ఏముంటుంది? ఇదంతా ప్రజల్ని మరోసారి మోసగించేందుకు చేస్తున్న ప్రయత్నమే తప్ప మరొకటి కాదు. మొత్తంగా ఈ ప్యాకేజీ ఎంత అస్పష్టంగా ఉందో, సంస్కరణల పేరుతో కార్మికులపై, పేదలపై దాడి అంత స్పష్టంగా గోచరిస్తుంది. సంస్కరణల విషయంలో చూపిన ఆసక్తి కార్మికులకు ఉద్దీపన ఇవ్వడంలో అంత ఉదారంగా వ్యవహరించ లేకపోయింది.

ఆర్థిక మంత్రి ఐదురోజులు వరుసగా ప్రకటించిన 40 చర్యలు గమనిస్తే, కరోనా సాకుతో ప్రైవేటీకరణ, కార్పొరేట్ అనుకూల సంస్కరణలకు కేంద్రం పావులు కదుపుతోందన్న అభిప్రాయం అందరిలో ఏర్పడింది. అంతేగాదు 20.9 లక్షల కోట్ల ప్యాకేజీతో దేశంలో ఆవగింజంత స్వావలంబన, స్వయం పోషకత్వం సమకూరుతుందా? అని పరికించి చూస్తే అటువంటి అవకాశమే కన్పించడం లేదు. చైనా నుంచి 100 కంపెనీలు భారత్‌కు తరలివస్తాయన్న ఆశతో ఎదురుచూస్తున్న నేపథ్యంలో స్వావలంబన, స్థానికత, స్వయం పోషకం వంటి ఉదాత్త నినాదాలు ఆచరణలోకి వస్తాయా? గత మూడు దశాబ్దాలుగా చిన్న పరిశ్రమలను చిదిమివేసింది, వేస్తున్నది ఎవరు? వ్యవసాయాన్ని, రైతాంగాన్ని సంక్షోభంలోకి నెట్టింది ఎవరు? ప్రభుత్వరంగంలోని పరిశ్రమలను ధ్వంసం చేసిందెవరు? కోట్లాది రూపాయల అవినీతి, అక్రమాలను ప్రోత్సహిస్తున్నదెవరు? పర్యావరణాన్ని ధ్వంసం చేస్తున్నదెవరు? దేశ సహజ వనరులను లూటీ చేస్తున్నదెవరు? విద్య, వైద్యం, రవాణా వంటి సామాజికాంశాలను ప్రైవేటు పరం చేసిందెవరు? వీటికి ప్రభుత్వం అనుసరించిన విధానాలు, కార్పొరేట్ సంస్థల దోపిడీ కారణం కాదా! గత మూడు దశాబ్దాల ప్రపంచీకరణ ఆర్థిక విధానాల పర్యవసానమే ఆర్థిక వ్యవస్థ కుంగుబాటుకు, ప్రజల ఈతి బాధలకు కారణమని ఈ దేశ రైతాంగం, శ్రామికులు, కూలీలు స్పష్టంగానే అవగతం చేసుకున్నారు. ఇందుకు పెరిగిపోయిన పేదరికం, నిరుద్యోగం, ఆర్థిక అంతరాలే ప్రత్యక్ష సాక్షం.

ప్రధాని మోడీ అట్టహాసంగా ప్రకటించిన స్వావలంబన భారత్ (ఆత్మ నిర్భర భారత్)పై ఆర్థిక మంత్రి 5 విడతల ప్రకటనలు విన్నాక పలువురికి సందేహాలు కలుగుతున్నాయి. ప్రధాని ప్రసంగంలో సంక్షోభంలో ఉన్న వ్యవసాయం, ఆకలితో అలమటిస్తున్న వలసకూలీలు, ఉపాధి కోల్పోయిన అసంఘటిత కార్మికులు, ఉద్యోగులు, ప్రభుత్వరంగ సంస్థల్లో పనిచేస్తున్న కార్మికులు విస్మరణకు గురికావడం శోచనీయం. మోడీ ప్రసంగంలో స్వావలంబనకు భూమి, పెట్టుబడి, కార్మికులు, చట్టాలు ప్రధానమంటూనే వాటిని మార్చబోతున్నామని చెప్పడంలోనే కుట్ర దాగి ఉంది. 2014 భూ సేకరణ చట్టాన్ని సవరించి కార్పొరేట్లకు భూమి కట్టబెట్టాలని ఆరేళ్లుగా ప్రయత్నిస్తూనే ఉన్నారు. పెట్టుబడిదారులకు ప్రభుత్వ రంగాన్ని కట్టబెట్టడంతో పాటు పన్ను రాయితీలు, బ్యాంకులకు ఎగ్గొట్టిన అప్పును రైట్ ఆఫ్ చేస్తూనే ఉన్నారు. ఎన్నో సంవత్సరాలు పోరాడి సాధించుకున్న కార్మికుల హక్కులను హరించే నాలుగు కోడ్స్, పని గంటలు 8 నుంచి 12కు పెంచడం, 1000 రోజులు కార్మికుల చట్టాలను బ్యాన్ చేయడం వంటి కార్మిక వ్యతిరేక చర్యలకు పూనుకొంటూనే ఉన్నారు. ఇక ఫ్యాక్టరీ చట్టాన్ని, దివాళ చట్టాన్ని యాజమాన్యాలకు అనుకూలంగా మార్పులు తెస్తామన్నారు. ఇవన్నీ ప్రపంచ బ్యాంకు నిర్దేశితాలే. స్వదేశీ విదేశీ కార్పొరేట్లు సహజ వనరులను, చౌకగా దొరికే శ్రమను, దేశీయ మార్కెట్‌ను కొల్లగొట్టి లాభాలు దండుకోవడానికి సహకరించే చర్యలేనని స్పష్టమవుతుంది. ఈ చర్యలు దేశాన్ని మరింత సంక్షోభంలోకి నెట్టివేస్తాయి తప్ప ఆర్థిక సంక్షోభాన్ని పరిష్కరించలేవన్నది స్పష్టం.

ఆయన మాటల్లో స్వావలంబన భారత్‌కు ఆర్థిక వ్యవస్థ, మౌలిక వసతులు, సాంకేతిక పరిజ్ఞానం, చైతన్యవంతమైన (స్కిల్డ్) ప్రజలు, డిమాండులు పునాదిగా ఉంటాయన్నారు. స్వావలంబన అంటే దేశ ప్రజల అవసరాలు ప్రభుత్వ రంగం ద్వారానే తీర్చాల్సి ఉంటుంది. అయితే ప్రభుత్వ రంగ సంస్థలను నీరుగారుస్తూ, స్వావలంబనను దెబ్బతీస్తూ ఆ పథకాలకే 'స్వావలంబన భారత్' అని పేరు పెట్టి పిలుచుకోవడం కన్నా నయవంచన వేరొకటి ఉంటుందా? సులభతర వ్యాపారం పేరిట భూమి, నీరు, ఇతర వనరులు చౌకగా కార్పొరేట్లకు కట్టబెడుతున్నారు. సాంకేతిక పరిజ్ఞానం సామ్రాజ్యవాద దేశాల బహుళజాతి సంస్థల చేతుల్లో ఉందని మనందరికి తెలుసు. మనదేశంలో శాస్త్ర సాంకేతిక అంశాల పరిశోధనలకు (ఆర్ & డి) 1950లో బడ్జెట్‌లో 3 శాతం కేటాయిస్తే సామ్రాజ్యవాద ప్రపంచీకరణ సంస్కరణలు అమలులోకి వచ్చాక పరిశోధన– అభివృద్ధి అటుకెక్కింది. బడ్జెట్‌లో 1 శాతం నిధులు మాత్రమే కేటాయిస్తున్నారు.

మోడీ చెబుతున్న మాటల్లో చిత్తశుద్ధి, నిజాయితీ ఉంటే ఆయన గంభీరంగా ప్రకటించిన పథకాల్లో మొదటి లబ్ధిదారులుగా సామాన్యులు ఉండాలి. అంటే కార్మికులు, అసంఘటిత రంగ కార్మికులు, రైతులు, రైతుకూలీలు, ఉపాధిలేని యువతకు, మధ్య–దిగువ మధ్యతరగతి ఉద్యోగుల చేతికి నేరుగా నగదు అందాలి. ఉద్యోగుల కరువు భత్యం ప్రకటించాలి. వేతన సవరణ చేపట్టాలి. పూర్తి జీతాలు చెల్లించాలి. కనీస వేతనం అమలు చేయాలి. కార్మిక హక్కులను కాపాడాలి. అప్పుడే వారి చేతిలో నాలుగు డబ్బులు పెరిగి మార్కెట్‌లో వస్తువులకు డిమాండ్ పెరుగుతుంది. దేశీయ మార్కెట్ వర్ధిల్లుతుంది. అది ఉత్పత్తులు పెరగడానికి, ఉద్యోగాల కల్పనకు, ఆర్థిక వ్యవస్థ పటిష్టానికి వెరసి నిజమైన ప్రజా చైతన్యానికి, స్వావలంబనకు బాటలు వేస్తుంది. ఆ దిశలో చర్యలు తీసుకోకుండా మాయమాటలు చెప్పి కార్పొరేట్లకు దోచిపెట్టడానికే పరిమితమైతే అయిన వారికి ఆకుల్లో కానివారికి కంచాల్లో అన్న చందంగా ఉంటుంది. అసలు కొనేవాడు లేకపోతే ఆర్థిక వ్యవస్థ మనగలుగుతుందా?

ఉద్యోగులు, కార్మికులు, అసంఘటిత రంగ కార్మికులు, రోజువారి కులీలు, రైతులు నీరసించి, నిస్తేజమై ఉంటే కార్పొరేట్లకు ఎన్ని కోట్లు కుమ్మరించినా స్వావలంబన, స్వయం పోషకత్వం ఎలా అవిష్కృత మవుతుంది? నిజానికి స్వావలంబనలో కీలక పాత్ర ప్రభుత్వ రంగానిదే ఉంటుంది. అయితే మూడు దశాబ్దాలుగా పివి, మన్మోహన్, మోడీ ఒకరి తర్వాత ఒకరు ప్రభుత్వ అధికారంలోకి వచ్చి ప్రభుత్వ రంగ సంస్థలను నీరుగార్చి, ఆ ప్రక్రియనే 'సంస్కరణలు' అని ముద్దుపేరు పెట్టి, ఇప్పుడు ఆ సంస్కరణలనే వేగవంతం చేయబోతున్నట్లు ఆర్థిక ప్యాకేజీ చూశాక స్పష్టమవుతుంది. ఇప్పటికే భారీగా పెరిగిన అసమానతలు, తరిగిపోయిన సామాన్యుల కొనుగోలు శక్తి చూశాక ఏమనాలి? ఇది స్వావలంబనా? స్వాహాలంబనా? ప్యాకేజీలో వేలల్లో

ఉన్న పెట్టుబడిదారులకు 90 శాతం, కోట్లలో ఉన్న ప్రజలకు 10 శాతం ఇస్తే సగటు మనిషి బతికేదెట్ల అన్న సోయి ప్రభుత్వానికి లేకపోవడం దుర్మార్గం, దారుణం కాదా!

**స్వావలంబన అంటే ఏమిటి?**

నిజానికి స్వాలంబన అంటే స్వదేశీ పెట్టుబడి, స్వదేశీ సాంకేతికత, స్వదేశీ మార్కెట్‌లపై ఆధారపడి నిర్మితమైన రాజకీయార్థిక సామాజిక వ్యవస్థ. 1950 తర్వాత మన దేశంలో స్వావలంబన సాధించాలనే లక్ష్యంతో ప్రభుత్వ రంగంలో 1954లో స్టీల్ అథారిటీ ఆఫ్ ఇండియా లిమిటెడ్(సెయిల్), 1958లో డిఫెన్స్ రిసర్చ్ అండ్ డెవలప్‌మెంట్ (డిఆర్‌డిఒ), 1964లో హిందూస్థాన్ ఏరోనాటిక్స్ లిమిటెడ్(హెచ్ఎఎల్), 1965లో భారత్ హెవి ఎలక్ట్రికల్ లిమిటెడ్ (బిహెచ్ఇఎల్), 1969లో భారతీయ అంతరిక్ష పరిశోధన సంస్థ (ఇస్రో), 1995 సెంట్రల్ కోల్‌ఫీల్డ్స్ లిమిటెడ్(సిసిఎల్), 1975లో నేషనల్ థర్మల్ పవర్ కార్పొరేషన్ (ఎన్‌టిపిసి), విదేశీ చమురు కంపెనీలను జాతీయం చేయడంతో 1976లో భారత్ పెట్రోలియం కార్పొరేషన్ లిమిటెడ్ (బిపిసిఎల్), 1981లో గ్యాస్ అథారిటీ ఆఫ్ ఇండియా (గెయిల్), భారత్ సంచార్ నిగమ్ లిమిటెడ్ (బిఎస్ఎన్ఎల్) వంటి అత్యున్నత ప్రభుత్వ రంగ సంస్థలు నెలకొల్పారు.

మన దేశంలో 1950 నుంచి నిర్మించుకున్న 339 ప్రభుత్వ రంగ సంస్థలను ప్రైవేటీకరించనున్నట్లు ఆర్థిక మంత్రి నాలుగు ఐదవ విడత ప్యాకేజీలో తెలిపారు. వీటిలో రు. 26 లక్షల కోట్లు ప్రభుత్వ పెట్టుబడులున్నాయి. అంటే అది ప్రజాధనం అని గుర్తించాలి. ఇప్పటి ధరల ప్రకారం చూస్తే వీటి ధరలు పది రెట్లు పెరిగాయని గమనించాలి. గత సంవత్సరం లక్షా డెబ్బై ఐదు వేల కోట్ల లాభాలు ఆర్జించాయి. బంగారు బాతు లాంటి వీటిని విదేశీ, స్వదేశీ గుత్త సంస్థలకు అమ్మేయడం దేశ ద్రోహం తప్ప మరేమవుతుంది? దీంతో దేశ ఆర్థిక వ్యవస్థకు జీవనాడులుగా ఉన్న స్టీల్, పెట్రోలియం, గ్యాస్, విద్యుత్, మైనింగ్, రక్షణ, ఎలక్ట్రికల్ ఇతరత్రా ప్రభుత్వ రంగ సంస్థలు కనుమరుగు కాబోతున్నాయి. స్వావలంబన అంటే దేశ ప్రజల అవసరాలు ప్రభుత్వ రంగం ద్వారానే తీర్చాల్సి ఉంటుంది. ఒకవైపు ప్రభుత్వ రంగ సంస్థలను నీరుగారుస్తూ, స్వాలంబనను దెబ్బతీస్తూ ఆ పథకాలకే 'స్వావలంబన భారత్' అని పేరు పెట్టి పిలుచుకోవడం కన్నా నయవంచన వేరొకటి ఉంటుందా?

స్వావలంబనకు 'భూమి, పెట్టుబడి, శ్రామికులు, చట్టాలు' పునాదులుగా ఉంటాయని ప్రధాని మోడీ చెప్పారు. వీటిలో కార్పొరేట్ల వైపు మొగ్గు స్పష్టం. సులభతర వ్యాపారం పేరిట భూమి, నీరు ఇతర వనరులు చౌకగా కట్టబెట్టుతున్నారు. కార్మిక చట్టాలను తుంగలో తొక్కి పనిగంటలు పెంచారు. సాంకేతిక పరిజ్ఞాన సామ్రాజ్యవాద దేశాల బహుళజాతి సంస్థల చేతుల్లో ఉందని మనందరికి తెలుసు. ప్రధాని చివరి అంశంగా పేర్కొన్న డిమాండ్ ప్రధానమైనది. వస్తు, సేవల డిమాండ్ పెరిగితేనే ఆర్థిక వ్యవస్థ పునరుద్దరణ జరుగుతుంది. ఈ ప్రక్రియ సాకారం కావాలంటే ప్రభుత్వ ప్యాకేజీల్లో అగ్రస్థానం పేదలకు, కార్మికులకు ఉండాలి. ప్రథమ లబ్ధిదారులుగా సామాన్య ప్రజలుండాలి. అప్పుడే ప్రజల కొనుగోలు శక్తి పెరిగి, మార్కెట్‌లో డిమాండ్ పెరుగుతుంది. పరిశ్రమల ఉత్పత్తులు విక్రయమవుతాయి.

స్వావలంబన, స్వయం పోషకత్వం అంటే ప్రభుత్వ చర్యలు, విధానాలు ఉద్యోగాల కల్పనకు, ఆర్థిక వ్యవస్థ పటిష్ఠానికి వెరసి ప్రజాచైతన్యానికి, సరైనా బాటలు వేయాలి. ఆ దిశలో చర్యలు తీసుకోకుండా చేతల దాక రాని మాటలతో కార్పొరేట్లకు దోచిపెట్టడానికే పరిమితమై ప్రజలను మభ్యపెడితే మొదటికే మోసం వస్తుంది. లాక్‌డౌన్ నేపథ్యంలో ప్రజలు నానా అగచాట్లు పడుతున్నారు. ఇలాంటి పరిస్థితుల్లో వారికి నగదు లభ్యత పెంచడానికి తగిన చర్యలు తీసుకోకుండా మొత్తం ఆర్థిక వ్యవస్థను బడా కార్పొరేట్ సంస్థల గుప్పిట్లో పెట్టబోతున్నారు. ఎంఎస్ఎంఇలు, చిన్న వ్యాపారులు మొదలుకొని రాష్ట్రాల వరకు దాదాపు అందరికందరు రుణాలు తెచ్చుకోవాలి తప్ప కేంద్రం ఇవ్వదలుచుకున్నది ఏమి లేదు. ఫలితంగా ఏర్పడేది స్వావలంబన కాదు పరాధీనత అని గుర్తించాలి. మోడీ చెబుతున్న ప్రవచనాలు మోసపూరితమైనవి. ప్రజలను దగా చేసేవిగా ఉన్నాయి.

రోగం కంటే ప్రమాదకరమైన మందు ఇవ్వడంలో ప్రధాని మోడీకి సాటి లేరు. గతంలో పెద్దనోట్ల రద్దు, వస్తు సేవల పన్ను(జిఎస్‌టి) అమలు చర్యలతో దేశాన్ని తీవ్ర సంక్షోభంలోకి నెట్టివేసిన నరేంద్ర మోడీ ప్రభుత్వం ఇప్పుడు కరోనా కోరల్లోని జాతిని ఆదుకునే భారీ ప్యాకేజీ సాకుతో మానవీయ ముఖం బొత్తిగా లేని సంస్కరణలకు తెర తీసింది. వివిధ కీలక ఆర్థిక రంగాలను బంగారు పళ్లెంలో పెట్టి ప్రైవేటుకు అప్పగించే తెగువకు పాల్పడింది. ఈ ప్యాకేజీ సామ్రాజ్యవాద ప్రపంచీకరణ ఆర్థిక సంస్కరణలపై ప్రధానంగా దృష్టి పెట్టింది. పలు మౌలిక రంగాలకు ప్రైవేట్ పెట్టుబడులను విశేషంగా ఆహ్వానించిన చేత్తోనే ప్రభుత్వరంగ పరిశ్రమలను కూడ దళారీ బడా బూర్జువా వర్గాలకు అప్పగించాలని మోడీ ప్రభుత్వం నిర్ణయించడం శోచనీయం. వైద్యరంగం ప్రైవేట్ పరం కావడం మూలానా ప్రజా వైద్యరంగం బలహీనత కరోనా వ్యాధిని అరికట్టడంలో తేటతెల్లమైనప్పటికీ నిస్సిగ్గుగా సమస్త రంగాల ప్రైవేటీకరణకు పునుకోవడం పాలకుల దుస్సాహసానికి నిదర్శనం. ప్రభుత్వ రంగానికి పూర్తిగా తెరదించే కార్యక్రమానికి 'నూతన సమన్విత ప్రభుత్వ రంగ సంస్థల విధానం' అని ముద్దు పేరు పెట్టారు.

కరోనా సంక్షోభాన్ని సదవకాశంగా భావించిన కేంద్ర ఆర్థిక మంత్రి నిర్మలా సీతారామన్ బుట్టలోంచి తీసి ప్రజల మీదకు విడిచిపెట్టిన ప్యాకేజీ కరోనాను అరికట్టడంలోగానీ, లాక్‌డౌన్ బాధిత ఆర్థిక వ్యవస్థకు తక్షణ స్వస్థత చేకూర్చడంలోగానీ, నూతన వైరస్ నేపథ్యంలో అమితంగా బయటపడిన వైద్య ఆరోగ్య రంగ డొల్లతనాన్ని మెరుగుపర్చడంలో గానీ ఏ మాత్రం సంబంధం లేకుండా దేశ ఆర్థిక వ్యవస్థ అడ్డుఅదుపు లేకుండా కొల్లగొట్టుకోవడానికి విదేశీ, స్వదేశీ పెట్టుబడిదారులకు గేట్లన్నీ బార్ల తెరిచింది. స్వావలంబన సాధన పేరుతో అంతటా ప్రభుత్వేతర పెట్టుబడులకు విశాలమైన ఎర్ర తివాచీ పరవడమే ధ్యేయంగా ఆర్థిక మంత్రి నిర్మలా సీతారామన్ ఈ ఆత్మహత్యా సదృశమైన సంస్కరణలకు పచ్చ జెండా ఊపారు. దేశాన్ని సామ్రాజ్యవాద బహుళజాతి సంస్థలకు, దేశీయ దళారీ పెట్టుబడిదారులకు పాదాక్రాంతం చేయడం తప్ప మరొకటి కాదు. ఇదంతా స్వావలంబనకు పూర్తి విరుద్ధమైంది. ఈ ప్యాకేజీతో దేశానికి కరోనాను మించిన శాశ్వత వైరస్‌ను అంటించే నిర్వాకానికి బిజెపి ప్రభుత్వం ఒడిగట్టింది.

**ఎవరిని ఉద్ధరించడానికి సమస్తం ప్రైవేట్‌మయం?**

స్వావలంబన లేదా స్వయంప్రకాశ ఆర్థిక వ్యవస్థ నిర్మాణం పేరిట, కరోనా దాడికి గురైన దేశ ప్రజా బాహుళ్యాన్ని ఆ దాడి నుంచి బయట

పడేయడానికేనంటూ రు. 20.9 లక్షల కోట్లతో బాధిత దేశానికి ఒక ఉద్దీపన పథకం ప్రవేశపెట్టారు. ఇది దేశ జాతీయోత్పత్తుల విలువలో పది శాతం అని చెప్పారు. కానీ ఆచరణలో దీని ప్రయోజనం పేదలకు దేశం జాతీయోత్పత్తుల విలువలో ఒకటిన్నర శాతం మాత్రమే. అలాగే స్వావలంబన స్వయంపోషక ఆర్థిక వ్యవస్థ నిర్మాణమే తమ ధ్యేయమని చెబుతూనే మోడీ చాపకింద నీరులా ఇంతకముందెన్నడూ లేని స్థాయిలో విదేశీ ద్రవ్య పెట్టుబడులకు అవకాశాలు కల్పిస్తున్నారు. ఇంతవరకు ప్రధానంగా దేశ ఆర్థిక వ్యవస్థకు వెన్నుదన్నుగా (లోపాల మధ్యనే) ఉన్న ప్రభుత్వ రంగాన్ని తొలగింపజేసి దేశ విదేశీ గుత్త పెట్టుబడిదారుల దోపిడీకి చేయూతనిచ్చే ఉద్దీపన ప్యాకేజీ ఇది.

దేశ భద్రతకు, ఆర్థిక వికాసానికి, ప్రజా సంక్షేమానికి మూలాధారమైన వ్యవస్థలను ప్రభుత్వమే స్వయంగా నిర్వహించడం ద్వారా, జనాభ్యుదయ లక్ష్యాలను సాధించడానికి పటిష్టమైన పునాదుల మీద మిశ్రమ ఆర్థిక విధానంలో భాగంగా, వ్యవసాయరంగ ప్రధానమైన భారత దేశాన్ని, పారిశ్రామిక వంతం చేయడానికి ప్రభుత్వ రంగాన్ని నెలకొల్పారు. కాలక్రమంలో బ్యాంకులను కూడ జాతీయం చేశారు. ఎన్‌టిపిసి, ఒఎన్‌జిసి, సెయిల్, బిహెచ్ఇఎల్, గెయిల్, ఎంటిఎంఎల్, ఎన్ఎండిసి, బిపిసిఎల్, పవర్ గ్రిడ్ వంటి నవరత్నాలు మరెన్నో మిని పరిశ్రమలు రూపుదిద్దుకొని దేశ ఆర్థిక వికాసానికి, ఉపాధి కల్పనకు తోడ్పడ్డాయి. ఎంతో చారిత్రాత్మకమైన పాత్ర పోషించిన ప్రభుత్వ రంగాన్ని క్రమంగా నీరుగారుస్తూ నూతన ఆర్థిక విధానాల పేరుతో పాలకులు దానికి పూర్తిగా చితి పేర్చడం దారుణం.

**కీలక రంగాల్లోకి ప్రైవేట్ పెట్టుబడులు**

కేంద్రపాలిత ప్రాంతాలలోని విద్యుత్తు పంపిణీ సంస్థల(డిస్కంలు)ను ప్రైవేటుకు అప్పగిస్తున్నట్టు ప్రకటించారు. కరోనా సమయంలోనే విద్యుత్‌ను ప్రైవేట్ లాభార్జనగా మార్చే కుట్రకు ప్రభుత్వం తెరతీసింది. రాష్ట్రాలు భారీగా విద్యుత్ సబ్సిడీలు భరిస్తూ పేద రైతులు, ఎస్‌సి, ఎస్‌టిలు తదితర అణగారిన వర్గాలను, జౌళి వంటి రంగాలను ఆదుకుంటున్న ప్రస్తుత స్థితి నుంచి విద్యుత్తును బహు దూరం చేసి దానిపై తన గుత్తపెత్తనపు ఉక్కు పిడికిలిని బిగిస్తూ దానిని ప్రైవేటు లాభార్జన స్థావరంగా మార్చడానికి ఇప్పటికే సిద్ధం చేసిన విద్యుత్ సంస్కరణల ముసాయిదా చట్టంలోని అంశాలను ఇందులో చేర్చారు. ఇది ముందు ముందు రాష్ట్రాల కొంప కూడా ముంచుతుందనడానికి వెనుకాడవలసిన పని లేదు. అంతేకాదు దేశ వ్యాప్తంగా స్మార్ట్ ప్రీపెయిడ్ విద్యుత్ మీటర్లను ప్రవేశపెడుతామని ప్రకటించి వినియోగదారులకు షాకిచ్చారు. అంతరిక్ష పరిశోధనల్లో లక్ష్య సాధనలో ఎంతో అనుభవం గడించిన ప్రభుత్వ(ఇస్రో) సంస్థను దారుణంగా నిరుత్సాహానికి గురిచేస్తూ అందులోకి ప్రైవేటు పెట్టుబడులను ఆహ్వానించడంలోని జనహితం ఏమిటో అర్థం కాదు. ప్రైవేట్ భాగస్వామ్యంతో ఇండియా స్పేస్ రంగం ప్రయాణానికి ప్రైవేట్ రంగం సహ ప్రయాణికులు(కో ట్రావెలర్)గా ఉంటుందని అన్నారు. ఇకమీదట ఉపగ్రహాలు, ప్రయోగాలు, అంతరిక్ష ఆధారిత సేవలల్లో ప్రైవేట్ సంస్థలకు అవకాశం ఉంటుందన్నారు. ఇస్రో సౌకర్యాలను ఉపయోగించుకోడానికి ప్రైవేట్ రంగానికి అనుమతి ఉంటుందని, గ్రహాల అన్వేషణ కోసం భవిష్యత్తు ప్రాజెక్టులు, బాహ్య అంతరిక్ష ప్రయాణం మొదలైన వాటిల్లో ప్రైవేట్ రంగానికి తలుపులు తెరిచి ఉంటాయని పేర్కొన్నారు.

ఆరు విమానాశ్రయాలను ప్రభుత్వ, ప్రైవేటు భాగస్వామ్యంలో నడపడానికి వీలుగా వేలం వేయదలచినట్టు ప్రకటించారు. ఇప్పటికే దేశంలో 12 ఎయిర్ పోర్టులు పిపిపి విధానంలో కేటాయించామని తెలిపారు. దేశవ్యాప్తంగా ఎంపిక చేసిన ఆరు విమానాశ్రయాలను కూడా ప్రైవేటు సంస్థకు విక్రయించబోతున్నామని నిర్మలా సీతారామన్ తెలిపారు. వాటిని విక్రయించడానికి త్వరలోనే వేలం నిర్వహిస్తామని అన్నారు. పౌర విమానయానాన్ని బలోపేతం చేయడంలో భాగంగా ఈ నిర్ణయాన్ని తీసుకున్నట్లు మంత్రి తెలిపారు. భారత గగనతలాన్ని వినియోగించు కోవడానికి ఇప్పటిదాకా ఉన్న ఆంక్షలను కూడా సరళీకరించ బోతున్నామని అన్నారు. పబ్లిక్-ప్రైవేటు భాగస్వామ్యం(పిపిపి) కింద విమానాశ్రయాల నిర్వహణను మెరుగుపర్చడానికి ఎయిర్‌పోర్ట్ ఆథారిటీ ఆఫ్ ఇండియాకు అవకాశం ఇచ్చినట్లు చెప్పారు. దేశంలో రు. 13 వేల కోట్లతో 12 ఎయిర్ పోర్టుల నిర్మాణానికి కేంద్రం నిర్ణ యించిందన్నారు. విమాన మరమ్మతుల హబ్‌గా భారత్‌ను తీర్చిదిద్దే ప్రయత్నం చేస్తున్నామని చెప్పారు. భారతీయ వాయు స్థలాన్ని ఉపయోగించుకోవడంలో ఆంక్షలు సడలిస్తామని తెలిపారు.

బొగ్గు రంగంలో వాణిజ్య మైనింగ్ ప్రవేశపెట్టేందుకు విధాన సంస్కరణలు తీసుకొస్తున్నామని చెప్పారు. ఆ రంగంలో ప్రైవేట్‌కు భాగస్వామ్యం కల్పిస్తామన్నారు. పెట్టుబడులను విశేషంగా ఆకర్షించదలచి వాటి ప్రవేశానికి సరళమైన నిబంధనలను రూపొందిస్తామని చెప్పారు. బొగ్గు ఉత్పత్తికి కొత్తగా 500 బ్లాకులు అందుబాటులోకి తెస్తామన్నారు. గనుల రంగంలో సరళీకృత వ్యాపార విధానాలు తీసుకొస్తామని, ఖనిజ రంగంలో ప్రైవేట్ పెట్టుబడులను మెరుగుపరుస్తామని తెలిపారు. మైనింగ్ లీజుల సమయంలో విధించే స్టాంప్ డ్యూటీల హేతుబద్ధీకరణ చేపడతామని, పాక్షికంగా వినియోగించుకున్న గనులను వేరే వారికి బదిలీ చేసేందుకు వెసులుబాటు కల్పిస్తామని తెలిపారు. 50 బ్లాకులను ప్రైవేట్‌కు తక్షణమే కేటాయించనున్నట్లు తెలిపారు. బొగ్గు, విద్యుత్ సరఫరా లేక చాలా మంది పెట్టుబడిదారులు వెనక్కి వెళ్లారని, బాక్సైట్, బొగ్గు రెండూ కలిపి కేటాయింపులు చేస్తే పెట్టుబడులకు అవకాశం ఉంటుందని అన్నారు. బొగ్గు లేకుండా అల్యూమినియం ఉత్పత్తి కాదని, బొగ్గు, బాక్సైట్ వేలం సంయుక్తంగా నిర్వహిస్తామని పేర్కొన్నారు.

దేశ భద్రతకు సంబంధించిన రక్షణ రంగాన్ని మేక్ ఇన్ ఇండియాను ప్రోత్సహించి ఆర్డినెన్స్ ఫ్యాక్టరీలను కార్పొరేట్ బాడీలుగా తీర్చిదిద్దామని తెలిపారు. ఆటోమేటిక్ రూట్ కింద రక్షణ తయారీ రంగంలో ఎఫ్‌డిఐ పరిమితి 49 శాతం నుంచి 74 శాతానికి పెంచబోతున్నట్టు తెలిపారు. కార్పొరేటీకరణ అంటే ప్రైవేటీకరణ కాదని, కార్పొరేటీకరణ అంటే సామర్థ్యం, నైపుణ్యాల పెంపు మాత్రమేనని బుకాయిస్తున్నారు. ఆయుధాల ఉత్పత్తి, పరిశోధనలో ఆర్డినెన్స్ ఫ్యాక్టరీలు పారదర్శక నిర్ణయాలు తీసుకుంటాయని చెప్పారు. ఆర్డినెన్స్ ఫ్యాక్టరీలను స్టాక్ మార్కెట్లలో నమోదు చేస్తామన్నారు. అంటే ద్రవ్య పెట్టుబడికి ద్వారాలు బార్లా తెరువనున్నట్లు చెప్పకనే చెప్పారు.

సామాజిక మౌలిక సదుపాయాల్లో ప్రైవేట్ రంగ పెట్టుబడులను పెంచడానికి వైబిలిటీ గ్యాప్ ఫండ్ స్కీమ్‌కు రు. 8,100 కోట్లు కేటాయిస్తున్నట్టు తెలిపారు. మొత్తం ప్రాజెక్టు వ్యయాన్ని 20 శాతం నుంచి 30 శాతం వరకు ప్రభుత్వ వైబిలిటీ గ్యాప్ ఫండింగ్‌ను

పెంచుతుందన్నారు. పిపిపి మోడల్‌లో వైద్య ఐసోటోపుల ఉత్పత్తిని ప్రోత్సహించడం కోసం పరిశోధన రియాక్టర్‌ను పిపిపి మోడల్‌లో ఏర్పాటు చేస్తామని తెలిపారు. ఇందుకు అణురంగాన్ని ఉపయోగిస్తామన్నారు. క్యాన్సర్ ఇతర వ్యాధుల చికిత్స కోసం మానవ జాతి సంక్షేమానికి వైద్య ఐసోటోపుల ఉత్పత్తి పిపిపి మోడల్ ద్వారా జరుగుతుందన్నారు. వ్యవసాయ సంస్కరణలను ప్రోత్సహించడానికి, రైతులకు సహాయం చేయడానికి ఆహార సంరక్షణ కోసం రేడియేషన్ టెక్నాలజీని ఉపయోగించడానికి పిపిపి మోడల్‌లో సౌకర్యాలను ఏర్పాటు చేస్తామన్నారు. దీంతో దాదాపు అన్ని కీలక రంగాల్లోనూ ప్రైవేటు భాగస్వామ్యానికి తెర తీసినట్టయిందని అర్థమవుతున్నది.

సరళతర వాణిజ్యం, బిఎఎఫ్ఆర్ అమలులో తమ ప్రభుత్వం ముందుందని మంత్రి నిర్మలా సీతారామన్ తెలిపారు. విదేశీ పెట్టుబడులకు కేంద్రంగా భారత్‌ను తీర్చిదిద్దే ప్రక్రియ నిరంతరం జరుగుతున్నదన్నారు. బ్యాంకు రుణాల ద్వారా క్రోనీ క్యాపిటలిస్టులు ఏర్పడకుండా జాగ్రత్త పడుతున్నామని చెప్పారు. 'ఒకే దేశం- ఒకే మార్కెట్'ను తీసుకురావడం గొప్ప సంస్కరణగా అభివర్ణించారు. పెట్టుబడిదారులతోనూ, కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలతోనూ సమన్వయం చేస్తూ ఇన్వెస్టెబుల్ ప్రాజెక్టులను సిద్ధం చేయడానికి ప్రతి మంత్రిత్వ శాఖలో ప్రాజెక్ట్ డెవలప్‌మెంట్ సెల్‌ను ఏర్పాటు చేస్తున్నామన్నారు. పారిశ్రామిక మౌలిక సదుపాయాలను అభివృద్ధి చేస్తామని, పారిశ్రామిక సమాచార వ్యవస్థ (ఐఐఎస్)లో 5 లక్షల హెక్టార్లలో 3,376 పారిశ్రామిక పార్కులు, ఎస్టేట్లు, సెజ్‌లు మ్యాప్ చేశామని తెలిపారు. అన్ని పారిశ్రామిక పార్కులు 2020-21లో ర్యాంక్ చేస్తామని చెప్పారు.

సూక్ష్మ, చిన్న, మధ్య తరహా పరిశ్రమల (ఎంఎస్ఎంఇల) పట్ల ప్రత్యేక శ్రద్ధ చూపిస్తున్నామని చెబుతూ ప్రకటించిన రు. 3 లక్షల కోట్ల సాయం కూడా అప్పు రూపంలో ఇచ్చి వడ్డీతో సహా గోళ్లూడగొట్టి వసూలు చేసుకోవడానికి ఉద్దేశించిందేనని స్పష్టమైపోయింది. 50 రోజులకు పైగా ఉత్పత్తి కార్యకలాపాలు, వ్యాపారాలు మూతపడిపోయి వాటిని తెరువడానికి కావలసిన కనీస పెట్టుబడి కరువైన స్థితిలో ప్రభుత్వమిచ్చే వడ్డీ భారంతో కూడిన రుణాలను తీసుకోడానికి ఎంత మంది ముందుకు వస్తారనేది కీలకం. వివిధ స్వయం ఉపాధి పనులు చేసుకుంటూ బతుకులు వెళ్లమార్చేవారు, రోజు కూలీలు ఇలా ఎంతో మంది ఈ రోజున తీవ్ర నిరాశమయ స్థితిలో ఉన్నారు. వీరందరికీ నేరుగా నగదు సదుపాయం చేసి వారిలో జీవితం మీద విశ్వాసాన్ని తిరిగి పాదుకొల్పవలసిన పాలకులు అటు అదీ చేయక మరోకవైపు ఇదే సందుగా భావించి దేశాన్ని మరింత ప్రైవేట్ గుప్పెట్లోకి నెట్టివేయ బోవడాన్ని ఎంత మాత్రం హర్షించలేము.

కీలక రంగాల్లో పెట్టుబడులకు వేగంగా అనుమతులివ్వడానికి కార్యదర్శుల సాధికార బృందం ద్వారా ఫాస్ట్‌ట్రాక్ ఇన్వెస్ట్‌మెంట్ క్లియరెన్స్ విధానాన్ని అమలులోకి తీసుకొచ్చినట్లు నిర్మలా సీతారామన్ గుర్తుచేశారు. ప్రతి శాఖలో ప్రాజెక్టు డెవలప్‌మెంట్ సెల్ పెట్టనున్నారు. కొత్త ప్రాజెక్టుల రూపకల్పనతో పాటు పెట్టుబడిదారులు, కేంద్ర/రాష్ట్ర ప్రభుత్వాల మధ్య సమన్వయం పెంచడమే ఈ సెల్ ఉద్దేశమని తెలిపారు. కొత్త పెట్టుబడిదారులను ఆకర్షించే విషయంలో రాష్ట్రాలకు ర్యాంకులు ఇవ్వనున్నట్టు తెలిపారు. ఇండస్ట్రియల్ ఇన్ఫర్మేషన్ సిస్టమ్(ఐఐఎస్) పరిధిలోకి 3,376 పారిశ్రామిక ఎస్టేట్లు/ సెజ్‌లను తీసుకొచ్చామన్నారు. అన్ని ఇండస్ట్రియల్ పార్కులకు 2020-21లో ర్యాంకులు ఇస్తామని తెలిపారు. ఇదంతా గమనిస్తే కేంద్రమే కాదు రాష్ట్రం కూడ విదేశీ పెట్టుబడులకు హారతులు పట్టాలని నిర్దేశించడం తప్ప మరొకటి కాదు.

**ముగింపు**

తీవ్ర సంక్షోభంలోకి నెట్టబడ్డ భారత ఆర్థిక వ్యవస్థను కరోనా నేపథ్యంలో లాక్‌డౌన్ సాకుతో చాపకింది నీరులా ఆర్థిక ప్యాకేజీ పేరుతో బిజెపి ప్రభుత్వం ఆశిస్తున్న సంస్కరణలను ప్రకటించడం, రాష్ట్ర ప్రభుత్వాలను తన కంట్రోల్‌లోకి తెచ్చుకోవడం జరుగుతుంది. మొత్తం దేశ ఆర్థిక వ్యవస్థను విదేశీ, స్వదేశీ బడా కార్పొరేట్ సంస్థల గుప్పెట్లో పెట్టబోతున్నారు. పైగా ఈ దేశాన్ని తామే ఉద్ధరిస్తున్నామని డాంభికాలు పలకడం మోడీ ప్రభుత్వ వ్యూహంలో భాగంగా కన్పిస్తోంది. విచిత్రమేమిటంటే ఈ సంస్కరణల గురించి రాష్ట్రాలతో గానీ, పార్లమెంటులో గానీ, జాతీయ అభివృద్ధి మండలితో గానీ చర్చించలేదు. ఈ ప్యాకేజీలో అత్యధిక భాగం బ్యాంకులు ఇచ్చే రుణాలే ఉన్నాయి. ప్రభుత్వం చేసే వ్యయం నామమాత్రం. అందులో ప్యాకేజీ పాలు తక్కువ. ప్రకటనలు, ప్రచారం పాలు ఎక్కువ అన్నది సులభంగానే అర్థమవుతుంది. ఈ ప్యాకేజీ సారాంశాన్ని గమనిస్తే 1991 సంస్కరణలను మించిన ఉత్పాతం అని విధితమవుతుంది. ప్రధాని మోడీ జాతినుద్దేశించి మాట్లాడుతూ రు. 20 లక్షల కోట్ల ప్యాకేజీ అంటూ చేసిన అట్టహాస ప్రకటన, లాక్‌డౌన్ వల్ల చిల్లి గవ్వలేని దుస్థితికి చేరుకున్న కోట్లాది బడుగు జనానికి అది ఎంత మాత్రం గొడుగు కాదని ఆ తర్వాత ఐదు రోజులుగా ఆర్థిక మంత్రి వెల్లడించిన దాని వివరాలు రుజువు చేశాయి.

మోడీ బిజెపి ప్రభుత్వ పాలనలో బ్యాంకులను ముంచేసి ఆస్తులను పెంచుకునే భ్రష్టాచారానికి అలవాటుపడిన ప్రైవేట్ రంగం, ఆశ్రిత పెట్టుబడిదారీ విధానం లోతుగా వేళ్లూనుకున్న దేశంలో ప్రధాని మోడీ ప్రభుత్వం ఆవిష్కరించిన 20.9 లక్షల కోట్లు ప్యాకేజీ మరొక పెద్ద కుంభ కోణానికి దారి తీసినా ఆశ్చర్యపోవలసిన అవసరం లేదు. 21 లక్షల కోట్ల కిమ్మతు పథకమని మీడియాలో జోరుగా ప్రచారం జరుగుతోంది. ఈ ప్యాకేజీ దేశీయ పరిశ్రమల వికాసానికి, విదేశీ వస్తు బహిష్కరణకు తోడ్పడుతుందని ప్రభుత్వం ప్రచారం చేస్తోంది. నిజానికి ప్రభుత్వ చర్యలు దేశ స్వావలంబనకు, స్వయం పోషకత్వాన్ని దెబ్బతీసి దేశ పరాధీనతకు దారితీసేలాగుంది. అందువల్ల ఈ ప్యాకేజీలోని నిజానిజాలను తెలుసుకొని, అందులోని డొల్లతనాన్ని బుద్ధిజీవులు, ప్రగతిశీల వ్యక్తులు బహిర్గతం చేయవలసి ఉంది.

దేశ భద్రత, ప్రగతి, సాధారణ ప్రజల సంక్షేమంతో నేరుగా ముడిపడి ఉన్న ఈ రంగాలను పాలకులకు ఆశ్రితులైన ప్రైవేట్ సంపన్న పెట్టుబడిదారులకు బేషరతుగా ధారాదత్తం చేయడం ఎంత వినాశకరమో చెప్పనక్కర లేదు. అటువంటి దుస్సాహస చర్యను కరోనా పీడిత సువిశాల భారతాన్ని ఆదుకోడానికి తీసుకున్న నిర్ణయంగా ప్రకటించడం విడ్డూరం. మోడీ ప్రభుత్వం, దాని వందిమాగదులు మరొకసారి ఉత్తుత్తి చప్పుళ్లతో ఉవ్వెత్తు ప్రచారాన్ని సాగిస్తున్నారు. ఈ ప్రచారాన్ని కార్మికులు, రైతాంగం, విద్యార్థులు, దేశభక్తులు, ప్రగతి కాముకులు ముక్తకంఠంతో ఖండించాల్సిన అవసరం ఉంది. అంతేగాదు మొత్తం భారత ఆర్థిక వ్యవస్థ స్వదేశీ, విదేశీ కార్పొరేట్ల కబంధ హస్తాల్లో బందీ కాబోతున్నది. అందువల్ల సామ్రాజ్యవాద, భూస్వామ్య వ్యతిరేక ఐక్య ప్రతిఘటనోద్యమం నిర్మించాల్సిన చారిత్రక సందర్భం ఇది.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

# సూక్ష్మ, చిన్న, మధ్యతరహా పరిశ్రమల ఉద్దీపన

*లాక్‌డౌన్ కారణంగా దెబ్బతిన్న సూక్ష్మ, చిన్న, మధ్యతరహా పరిశ్రమలు యథాస్థితికి చేరుకోవాలంటే వాటిని ప్రభుత్వం ఆర్థికంగా ఆదుకొంటూనే ప్రజల కొనుగోలు శక్తి పెంచాలని అంటున్నారు* **డా. ఎ. పున్నయ్య**

ప్రపంచ వ్యాప్తంగా రూపాంతరీకరణ చెందిన కరోనా వైరస్ అత్యంత శక్తివంతంగా వేగంగా విస్తరిస్తోంది. ప్రత్యామ్నాయం లేక ప్రపంచ దేశాలు అనివార్యంగా లాక్‌డౌన్‌ను మార్గంగా ఎంచుకున్నాయి. దీనితో గ్లోబల్‌గా కార్యకలాపాలు స్థంబించి వ్యాపార, వాణిజ్యం పూర్తిగా దెబ్బతిన్నది. గతంలో ఎన్నడూ లేని విధంగా అంతర్జాతీయ ఆర్థికవ్యవస్థ చిన్నాభిన్నమైంది. ప్రపంచ దేశాధినేతలందరు ఈ ఉత్పాతం నుండి ప్రజల ప్రాణాలు కాపాడడానికి వాక్సిన్ కోసం తీవ్రంగా పరిశోధిస్తూ నివారణ హెచ్చరికల నడుమ జీవనోపాధికోసం అన్వేషిస్తున్నారు. ఇప్పటికే జరగాల్సిన దానికంటే అధికంగా నష్టం జరిగింది. లాక్‌డౌన్ దశలవారిగా ఇంకా కొనసాగితే ఆకలి చావులు మరిన్ని పెరిగి లక్షల మంది ప్రాణాలు కోల్పోయే దుస్థితి ఒకవైపు ఉంది. లాక్‌డౌన్ సంపూర్ణంగా ఎత్తివేస్తే ఈ మహమ్మారి మరింత ఉత్పాతాన్ని సృష్టించే పరిస్థితి నేడు అన్ని దేశాలను వేధిస్తూ అయోమయపరుస్తుంది. ఆర్థిక వ్యవస్థను చక్కదిద్దే పేరుతో షరతులతో లాక్‌డౌన్‌ను పాక్షికంగా ఎత్తివేశారు. ఈ విషమ పరిస్థితిని అధిగమించడానికి 80 శాతం మంది ప్రజలను ఉద్దీపన ప్యాకేజీ ద్వారా ప్రభుత్వాలే కాపాడుకోవాలని ప్రపంచ అగ్రశ్రేణి ఆర్థిక వేత్తలు అభిప్రాయపడ్డారు. వీరి సూచన ప్రకారంగా ప్రపంచంలో తీవ్ర మాంద్యం వలన ఆదాయం లేక విలవిలలాడుతున్న ప్రజలకు ఉపాధి అవకాశాలు సృష్టించి 'సమిష్టి డిమాండ్‌ను' పెంచి ఆర్థిక వ్యవస్థను పునరుజ్జీవించడానికి ప్రపంచదేశాలన్నీ తమ శక్తి కొలది ఉద్దీపన ప్యాకేజీలు ప్రకటించాయి. ఈ క్రమంలో అమెరికా 10, బ్రిటన్ 17, జపాన్ 21.1, సింగపూర్ 13, మలేషియా 16.2, సౌత్ ఆఫ్రికా 10, డెన్మార్క్ 13 శాతం తమ జిడిపిలో ఆర్థిక ఉద్దీపన ప్యాకేజీలు ప్రకటించాయి. ఇక అమెరికాతో సహా 90 దేశాలు ఈ సంక్షోభాన్ని ఎదుర్కోవడానికి నేరుగా పన్ను చెల్లింపు స్థాయి ఆధారంగా ప్రజల ఖాతాల్లోకి డబ్బులు జమ చేసినట్లు ప్రపంచ బ్యాంకే నివేదించింది.

### ఆత్మనిర్భర్ భారత్ ప్రకటన అనివార్యత

ప్రపంచంలో ధనిక బీద దేశాలు భారీ ఉద్దీపనలు ప్రకటించాయి. దీనితో అంతర్జాతీయంగా భారత్‌పై ఒత్తిడి పెరిగింది. దీంతో పాటు విదేశీ రేటింగ్ ఏజెన్సీలు భారత ఆర్థిక వ్యవస్థకు తక్కువ రేటింగ్ ఇస్తే విదేశీ పెట్టుబడులు నిలుస్తాయన్న భయంతో, వృద్ధికి ఊతమివ్వడమే ధ్యేయంగా స్వావలంబన పేరు లక్ష్యంగా మే 12న దేశ ప్రధాని 'ఆత్మనిర్భర్ భారత్ అభియాన్' ప్రకటించారు. ఇందులో కేవలం ఆర్భాటంగా ఐదు సూత్రాలు, 15 అంశాలు, గణమైన అంకెలు, అమలు సాధ్యంకాని హామీలు దీర్ఘకాలిక చర్యలను జోడించి జిడిపిలో 10 శాతంగా రు. 20 లక్షల కోట్ల ప్యాకేజీ నిర్ణయించారు. మరుసటి రోజు నుండి వరసగా ఐదు రోజులు ఆర్థికమంత్రి ఇచ్చిన వివరణలో గోరంతను కొండంతగా చేసి చూపించారు. జాగ్రత్తగా పరిశీలిస్తే దీంట్లో విధానాలు తప్ప ఈ సంక్షోభాన్ని గట్టెకించే రాయితీలేలేవు. కరోనాకు ముందే భారత ఆర్థిక వ్యవస్థ తీవ్రమాంద్య ప్రభావంతో కదలలేని స్థితిలోకి పోయింది. 2014 నుండి వృద్ధిరేటు క్షీణిస్తూ మూడు దశాబ్దాల కనిష్ట స్థాయికి చేరింది. నేడు కరోనా ముప్పుతో దేశ ఆర్థిక వ్యవస్థ కకావికలమైంది. అయినప్పటికీ ఈ క్రమంలో కేంద్రం ప్రకటించిన ఈ రు. 20 లక్షల కోట్ల ఉద్దీపనతో ప్రభుత్వంపై పడే వాస్తవ ఆర్థిక భారం దాదాపు రు. 1.50 లక్షల కోట్లని బార్‌క్లేస్ బ్రోకరేజి సంస్థ అంచనా వేసిందంటే ఈ ప్యాకేజీలో ఎంత మోసం, దగా దాగి ఉందో అర్థమవుతుంది. మరోవైపు ఈ ప్యాకేజి పేరుతో వ్యూహ రహిత రంగాల్లోని ప్రభుత్వరంగ సంస్థలను ప్రైవేటీకరించేందుకు, దేశీయ, విదేశీ బడా పెట్టుబడిదారులకు అడ్డు, అదుపు లేకుండా కోట్లు కొల్లగొట్టడానికి దారులను బారులుగా తెరిచారు. ఇప్పటివరకు కేంద్ర ప్రభుత్వ గుత్తాదిపత్యంలో కొనసాగుతున్న ముఖ్యమైన ప్రభుత్వ రంగాలను కూడ చావుదెబ్బ తీయబోతున్నారు.

### దేశ స్వావలంబనను దెబ్బతీసే అదృశ్య చర్యలే ఆత్మనిర్భర భారత్

ఈ ప్యాకేజీ ముసుగులో భారతదేశంలో అత్యధికంగా ఉన్న పేదవాళ్లు తమ చెమటను రక్తంగా మార్చుకొని చెల్లించిన పన్నులతో నిర్మించుకుంటూ వచ్చిన 339 ప్రజా ఉపయోగ ప్రభుత్వ రంగ సంస్థలను ప్రైవేటీకరణ చేస్తున్నట్లు ఈ ప్రభుత్వం ప్రకటించింది. దీంతో దేశ ఆర్థిక జీవనాడులుగా ఉన్న స్టీలు, పెట్రోలియం, గ్యాస్, విద్యుత్, మైనింగ్, పోర్టులు, ఎయిర్ పోర్టులు, బొగ్గు, టెలికం, షిప్పింగ్, రవాణా, ఎలక్ట్రికల్ లాంటి భారీ ప్రభుత్వరంగ సంస్థలు అదృశ్యం కాబోతున్నాయి. ఈ సంస్థలన్నీ గత ఆర్థిక సంవత్సరంలో రు. 1.74 లక్షల కోట్ల లాభాలు గడించాయి. కేవలం 70 కంపెనీలు రు. 31 వేల కోట్ల నష్టాలు పొందినాయి. ఇదే కాలంలో ఉత్పత్తుల అమ్మకాల ద్వారా రు. 25.43 లక్షల కోట్ల ఆదాయం ఆర్జించాయి. నేటికి ఈ కంపెనీల వద్ద రు. 9.93 లక్షల కోట్ల రిజర్వు నిధులున్నాయి. గతేడాది పన్నుల రూపంలో రు. 3.68 లక్షల కోట్లు, డివిడెండ్స్ రూపంలో రు. 71 వేల కోట్లు రాగా 2020-21 బడ్జెట్‌లో రు. 1.50 లక్షల కోట్లు డివిడెండ్స్ అందించినాయి. ఇందులో కార్మికుల వేతనాల కింద కేవలం రు. 1.53 లక్షల కోట్లు చెల్లిస్తున్నారు. ఇప్పటి వరకు కేవలం రు. 26 లక్షల కోట్లు మాత్రమే ప్రభుత్వం పెట్టుబడి పెట్టింది. ప్రస్తుత మార్కెట్ రేటు ప్రకారం అంచనా విలువ 20 రెట్లు అధికం. వీటితోపాటు ప్రతి ఏడాది ఈ కంపెనీల విస్తరణ కోసం సగటున రు. 2.5 లక్షల కోట్లు నూతన పెట్టుబడులు పెడుతున్నాయి. ఈ సంస్థలు అనేక నగరాల అభివృద్ధికి

మూలకేంద్రంగా ఉంటూ దేశ ఆర్థికవ్యవస్థలో సమిష్టి డిమాండ్ పెంచుకుంటూ ఆర్థికాభివృద్ధి విస్తరణకు కేంద్రంగా ఉన్నాయి. ఇంత ప్రజోపయోగంగా ఉండి ముఖ్య పాత్ర పోషిస్తున్న ప్రభుత్వరంగ సంస్థలను అమ్మడం వెనుక దేశ ప్రయోజనాలకన్నా విదేశీ, స్వదేశీ బడా కార్పొరేట్ సంస్థల లాభాల కోసమే ఈ ప్రభుత్వరంగ సంస్థల స్వభావాలను, స్వరూపాలను దిగజార్జి ఉనికి లేకుండా చేసింది.

**సూక్ష్మ, చిన్న, మధ్యతరహా పరిశ్రమలకు కేటాయింపులు**

భారత ఆర్థిక వ్యవస్థకు వ్యవసాయం వెన్నుముక వంటిదైతే, దేశాభివృద్ధిని వేగవంతం చేసేవి సూక్ష్మ, చిన్న, మధ్యతరహా పరిశ్రమలే. ఇవి దేశ జనాభాలో సుమారు 30 శాతం మందికి జీవనోపాధిని కల్పిస్తూ జాతీయాదాయానికి 30 శాతం ఆదాయాన్ని అందిస్తున్నాయి. 45 శాతం ఎగుమతులతో ఆర్థిక వ్యవస్థ వృద్ధికి ముఖ్యపాత్ర పోషిస్తుంది. ప్రభుత్వ అనాలోచిత నిర్ణయాల మూలాన ఈ రంగం కరోనాకు పూర్వం నుండే ఆర్థిక ఒత్తిడిలో ఉంది. ఆర్థిక మాంద్యం కారణంగా నాన్ బ్యాంకింగ్ ఫైనాన్స్ కంపెనీలకు తగిన విధంగా సాయం అందడం లేదు. గతంలో ఎంఎస్ఎంఇలు ఉజ్వల ప్రకాశాన్ని వెదజల్లాయి. కాని ఇంతటి కీలక రంగానికి ఈ సంక్షోభం నుండి గట్టెక్కించేందుకు కేవలం రు. 3.70 వేల కోట్ల రుణాలిస్తామనే ప్రభుత్వ ప్రకటన నిరాశపరిచింది. సర్వే ప్రకారంగా మన దేశంలో సుమారు 10 కోట్ల చిన్న పరిశ్రమలుండగా వాటిలో 45 లక్షల పరిశ్రమలకు రు. 3 లక్షల కోట్ల రుణ సదుపాయం కల్పించేందుకు కేంద్ర ఆర్థిక మంత్రిత్వశాఖ హామీ పడింది. బ్యాంకుల నిరర్థక ఆస్తులలో 10 శాతం స్థాయిలో అంటే రు. 30 లక్షల కోట్ల మేరకు చిన్న పరిశ్రమలకు రుణ సదుపాయం కల్పించాలి. అయితే కేవలం రు. 70,000 కోట్లు మాత్రమే మంజూరు చేశారు. అందులో కూడ కేవలం రు. 35,000 కోట్లు మాత్రమే పంపిణీ చేశారు. వేలాది చిన్న పరిశ్రమలు మూతపడ్డాయి. లక్షలాది కార్మికులు వీధిన పడ్డారు. ఉద్యోగాల నష్టం భారీ స్థాయిలో ఉంది. సూక్ష్మ చిన్న మధ్యతరహా పరిశ్రమలు మరింత సంక్షోభంలోకి దిగజారిపోయాయి.

**కార్పొరేట్లను ప్రోత్సహించడానికే నిర్వచనంలో మార్పులు**

భారతదేశ పురోగమనంలో సూక్ష్మ, చిన్న, మధ్యతరహా పరిశ్రమల రంగం అతిపెద్ద వాటాదారుగా రుజువు చేసుకుంది. ఈ క్రమంలో ఈ రంగానికి నవశక్తిని జోడించి భారతదేశాన్నే గర్వించదగిన స్థాయికి తీసుకుపోవాలని కాని ప్రభుత్వ రాయితీలు పోతాయని, కార్పొరేట్లు తమ పెట్టుబడులను గరిష్ట స్థాయిలో నిలుపుదల చేస్తున్నారని, దీని వలన ఆర్థిక వ్యవస్థ విస్తరణ జరగడం లేదని, అత్యధికంగా యూనిట్లు ఉన్న సూక్ష్మ, చిన్న, మధ్యతరహా వ్యాపారులు నష్టపోయేలా, కార్పొరేట్లు లాభపడేలా నిర్వచనాన్నే మార్చినారు. ఏదైన సంస్కరణ జరిగితే అధికంగా ఉన్న సూక్ష్మ, చిన్న, మధ్యతరహా వ్యాపారులు లాభపడితే దేశంలో అధికంగా ప్రయోజనం ఉంటుంది. కాని మార్చిన నిర్వచనం కేవలం ఉన్నవాళ్లను మరింత ఉన్నవాళ్లుగా మార్చే అవకాశాన్నిచ్చింది. దీని వల్ల ఎక్కువ పెట్టుబడి ఉన్నవాళ్లే ఇందులో ఉండే విధంగా వారికే ప్రభుత్వ రాయితీలు అందేలా చర్యలు ఉన్నాయి. గతంలో సూక్ష్మ తరహా పరిశ్రమల లావాదేవీలు రు. 25 లక్షల నుండి ప్రారంభమైతే నేడు దానిని కోటి రూపాయల వరకు పెంచారు. గతంలో చిన్నతరహా పరిశ్రమల లావాదేవీలు రు. 1 కోటి నుండి ప్రారంభమయ్యాయి. నేడు అవి రు. 10 కోట్లకు పెంచారు. మధ్యతరహా పరిశ్రమలు రు. 10 కోట్ల నుండి ప్రారంభమయ్యేది. నేడు అది రు. 20 కోట్లకు పెంచారు. చిన్న చేపలను పెద్ద చేపలు మింగినట్లు కార్పొరేట్ సామ్రాజ్యం వాటిని కనుమరుగు చేసి ఎట్లా విస్తరిస్తుందో అర్థం చేసుకోవచ్చు. ఈ నిర్వచనంలోని మార్పుల వలన గతంలో పెద్ద యూనిట్లు ఎంఎస్ఎంఇ పరిధికి రానివి నేడు అనేకం వస్తున్నాయి. దీనివలన పెద్ద యూనిట్ల సంఖ్య గణనీయంగా పెరుగనుంది. ఇక పెద్ద కార్పొరేట్లకే రాజకీయ పలుకుబడి ఉంటుంది. వారికే అధిక రాయితీలు రుణాలు అందనున్నాయనేది నిర్వివాదాంశం.

**ప్రభుత్వ రుణ వితరణే చిన్న ఎంఎస్ఎంఇలకు ప్రయోజనం**

ఎంఎస్ఎంఇ చిన్న యూనిట్లను ఆదరించకుండా, ప్రోత్సహించకుండా నిర్వీర్యమయ్యే ప్రభుత్వ విధానాలతో ప్రభుత్వ రంగంలో 2018లో రుణాల వాటా 18 శాతం ఉంటే నేడు అది 6 శాతానికి తగ్గింది. ప్రైవేటు రుణాల వాటా 32 శాతం ఉంటే నేడది 39 శాతానికి పెరిగింది. పలుకుబడి గల కార్పొరేట్లు ప్రభుత్వ బ్యాంకుల్లో రుణాలు కోటానుకోట్లు ఎగ్గొట్టడం మూలాన ఏ పలుకుబడిలేని చిన్న చిన్న ఎంఎస్ఎంఇలకు బ్యాంకులు రుణాలు ఇవ్వడం లేదు. ఈ ప్యాకేజీ ద్వారా ప్రభుత్వమే ఇక రుణాలపై 100 శాతం గ్యారంటీ ఇస్తుంది. దీనినే కొల్లెటర్ ఫ్రీ అంటున్నారు. ఇది కేవలం 100 శాతం కార్పొరేట్లకు మాత్రమే ఉపయోగపడనుంది. గతంలో వేరే బ్యాంకులను దివాలా తీయించి వీరు ఇతర దేశాల్లో విలాసవంతమైన జీవితాన్ని చట్టబద్ధంగానే అనుభవిస్తున్నారు. ఈ క్రమంలో భారత బ్యాంకింగ్ నష్టాల చరిత్రలో రాజకీయ నాయకులు, పెద్ద వ్యాపారులు అవినీతి బ్యాంకు అధికారులే ముద్దాయిలుగా నిలబడితే, కష్టాల చరిత్ర నిజాయితీగల ఎంఎస్ఎంఇల యాజమానులది. ఈ ఎగవేతల కారణంగా ఎన్‌పిఎలు, మొండి బాకీలు పెరుగుతాయి. ఇది ప్రభుత్వ బ్యాంకులపై ఒత్తిడిని పెంచింది. మన బ్యాంకులు కొన్నిసార్లు ప్రభుత్వం ఆశించినట్లు గానీ, రిజర్వ్ బ్యాంకు చెప్పినట్లుగానీ వినవు. పలుకుబడి గల పెట్టుబడిదారులకు మాత్రం ప్రాధాన్యతనిస్తాయి. కొవిడ్–19 ప్రభావంతో రిజర్వ్‌బ్యాంకు 3 నెలల పాటు ఇఎంఐ చెల్లింపులపై మారిటోరియం విధిస్తే అది ఆచరణలో అందరికి అమలుకాలేదు. చిన్న చిన్న ఎంఎస్ఎంఇల విషయంలో కూడా ఇంతకంటే మెరుగ్గా ఉండదు. ఎలాంటి హామీ లేకుండా రుణాలిస్తే తామే నష్టపోతామన్న ఆందోళనలు కూడా బ్యాంకులకుంటాయి. వాటికి రిజర్వ్ బ్యాంకు నిబంధనలు గుర్తొస్తాయి. చిన్న చిన్న ఎంఎస్ఎంఇ యజమానులకు ప్రయాస తప్ప ఫలితం శూన్యం. కావున ప్రభుత్వమే ఒక ప్రత్యేక సంస్థను ఏర్పాటుచేసి దాని ద్వారానే నేరుగా రుణ వితరణ రాష్ట్ర ప్రభుత్వాల ప్రమేయంతో పారదర్శకంగా అమలు చేయిస్తే ఫలితముంటుంది.

**ప్రభుత్వం నుండి ఎంఎస్ఎంఇలు ఆశించే చర్యలు**

ఎంఎస్ఎంఇలు జరీ నుండి చేనేత దాకా, వ్యవసాయాధారం నుండి క్రీడా పరికరాల దాకా, వస్త్రాల నుండి ఆయుధాల తయారీ వరకు, ఊలు ఉత్పత్తి నుండి విద్యుత్ ఉత్పత్తి దాకా అన్ని రంగాలలో కీలక పాత్ర వహిస్తున్నాయి. మన భారతీయ వారసత్వాన్ని సమున్నతంగా కొనసాగిస్తున్నాయి. కావున వీటికి అత్యాధునిక మౌలిక వసతుల స్థాయిని పెంచాలి. వీటికి సాంకేతిక విజ్ఞానాన్ని అందించి స్వచ్ఛమైన వ్యాపారానికి

ప్రోత్సహించాలి. కాని ప్రపంచ వాణిజ్య సంస్థ ఒప్పందంలో భాగంగా పారిశ్రామిక అభివృద్ధి చెందిన దేశాలవలే అధునాతన, ఆటోమెటిక్ రోబో ఫ్యాక్టరీలను అభివృద్ధి పరుచుకోవాలనే ఆరాటం నుండి బయటకు రావాలి. ఆ అధునాతన కంపెనీలు, దేశీయ, విదేశీ సరుకులను చౌక ధరలకు విరివిగా అందించగలుతున్నాయి. ఆ చౌక వస్తువులతో మన దేశీయ చిన్న పరిశ్రమల ఉత్పత్తులు పోటీపడలేక పోతున్నాయి. ఇది స్వావలంభన నినాదానికి వ్యతిరేకమే. ఈ వాస్తవాన్ని దృష్టిలో ఉంచుకొని ప్రభుత్వం తక్షణమే డబ్లుటిఓ ఒప్పందం మేరకు అన్నిరకాల సరుకులపై దిగుమతి సుంకాలను గరిష్టంగా పెంచాలి. చౌక దిగుమతుల నుంచి చిన్న పరిశ్రమలను సంరక్షించలేని పక్షంలో ప్రపంచ వాణిజ్య సంస్థ ఒప్పందం నుండి వైదొలగాలి. అప్పుడే ఈ ప్రభుత్వ నినాదాలకు విధానాలకు ఆదరణ ఉంటుంది. చిన్న పరిశ్రమలు వస్తువులు, సేవల పన్ను వంటి చారిత్రాత్మక పన్ను సంస్కరణలను అనువర్తింప చేసుకున్న దరిమిలా ఈ పన్ను తగ్గించేందుకు ప్రభుత్వం పటిష్టమైన చర్యలు తీసుకోవాలి. దిగుమతి సుంకాల తగ్గింపు కార్పొరేట్ సంస్థల ప్రయోజనానికి చిన్న పరిశ్రమలకు లాభాదాయకంగా ఉండే పోర్టర్ ద్వారా రుణాలు పొందే చర్యలుండాలి. దేశ పారిశ్రామిక విప్లవానికి చిన్నతరహా పరిశ్రమలు కొత్త కోణాన్ని ఆవిష్కరించేందుకు ప్రోత్సాహకా లందించాలి. ఈ ప్యాకేజీ ద్వారా ప్రకటించిన రు. 3 లక్షల కోట్లు ఏ మేరకు ఈ రంగానికి సరిపోవని, ఇప్పటికే ఈ పరిశ్రమలకు రు. 45 లక్షల కోట్లు అవసరముంటాయని భారత వ్యాపార సంస్థలు కరోనా ప్రభావం కంటే ముందే తెలియజేసినారు. ఆ మేరకు పెట్టుబడుల స్థాయిని పెంచితేనే ప్రపంచ మార్కెట్‌కు దీటుగా ఉత్పత్తినందిస్తాయి. స్వావలంభన లక్ష్యం సాకారమౌతుంది.

**కార్పొరేట్ల కొరకు కార్మిక చట్టాలను కాలరాశారు**

ఈ సంక్షోభ తీవ్రతను కారణంగా చూపి కార్మిక వర్గాన్ని శాశ్వతంగా బానిసత్వంలోకి నెట్టడానికి కార్మిక చట్టాలను, హక్కులను కాలరాసే విధంగా ఈ ప్రభుత్వాలు చట్టాలకు చిల్లులు పొడవడం అత్యంత విషాదం. స్వాతంత్ర్యానికి పూర్వం పెట్టుబడిదారులు, యజమానులు, కార్మికులను వెట్టి చాకిరి చేయిస్తూ అమానుషంగా దోపిడికి గురిచేస్తున్న కాలంలో విప్లవ పార్టీల నాయకత్వంలో ప్రజా పోరాటాలు నిరంకుశ బ్రిటిష్ పాలకుల మెడలు వంచి కార్మిక చట్టాలు రూపుదిద్దుకున్నాయి. స్వాతంత్ర్యానంతర కాలంలో బలమైన యాజమాన్యాలను పేదలు, నిస్సహాయులైన కార్మికులు ఎదుర్కోలేనప్పుడు చట్టాల ద్వారానే వీరికి కోర్టులు రక్షణ కల్పించాయి. అనేక చట్టాలున్నప్పటికీ చట్టాలలోని లొసుగుల కారణంగా ఈ ప్రభుత్వాలు ప్రజాహితమైన ప్రభుత్వ రంగ సంస్థలను ప్రైవేటీకరించాయి. కొన్నిటిని మూసివేసాయి. ఇప్పుడు ఆర్థిక వ్యవస్థను తమ ఇష్టారాజ్యంగా కొల్లగొట్టడానికి విదేశీ, స్వదేశీ పెట్టుబడిదారులకు గేట్లు తెరిచిన నేపథ్యంలో వారికి గొడ్డు చాకిరి చేసే కార్మికులను అందించేందుకు ఉన్న ఆ కొన్ని చట్టాలను చట్టుబండలు చేస్తున్నారు. కార్పొరేట్లను సంతృప్తి పరిచేందుకు కార్మికుల మీద పాలకులు తమ ప్రతాపం చూపుతున్నారు. దీంతో కార్మిక చట్టాలలో కనీస వేతనాలు మొదలుకొని పారిశ్రామిక వివాదాలు పని పరిస్థితుల్లో వృత్తి భద్రత, కార్మికుని ఆరోగ్యంతో పాటు కాంట్రాక్టు కార్మికుల ఉనికి బలహీనపడింది. రాబోయే రోజుల్లో కార్మికులది ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక జీవనశైలి పూర్వం లాగా ఉండబోదని అర్థమౌతుంది. ఇప్పటికే ఈ ఉత్పాతం నుండి బయటపడాలనే సాకు చూపిస్తూ ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం 38 నిర్దేశిత కార్మిక చట్టాల నుంచి మినహాయింపు ఆర్డినెన్స్ 2020లో కార్మిక యూనియన్లను, పని పరిస్థితుల్లో వచ్చే సమస్యలు సంబంధిత చట్టాలను మూడేళ్ల పాటు రద్దు చేసింది. దీనిలో భాగంగా పని గంటలు 8 నుండి 12 గంటలకు పెంచనున్నారు. ప్రస్తుతం ప్రతి మనిషికి 8 గంటలు పని, 8 గంటలు విశ్రాంతి, 8 గంటలు సొంత పనికి వినియోగించుకునేలా చట్టాలు నిర్దేశించినాయి. దానికి బదులుగా 12 గంటల పనిని ప్రోత్సహిస్తున్నాయంటే ఈ ప్రభుత్వాలు కార్పొరేట్ల, పెట్టుబడిదారుల పక్షం వహిస్తున్నాయని అర్థం చేసుకోవచ్చు. పరిమిత రక్షణ కల్పించే చట్టాలు అసంఘటిత రంగంలో కార్మికుల హక్కులను కాపాడడంలో విఫలమైనాయి. ఇప్పటికే ఉత్తరప్రదేశ్ మాదిరిగా మధ్యప్రదేశ్, గుజరాత్, హర్యానా, పంజాబ్, హిమాచల్‌ప్రదేశ్, రాజస్థాన్ రాష్ట్రాలు మార్గదర్శకాలు విడుదల చేయగా మిగిలిన రాష్ట్రాలు కూడా అదేదారిలో ఆలోచిస్తున్నాయి. ఇక తెలంగాణ ప్రభుత్వం అధికారం చేపట్టిన నాటి నుండి ఉపాధ్యాయ, ఉద్యోగ, కార్మికవర్గాలపై ఉక్కుపాదం మోపుతూ నిరంకుశంగా అణచివేస్తోంది. ఇటీవల ఆర్‌టిసి సమ్మెను ఎంత నిర్లక్ష్యం చేసిందో కండ్లారా చూసినాం. కార్మిక చట్టాలు బలహీన పడితే నిరుద్యోగులు, పేదలు మరింతగా పెరుగుతారు. దీనిపై అంతర్జాతీయ కార్మిక సమాఖ్య (ఐఎల్ఓ) తన నిరసనను వ్యక్తం చేసింది. ఈ ప్రభుత్వాలు పునరాలోచించాలని కోరింది.

**ఎంఎస్ఎంఇలు వర్ధిల్లాలంటే మార్కెట్ విస్తరించాలి**

ఈ ప్యాకేజీ చిన్నతరహా పరిశ్రమలకు ప్రాణ వాయువునిచ్చిందని ప్రభుత్వం గొప్పలు చెప్పుకుంటే సరిపోదు. రుణ పరిమితిలో 50 శాతం వరకు ఎలాంటి షరతులు లేకుండా ఇవ్వాలి. ఈ పథకంలో కేవలం 5 శాతం వడ్డీకి మాత్రమే రుణాలందించాలి. మారిటోరియం అమలు చేస్తున్న బకాయిలపై వడ్డీని మాఫి చేయాలి. దేశంలో లాక్‌డౌన్ కారణంగా మూతపడిన సూక్ష్మ, చిన్న, మధ్యతరహా పరిశ్రమలు కోలుకోలేక పోతున్నాయి. అయా యూనిట్లలో అర్థాంతరంగా నిలిచిపోయిన ఉత్పత్తు లను లాక్‌డౌన్ నిబంధనలు సడలించిన తర్వాత ఉత్పత్తి చేశారు. అటు తర్వాత కొత్త ఆర్డర్స్ రాక, నిల్వ ఉత్పత్తులకు డిమాండ్ లేక విద్యుత్ చార్జీలు, బ్యాంక్ వడ్డీలు చెల్లించలేక పనిచేసిన ఉద్యోగులు, కార్మికులకు వేతనాలు అందించలేక యజమానులు తల్లడిల్లిపోతున్నారు. ఈ విపత్కర పరిస్థితుల్లో ప్రజలందరు కేవలం అత్యవసరాలు, మాత్రమే కొనుగోలు చేస్తున్నారు. మిగిలినవన్నియు వాయిదా వేస్తున్నారు. ప్రజలు ఆర్థిక ఇబ్బందుల్లో ఉన్నప్పుడు ఎంఎస్ఎంఇల ఉత్పత్తులు కొనుగోలు చేయరు. కావున ప్రజల కొనుగోలు శక్తి పెరిగితేనే ఈ ఉత్పత్తులకు డిమాండ్ ఉంటుంది. ఈ వస్తువులకు గిట్టుబాటు ధరతో గిరాకి ఉన్నప్పుడే ఈ సంస్థలు లాభాలను ఆర్జిస్తాయి. అప్పుడు మాత్రమే సముపార్జించిన లాభాలతో రుణాలపై వడ్డీ, అసలును వ్యాపారస్తులు చెల్లిస్తారు. మార్కెట్‌లో డిమాండ్ లేనప్పుడు లాభార్జన అసాధ్యం. అప్పుడు రుణాలు భారమవుతాయి. రుణ సృష్టికంటే ఉత్పత్తులకు డిమాండ్ ఉన్నప్పుడే ఎంఎస్ఎంఇలు వర్ధిల్లుతాయి. కావున విదేశీ దిగుమతులను నిలిపివేసి దేశీయ పరిశ్రమల మార్కెట్‌ను విస్తరింపజేయాలి. ఇవి బలపడితేనే భారత ఆర్థిక వ్యవస్థ పురోగమనం చెందుతుంది. గతంలో చెప్పిన మేకిన్ ఇండియా నేడు చెపుతున్న స్వావలంభన సాధ్యమౌతుంది.

*(రచయిత అసిస్టెంట్ ప్రొఫెసర్, తెలంగాణ విశ్వవిద్యాలయం)* వీ

# కష్టకాలంలో పాలకుల నియంతృత్వం

***కరోనా వల్ల ప్రజలు ఉపాధి కోల్పోయి దిక్కుతోచని స్థితిలో ఉంటే వారి కొనుగోలు శక్తి పెంచకుండా పాలకులు కార్మికులకు ఉపయోగపడే కొద్దిపాటి చట్టాలను కూడా మార్చివేసి పెట్టుబడిదారుల పక్షం వహించారని అంటున్నారు* బైరెడ్డి సతీష్**

ప్రపంచమంతా కరోనా కల్లోలాన్ని ఎదుర్కొంటున్నది. ఎల్లలు దాటి ఎల్లెడలా జన జీవనాన్ని అతలాకుతలం చేస్తున్నది కరోనా. ఊహించని ఉత్పాతమై మానవ మనుగడనే ప్రమాదంలోకి నెట్టివేసింది. ప్రకృతి పైన మనిషి చేస్తున్న ఆధిపత్య ప్రయత్నాల వికటింపే ఈ విలయానికి కారణం. ఈ ఆకస్మిక దాడికి మనిషి చేష్టలుడిగి చూస్తున్నాడు. అప్పటికే ఉన్న పరిష్కారాలను ప్రయత్నిస్తూ, కొత్త పరిష్కారాల వేటలో తలమునకలై ఉన్నది ప్రపంచం. ఈ లోపు లక్షలాదిగా ప్రాణాలు గాలిలో దీపంలా ఆరి(గి)పోతున్నాయి.

ప్రపంచీకరణ నేపథ్యంలో ప్రపంచమంతా ఒక దగ్గరికి వస్తుందన్న ప్రచారానికి విరుద్ధంగా ఎవరి రక్షణలో వారు పడిపోయారు. పొరుగింటిని పలకరించే తీరికలేని తనంలో కూరుకు పోయినవి దేశాలు. తమ తమ ప్రజలను వైరస్ బారిన పడకుండా ఆయా ప్రభుత్వాలు తమవైన ప్రయత్నాలను, పరిశ్రమను చేస్తూనే ఉన్నాయి. ఆయా దేశాల్లోని ప్రభుత్వాల స్వభావం, అక్కడి అభివృద్ధి, ప్రజల చైతన్యం, వైద్య వ్యవస్థ మీద ఆధారపడి ఫలితాలు కనిపిస్తున్నాయి. చైనా దేశం వూహాన్‌లో మొదటి కరోనా కేసు నమోదు అయిన కొత్తలో అక్కడి ప్రభుత్వమే ఇది ఇంత పెద్ద ప్రజారోగ్య సంక్షోభానికి దారి తీస్తుందని ఊహించలేదు. ఊహించిన వారిని ఉపేక్షించనూలేదు! గతంలో కంటే ప్రపంచ దేశాల మధ్య రాకపోకలకు సౌకర్యాలు, సాధనాలు మెరుగుపడడంతో మనుషులతో పాటు వైరస్ ప్రపంచమంతటా పాకిపోయింది. తొలినాళ్లలో చైనా ప్రదర్శించిన అలక్ష్య పూరితమైన వైఖరినే అనేక దేశాలు తీసుకున్నాయి. చైనాలో ఏదో కొత్త వైరస్ సోకి మనుషుల ప్రాణాల్ని తోడేస్తున్నదంటూ మనం దూరంలో ఉన్నాం మనకేం కాదని అనుకోవడం లోనే కాలం గడిపిన దేశాలకు తన దాకా వచ్చి తమ వాళ్ల ప్రాణాలను గాల్లో కలిపేస్తుంటే గాని అర్థం కాలేదు దాని తీవ్రత ఏంటో, ప్రమాదం ఎంతో. తీరా తమ వాకిట్లోకే వరదలా వచ్చాక ఏదో చెయ్యాలన్న హడావుడిలో చైనా మార్గాన్నే తమ మార్గంగా ఎంచుకుంటున్నాయి. వూహాన్ నగర అష్టదిగ్బంధనంతో ప్రజా జీవన కదలికల్ని కట్టడి చేసి వైరస్ వ్యాప్తిని అరికట్టేలా చేసిన చైనా అనుభవాలతో అనేక చర్యలు చేపట్టాయి.

అన్ని దేశాలు అంతర్జాతీయ రాకపోకలను నిలిపివేసి సరిహద్దుల్ని మూసివేసి మరింత కట్టుదిట్టం చేసుకున్నాయి. ఏక పార్టీ వ్యవస్థలో ఉన్న చైనాలో ఏ విధానాన్ని అయినా సులభంగానే అమలు చేయవచ్చు. ప్రజాస్వామ్య దేశాలుగా ప్రచారంలో ఉండి ప్రజల చేత ఎన్నుకోబడిన ప్రభుత్వ నేతలు ప్రజారోగ్యం పేరుతో దేశానికే 'తాళం' వేసే అధికారం సంక్రమింప చేసుకున్నారు. అంతా 'బంద్' అనే విధానాన్ని ముందస్తు సన్నాహక చర్యలు గానీ, సంప్రదింపులు కాని లేకుండానే ఏకపక్షంగా దేశ ప్రజలపై విధించారు. ఇవాళ ప్రపంచమంతా ప్రజల చేత ఎన్నుకోబడిన ప్రభుత్వాలు, రాజరికాలు, సైనిక పాలనలు, ఏక పార్టీ పాలనలు ఉన్నాయి. సాధారణ సందర్భాల్లో వాటి పని విధానాల్లో రూపంలో, సారంలో తేడా ఉన్నప్పటికీ కరోనా కాలంలో అన్ని ప్రభుత్వాలు ఒకేలా స్పందిస్తున్నాయి.

అన్ని దేశాల్లో ఆరోగ్య అత్యవసర పరిస్థితిని ప్రకటించారు. ఆ దేశాల్లో ఈ స్థితిని ఎదుర్కొనే పేరుతో పాత చట్టాల దుమ్ముదులపడమో, కొత్త చట్టాలను ఏకపక్షంగా ప్రకటించడమో చేస్తున్నాయి. ఒక అసాధారణ ఆరోగ్య సంక్షోభాన్ని ఎదుర్కొనేందుకు అసాధారణ చర్యలు అవసరమే కావచ్చు. కానీ అనేక దేశాల్లో ప్రజారోగ్యం కంటే పాలకులు తమ అధికారాలను పెంచుకోవడం, వారి అధికార పీఠాలను బలంగా మార్చుకోవడం కోసం ఉపయోగించుకుంటున్నారు. అన్ని ప్రజాస్వామిక సూత్రాలను తుంగలో తొక్కి వారి వారి రాజ్యాంగ నిబంధనలను పక్కకు పెట్టి వ్యక్తుల ఇష్టానుసారం మితిమీరిన అధికారాలను తమకు తామే కట్ట పెట్టుకుంటున్నారు. ఇప్పటికే 84 దేశాల్లో అత్యవసర పరిస్థితిని విధించి మానవ హక్కుల పై తీవ్రమైన ఆంక్షలు విధించినట్టు ఐక్యరాజ్యసమితికి చెందిన పౌర, రాజకీయ హక్కుల కేంద్రం ప్రకటించింది.

హంగరీ ప్రధాని విక్టర్ ఆర్బన్ పార్లమెంటును పక్కకు నెట్టి తన వ్యక్తిగత ఆదేశా(డిక్రీ)ల ద్వారా ఏ నిర్ణయమైనా ప్రకటించే, అమలు చేసే అధికారం కల్పించుకున్నాడు. నిర్ణయాలను ప్రశ్నించడాన్ని విమర్శించడాన్ని శిక్షార్హమైన నేరంగా పరిగణిస్తారు. దానికిగాను ఐదు సంవత్సరాల జైలు శిక్ష కూడా విధించే అవకాశం ఉన్నది. ఈ నిర్ణయాన్ని యూరోపియన్ యూనియన్ తీవ్రంగా తప్పు పట్టింది కూడా. ప్రజాస్వామిక విలువల్ని, భావవ్యక్తీకరణ స్వేచ్ఛను, చట్టబద్ధ పాలనకు కట్టుబడి ఉండాలని కోరింది. చిలీ దేశం కరోనా సంక్షోభాన్ని జాతీయ విపత్తుగా ప్రకటించింది. సరిహద్దుల్లో సంచరించే సైన్యాన్ని ఏకంగా వీధుల్లో దించి ప్రజలను బయ భ్రాంతులకు గురి చేస్తున్నది. ఫిలిప్పీన్స్‌లో అయితే లాక్‌డౌన్, క్వారంటైన్ నిబంధనలను ఉల్లంఘించిన వారిని కాల్చి చంపేయమని ఆ దేశ అధ్యక్షుడు డ్యూటర్టే ఆదేశాలు ఇచ్చాడు. ప్రభుత్వాన్ని సవాల్ చేసినా, బెదిరించినా ప్రాణాలు కోల్పోతారు అని బాహాటంగానే ప్రకటించాడు. అంటే ఎవరినైనా చంపేసి లాక్‌డౌన్ ఉల్లంఘించారనో, ప్రభుత్వాన్ని వ్యతిరేకించారనో ప్రకటించి హాయిగా చేతులు దులుపుకోవచ్చన్నమాట.

ఇజ్రాయిల్ ప్రధానమంత్రి బెంజమిన్ నెతన్యాహు అయితే తన పైన

నమోదయిన అవినీతి కేసులను విచారించే సమయంలోనే లాక్‌డౌన్ సాకుతో ఏకంగా కోర్టులనే మూసివేసేలా ఆదేశాలు ఇచ్చాడు. తను తీసుకున్న ఏ నిర్ణయం కూడా కరోనా కాలంలో న్యాయ సమీక్ష పరిధిలోకి రాదనే సందేశాన్ని స్పష్టంగా చెప్పాడు. కాంటాక్ట్ ట్రేసింగ్ పేరుతో 'కౌంటర్ టెర్రరిజం' పనులను ఇజ్రాయిల్ మరింత వేగవంతం చేసింది. ప్రతి పౌరుని వివరాలను సంపూర్ణంగా సేకరించే పనిలో తలమునకలై ఉన్నది. శ్రీలంక లాంటి చిన్న దేశాల్లో కరోనా కట్టడి సాకుతో మైనారిటీలపై పోలీసుల, సైనికుల వేధింపులు, దాడులు మరింతగా పెరిగినవి. లాక్ డౌన్ మూలంగా ఎలాంటి సమాచారం బయటకు వచ్చే అవకాశం లేకపోవడంతో 'ఉగ్రవాద' అనుమానితుల జాబితాను తయారు చేసే పనిలో పడింది. నిర్బంధించిన వారిని, అక్రమంగా అరెస్టు చేసిన వారి వివరాలేవీ బయటకు రావడం లేదు. సైనిక అధికారులే పాలన కొనసాగిస్తున్న కొన్ని ఆఫ్రికా దేశాల్లో, రాజరికాలు అమలవుతున్న దేశాల్లో ఈ పరిస్థితి మరింతగా దిగజారిపోయింది. ప్రభుత్వ వర్గాలు ఇచ్చిందే 'నిజమైన' సమాచారం. మరే రూపంలో వాస్తవాలను వెలికి తీసే అవకాశం లేని చీకటి స్థితి అలుముకొని ఉన్నది.

దేశం ఏదైనా కావచ్చు, పాలన ఎటువంటిది అయినా కావచ్చు అమలవుతున్న విధానాలన్నీ ఒకేలా ఉన్నాయి. అసమ్మతిని అణచివేయడం, పౌరుల హక్కులను హరించి వేయడం, పౌరులపై రాజ్య నిఘా నేత్రాన్ని మరింతగా పెంచడం తమకు అనుకూలమైన, తాము లాభం చేకూర్చాలని అనుకున్న వర్గాలకు అనుకూలంగా పాలకవర్గాలు ఈ అత్యవసర పరిస్థితిని ఉపయోగించుకుంటున్నారు. ఇంట్లో ఉండి గొంతు విప్పలేని, వీధుల్లోకి వచ్చి ఆందోళన చేయలేని స్థితిలో సాధారణ ప్రజలు ఉన్నారు. లాక్‌డౌన్ పీరియడ్ అంతా రాజకీయ ప్రయోజనాలకు ఉపయోగించుకోవాలనే ప్రయత్నాలే తప్ప వైద్య రంగాన్ని పటిష్టపరిచే చర్యల్లో, ఉద్యోగాలు కోల్పోయిన ప్రజలకు ఆర్థిక అవసరాలను అందించే పథకమో, జీవితం పట్ల విశ్వాసం, భద్రత పెరిగే చర్యలేవీ తీసుకోకపోగా ప్రజలను మరింత బలహీనులుగా మార్చి వేస్తున్నారు.

అభివృద్ధి చెందిన దేశాలుగా, అగ్రదేశాలుగా తమకు తామే చెప్పుకునే దేశాల్లో ఆయా దేశాధినేతల అతి విశ్వాసం వారి ప్రజల ప్రాణాలతో చెలగాటం ఆడుతున్నది. చీమ చిటుక్కుమన్నా మాకే ముందు తెలుస్తుందని విర్రవీగే అగ్రరాజ్య అహంకారాన్ని అణచి వేసింది కంటికి కనిపించని కరోనా! మా జన్యువులు వేరు, మేము బలవంతులం మమ్మల్ని కరోనా ఏమీ చేయలేదని ప్రగల్భాలు పలికిన ట్రంప్ దేశమే ఇవాళ కొవిడ్ రోగుల్లో, చావుల్లో ముందున్నదన్న విషయం మరువరాదు. వైరస్ బారిన పడిన ప్రజల్ని కాపాడాల్సింది పోయి వైరస్‌ను మీరే సృష్టించారనే ఆరోపణా క్రీడల్లో మునిగి తేలి పుణ్య కాలాన్ని పుటుక్కుమనిపించాడు ట్రంప్. రోగులకు సరిపడా ఆసుపత్రులు, వైద్య సిబ్బందికి సరిపడా వ్యక్తిగత రక్షణ కవచాలను అందించలేని దీన స్థితిలో కొట్టుమిట్టాడుతోంది అగ్రరాజ్యం అమెరికా. గుట్టలుగుట్టలుగా ఆయుధాలు పోగేసుకున్న అమెరికాలో మనుషుల్ని బతికించే మందులు లేకపోవడం పెద్దగా ఆశ్చర్యకరమైన విషయం ఏమీ కాదు! ఏ మందు పనిచేస్తుందంటే ఆ మందును ఇతర దేశాలను బెదిరించైనా సరే తెచ్చుకునే స్థితికి అమెరికా దిగజారింది. కరోనా కల్లోలాన్ని ఎదుర్కొనే అంశంలో ట్రంప్ అవలంబించిన వైఖరి, విధానం రాజకీయాలతో నిండినదే తప్ప శాస్త్రీయ దృక్పథం, శాస్త్రజ్ఞుల సూచనలు, వైద్యరంగ నిపుణుల సలహాల ఆధారంగా నడుస్తున్నది ఏమీ కాదు. పరిసరాలను పరిశుభ్ర పరిచే రసాయన ద్రావకాలను శరీరంలోకి పంపిస్తే పోలా అనేంత వైజ్ఞానికుడు ట్రంప్ గారు. వ్యాపారస్తుడు అయిన ట్రంప్ గారికి పోతున్న ప్రాణాల కన్నా పడిపోతుంది అనుకుంటున్న ఆర్థిక వ్యవస్థ పైననే ఆందోళన ఎక్కువగా ఉన్నది. మాస్క్ దరించని ఏకైక ప్రభుత్వాధినేత ట్రంప్ గారు ఒక్కరే! చైనాను కరోనా వైరస్ సృష్టికర్తగా బోనులో నిలబెట్టి, ప్రపంచ ఆరోగ్య సంస్థను మూసి పెట్టి మరోసారి శ్వేత పీఠం పైన కూర్చోవాలన్న యావే తప్ప ప్రజల ప్రాణాల పట్ల ఆయనకు మమకారం ఎక్కడుంది? అమెరికా ప్రజల పట్ల కరోనా విపత్తు కాలంలో డోనాల్డ్ ట్రంప్ ప్రదర్శించిన వైఖరి, అలసత్వం, నిర్లక్ష్యం నిస్సందేహంగా నేరపూరితమైనదే. ప్రపంచంలో ఏ మూలన ఏం జరిగినా యుద్ధ సామాగ్రిని ఆగమేఘాల మీద తరలించ గలిగే అమెరికాకి తన దేశంలోనే కరోనా రోగులకు ఆసుపత్రుల్లో జాగా లేకపోవడం ఏంటో?

అన్ని దేశాలు మా దరికి చేరదు అనుకున్నట్టే భారత దేశ పాలకులు అదే పాట పాడారు. తీరా గొంతు మీదికొచ్చాకే 'తాళం' అందుకున్నారు. దేశం మొత్తం ప్రజా జీవనాన్ని ప్రభావితం చేసే అత్యంత కీలకమైన నిర్ణయాన్ని నాటకీయంగా, ఏకపక్షంగా ప్రకటించారు. కనీస సంప్రదింపులు కానీ, సన్నద్ధత కానీ, నిపుణుల సలహాలు అవసరం లేకుండానే లాక్‌డౌన్ ప్రకటించేసరికి శ్రమజీవుల జీవితం అస్తవ్యస్తమైంది. కోట్లాది మంది పుట్టిన నేలను విడిచి వందల, వేల కిలోమీటర్ల దూరంలో బ్రతుకులీడుస్తున్న వలస కూలీల జీవితాల్లో కరోనా కంటే లాక్‌డౌన్ పిడుగే మృత్యుపాశమయ్యింది. తలలు కాలిపోయే ఎండలు, పాదాలు చిట్లిపోయే భూతాపం, పిల్లా పాపలు, నడుం కృంగిపోయేలా బరువుతో ఇంటి బాట పట్టిన వారి దయనీయ జీవన దృశ్యాలు ప్రపంచాన్నే కదిలించాయి. దారి పొడుగునా దాహంతో నడుస్తూనే దాతలెవరో పెట్టిన భోజనంతో పొట్ట నింపుకొని కలలో కూడా ఊహించని సుదీర్ఘ పాదయాత్ర చేసి కొందరు శవాలుగా ఇల్లు చేరితే, మరికొందరు చిక్కి శల్యమై కొన ఊపిరితో కన్న ఊరును కళ్ల చూశారు. వారి దయనీయ స్థితిపట్ల ఒక్క రాజకీయ వ్యవస్థే కాదు దానితో ప్రభావితమైన న్యాయవ్యవస్థ స్పందన కూడా అమానవీయంగా ఉండడమే అత్యంత ప్రమాదకరం. వలస కార్మికుల పట్ల కర్కశంగా వ్యవహరించిన పాలకులే చప్పట్లు కొట్టించుకుని, దీపాలు వెలిగించుకొని, పూలు చల్లించుకున్నారు. కేంద్ర పాలకులు ప్రవక్త ప్రవచనాలు తప్ప రాష్ట్రాలకు ఆర్థికంగా వెన్నుదన్నుగా నిలబడింది లేదు వారు స్వతహాగా విదిలించిందీ లేదు. కొవిడ్ 19ని ఎదుర్కొనేందుకు బ్రిటిష్ కాలం నాటి అంటు వ్యాధుల నిర్మూలన చట్టం 1897ను దుమ్ము దులిపింది. నాలుగు సెక్షన్లతో కూడిన ఈ చట్టం ప్రకారం కేంద్రం ఇచ్చే ఏ మార్గనిర్దేశకాలనైనా, సూచనలనైనా ఉల్లంఘిస్తే శిక్షార్హమంటు రెండవ సెక్షన్ సూచిస్తున్నది. నిజానికి ఈ చట్టం ఇటువంటి ఆరోగ్య పరమైన అత్యవసర స్థితిని సమర్థవంతంగా ఎదుర్కొనే సమగ్ర చట్టం ఏమీ కాదు. ఈ అత్యవసర కాలంలో ప్రజల అత్యవసరాలు, నిత్యావసరాలు తీర్చే అంశాలేవీ ఈ చట్టంలో పొందుపరచలేదు. దీనికి తోడుగా జాతీయ విపత్తుల నిర్వహణ చట్టం 2005ను కూడా దేశవ్యాప్తంగా అమలు పరుస్తున్నారు. ఈ ఆరోగ్య సంక్షోభాన్ని

# కొవిడ్-19 పరీక్షల పైన హైకోర్ట్ తీర్పు

*కొవిడ్-19 కట్టడికి ప్రపంచ ఆరోగ్య సంస్థ మార్గదర్శకాలకు, రాష్ట్రంలో వాటి అమలుకు పొంతన లేకపోవడంతో కోర్టులో ప్రజోపయోగ వ్యాజ్యం వేయగా రాష్ట్ర ప్రభుత్వం స్పందించిన తీరును వివరిస్తున్నారు* **ప్రొ. కోదండరామ్, ప్రొ. పి.ఎల్. విశ్వేశ్వర రావు**

మే నెల 26న కొవిడ్-19 వ్యాధి నిర్ధారణ పరీక్షలకు సంబంధించి తెలంగాణ జన సమితి ఉపాధ్యక్షులు ప్రొ. పి.ఎల్.విశ్వేశ్వరరావు వేసిన ప్రజోపయోగ వ్యాజ్యంలో హైకోర్టు కీలక ఉత్తర్వులు జారీచేసింది. కోర్టు తీర్పు వివరాలు, విశేషాలలోకి వెళ్లే ముందు కేసుకు సంబంధించి కొన్ని ముఖ్యాంశాలు తెలుసుకోవాలి. అప్పుడే తీర్పు ప్రత్యేకత అర్థమవుతుంది.

**కోర్టు కేసు వివరాలు**

ఏప్రిల్ 4న ప్రొ. విశ్వేశ్వరరావు కేసు వేసినారు. కొవిడ్-19 విజృంభిస్తున్న నేపథ్యంలో ఒకవైపు ఆరోగ్యానికి భద్రత లేకుండా పోయింది. మరొకవైపు ఆర్థిక కార్యకలాపాలు స్థంభించిపోవడంతో తిండికి లేక ప్రజలు ఆకలితో అలమటిస్తున్న పరిస్థితి తలెత్తింది. ప్రజల జీవించే హక్కుకు మునుపెన్నడూ లేని విధంగా ముప్పు వాటిల్లుతున్నది. ఇటువంటి సందర్భాలలో ప్రజలను ఆదుకోవలసిన బాధ్యతను రాజ్యాంగం ప్రభుత్వం పైన ఉంచింది. ఒకవైపు ప్రజల ఆరోగ్య రక్షణకు, మరొకవైపు ప్రజలకు కావలసిన ఆహారాన్ని, నీడను కల్పించవలసిన బాధ్యతను ప్రభుత్వానికి గుర్తుచేస్తూ తగు ఉత్తర్వులు ఇవ్వమని విశ్వేశ్వరరావు కోర్టులో పిటిషన్ వేసినారు. కేసు నడిచే క్రమంలో కోర్టువారు ప్రభుత్వాన్ని ఒక్కొక్క అంశం మీద విడిగా అఫిడవిట్ దాఖలు చేయమని అడిగినారు. కోర్టు ప్రభుత్వం నుంచి వివరమైన నివేదికలు కోరిన అంశాలు ఇలా ఉన్నాయి.

1. వైద్య సిబ్బంది రక్షణకు మాస్కులు, రక్షణ దుస్తులు ఎన్ని ఉన్నాయో తెలియజేయమని అడిగింది.
2. కొవిడ్ పరీక్షలకు చేసిన ఏర్పాట్ల గురుంచి కోర్టు ఆరా తీసింది. కొవిడ్ పరీక్షలకు సంబంధించిన వివరాలను ఇవ్వవలసిందిగా ప్రభుత్వాన్ని ఆదేశించింది.
3. ధరల నియంత్రణకు తీసుకుంటున్న చర్యలను పరిశీలించడానికి ఒక కమిషన్‌ను నియమించిది. కమిషన్ లాక్‌డౌన్ ప్రకటించిన తరువాత ధరలు బాగా పెరిగాయని కోర్టుకు నివేదించింది.
4. అనాథాశ్రమాలలోను, వృద్ధాశ్రమాలలోను ఉన్న వసతుల గురించి, నిరాశ్రయులకు తిండి అందించడానికి జరిగిన ఏర్పాట్ల గురించి ప్రభుత్వం నుండి నివేదికను అడిగింది.
5. వలస కూలీలకు కల్పిస్తున్న సౌకర్యాల గురించి అడిగి తెలుసుకున్నది. ప్రభుత్వ నివేదికతో సంతృప్తి చెందక వలస కూలీల పరిస్థితిని అధ్యయనం చేయడానికి అడ్వకేట్ కమిషన్‌ను నియమించింది.

---

ఎదుర్కొనేందుకు ఈ చట్టాలేవీ ఉపయుక్తం కావని అనుభవంలో తేలుతున్నది. ఈ చట్టాల నేపథ్యంలోనే ప్రభుత్వం 'ఆరోగ్య సేతు' యాప్ పేరుతో విధిగా అందరూ దీన్ని తమ ఫోన్లలో వ్యక్తిగత వివరాలు అన్నీ సమర్పిస్తూ డౌన్‌లోడ్ చేసుకోవాలని నిర్దేశిస్తున్నది. వ్యక్తిగత వివరాలకు ఎటువంటి భద్రత ఇవ్వని ఇటువంటి చర్యలు ప్రాథమిక హక్కులో భాగమైన గోప్యత హక్కును ఉల్లంఘించడమే. మరోవైపు ఈ వ్యాధి ప్రబలే ప్రమాదం ఉన్నదని జైల్లో శిక్ష అనుభవిస్తున్న ఖైదీలు, ఎటువంటి విచారణ లేకుండా మగ్గిపోతున్న నిందితులను విడిచిపెట్టాలని సుప్రీంకోర్టు సూచనను పెడచెవిన పెట్టింది ప్రభుత్వం. సామాజిక కార్యకర్తలుగా, హక్కుల కార్యకర్తలుగా పనిచేస్తున్న ఆనంద్ తేల్ తుమ్డే, గౌతమ్ నవ్ లాఖ లాంటి బుద్ధి జీవులను లాక్‌డౌన్ కాలంలో నిర్బంధించడమే కాకుండా భీమా కోరేగావ్ కేసుల్లో ఎలాంటి ప్రాథమిక ఆధారాలు లేకుండా అరెస్టు చేసి జైలులో బంధించబడిన విప్లవ కవి వరవరరావుతో పాటు మరో 10 మందిని, అప్పటికే జైలు శిక్షను అనుభవిస్తున్న 90 శాతం అంగవైకల్యం కలిగిన జి. ఎన్. సాయిబాబా లాంటి వారిపట్ల రాజ్యవ్యవస్థ వైఖరి అత్యంత అమానవీయంగా ఉన్నది.

లాక్‌డౌన్ మాటున ప్రభుత్వాలు చేస్తున్న మరో దుర్మార్గం కార్మిక చట్టాలను నిర్వీర్య పరిచే చర్యలు తీసుకోవడం. ఆర్థిక వ్యవస్థ చితికి పోయిందని, పారిశ్రామిక వస్తు తయారీ, సేవా రంగాలు సంక్షోభంలో పడుతున్నాయన్న కారణంతో మొత్తంగా కార్మిక చట్టాలను రద్దు పరిచేలా పావులు కదుపుతున్నాయి ప్రభుత్వాలు. పనిగంటలు పెంచడం, ప్రత్యేక హక్కులను రద్దు పరచడం అసలు మొత్తంగా కార్మిక సంఘాలను పెట్టుకునే హక్కు లేకుండా చేసి పెట్టుబడిదారులకు మరింత ఊడిగం చేసే పనిలో చీకటి నిర్ణయాలు తీసుకుంటున్నారు. ఓ వైపు ఉపాధి, ఉద్యోగం కోల్పోతున్న లక్షలాది కార్మికవర్గానికి కనీస భరోసా ఇవ్వని ప్రభుత్వాలు ఉన్నపాటి కనీస ఉద్యోగ భద్రత, చట్టాల రూపంలో పొందుపరచబడిన హక్కుల్ని రద్దు పరిచేలా వ్యవహరించడం అంటే పాలకవర్గాలు అశేష ప్రజల వైపు కాకుండా పిడికెడు పెట్టుబడిదారుల వైపు నిలబడ్డారనేది బట్టబయలవుతున్నది. సంక్షోభాలను అవకాశాలుగా మలచుకోవడం అంటే శ్రమజీవులు, మెజారిటీ ప్రజలను రక్షించడం కాదన్నమాట. ప్రకటించిన ప్యాకేజీలేవి ప్రజల చేతుల్లోకి సొమ్ములు పెట్టి కొనుగోలు శక్తిని పెంచేలా లేకపోగా అప్పులు ఇస్తాం బ్యాంకుల చుట్టూ తిరగండి అని చెబుతున్నాయి. భారీ ప్యాకేజీలన్నీ అంకెల గారడీలా ఉన్నాయి తప్ప నికరంగా సగటు జీవికి ఊరటను, బతుకు పట్ల భరోసాను ఇచ్చేలా లేవు. పాలకులు, భద్ర జీవులు మరింత బలపడడానికి బడుగు జీవులు మరింత కృంగి పోయేలా కరువు కరోనా లాంటి కష్ట కాలాన్ని ఉపయోగించడం పాలకుల దుర్మార్గం తప్ప మరొకటి కాదు. వీ

*(రచయిత ఆంగ్ల ఉపన్యాసకులు)*

6. ప్రజలకు అందిస్తున్న బియ్యం, ఆర్థిక సహాయం వివరాలను కోర్టుకు సమర్పించమని ఆదేశించింది.

ప్రభుత్వం ఇచ్చిన ప్రతీ నివేదికపైన కోర్టు అసంతృప్తిని వ్యక్తం చేసింది. ప్రభుత్వ నివేదికలు అస్పష్టంగా ఉన్నాయని, తప్పుదోవ పట్టించేవిగా ఉన్నాయని కోర్టు వ్యాఖ్యానించింది. కోర్టుకు సమర్పించిన నివేదికలను చూసినప్పుడు కరోనా మహమ్మారిని ఎదుర్కొనడానికి ప్రభుత్వం దగ్గర నిర్దిష్టమైన కార్యాచరణ లేదని అర్థమవుతున్నది. జాగ్రత్తగా పరిశీలిస్తే ముఖ్యమంత్రి పత్రికా సమావేశాలలో చెప్పిన విషయాలను, దాదాపుగా వారు చెప్పిన తీరుగానే కోర్టుకు అడ్వకేట్ జనరల్ గానీ, సంబంధిత అధికారులు గానీ నివేదించారు.

ప్రొ. విశ్వేశ్వరరావు పార్టీకి చెందిన ఇతర నాయకులు, స్వచ్ఛంద సంస్థ కార్యకర్తలు, ప్రజా సంఘాల మిత్రుల సహకారంతో చాలా విపులంగా కోర్టు పరిభాషలో, ప్రభుత్వ అఫిడవిట్లకు జవాబు ఇచ్చినారు. కోర్టుకు సాక్ష్యాలు కావాలి. అందుకోసం పత్రికలలో వచ్చిన వార్తలను కోర్టుకు సమర్పించారు. కోర్టుకు ఒక ప్రత్యేక పద్ధతి ఉంటది. ప్రభుత్వ చర్యలు ఏ చట్టాన్ని ఉల్లంఘిస్తున్నాయో చెప్పాలి. ఏ చట్టం ప్రకారం ప్రభుత్వం చర్యలు తీసుకోవాలో కోర్టుకు వివరించాలి. అందుకోసం కోర్టు ఇచ్చిన తీర్పులను, చట్టాలను చదవాలి. వాటి సారాంశాన్ని కోర్టుకు వివరించాలి. విశ్వేశ్వరరావు ఈ కృషి చేయగలిగినారు. అందుకే కోర్టులో కేసు నిలబడింది.

**కేసు**

ఐసిఎంఆర్ మార్గదర్శకాల ప్రకారం పరీక్షలు జరపాలని, పరీక్షలకు అన్ని జిల్లా కేంద్రాలలో సౌకర్యాలను కల్పించాలని విశ్వేశ్వరరావు పిటిషన్‌లో అడిగినారు. మన పిటిషన్‌తో పాటు మరో రెండు కేసులను జోడించారు. సరిగ్గా పరీక్షలు చేయకుండానే సూర్యాపేటను రెడ్‌జోన్ నుండి గ్రీన్‌జోన్‌లోనికి మార్చారని, క్రమపద్ధతిలో పరీక్షలు నిర్వహించాలని ప్రభుత్వాన్ని ఆదేశించ వలసిందిగా కోరుతూ ఒక పిటిషన్ వచ్చింది. మరొక పిటిషన్ నిర్మల్ పట్టణంలోనూ సరిగ్గా పరీక్షలు నిర్వహించ వలసిందిగా ప్రభుత్వాన్ని ఆదేశించమని కోరింది. ఈ అన్ని పిటిషన్‌లను జోడించి అడ్వకేట్ జనరల్ గారిని మొత్తం సమాచారంతో వివరమైన నివేదిక సమర్పించమని కోర్టు అడిగింది. జిల్లాల వారీగా రాష్ట్రంలో జరుగుతున్న పరీక్షల సంఖ్యను, రాష్ట్రంలో ఉన్న కొవిడ్ నిర్ధారణ పరిక్షా కేంద్రాల వివరాలను, మొబైల్ టెస్టింగ్ కేంద్రాల ఏర్పాటు ప్రతిపాదన విషయం పైన కోర్టు సమాచారం అడిగింది. కోర్టు ఉత్తర్వుల ప్రకారం పైన చెప్పినట్టు డాక్టర్ శ్రీనివాసరావు అఫిడవిట్ దాఖలు చేసినారు. మే 26న విచారణ జరిగే సమయానికి ప్రభుత్వం ఈ పిటిషన్లకు తన జవాబును రాతపూర్వకంగా సమర్పించింది.

**ప్రభుత్వ వాదన**

ప్రభుత్వం తరపున వైద్య, కుటుంబ సంక్షేమ శాఖ డైరెక్టర్ డాక్టర్ శ్రీనివాసరావు కోర్టుకు అఫిడవిట్ సమర్పించారు. వ్యాధి నివారణకు తీసుకుంటున్న చర్యలను వివరించి, వ్యాధి నివారణకు అంతకంటే చేయవలసింది లేదనే 31 పేజీల అఫిడవిట్‌లో వాదించారు. ప్రభుత్వ వాదనలోని ముఖ్యాంశాలు దిగువన వివరిస్తున్నాం.

1. జనవరి 21 నుండి విమానాశ్రయంలో దిగిన ప్రయాణీకులను స్క్రీనింగ్ చేయడం మొదలు పెట్టారు. జనవరి 21 నుండి మార్చ్ 22 మధ్యకాలంలో 75,786 ప్రయాణికులను స్క్రీనింగ్ చేసి వివరాలు కలెక్టర్లకు పంపించారట. కలెక్టర్లు ఆ వివరాలను పోగొట్టుకున్నారేమో, వారు 3500 గ్రామాలకు బృందాలను పంపించి మార్చ్ 14 తరువాత విదేశాల నుండి వచ్చిన వారిని వెతికి పట్టుకున్నారు. ఆ విధంగా మొత్తం మీద 25,937 మందిని గుర్తించి, వారిని క్వారంటైన్ చేసినారు. కొవిడ్ వ్యాధి లక్షణాలున్న వారిని మాత్రం గాంధీ ఆసుపత్రికి పంపించారు. అందులోను కరోనా పాజిటివ్ తేలిన వారిని విడిగా ఐసోలేషన్ వార్డులో ఉంచారు. అఫిడవిట్‌లో పాజిటివ్ తేలిన వారి సంఖ్య కాని, క్వారంటైన్ అయిన వారి సంఖ్య కాని ఇవ్వలేదు.

2. ప్రభుత్వం పాజిటివ్ తేలిన వ్యక్తులు నివసించే ప్రాంతాలను గుర్తించి వాటిని కంటైన్‌మెంట్ జోన్లుగా ప్రకటించింది. ఈ జోన్లలో నివసించే వారిని ఇళ్ల నుండి బయటకు వెళ్లనీయలేదు. కంటైన్‌మెంట్ జోన్లలోని అన్ని ఇళ్లకు ప్రభుత్వమే నిత్యావసర వస్తువులను సరఫరా చేసింది. ప్రతీ ఇంటికి వెళ్లి వైద్య సిబ్బంది అక్కడ నివసించే వ్యక్తుల ఆరోగ్యానికి సంబంధించిన సమాచారాన్ని సేకరించారు. కొవిడ్ వ్యాధి లక్షణాలు ఉన్నవారిని మాత్రమే ఆసుపత్రికి తరలించారు. రాష్ట్రంలో మొత్తం 206 కంటైన్‌మెంట్ జోన్లను ఏర్పాటు చేసినారు.

3. ప్రభుత్వం మార్చ్ 23 నాడు, విధిగా మాస్కులను ధరించాలని, భౌతిక దూరం పాటించాలని ఆదేశాలను జారీచేసింది. నిత్యావసరాల కోసం తెరిచి ఉంచిన దుకాణాలలోను భౌతిక దూరం పాటించాలని ప్రభుత్వం ఆదేశాలను జారీచేసింది. ఈ ఆదేశాల ప్రకారం ప్రతి దుకాణంలోను సానిటైజర్లను విధిగా అందుబాటులో ఉంచాలి. బి.పి., షుగర్, కాన్సర్ ఉన్నవారికి అదే విధంగా డయాలిసిస్ చేయించుకుంటున్న వారికి తలా రెండు మాస్కులు ప్రభుత్వమే ఉచితంగా సరఫరా చేసింది. తీవ్రమైన ఊపిరితిత్తుల సంబంధిత వ్యాధులు ఉన్నవారిని ప్రభుత్వం నిత్యం పర్యవేక్షించింది.

4. వ్యాధి సోకిన వారికి వైద్యం అందించడానికి కూడా ప్రభుత్వం ఏర్పాట్లు చేసింది. తెలంగాణాలో 60,000 మించి కొవిడ్ వ్యాధి సోకకపోవచ్చునని ప్రభుత్వ అంచనా. దేని ఆధారంగా ఈ అంచనాకు వచ్చినారో అధికారులు వివరించలేదు. ఇప్పటి వరకు అర్థమైన వ్యాధి స్వభావాన్ని బట్టి చూస్తే ఇందులో 80 శాతం వ్యాధిగ్రస్తులకు ఇంటివద్ద వైద్యం చేయవచ్చు. ఇక ఆసుపత్రి సౌకర్యాలు 12000 మందికి మాత్రమే అవసరం రావచ్చు. సుమారు 3000 మంది రోగులకు ఐసియు వైద్యం అందించవలసిన అవసరం ఏర్పడవచ్చు.

రాష్ట్రంలో ప్రభుత్వం చేసిన సౌకర్యాలు ఇలా ఉన్నాయి. కొవిడ్ వ్యాధి సోకినవారికి ఏర్పాటైన పడకలు మొత్తం 4008 కాగా, ఇందులో చేర్చిన గచ్చిబౌలి స్టేడియంకు చెందిన 1200 పడకలు కూడా ఉన్నాయి. గచ్చిబౌలి ఆసుపత్రి ఇంకా ఏర్పాటు కాలేదు. డాక్టర్లు లేరు, వైద్య సిబ్బంది కూడా లేరు. ఈ పడకలను తీసేస్తే వాస్తవంగా ఉన్నవి 2808 పడకలే. మొత్తంగా ఐసియు పడకలు 616. వెంటిలేటర్లు 255 మాత్రమే. ఆక్సిజన్ అందుబాటులో ఉన్న పడకలు 2339. ప్రభుత్వం ప్రకటించిన అవసరాలకు వాస్తవంగా అందుబాటులో ఉన్న సౌకర్యాలకు వ్యత్యాసం గమనించాలి.

5. కొవిడ్ వ్యాధి నిర్ధారణ పరీక్షలకు సంబంధించి ప్రభుత్వ వాదన విచిత్రంగా ఉన్నది. ప్రపంచ ఆరోగ్య సంస్థ కాని, మన దేశానికి చెందిన ఐసిఎంఆర్ కాని కొవిడ్ పరీక్షలకు సంబంధించి వివిధ సమయాలలో మార్గదర్శకాలను జారీచేసినాయి. కొత్త మార్గదర్శకాలు వచ్చినంత మాత్రాన పాతవి రద్దు కావు. పాత వాటికి అదనంగా, వాటిని మెరుగు పరిచే లక్ష్యంతో కొత్తవి వస్తున్నాయని గమనించాలి. ఆ విధంగా

ఐసిఎంఆర్ ఆఖరున 2020, మే 18న ఇచ్చిన మార్గదర్శకాలు మాత్రమే వర్తిస్తాయని ప్రభుత్వ వాదన. వీటి ప్రకారం ఆసుపత్రిలో చికిత్స పొందుతూ మరణించిన వారి నుండి సాంపిల్స్ తీసి పరీక్షించవలసిన అవసరం లేదు. కనుక కచ్చితంగా ఐసిఎంఆర్ మార్గదర్శకాలను పాటిస్తున్నామని ప్రభుత్వం కోర్టులో వాదించింది.

6. వలస కార్మికుల విషయానికి వస్తే వారిని సరిహద్దుల వద్దనే స్క్రీనింగ్ చేస్తున్నామని ప్రభుత్వం కోర్టుకు చెప్పింది. వ్యాధి లక్షణాలు కనిపించని వారిని ఇంటి వద్దనే క్వారెంటైన్ చేస్తున్నామని, ఎవరికైనా వ్యాధి లక్షణాలు కనిపిస్తే వారిని మాత్రమే ఆసుపత్రికి తరలించి, కొవిడ్ పరీక్ష చేస్తున్నామని ప్రభుత్వ అధికారులు కోర్టుకు చెప్పారు.

ఈ పద్ధతులు పాటించడం వల్లనే చాలా ప్రయోజనం చేకూరిందని ప్రభుత్వం కోర్టులో వాదించింది. రాష్ట్రంలో కొవిడ్ వ్యాధి సోకిన వారిలో 60.44 శాతం నయమై ఆసుపత్రి నుంచి డిశ్చార్జి అయ్యారు. ఇది జాతీయ సగటుకన్నా ఎక్కువ. జాతీయ స్థాయిలో 40.97 శాతం మాత్రమే నయమై డిశ్చార్జి అవుతున్నారు. వ్యాధి సోకిన వారిలో జాతీయ స్థాయిలో సగటున 3.03 చనిపోతుండగా రాష్ట్రంలో కేవలం 2.68 శాతం మాత్రమే చనిపోయారు. ఈ గణాంకాలు రాష్ట్ర ప్రభుత్వం అనుసరిస్తున్న పద్ధతి బాగానే ఉందనడానికి సాక్ష్యం. పత్రికల్లో వచ్చే గాలి వార్తలకు స్పందించి, ఎవరో కోరినంత మాత్రాన పరీక్షలు పెంచవలసిన అవసరం లేదని, ఉన్న కొద్దిపాటి కిట్స్‌ను వృథా చేయదలచుకోలేదని, నిధులను దుర్వినియోగం చేయదల్చుకోలేదని ప్రభుత్వం కోర్టుకు తెలిపింది. అదే విధంగా ఆసుపత్రులలో చికిత్స పొందుతూ మరణించిన వారికి కొవిడ్ పరీక్ష చేయవలసిన అవసరం లేదని, ఐసిఎంఆర్ అటువంటి సూచన చేయలేదని కుడా ప్రభుత్వం కోర్టుకు తేల్చిచెప్పింది. ఇదీ ప్రభుత్వ వ్యూహం.

### కోర్టు తీర్పు

కోర్టు తన తీర్పులో పిటిషనర్ల వాదన సారాంశాన్ని తెలియజేసింది. కోర్టు దృష్టిలో పిటిషనర్లు క్రమపద్ధతిలో పరీక్షలు జరుగాలని కోరుకుంటున్నారు. అదీ కాక ఏప్రిల్ 20న శవాల నుండి సాంపిల్స్ తీసి కొవిడ్ పరీక్షలు చేయవలసిన అవసరం లేదంటూ వైద్య, కుటుంబ సంక్షేమ శాఖ జారీ చేసిన ఉత్తర్వులు రద్దుకావాలని పిటిషనర్లు కోర్టును అడిగినారు. ఈ ఉత్తర్వుల నేపథ్యంలో ప్రభుత్వం కొవిడ్ వ్యాధి నిర్ధారణ పరీక్షల విషయంలో అనుసరిస్తున్న వైఖరి సరిగ్గా లేదన్న అనుమానాలు బలపడుతున్నాయిని కోర్టు పేర్కొన్నది. కొవిడ్ కేసులను గుర్తించడం, కరోనా వ్యాప్తిని నివారించడానికి చర్యలు తీసుకోవలసిన బాధ్యత ప్రభుత్వం పైన ఉన్నదని కోర్టు పేర్కొన్నది.

ముందుగా కోర్టు ఐసిఎంఆర్ కరోనా వ్యాప్తి నిలువరించడానికి జారీచేసిన మార్గదర్శకాలను విపులంగా పరిశీలించింది. ఐసిఎంఆర్ మొదట విడుదల చేసిన మార్గదర్శకాల ప్రకారం చావులకు సంబంధించిన సమాచారం సేకరించడం చాలా అవసరం. చావులకు గల కారణాలను గుర్తించినప్పుడు సమాజం ఆరోగ్య పరిస్థితి, వ్యాధి సమగ్ర స్వరూపం తెలిసిపోతుంది. దాని ఆధారంగా ఆరోగ్య సేవలను, పథకాలను రూపొందించుకోవచ్చు. ప్రజారోగ్యానికి సంబంధించిన పరిశోధనాంశాలను కూడా ఎంపిక చేయవచ్చు. ప్రపంచ ఆరోగ్య సంస్థ కొవిడ్‌ను మహమ్మారిగా ప్రకటించిన సందర్భంలో చావులకు గల కారణాలను తెలుసుకోవడం ద్వారా వైరస్ ప్రభావాన్ని అంచనా వేయగలమని కోర్టు తీర్పులో పేర్కొన్నది.

ప్రపంచ ఆరోగ్య సంస్థ కొవిడ్ ఒక కొత్త రకమైన వ్యాధి అని అన్నది. ఈ వ్యాధికి సంబంధించిన వివరాలు మనకు ఎక్కువగా తెలియవు. ఈ వ్యాధి కొందరిలో తీవ్రంగా ఉంటే మరికొందరిలో వ్యాధి తీవ్రత అంతగా ఉండడం లేదు. వ్యాధి ప్రభావం వయసును బట్టి, రోగి ఆరోగ్య పరిస్థితిని బట్టి మారుతున్నది. వ్యాధి ప్రభావం, వ్యాధి పెంపొందే తీరు, ఎటువంటి వ్యక్తులు వ్యాధి తాకిడికి చనిపోతున్నారు అనేది అర్థం కావాలంటే రోగి ఆరోగ్యానికి సంబంధించిన సమగ్ర చరిత్ర తెలిసి ఉండాలి. రోగం సోకిన తీరు, చావుకు దారితీసిన పరిస్థితులు తెలిసి ఉండాలి. ప్రతి జిల్లా నుండి విస్తృతంగా, క్రమపద్ధతిలో సమాచారాన్ని సేకరించాలి. అప్పుడే ప్రజారోగ్యంపై కరోనా ప్రభావం అర్థం చేసుకోగలం. ఆరోగ్య పరిరక్షణకు తగు చర్యలను రూపొందించుకోగలం. చావుకుగల కారణాలను నిర్దిష్టంగా గుర్తించాలని ఐసిఎంఆర్, ప్రపంచ ఆరోగ్య సంస్థ మార్గదర్శకాల ఆధారంగా కోర్టు నిర్ధారించింది.

ఐసిఎంఆర్ వరుసగా అనేక మార్గదర్శకాలను జారీ చేసింది. 2020, మే 18న ఐసిఎంఆర్ జారీచేసిన తుది ఆదేశాల ప్రకారం పాజిటివ్ తేలిన వ్యక్తిని కలిసిన రిస్కు ఎక్కువగా ఉన్న వ్యక్తులకు (వయస్సు మీరిన వారు, బి.పి., కాన్సర్, షుగర్ ఉన్నవారు, డయాలిసిస్ చేయించుకుంటున్న వ్యక్తులు) విధిగా పరీక్షలు చేయాలి. వలస పోయి తిరిగి వచ్చిన వారికి, విదేశాల నుండి తిరిగి వచ్చిన వారికి వ్యాధి లక్షణాలుంటే పరీక్షలు నిర్వహించాలి. ఐసిఎంఆర్ మార్గదర్శకాలకు చట్టబద్ధత ఉన్నది. వాటిని విధిగా అమలు చేయవలసిన బాధ్యత రాష్ట్రాలపైన ఉన్నది. ఇంత స్పష్టంగా ఐసిఎంఆర్ మార్గదర్శకాలు ఉండగా, వాటికి విరుద్ధంగా రాష్ట్ర ప్రభుత్వం ఏప్రిల్ 20న చికిత్స పొందుతూ చనిపోయిన వ్యక్తుల సాంపిల్స్ తీసి పరీక్ష చేయవలసిన అవసరం లేదని ఉత్తర్వులు జారీ చేయడాన్ని కోర్టు తప్పుబట్టింది. 20 ఏప్రిల్ నాడు రాసిన లేఖ ఐసిఎంఆర్ మార్గదర్శకాలకు వ్యతిరేకమని కోర్టు అన్నది.

కేంద్ర ప్రభుత్వం కూడా రాష్ట్ర ప్రభుత్వం తగినన్ని పరీక్షలు చేయలేదని తప్పుపట్టింది. ఈ విషయం పత్రికల్లో ప్రముఖంగా అచ్చయింది. పిటిషనర్లు ఇచ్చిన సమాచారం ప్రకారం మే 5 నాటికి ప్రతి పది లక్షల జనాభాకు తమిళనాడు 2674, ఆంధ్రప్రదేశ్ 2860, ఢిల్లీ 3630 పరీక్షలు జరుపగా తెలంగాణలో 518 మందికి మాత్రమే పరీక్షలు అయినాయి.

### ప్రభుత్వ అఫిడవిట్ – కోర్టు వ్యాఖ్యలు

కోర్టు ప్రభుత్వ అఫిడవిట్ పట్ల అసంతృప్తిని వ్యక్తం చేసింది. ఈ అఫిడవిట్ కోర్టు అడిగిన ప్రశ్నలకు సమాధానం చెప్పలేదని, అసమగ్రంగా ఉన్నదని, అంతర్గత వైరుధ్యాలున్నాయని కోర్టు అభిప్రాయపడింది. కోర్టు ప్రభుత్వ అఫిడవిట్‌పైన వ్యక్తం చేసిన అభిప్రాయాలు ఇలా ఉన్నాయి.

- ప్రభుత్వం తన అఫిడవిట్లో విదేశాల నుండి వచ్చిన వారిలో ఎందరిని పరీక్షించింది, ఎందరిని గాంధీ ఆసుపత్రికి తరలించింది, ఎందరు క్వారెంటైన్‌లో ఉన్నది వంటి వివరాలను ఇవ్వనే లేదని కోర్టు అన్నది.
- ముఖ్యమంత్రి మే 17 నాడు సడలింపులు ప్రకటించిన తరువాత, ఆటోలు, బస్సులు, విమానాలు తిరుగుతుండగా ఇంకా లాక్‌డౌన్ ఉందనడం అర్థరహితం అన్నది కోర్టు అభిప్రాయం.
- రాష్ట్రంలో మొత్తంగా ఎన్ని పరీక్షలు జరిగినాయన్న ప్రశ్నకు ప్రభుత్వ అఫిడవిట్ సమాధానం ఇవ్వలేదు.
- రాష్ట్రంలో ఉన్న 206 కంటైన్‌మెంట్ జోన్లలో 4 మాత్రమే గ్రేటర్ హైదరాబాద్ పరిధిలో కొనసాగుతున్నాయని ప్రభుత్వ అఫిడవిట్‌లో పేర్కొన్నారు. అయితే మిగతా జిల్లాల పరిస్థితి ఏమిటో తెల్చిచెప్పలేదు.

- రాష్ట్రాన్ని రెడ్, అరెంజ్, గ్రీన్ జోన్లుగా విభజించినారు. అయితే డాక్టర్ శ్రీనివాసరావు తన అఫిడవిట్‌లో జిల్లాల ప్రస్తుత పరిస్థితి వివరించనే లేదు.
- ఎటువంటి విపత్కర పరిస్థితులనైనా ఎదుర్కొనడానికి కావలసిన ఏర్పాట్లు ప్రభుత్వం చేసిందని అఫిడవిట్ ద్వారా కోర్టుకు తెలిపినారు. ఆ వివరాలు ఇంతకు ముందు తెలుసుకున్నాం. ప్రభుత్వం చెప్పినట్టు 12000 మంది ఆసుపత్రిలో చేరవలసి వస్తే ఈ సదుపాయాలూ చాలవని కోర్టు అన్నది. "ప్రభుత్వం చేసిన ఏర్పాట్లు చూస్తుంటే ఈ రాష్ట్ర పరిస్థితి భయానకంగా కనబడుతున్నది" అని కోర్టు వ్యాఖానించింది.
- ఆసుపత్రిలో ఉన్న రక్షణ దుస్తులు, మాస్కులకు సంబంధించి అఫిడవిట్ ప్రభుత్వం దగ్గర ఉన్న స్టాక్ గురించి తెలియజెప్పిందే తప్ప ఆసుపత్రిలో అందుబాటులో ఉన్న పరికరాల గురించి కాదని కోర్టు వ్యాఖ్యానించింది.
- ఐసిఎంఆర్ మే 18 నాడు జారీచేసిన మార్గదర్శకాలను ఉటంకించారు కాని వాటిని ఎంతమేరకు పాటిస్తున్నారో చెప్పలేదని కోర్టు అన్నది.
- మరణించిన వారి సాంపిల్స్ తీసుకోకూడదని ఐసిఎంఆర్ మార్గదర్శకాలలో ఎక్కడా లేదని ప్రభుత్వం చేసిన వాదనను కోర్టు తప్పు పట్టింది. కొత్త మార్గదర్శకాలు జారీ అయినంత మాత్రాన పాతవి రద్దు కావు. పాత వాటికి అదనంగా కొత్త మార్గదర్శకాలు పాటించాలి. కొవిడ్ సంబంధిత మరణాలను రికార్డు చేయవలసిన అవసరం లేదన్న వాదన సమర్థనీయం కాదని కోర్టు చెప్పింది. ఐసిఎంఆర్ ముందు జారీచేసిన మార్గదర్శకాలలో చాలా స్పష్టంగా ఆసుపత్రిలో మరణించిన వారికి కొవిడ్ పరీక్షలు చేయాలని స్పష్టంగా చెప్పింది. అందువలన ప్రభుత్వం ఏప్రిల్ 20 నాడు జారీచేసిన ఆదేశాలు చెల్లవని కోర్టు తీర్పు చెప్పింది. ఐసిఎంఆర్ మార్గదర్శకాలు విధిగా పాటించడం కొవిడ్ నియంత్రణకు అవసరమని కోర్టు అదేశించింది. ఒక వ్యక్తి ఆసుపత్రిలో గుండెపోటుతోనే మరణించి ఉండవచ్చు. కాని ఆ వ్యక్తికి కొవిడ్ ఉంటే కుంటుంబ సభ్యులకు కూడా పాకే ప్రమాదం ఉంటుంది. అందుకని ఆసుపత్రిలో చికిత్స పొందుతూ మరణించిన ప్రతీ వ్యక్తికి కొవిడ్ పరీక్ష చేయాలి.
- వలస కార్మికుల పర్యవేక్షణ విషయంలోనూ కోర్టు అసంతృప్తిని వ్యక్తం చేసింది. రాష్ట్రంలోకి అనేకమంది వలస కార్మికులు వస్తున్నారని పత్రికల్లో చూస్తున్నాం. అయితే వారిలో ఎందరిని పరిశీలించారన్నది ముఖ్యమని కోర్టు చెప్పింది. వ్యాధి సోకిన వారి వెంట ప్రయాణించిన వారి విషయంలో ఏం చేశారో స్పష్టంగా చెప్పాలని కోర్టు అన్నది.

**కోర్టు ఆదేశాలు**

కోర్టు దృష్టిలో ప్రభుత్వం కొవిడ్ పరీక్షలు చేయవలసినన్ని చేయడం లేదు. చేయవలసిన పద్ధతిలో కూడా పరీక్షలు జరగడం లేదు. వైద్యానికి కావలసిన సదుపాయాలను కూడా కల్పించడం లేదు. అన్ని విషయాలను పరిశీలించి కోర్టు దిగువ ఆదేశాలను జారీ చేసింది.

1. చికిత్స పొందుతూ మరణించిన వారి నుండి కొవిడ్ పరీక్షకు సాంపిల్స్ తీసుకోనవసరం లేదన్న ఏప్రిల్ 20 నాటి ఉత్తర్వులను కోర్టు కొట్టిపారేసింది.

2. ఆసుపత్రిలో మరణిస్తే కొవిడ్ పరీక్ష నిర్వహించిన తరువాతనే శవాన్ని అప్పగించాలి.

3. రెడ్, ఆరెంజ్, కంటైన్‌మెంట్ జోన్లలో విధిగా రాండమ్ కొవిడ్ పరీక్షలు, సామూహిక కొవిడ్ పరీక్షలు నిర్వహించాలి. ఎన్ని పరీక్షలు జరిపింది, ఏ స్థలాలో పరీక్షలు జరిపింది కోర్టుకు నివేదించాలి.

4. మే 1 నుండి మే 25 మధ్యన జరిగిన కరోనా పరీక్షల వివరాలు కోర్టుకు ఇవ్వాలి. అందులో భాగంగా కొవిడ్ వచ్చిన వారిని కలిసిన హైరిస్కు వ్యక్తులను (కొవిడ్ లక్షణాలు ఉన్నా లేకున్నా) ఎందరిని పరీక్షించింది కూడా తెలియజేయాలి. ఐసిఎంఆర్ మార్గదర్శకాల ప్రకారం కొవిడ్ వచ్చిన వ్యక్తులను కలిసిన వారిలో హైరిస్కు కాని వారిని ఎందరిని పరిశీలించింది కూడా కోర్టుకు తెలయజెప్పాలి.

5. రాష్ట్రంలోకి వలస కార్మికులు ఎందరు తిరిగి వచ్చింది, వారిని పరీక్షించడానికి అనుసరించిన పద్ధతిని కోర్టుకు వివరించాలి. వలస పోయి తిరిగి వచ్చిన వారిలో క్వారంటైన్ అయిన వారెందరు, కరోనా పాజిటివ్ తేలిన వారెందరో కూడా కోర్టుకు సమాచారం ఇవ్వాలి.

6. వలస పోయి వచ్చిన వారి కుటుంబ సభ్యులను, వారి ఇరుగు, పొరుగు ఇళ్లలో ఉంటున్న వారిని వైద్య సిబ్బంది చూశారా అన్న విషయాన్ని కూడా స్పష్టంగా ప్రభుత్వం కోర్టుకు నివేదించాలి.

7. రెడ్, ఆరెంజ్, గ్రీన్ జోన్‌లు ఎన్ని ఉన్నాయి, ఒకవేళ ఒక ప్రాంతాన్ని ఒక జోన్ నుండి ఇంకొక జోన్ లోనికి మార్చి ఉంటే మార్పుకు దారితీసిన పరిస్థితులను కోర్టుకు వివరించాలి.

కోర్టు చివరికి ప్రభుత్వ బాధ్యతను విశదీకరించింది. కొవిడ్ మామూలు వ్యాధి కాదు. ఇది అనేక దేశాలకు విస్తరించింది. లక్షల మంది కొవిడ్ సోకి మరణించారు. వైద్య పరంగా అభివృద్ధి చెందిన అమెరికాలోనే దాదాపు లక్షకు పైగా మరణించారు. భారతదేశం ఇప్పటివరకు కరోనాను విజయవంతంగానే ఎదుర్కొంటున్నది. అయితే సమస్య పూర్తిగా పోలేదు. ఈ మధ్యనే ప్రపంచ ఆరోగ్య సంస్థ లాక్‌డౌన్ ఎత్తివేసిన తరువాత కరోనా విజృంభిస్తుందని హెచ్చరించింది. వైద్య సౌకర్యాల మీద విపరీతమైన భారం పడనున్నది. ఇప్పుడు చాలా జాగరూకతతో ఉండవలసిన అవసరం ఉన్నది. సరిగ్గా పరీక్షలు నిర్వహించకుండా వదిలేస్తే, గ్రీకు గాథలలో ప్రస్తావించిన ట్రోజన్ యుద్ధం లోని ట్రోజన్ హార్స్ వలె, కరోనాను సమాజంలో ఎవరు విస్తరించేది తెలియదు. అందువలన కోర్టు, పరీక్షలు నిర్వహించడమే కాదు పరీక్షల సంఖ్యను కూడా ఎంత వీలయితే అంత పెంచమని ఆదేశించింది. ఆర్థిక వనరుల లేమిని సాకుగా చూపి తప్పుకోవడానికి వీలులేదు. ప్రజల ప్రాణాలు వెలకట్టలేనంత విలువైనవని గుర్తించాలి. ఇతర రాష్ట్రాలు కరోనా ప్రమాదాన్ని విజయవంతగా ఎదుర్కొన్నాయి. తెలంగాణ కూడా కరోనాను నిర్మూలించగల పాలనా దక్షతను ప్రదర్శించి దేశానికే మంచి ఉదాహరణగా నిలువవచ్చు.

**తీర్పు తదనంతరం**

తీర్పు వచ్చిన తరువాత మరో రెండు వాయిదాలలో తీర్పు తదనంతర పరిణామాలపై కోర్టులో వాదనలు నడిచాయి. మొదట రక్షణ దుస్తులతో పాటు అన్ని పరికరాలు సరిగ్గా ఉంటే డాక్టర్లకే వైరస్ సోకడానికి కారణాలేమిటో చెప్పాలని కోర్టు అడిగింది. ఇక రెండవసారి కోర్టు తీర్పు అమలుపట్ల అసంతృప్తిని వ్యక్తం చేసింది. ఆరోగ్యశాఖ కార్యదర్శి కోర్టుకు హాజరు కావాలని ఆదేశించింది.

*(రచయితలు తెలంగాణ జన సమితి పార్టీ నాయకులు)* వీ

# కార్మిక చట్టాల్లో సడలింపు పాలకుల దుర్మార్గం

*బహుళజాతి కంపెనీలను భారతదేశానికి రప్పించడానికి ప్రభుత్వాలు వాటికనుకూలంగా కార్మిక చట్టాలను సవరించడం అంటే పిడికెడు మంది సంపన్న వర్గాల ప్రయోజనాల కోసం కోట్లాది మంది కార్మికుల హక్కులను కాలరాయడమేనని అంటున్నారు* **బి. రామకృష్ణ**

కరోనా ప్రేరేపిత దేశవ్యాప్త లాక్‌డౌన్ నేపథ్యంలో 'మే' నెలలో కార్మిక చట్టాలలో సవరణలు, సడలింపులు చేశారు. ఉత్తరప్రదేశ్‌లో వెట్టిచాకిరి వ్యతిరేక చట్టం 1976, భవన నిర్మాణ కార్మికుల చట్టం, నష్టపరిహార చట్టం 1923, వేతన చెల్లింపుల చట్టం 1934 లోని 5వ సెక్షన్ వంటివి తప్పిస్తే అన్నిరకాల కార్మిక చట్టాలను మూడు సంవత్సరాల వరకు రద్దుచేస్తూ ఉత్తరప్రదేశ్ టెంపరరీ ఎగ్జెంప్షన్ ఫర్ సర్టెయిన్ లేబర్ లాస్ ఆర్డినెన్స్‌ను తెచ్చారు. ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్, గుజరాత్, రాజస్థాన్, పంజాబ్, హర్యానా, కర్ణాటక, ఒరిస్సా మరితర రాష్ట్రాలు కార్మిక చట్టాలలో మౌలికంగానే మార్పులు చేస్తూ నిర్ణయాలు చేశాయి.

లాక్‌డౌన్ కారణంగా కంపెనీలు, పరిశ్రమలు మూతపడ్డాయని వ్యాపారాలు, ఉత్పత్తులు కుంటుపడడం వల్ల నష్టాలు వచ్చాయని వ్యాపార, పారిశ్రామిక వర్గాలు చెబుతున్నాయి. కార్మికులకు భద్రత ఉండడం వల్ల పెట్టుబడులను ఆకర్షించలేకపోతున్నామని అంటున్నారు. పెద్దమొత్తంలో పెట్టుబడులను ఆకర్షించాలంటే కార్మిక చట్టాలు అడ్డువస్తున్నాయని వాటిని సడలించడమో రద్దు చేయడమో జరగాలని చెబుతున్నారు. చైనాలోని అంతర్జాతీయ కంపెనీలు అక్కడి నుండి తరలివెళ్లే పరిస్థితి ఉన్నదని దీన్ని సావకాశంగా వినియోగించుకోవాలని అంటున్నారు.

పని గంటలను 8 గం॥ నుండి 12 గం॥లకు పెంచారు. అటుపిమ్మట ఉత్తరప్రదేశ్ హైకోర్టు ఆదేశాలమేరకు ఆ రాష్ట్రంలో ఈ నిర్ణయాన్ని వెనక్కుతీసుకున్నారు. కనీస వేతన చట్టాన్ని రద్దు చేశారు. కార్మిక సంఘాలు ఉండవద్దని దానికి సంబంధించిన చట్టాన్ని రద్దుచేశారు. పని స్థలాల్లో పాటించవలసిన కనీస ఆరోగ్య, పరిశుభ్రత ప్రమాణాలు పాటించనవసరం లేని విధంగా సడలింపులు చేశారు. వేతనాలు, పనిచేసే చోట భద్రత, సామాజిక భద్రతహామీ, సంఘటితం అయ్యే, మాట్లాడే, హక్కులను కార్మికులకు లేకుండా చేశారు. యజమానుల ఇష్టారీతిన కార్మికులను నియమించుకునే, తొలగించే అధికారాన్ని కలిగి ఉండేలా చట్ట సవరణలు చేశారు.

జీవించే హక్కులో భాగంగా కనీస వేతన చట్టాలను చూడాలి. కనీస వేతనాలు లేకుండా జీవన ప్రమాణాలు ఎలా మెరుగవుతాయి. అలాంటి చట్టం రద్దయ్యింది. కనీస వేతన చట్టంను రద్దు చేయడం అంటే శ్రమ తప్ప వేరే ఆస్తులు లేని ప్రజలు పనుల్లేక, ఆకలి తట్టుకోలేక, కుటుంబ పోషణ కొరకు ఏదో ఒక పనిలో గత్యంతరం లేక తమను తాము చవకగా అమ్ముకునే నిర్బంధ పరిస్థితిని సృష్టించడమే. ఏ రకమైన వెసులు బాటు లేకుండా. ప్రత్యామ్నాయ మార్గాలు లేకుండా, తప్పనిసరి పరిస్థితుల్లో తమ శ్రమను, సేవలను అందించాల్సిన పరిస్థితి అనేది నిర్బంధ శ్రమకిందకే వస్తుందని సుప్రీం కోర్టు 1983లో పియుడిఆర్, కేంద్రప్రభుత్వం కేసులో చెప్పింది. గత్యంతరం లేని పరిస్థితుల్లో, తమ ఇష్టాలకు వ్యతిరేకంగా, తక్కువ వేతనాలతోనైనా సరే ఇతర రక్షణలు లేకుండా పనిచేయవల్సి రావడం అనేది ఆర్టికల్ 23కు వ్యతిరేకమైనది.

పనిచేయు వారందరికీ జీవన ప్రమాణానికి సరిపోవు వేతనాలు ఇవ్వాలని, అలానే వ్యాపార సంస్థలో పనిచేస్తున్న కార్మికులకు యాజమాన్య నిర్వహణలో భాగస్వామ్యాన్ని కల్పించాలనీ ఆర్టికల్ 43 చెబుతున్నది. కార్మిక చట్టాల్లోని సవరణలు రాజ్యాంగంలోని ఆర్టికల్ 23, 43 అలాగే 21లకు వ్యతిరేకమైనవి. పెన్షన్ చట్టం, పని పరిస్థితుల చట్టం, కాంట్రాక్ట్ కార్మిక రక్షణ చట్టం, కార్మిక ఆరోగ్య చట్టం, ఫ్యాక్టరీ చట్టం 1948, వంటి చట్టాలను రద్దు చేయడం లేదా సడలించడం ద్వారా యాజమాన్యాలకు విపరీతమైన వెసులుబాట్లు కలుగుతాయి. ఇష్టం వచ్చినట్లుగా వేతనాలు కానీ, అధిక పనిగంటలు కానీ, ఎప్పుడంటే అప్పుడు ఎవరినంటే వారిని తొలగించే లేదా నియమించుకునే స్వేచ్ఛ వారికి ఉంటుంది. ఈ సడలింపుల వలన కార్మికులకు ప్రథమ చికిత్స, మరుగుదొడ్లు, తాగునీరు, క్యాంటిన్లు, క్రెష్‌లు, సరియగు గాలి, వెలుతురు, పని స్థలాల్లో పరిశుభ్రత వంటివి యాజమాన్యాల బాధ్యత కాదు. పనిచోట్లలో కార్మికుల రక్షణ భద్రతలు పట్టించుకోవాల్సిన పనిలేదు. ఎటువంటి దుర్భర పరిస్థితుల్లోనైనా సరే కార్మికులు పనిచేయవల్సి ఉంటుంది. వ్యక్తిగత రక్షణ పరికరాలు అందించాల్సిన అవసరం లేదు. కార్మికులకు జరిగే కష్ట నష్టాలను లేబర్ కమిషనర్‌కు విజ్ఞప్తి చేసుకునే అవకాశం లేకుండా చేశారు. పారిశ్రామిక వివాదాలను పరిష్కరించడానికి ఉద్దేశించిన చట్టాలను వ్యవస్థలను రద్దుచేశారు. పి.వి. నర్సింహారావు ప్రధాన మంత్రిగా మన్మోహన్ సింగ్ ఆర్థిక మంత్రిగా పనిచేసిన సమయంలో సరళీకృత ఆర్థిక విధానాలను ప్రవేశపెట్టారు. ఆ విధానాల నేపథ్యంలో రాను రాను కార్మికులకు భద్రత, హక్కులు తగ్గిపోతున్నాయి. ఉన్న చట్టాలనైనా నిజ స్ఫూర్తితో అమలు పరచడంలేదు.

లాక్‌డౌన్ కంటే ముందే దేశంలో 25 శాతం నిరుద్యోగం ఉన్నదని సెంటర్ ఫర్ మానిటరింగ్ ఆఫ్ ఇండియన్ ఎకానమీ అధ్యయనం చెబుతున్నది. లాక్‌డౌన్ ఫలితంగా మరెంతో నిరుద్యోగం పెరిగింది. ఉన్న ఉద్యోగాలు ఉపాధులు పోతున్నాయి. వేతనాల్లో కోతలు విధిస్తున్నారు. ఇలాంటి దుర్భర పరిస్థితుల్లో ఉద్యోగ భద్రత కల్పిస్తూ, ప్రజలకు నగదును బదిలీచేయాలి. నిత్యావసర వస్తువులను సరఫరా చేయాలి. కాని ప్రజలను ఎవరి దారిని వారే చూసుకొమ్మని వదిలేయడం అనేది సంక్షేమ రాజ్య లక్షణం కాదు. దేశంలో 40 కోట్ల కార్మికులు ఉంటారని అంచనా. పరిశ్రమల ఉత్పత్తులకు డిమాండ్ ఉండాలంటే

ఈ కార్మికులకు ఆర్థిక అదాయ వనరులు ఉండాలి. ప్రజల చేతుల్లో ఆదాయముంటేనే కదా వస్తు, సేవల వినియోగం పెరిగేది.

ఉత్పత్తులను కొనుక్కోగలిగే వారుంటేనే కంపెనీలు, పరిశ్రమలు మనుగడలో ఉంటాయి. ఉత్పత్తికి మార్కెట్‌లో డిమాండ్ ఉండాలంటే ప్రజలకు సరైన వేతనాలు మంచి జీవన ప్రమాణాలు, జీవనోపాధులకు రక్షణ ఉండాలి. లేని పక్షంలో ఉత్పత్తులు మురిగిపోతాయి. వీటిని వ్యాపార పారిశ్రామిక వర్గాలు ఉచితంగానో, చవకగానో ఇవ్వడానికి సిద్ధపడవు కదా. సప్లై పెరిగి డిమాండ్ లేనప్పుడు ప్రజల్లో కొనుగోలు శక్తి పడిపోయినప్పుడు వచ్చేది సంక్షోభమే. గతంలో కాని ఇటీవల వచ్చిన ఆర్థిక సంక్షోభం ఈ ఫలితమే కదా ప్రపంచంలోనే చైనా తరువాత 130 కోట్ల జనాభా కలిగివున్న రెండవ దేశం ఇండియా. కార్మికులు, కూలీలు, తదితర అట్టడుగు పొరల్లోని వారిని లెక్కలోకి తీసుకోకున్నా కూడా మధ్య తరగతి, ఎగువ మధ్య తరగతి, వివిధ స్థాయిల్లోని కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వ ఉద్యోగులు, పై స్థాయిల్లో ఉన్న ప్రైవేట్, సాఫ్ట్‌వేర్ ఉద్యోగులు, కాంట్రాక్టర్లు, రాజకీయ వర్గాలు, సంపన్నులు అతి సంపన్న వర్గం అంతా కలిస్తే చిన్న చిన్న పది ఇరవై దేశాల మొత్తం జనాభా కంటె ఎక్కువగానే ఉంటుంది. ఈ మార్కెట్‌ను కొల్లగొట్టడం కోసం జాతీయ అంతర్జాతీయ పెట్టుబడిదారీ శక్తులు ఇక్కడ పెట్టుబడులు పెట్టడానికి ముందుకొస్తాయన్నమాట.

ఇక్కడ చవక శ్రమతో, సహజ వనరులతో, పెట్టుబడికి దాసోహం అనే పాలకుల విధానాల ఆసరాతో సంపదలను దోచుకోవడానికి వచ్చే బహుళజాతి కార్పొరేషన్ల వలన నష్టపోయేది ఈ ప్రాంత ప్రజలు. ఇక్కడి ప్రజలకు కార్మిక చట్టాల అమలుతో కూడిన ఉద్యోగ ఉపాధులు న్యాయమైన వేతనాలు అందితే కదా సమాజానికి మేలు జరిగేది. ఇక్కడ ఉత్పత్తి చేసిన వాటిని ప్రపంచ మార్కెట్‌లో ఇతర దేశాలకు సరఫరాచేస్తే ఈ ప్రాంతానికి ఎంతో కొంత మేలు జరుగుతుంది. అలా కాకుండా మిడతల దండులా వచ్చే పెట్టుబడులు ఇక్కడి ప్రజలకు అనవసరం. ఈ వ్యవహారమంతా కూడా తాలుతోటి ధాన్యాన్ని తన్నుకు పోయినట్లుగా ఉంటుంది.

ప్రభుత్వ రాయితీలు, చవక శ్రమతో కొల్లగొట్టిన సంపదను, లాభాలను ఇక్కడి ప్రజలకు మేలు జరిగేలా వినియోగిస్తారనే గ్యారెంటీ ఏమీలేదు. వాటిని ఇక్కడే తిరిగి పెట్టుబడిగా పెట్టి అధిక సంఖ్యలో ప్రజలకు ఉపాధి ఉద్యోగాలు కల్పిస్తాయని చెప్పే పరిస్థితి లేదు. ఈ సంపదను మరో దేశంలో పెట్టుబడిగా పెట్టి అక్కడి సంపదలను కొల్లగొట్టవచ్చు. లేదా పొదుపు రూపంలో వారి బొక్కసాల్లో మూలుగుతుండవచ్చు. అప్పుడు ఆ పెట్టుబడులు ప్రజలకు నిరుపయోగం అవుతాయి.

కార్మిక చట్టాలను బలహీన పరచడం ద్వారా చవకగా కార్మిక శక్తిని అందించడం ద్వారా పెట్టుబడులను ఆకర్షిస్తామని అనుకోవడం పొరపాటని భారత ప్రభుత్వ అధ్యయనంలో తేలింది. రాజస్థాన్, ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలలో జరిపిన ఈ అధ్యయనంలో తెలిసిందేమంటే కార్మిక చట్టాల సడలింపుల ద్వారా భారీ పెట్టుబడులు రాలేదు. ఉద్యోగాల సృష్టి జరుగలేదు. పెట్టుబడులకు కావాల్సింది చవకగా లభించే ముడి సరుకులు, పెద్దదైన స్థానిక మార్కెట్. అనుకూలమైన విధాన స్థిరత్వం, ఆరోగ్యకర విద్యావంతులైన ఉన్నత ప్రమాణాలతో కూడిన శ్రమశక్తి. వేతనాలు తగ్గించడం, కార్మికుల హక్కులను హరించివేయడం, ఎక్కువ గంటలు పనిచేయడం, వారి రక్షణ, ఆరోగ్యాలను గాలికొదలడం ద్వారా వారి శక్తి సామర్థ్యాలు తగ్గిపోవడమే కాకుండా వారి కొనుగోలు శక్తి కూడా పడిపోతుంది.

చైనా నుండి కంపెనీలు ఇతర దేశాలకు తరలిపోతున్నాయని వాటిని అందుకోవడం కోసం వాటికి అనుకూలమైన విధానాలను అమలు చేయాలని అందులో భాగంగా కార్మిక చట్టాలను సవరించాలని చెబుతున్నారు. వేరే దేశాల నుండి కంపెనీలను ఎందుకు ఆహ్వానించాలి. వారికి అప్పనంగా ఇక్కడి సహజ వనరులను, మానవ శ్రమను చవకగా అప్పగించి వాటికి లాభాలను చేకూర్చడం కాదు. ఏక పక్షంగా పెట్టుబడిదారుల ప్రయోజనాలే తప్పిస్తే ఈ ప్రాంత అభివృద్ధి సంక్షేమాలను ఫణంగా పెట్టడంకానే కాదు. అటువంటి ఒప్పందాలు బహుళజాతి సంస్థలకు ప్రయోజనాలను చేకూరుస్తూ ప్రజలను కష్టాల్లో ముంచుతాయి. ఇటువంటి ఒప్పందాలు దేశ ప్రజానీకానికి అనవసరం.

ప్రభుత్వ అధికారం అనేది ఎప్పుడు కూడా సామాన్య ప్రజల, సంపదను సృష్టించే వర్గాల హక్కులను కాపాడేదిగా ఉండాలి కదా. పిడికెడు మంది సంపన్న వర్గాల ప్రయోజనాల కోసం కోట్లాది మంది కార్మికుల సాదారణ ప్రజానీకం హక్కులను కాలరాస్తూ వారి బతుకుల్లో నిప్పులు పోసే నిర్బంధ విధానాలను నిస్సిగ్గుగా ముందుకు తేవడం ఈ దేశ ప్రజాస్వామ్య దౌర్భాగ్యం. కార్మికుల వేతనాలు తగ్గించి చవకగా వారి శ్రమను కొల్లగొట్టి లాభాలను ఆర్జించడం వారంటున్న ఆర్థిక వ్యవస్థను గాడిలో పెట్టడం ఎవరికోసం, అట్టడుగున ఉన్న ప్రజల పొట్టలు గొట్టే వారిని మరింత దారిద్ర్యంలోకి నెట్టివేసే ఆ లాభాలు ఎందుకని అటువంటి కంపెనీలు వ్యాపార వర్గాలు ఆర్థిక వ్యవస్థ ఎందుకు? కార్మికులకు ఏమైతేనేమి వారు ఏమైపోతేనేమి కాని బడా వ్యాపార వర్గాలు, పెట్టుబడిదారుల లాభాలకు మాత్రం పడిపోవద్దు. లాక్‌డౌన్ వల్ల ఆర్థిక వ్యవస్థ మందగమనంలో పడలేదని అనలేముగానీ అంతకు ముందే సంపన్న వర్గాలు, పెట్టుబడిదారీ శక్తులు పోగేసుకున్న సంపదలు లాభాలు ఏమైపోయినట్లు? ఆ సంపదల్లోంచి కొంచెమైనా బయటకు తీయరా? అవన్నీ అలాగే గుట్టలు గుట్టలుగా పేరుకుపోవాలా? ఆ బొక్కసాల్లోకి కొత్తగా వారనుకున్నంతగా ఆదాయాలు చేరలేదని దాన్ని నింపుకోవడానికి కార్మికులను బలితీసుకోవడం ఏ మానవీయతకు నిదర్శనం?

సంపద సృష్టికి మూలకారణం శ్రమ. మానవ శారీరక, మేధో శ్రమలు లేకుండా ప్రకృతి వనరులు మానవ అవసరాలు తీర్చే రకరకాల వస్తువులుగా మారేవి కావు. శ్రామికుల శ్రమ సంపదను సృష్టించగా ఆ సంపదలపై అధికారాన్ని హక్కును యజమానులు, పెట్టుబడిదారులు, పెత్తందారీ శక్తులు అనుభవిస్తున్నారు. శ్రమ దోపిడికి గురవ్వడం వలన అది సంపదగా, లాభాలుగా ఆధిపత్య వర్గాలకు దక్కుతూ వస్తున్నది. శ్రమకు తగిన వేతనాన్ని - ఫలితాన్ని ఇస్తే పెట్టుబడిదారునికి గాని, యజమానికి గాని లాభాలెలా వస్తాయి? శ్రామికుల శ్రమను డబ్బు, ఆస్తులు, భూములు, యంత్ర పరికరాలు, భవనాలు వంటి వాటిల్లోకి పెట్టుబడులుగా మార్చడం జరుగుతుంది. వీటన్నింటిలోని మూలాధారం శ్రమ అనే విషయాన్ని దాచిపెట్టి వాటిని యజమానులు సంపదలుగా లాభాలుగా చూపెడుతుంటారు. కార్మికులకు వేతనాలిచ్చినట్లుగానే యజమానులు, పెట్టుబడిదారులు కూడా తాము చేసిన శ్రమకు తగిన వేతనం తీసుకుంటే వారు చెబుతున్న లాభాలు లేదా పోగయిన సంపద ఎక్కడ నుండి వస్తుందో తేలిపోతుంది.

# పని గంటల పెంపు - పాలకుల స్వభావం

***కార్మికులు పోరాడి సాధించుకున్న 8 గంటల పనిదినాన్ని కరోనా సాకుతో 12 గంటల పనిదినంగా మార్చి కార్పొరేట్ శక్తులకు లాభాలను చేకూర్చే పాలకుల నిర్ణయాన్ని సంఘటిత కార్మికోద్యమాల ద్వారానే ఎదుర్కోవాలని అంటున్నారు ఎం. శ్రీనివాస్***

ఆర్థిక మాంద్యంతో పాటు కరోనా సంక్షోభం కార్మికవర్గాన్ని, ప్రజలను తీవ్ర సంక్షోభంలోకి నెట్టింది. దేశ ఆర్థికవ్యవస్థను మరింత పతనావస్థకు దిగజార్చింది. ఈ పరిస్థితుల్లో కార్మికుల, ప్రజల తలసరి ఆదాయం పెంపొందించి, కొనుగోలు శక్తి పెరిగే విధంగా కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు అవసరమైన అన్నిరకాల చర్యలను చేపట్టవలసి ఉండగా అందుకు భిన్నంగా కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు ప్రధానంగా బిజెపి పాలిత రాష్ట్రాలు కేంద్ర ప్రభుత్వ పరోక్ష సహకారంతో కార్మిక చట్టాల్లో మార్పులను, పని గంటల పెంపు, కార్మికుల ఉద్యోగుల మౌలిక సౌకర్యాలను ఎత్తివేసే పనికి పూనుకున్నాయి. వివిధ రాష్ట్రాలు కార్మిక చట్టాలను మూడేండ్ల పాటు నిషేధిస్తూ, 8 గంటల పనిదినాన్ని 12 గంటల పనిదినంగా మారుస్తూ నిర్ణయం తీసుకున్నాయి. కార్మికులకు, ఉద్యోగులకు సంబంధించిన అనేక మౌలిక సౌకర్యాలను ఎత్తివేసింది. ఈ చర్యలు కార్మికుల, ఉద్యోగుల మౌలిక హక్కులు, సౌకర్యాల రద్దుకు ప్రాతిపదికగా ఉండబోతున్నాయి. చట్టాల నిషేధం, పని గంటల పెంపు తాత్కాలికమే అని చెప్పినప్పటికీ క్రమంగా వాటి శాశ్వత రద్దుకు అవసరమైన ముందస్తు చర్యలన్నది దృష్టిలో పెట్టుకోవాలి. ఈ నిర్ణయాలు ఎవరి ప్రయోజనాల కోసమన్నది పాలకులు తమంతట తామే స్పష్టం చేయడంతో వారి నగ్న స్వభావం మరోసారి బయటపడింది. నిజానికి ఈ ప్రక్రియ సంక్షోభ కాలానికి ముందునుంచే జరుగుతున్నది. 44 రకాల కార్మిక చట్టాలను నాలుగు కార్మిక కోడ్స్‌గా రూపొందించడం ఈ చర్యల్లో భాగమే. కోవిడ్ 19 నేపథ్యంలో విధించిన లాక్‌డౌన్ కారణంగా భారత ఆర్థిక వ్యవస్థ తీవ్ర సంక్షోభంలోకి నెట్టబడింది. అంతర్జాతీయ ద్రవ్యసంస్థ (ఐఎంఎఫ్) అంచనాల ప్రకారం 'ఇది గడిచిన కొన్ని దశాబ్దాల కనిష్ట స్థాయికి అంటే 2019-20 సంవత్సరానికి 1.9 శాతం ఉండబోతున్నది'. పలు రంగాల్లో ఉత్పత్తి నిలిచిపోయింది. నిరుద్యోగం, ఉపాధి రహిత పరిస్థితులు విలయతాండవం చేస్తున్నాయి.

అసంఘటిత రంగ కార్మికుల పరిస్థితి అస్తవ్యస్థంగా మారింది. వలస కార్మికులు అనాథ స్థితికి నెట్టబడ్డారు. ప్రజల తలసరి ఆదాయం తగ్గి కొనుగోలు శక్తి పడిపోయి జీవన ప్రమాణాలు దిగజారుతున్న పరిస్థితుల నేపథ్యంలో లాక్‌డౌన్ కారణంగా మన ఆర్థిక వ్యవస్థ పరిమాణం 200 లక్షల కోట్లలో 63 లక్షల కోట్లు నష్టం వాటిల్లింది. అంటే మొత్తంలో ఆర్థిక వ్యవస్థ పరిమాణంలో నాలుగోవంతు నష్టం వాటిల్లిందన్నమాట. అసంఘటిత రంగంలో కూడా 16 లక్షల కోట్ల నష్టం వాటిల్లింది. లాక్‌డౌన్ కారణంగా ప్రపంచవ్యాప్తంగా పరిశ్రమలు ఆగిపోయాయి. ఉత్పత్తి నిలిచిపోయింది, వ్యాపారాలు బందయ్యాయి, అమ్మకాలు కొనుగోలుల ఊసేలేదు. అయినా పెట్టుబడిదారులు లాభాలు అర్జిస్తూనే ఉన్నారు. అంతర్జాతీయ బడా కార్పొరేట్ సంస్థ అమెజాన్‌కు రు. 2250 కోట్ల లాభాలు వచ్చాయి. భారత్‌కు చెందిన బడా కార్పొరేట్ సంస్థ అయిన రిలయన్స్ తన లాభాలను మరింత పెంచుకున్నది. దీనికి కారణం వివిధ దేశాలు ప్రకటించిన ఉద్దీపన పథకాల ఫలితమే ఈ లాభాలకు మూలం. 'లాక్‌డౌన్ ఇలాగే కొనసాగితే అసంఘటిత కార్మికులు, కూలీలు, నిరుపేదలు ఆకలిచావుల బారిన పడతారని, కరోనా మరణాల కన్నా ఆకలిచావులే అనేక రెట్లు అధికంగా ఉంటాయని, వీరికోసం తక్షణమే 60 వేల కోట్ల రూపాయలు మంజూరు చేయవలసి ఉంటుందని' రిజర్వు బ్యాంకు మాజీ గవర్నర్ రఘురామ్ రాజన్ వంటి ఆర్థిక నిపుణులు చెపుతున్నా పాలకులు పెడచెవిన పెడుతున్నారు.

20 లక్షల ప్యాకేజీ ప్రజలకు, కార్మికులకు సంబంధించినంత వరకు కేవలం 'ఎండమావుల్లో నీళ్లులాంటివే'. ప్రజలను వంచించి మరింత

అంతకుముందే చేసిన శ్రమ ఫలితంగా పోగయిన సంపదలను కొద్ది మంది సంపన్న వర్గాలు తమ స్వంత ఆస్తిగా పేర్కొంటూ పెట్టుబడులుగా పెడుతుంటాయి. కేవలం పెట్టుబడులే ఉత్పత్తిని చేయలేవు. దానికి మానవ శ్రమ తప్పనిసరి. ఒకప్పుడు దాదాపుగా మానవ శ్రమ వల్లనే సంపదలు సృష్టించబడిన దశ నుండి ఆ శ్రమలు యంత్ర పరికరాలను తయారుచేసి పెట్టాయి. శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానం పెరుగుతూ ఎన్నెన్నో యంత్ర పరికరాలను ముందుకు తెచ్చాయి. కొన్ని సందర్భాల్లో శారీరక శ్రమ అవసరంలేకుండానే యంత్రాలు ఆ పని చేసే పరిస్థితి వచ్చింది. అయితే ఆ యంత్ర తయారీలో మానవ శ్రమ దాగి ఉన్నదనే విషయాన్ని మరిచిపోకూడదు. అంటే మానవ శ్రమ రకరకాల రూపాల్లో నిక్షిప్తం అవుతూ వస్తున్నది. సామూహిక శ్రమ ఫలాలను కొంతమంది మాత్రమే అనుభవిస్తూ తామే సంపద సృష్టికర్తలమని సంపన్న వర్గాలుగా, పెట్టుబడి దారులుగా, ఆస్తిపర వర్గాలుగా చలామణి అవుతున్నారు. మొత్తం సమాజానికి చెందాల్సిన సంపద కొద్దిమంది చేతుల్లో కేంద్రీకరించబడి వారి సుఖాలకు, విలాసాలకు వినియోగించబడుతున్నది. నిజమైన సంపద సృష్టికర్తలైన శ్రామిక జనులకు, కార్మికులకు, కర్షకులకు, అట్టడుగు వర్గాల వారికి పోగుపడుతున్న సంపదలు అందించే వ్యవస్థ నిర్మాణం అయి ఉంటే సంపదపై సమాజం మొత్తానికి హక్కు ఉండేది. ఆ వ్యవస్థ లేని ఫలితంగా మెజారిటీ ప్రజలు దారిద్ర్యంలో, కష్టాల్లో దిన దిన గండంగా బతుకులు లాక్కొస్తున్నారు.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

భ్రమల్లో ఉంచడానికి ఉద్దేశించినదే. మరోవైపున కేంద్ర పాలకులు ప్రభుత్వ రంగంలోని కీలకమైన సంస్థలను ప్రైవేటీకరించే చర్యలను బహాటంగానే ముమ్మరం చేశారని అందులో భాగంగా డిఫెన్స్, ఆయిల్, బొగ్గు గనులు, ఖనిజాలు, విమానయానం, బ్యాంకులు, బీమా సంస్థలు తదితర రంగాలున్నాయి. విదేశీ ప్రత్యక్ష పెట్టుబడులు 100 శాతం ప్రవేశానికి పూర్తి స్వేచ్ఛను కల్పించారు. కరోనా సంక్షోభాన్ని సాకుగా తీసుకొని డిఫెన్స్ రంగంలో 49 శాతం ఉన్న ప్రైవేట్ (విదేశీ) పెట్టుబడుల వాటాను 74 శాతానికి పెంచారని బొగ్గు గనులు, ఖనిజాలను స్వదేశీ, విదేశీ బడాకార్పొరేట్ సంస్థలకు విక్రయించడానికి చర్యలు తీసుకుంటున్నారు ఇవి మన ఆర్థిక, రక్షణ మూలాలను కబళించే చర్యలు.

కార్మిక చట్టాల అంశం ఉమ్మడి జాబితాలో ఉన్నందున రాష్ట్ర ప్రభుత్వాలు తమకున్న కార్మిక చట్టాల్లో మార్పులు చేసే హక్కును ఆధారం చేసుకొని బిజెపి పాలిత రాష్ట్రాలైన ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్, హర్యానా, హిమాచల్‌ప్రదేశ్, గుజరాత్, కర్నాటక, గోవా కాంగ్రెస్ పాలిత రాష్ట్రాలైన పంజాబ్, రాజస్థాన్ రాష్ట్ర ప్రభుత్వాలు కేంద్రప్రభుత్వ పరోక్ష సహకారంతో ఏకంగా కార్మికచట్టాల రద్దుకు రంగం సిద్ధం చేశాయి. విదేశీ, స్వదేశీ పెట్టుబడిదారీ శక్తులు బడా కార్పొరేట్ సంస్థల ఒత్తిడితో కార్మికుల మౌలిక హక్కుల రద్దుకు ప్రాతిపదికగా ఉండే విధంగా 44 రకాల కార్మిక చట్టాల స్థానంలో కేవలం 4 కార్మిక కోడ్స్‌ను రూపొందించి అమలుచేసే పనిలో కేంద్రం ఉన్నది. రాష్ట్ర ప్రభుత్వాలు తీసుకున్న ఈ నిర్ణయాలు కేంద్ర బిజెపి సర్కార్ చేపట్టిన కార్మిక చట్టాల సవరణ ప్రక్రియను మరింత పటిష్టపరిచేవి. కేంద్ర సర్కార్ సహకారంతో ఈ రాష్ట్ర ప్రభుత్వాలు ఆ కోడ్స్‌లో ఉన్న అత్యంత నిరంకుశమైన కొన్ని చర్యలను అమలు చేయడానికి పూనుకున్నాయి. అందుకు కలిసివచ్చిన కరోనా సంక్షోభ కాలాన్ని వినియోగించుకుంటున్నాయి. మూడేళ్లపాటు కార్మిక సంఘాలను నిషేధించాయి. కార్మిక చట్టాలను రద్దు చేశాయి.

కరోనా దెబ్బకు దేశ ఆర్థికవ్యవస్థ కుదేలైన నేపథ్యంలో దేశీయ పరిశ్రమలు వేగంగా కోలుకోవడం కోసం, పెట్టుబడులను ఆకర్షించడం కోసం ఈ చర్యలు అనివార్యమంటూ ఆయా రాష్ట్ర ప్రభుత్వాలు వివరణ ఇచ్చుకోవడం కేంద్ర బిజెపి పాలకుల అండతో జరుగుతున్నదే. ఏకంగా ఉత్తరప్రదేశ్ ప్రభుత్వం 'ఉత్తరప్రదేశ్ టెంపరరీ ఎగ్జమ్షన్స్ ఫర్ సస్టెయిన్ లేబర్‌లాస్ ఆర్డినెన్స్'ను జారీచేసింది. కరోనా సంక్షోభం కారణంగా లాక్‌డౌన్ విధించిన నేపథ్యంలో ఆర్థికవ్యవస్థ చాలా చిన్నాభిన్నమైంది. దీన్ని 'పునరుజ్జీవింప చేసేందుకు' ఈ ఆర్డినెన్స్‌ను జారీ చేశామని యుపి ప్రభుత్వం వివరణ ఇచ్చుకున్నది. కార్మిక వ్యవహారాలు రాజ్యాంగంలోని ఉమ్మడి జాబితా కిందకు వస్తాయి. కనుక వీటిపై రాష్ట్ర ప్రభుత్వాలు కేంద్ర కార్మిక చట్టాలలో మార్పులనూ, తమ పరిధిలోనూ చట్టాలను చేయవచ్చు. ప్రస్తుతం కార్మికులకు సంబంధించిన వేరువేరు అంశాలపై 44 కేంద్ర కార్మిక చట్టాలు, వందకుపైగా రాష్ట్ర చట్టాలున్నాయి.

కేంద్ర కార్మిక చట్టాలకు మార్పులు చేసే అధికారం రాష్ట్ర శాసనసభలకు ఉన్నది. రాష్ట్రాలు తీసుకువచ్చే అంశాలు కేంద్ర చట్టాలకు భిన్నంగా ఉంటే వాటికి కేంద్ర ప్రభుత్వం అంగీకారంతో రాష్ట్రపతి అనుమతి తీసుకోవాలని రాజ్యాంగంలోని 254(2) అధికరణ నిర్దేశిస్తుంది. ఉత్తర ప్రదేశ్, మధ్యప్రదేశ్ రాష్ట్రాలు 213వ రాజ్యాంగ అధికరణ కింద ఆర్డినెన్స్‌ను జారీచేసి కేంద్ర ప్రభుత్వ చట్టాలను సస్పెన్షన్‌లో పెట్టాయి. రాష్ట్ర శాసనసభల సమావేశాలు జరగని సమయంలో ఆ ఆర్డినెన్స్‌లపై సంతకాలు చేసే అధికారం గవర్నర్‌కు ఉంటుంది. కార్మికచట్టాల్లో రాష్ట్ర ప్రభుత్వాలు చేసే మార్పులను అమోదించాలా? లేదా తిరస్కరించాలా? అన్నది కేంద్రం నిర్ణయించాలి. ప్రధానంగా బిజెపి పాలిత రాష్ట్రాల్లో జరిగిన పరిణామాలివి. పైగా కేంద్ర ప్రభుత్వ సహకారంతో జరుగుతున్నవి. కనుక రాష్ట్రపతి ఆమోద ముద్ర వేయవచ్చు.

ఇక మధ్యప్రదేశ్ బిజెపి ప్రభుత్వం ఒకడుగు ముందుకు వేసి కార్మిక చట్టాలకే పరిమితం కాకుండా వ్యవసాయ ఉత్పత్తుల మార్కెట్ చట్టాన్ని కూడా సవరించింది. దీనివల్ల వ్యవసాయ ఉత్పత్తులను ప్రైవేట్ రంగం కూడా సేకరించవచ్చు. ఈ చట్టసవరణకు ముందు ప్రభుత్వం అమోదించిన మండీల్లో (మార్కెట్) కనీస మద్దతు ధరకు అమ్మాలనే నిబంధన ఉన్నది. ఈ సవరణతో మండీల్లో అమ్మాలన్న నిబంధన రద్దయి పోతుంది. ప్రైవేట్ వ్యక్తులు అమ్మకాలు, కొనుగోలులో తమ ఇష్టాను సారంగా ధరలను నిర్ణయించే ప్రమాదం ఉన్నది. అదే విధంగా రాష్ట్ర ప్రభుత్వాలు కార్మిక చట్టాల్లో తీసుకువచ్చిన మార్పులు ఒక కార్మికుడికి చెల్లించే వేతనం చట్టం నిర్దేశించిన కనీస వేతనం కన్నా తక్కువగా ఉంటే అది 23వ రాజ్యాంగ అధికరణలో పేర్కొన్న నిర్బంధ శ్రమకిందకే వస్తుందని ఒప్పంద కార్మికుల కేసుకు సంబంధించి సుప్రీంకోర్టు 1982లో ఒక తీర్పునిచ్చింది. దీని ప్రకారం 1948 కనీస వేతనాల చట్టంతోసహా అనేక చట్టాల అమలును రాష్ట్రాలు నిలిపివేయడం వల్ల ప్రాథమిక హక్కులకు విఘాతం ఏర్పడుతుంది. అంటే ప్రాథమిక హక్కుల ఉల్లంఘన కిందకే వస్తుంది. రాష్ట్రాలు కార్మిక చట్టాల విషయంలో తీసుకున్న నిర్ణయాలు అంతర్జాతీయ కార్మిక సంస్థ(ఐఎల్ఓ) 144వ ఒప్పందానికి విరుద్ధం. గతంలో ఈ ఒప్పందంపై భారత ప్రభుత్వం అంగీకరిస్తూ సంతకం చేసింది. రాష్ట్ర ప్రభుత్వాలు చేపట్టిన ఈ చర్యలు చట్టపరంగానూ, సామాజిక న్యాయ దృక్కోణంలోనూ, నైతిక పరంగానూ సరైనవికావు. సమర్థనీయంకావు.

బిజెపి పాలిత రాష్ట్రాలు తీసుకున్న నిర్ణయాలను సమర్థిస్తూ 'ప్రస్తుత విపత్కర పరిస్థితుల్లో పరిశ్రమలు మనుగడ సాగించాలంటే తగిన వాతావరణాన్ని కల్పించాల్సిన అవసరం ఉందని, రాష్ట్రాలు తీసుకువచ్చే కార్మిక సంస్కరణలు ఫ్యాక్టరీలు సమర్థవంతంగా పనిచేసేందుకు తోడ్పడతాయని' పరిశ్రమల సమాఖ్య అసోచామ్ అధ్యక్షుడు నిరంజన్ హీరానందని వాఖ్యానించడం కార్మిక చట్టాల్లో సవరణలు ఎవరి ప్రయోజనం కోసమన్నది స్పష్టమవుతున్నది. నిజానికి కరోనా సంక్షోభం, లాక్‌డౌన్ పరిస్థితులకు పూర్వమే కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు స్వదేశీ, విదేశీ బడా కార్పొరేట్ పెట్టుబడి శక్తులకు, సంస్థలకు అనుకూలంగా కార్మిక చట్టాలలో సవరణలు చేసే ప్రక్రియకు మూలం 90 దశకంలో వచ్చిన నూతన ఆర్థిక విధానాలే. నాటి నుండే కార్మికచట్టాలపై ప్రధానంగా చర్చ జరుగుతూ వచ్చింది. కాలాతీతమైన చట్టాలు భారత్‌లో భారీస్థాయి వ్యాపార సంస్థల అభివృద్ధికి ఆటంకంగా ఉన్నాయి. ఫలితంగా కార్మిక మార్కెట్ పెద్ద ఎత్తున అసంఘటిత రూపంలో ఉండిపోయిందన్నది బడా పెట్టుబడిదారీ వర్గాలు, వారిని సమర్థించే ఆర్థిక నిపుణులు తొలినుంచి చేస్తున్న వాదన. దేశంలో వ్యాపార సంస్థలు పెద్ద సంఖ్యలో లేకపోవడానికి పురాతన కార్మిక చట్టాలే కారణమని కూడా వీరి వాదన.

ఇంతకాలం అధిక మొత్తంలో పెట్టుబడులు రాకపోవడానికి దేశంలో

ఉన్న బలమైన, కాలంచెల్లిన కార్మిక చట్టాలే కారణమన్నది పాలకుల అభిప్రాయమే కాదు, బడా కార్పొరేట్ ఆర్థిక సంస్థల అభిప్రాయం కూడా. విదేశీ పెట్టుబడులు, పరిశ్రమలు రావడానికి అడ్డుగానూ కఠినంగానూ ఉన్న ఈ చట్టాలను పూర్తిస్థాయిలో మార్చాలన్నది బిజెపి వ్యూహాత్మక లక్ష్యం. అందువల్లనే 2014లో అధికారం చేపట్టిన నరేంద్రమోది ప్రభుత్వం కాలతీతమైన కార్మిక చట్టాలను మారుస్తామని ప్రకటించింది. దీని పర్యావసానమే కార్మిక చట్టాల్లో సంస్కరణలు మరింత వేగవంత మయ్యాయి. అందులో భాగమే ఈ అర్డినెన్స్‌లు. ఈ అర్డినెన్స్ ప్రకారం పారిశ్రామిక వివాదాల చట్టం, వృత్తి భద్రతా చట్టం, కాంట్రాక్ట్ కార్మికుల చట్టం, వలస కార్మికుల చట్టం, సమాన వేతన చట్టాలను రద్దు చేశాయి. కేవలం ఇక భవన నిర్మాణ కార్మికచట్టం, నష్టపరిహార చట్టం, వెట్టి కార్మిక చట్టం, వేతన చెల్లింపు చట్టంలోని సెక్షన్ 5 మాత్రమే అమల్లో ఉంటుంది.

ఇంత దారుణంగా కార్మిక చట్టాలను రద్దు చేయడం 1947కు పూర్వం బ్రిటిష్ పాలనా కాలంలోనే జరిగింది. దీనివల్ల అదనపు గంటల పనికి అదనపు వేతనం ఉండదు. పని గంటలను నిర్ధారించే అధికారం యాజమాన్యానికే ఉంటుంది. కార్మికులను ఎప్పుడైనా తమ ఇష్టానుసారంగా తొలగించవచ్చును. కార్మికులను సరఫరా చేసే కాంట్రాక్టర్లకు లైసెన్స్ అవసరం లేదు. దీనితో అక్కడ ప్రభుత్వాలు కార్మికుల మౌలిక హక్కుల హననానికి ఒడిగట్టాయి. వేతనాలు, సామాజిక భద్రత హామీ, పని స్థలాల్లో రక్షణ, ప్రభుత్వాలతో, యాజమాన్యాలతో బేరసారాలాడే హక్కులను కార్మికులు పూర్తిగా కోల్పోయే విధంగా నిర్మాణాత్మక చర్యలు చేపట్టాయి. ఇది కార్మిక సంఘాల ఉనికికీ అత్యంత ప్రమాదకరం.

పనిగంటల పెంపుతో సహా కార్మిక చట్టాలలో చేసే సవరణలు ఏవైనా ప్రభుత్వం, కార్మికులు, సంస్థల యాజమాన్యాలతో కూడిన త్రైపాక్షిక సంప్రదింపులతో జరగాలనీ, ఆ సవరణలు కూడా అంతర్జాతీయ ప్రమాణాలకు అనుగుణంగా ఉండాలని అంతర్జాతీయ కార్మిక సంస్థ (ఐఎల్‌ఓ) భారతదేశ పరిణామాల నేపథ్యంలో పేర్కొన్నది. కార్మికుల శ్రేయస్సు, ప్రయోజనాలను కార్మిక చట్టాలు పరిరక్షిస్తాయని, అలాగే సామాజిక న్యాయం అందించే ముఖ్య సాధనం కార్మిక చట్టాలని ఐఎల్‌ఓ స్పష్టం చేసింది. కనీసం ఈ విషయాన్ని కూడా పాలకులు పరిగణలోకి తీసుకోకుండా పెట్టుబడిదారుల ప్రయోజిత సేవలోనే మునిగి తేలుతున్నారు.

పెట్టుబడులను ఆకర్షించే సాకుతో ప్రధాన కార్మిక చట్టాలలో కీలక మార్పులకు పాలకులు పూనుకున్నారు. క్రమంగా ఈ చట్టాలను పూర్తి స్థాయిలో రద్దుచేయాలన్న సంకల్పంతో పాలసీలను రూపొందిస్తున్నారు. ఇది కేవలం కరోనా సంక్షోభ సమయంలో వచ్చింది కాదు. దీనికి ప్రాతిపదిక 90వ దశకంలోనే ఏర్పడింది. సామ్రాజ్యవాద ప్రపంచీకరణ ఆర్థిక విధానాల నేపథ్యంలో దేశీయ, విదేశీ బడా పెట్టుబడిశక్తుల, కంపెనీల నుండి వచ్చిన డిమాండ్లపై ఆధారపడి ఈ విధానాలు రూపొందించబడుతున్నాయి.

ప్రస్తుత పరిస్థితిని అవకాశంగా తీసుకొని తమ విధానాల అమలుకు మోది ప్రభుత్వం చర్యలను వేగవంతం చేసింది. బిజెపి పాలిత రాష్ట్రాలు పనిగంటలు, కార్మిక చట్టాలు, కార్మిక సంఘాల నిషేధం తదితర విషయాలలో తీసుకున్న నిర్ణయాలను కారణాలు ఏమైనా కావచ్చు చివరకు ఆర్‌ఎస్‌ఎస్ రాజకీయ విభాగమైన బిజెపి అనుబంధ కార్మికసంస్థ భారతీయ మజ్దూర్ సంఘ్ (బిఎంఎస్) కూడా తప్పు పట్టింది. 'కార్మిక ప్రయోజనాలను పణంగా పెడుతూ పెట్టుబడిదారులకు ప్రయోజనం కల్పించేవిగా ఉన్నాయని' పేర్కొంటూ ఆటవిక రాజ్యాన్ని అనుమతించ బోమని, కార్మికులను కార్పొరేట్ల చేతుల్లో చిక్కనీయమని బిఎంఎస్ జాతీయ అధ్యక్షుడు సాజి నారాయణన్ స్పష్టం చేశాడు.

కార్మిక చట్టాల నుండి పరిశ్రమల మినహాయింపు తాత్కాలికమంటూ కీలకమైన కార్మిక చట్టాలన్నింటినీ మూడేళ్లపాటు నిషేధంలో పెట్టి క్రమంగా ఆ చట్టాలను శాశ్వతంగా రద్దు చేయడం ప్రభుత్వ ఉద్దేశం. ఉద్యోగులను, కార్మికులను నియమించుకునే, తొలగించే విషయంలో యాజమాన్యాలకు నిరంకుశమైన అధికారాలను ఈ సవరణల ద్వారా కట్టబెట్టింది. ఫ్యాక్టరీల తనిఖీలను మరింతగా కుదించి నామమాత్రం చేయడం ద్వారా మిగిలిన చట్టాల అమలు జరుగుతున్నది లేనిది పట్టించుకోబోమని స్పష్టంచేసింది. షిఫ్టుల విషయంలో ఫ్యాక్టరీల, కంపెనీల ఇష్టానికే వదిలేశాయి. కార్మిక సంక్షేమ నిధికి రు. 80 చొప్పున జయచేయాలన్న నిబంధనను ఎత్తివేసాయి. జమగూడిన సెలవులను అమ్ముకునే (లీవ్ ఎన్‌క్యాష్‌మెంట్) సదుపాయాన్ని తొలగించాయి. ట్రాన్స్‌పోర్టేషన్ అలవెన్స్ కూడా నిలిపివేశాయి. 48 లక్షల మంది కేంద్ర ప్రభుత్వ ఉద్యోగులకు, 62 లక్షల మంది పెన్షనర్లకు ఒక సంవత్సరం పాటు (2021 జూలై వరకు) కరువు భత్యం చెల్లించబోమని, అదే విధంగా 2021 నుంచి చెల్లించబోయే కరువు భత్యంతో పాటు పాత బకాయిలు (ఏరియర్స్) కూడా ఉండవని ప్రకటించారు.

ఇప్పటికే వేతనాలు చెల్లించకపోవడం, చెల్లించిన వేతనాల్లో కోత విధించడం, కార్మికుల, ఉద్యోగుల అక్రమ తొలగింపులు వంటి పరిణామాలు జరుగుతున్నాయి. కార్మికుల, ప్రజల తలసరి ఆదాయం పెరగడానికి, వారి కొనుగోలు శక్తి పెంచడానికి వీలుగా చర్యలు తీసుకుంటే ప్రస్తుత పరిస్థితుల నుండి బయట పడటానికి ఉపయోగకరంగా ఉంటుందని ఆర్థిక శాస్త్రవేత్తలు, నిపుణులు చెప్పే విషయాలను పాలకులు నిర్లక్ష్యం చేస్తున్నారు. ఒప్పంద కార్మికుల చట్టం అమలుకు కనీస సంఖ్య 20 నుండి 50కి పెంచడం, కొద్దిమంది ఉద్యోగులుండే ఫ్యాక్టరీలకు రిజిస్ట్రేషన్ అవసరం లేదని అధికార రికార్డుల నిర్వహణను తొలగించడం వంటి నిర్ణయాలను తీసుకున్నాయి.

కార్మికుల వేతనాలు, ఇతర ప్రయోజనాలు నిర్ణయించడంలోనూ, కోత విధించడంలోనూ యాజమాన్యాలకు పూర్తి స్వేచ్ఛపూరిత హక్కులను, అధికారాలను దఖలు పరిచింది. తాగునీరు, గాలి, వెలుతురు, క్యాంటిన్లు, ప్రథమ చికిత్స వంటి కనీస సౌకర్యాలు కార్మికులకు కల్పించవలసిన అవసరం లేదని యాజమాన్యాలకు చెప్పడం అత్యంత అమానుషమైన మధ్య యుగాలనాటి పరిస్థితులకు దర్పణం పడుతుంది. దీనితో కార్మికులు కనీస వేతన హక్కులను కోల్పోతారు. సడలింపు అంటేనే కార్మిక చట్టాల వర్తింపు ఉండదు. చిన్న పరిశ్రమల కార్మికులు తమకు చట్టబద్ధంగా రావల్సిన వాటిని పొందలేరు.

కరోనా సంక్షోభం సరే.... ప్రభుత్వ విధానాలు కార్మికుల మనుగడకు పెనుముప్పుగా మారాయి. పెట్టుబడి శక్తులకు మరిన్ని లాభాలు చేకూర్చి పెట్టడానికి, లాక్‌డౌన్ కాలంలో కోల్పోయిన లాభాలను తిరిగి పోగుచేసి

పెట్టడానికి, శ్రామికుల శ్రమశక్తిని దోచిపెట్టే విధాన వైఖరితో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు వ్యవహరిస్తున్నాయి.

అనేక చారిత్రక పోరాటాల పొత్తిళ్ల నుండి ఆవిర్భవించిన 8 గంటల పనిదినం కార్మికవర్గ సంఘటిత ఉద్యమాలు, వీరోచితమైన సమరశీల పోరాటాల ఫలితమే సార్వజనితమై అమల్లోకి వచ్చింది. ప్రస్తుత మోడీ ప్రభుత్వం అండతో వివిధ రాష్ట్రాలు 8 గంటల పనిదినాన్ని 12 గంటల పనిదినంగా మార్చాలన్న ఉద్దేశంతో చర్యలు మొదలు పెట్టింది. ఈ సంకల్ప సాకారం కోసమే రాష్ట్రాలతో ఒక అడుగు ముందుకు వేయించింది. 8 గంటల పనిదినంలో మూడు షిఫ్టులుగా ఫ్యాక్టరీలు, కార్ఖానాలు, బహుళజాతి పరిశ్రమలు పనిచేస్తున్నాయి. ఇది ఇప్పటివరకూ కొనసాగుతున్న పద్ధతి.

లాక్‌డౌన్ కారణంగా పరిశ్రమలు మూతపడి పని నిలిచిపోవడంతో కార్మికుల అదనపు విలువను దండుకోవడం ఆగిపోయింది. ఈ పరిస్థితిని పెట్టుబడిదారులు తట్టుకోలేకపోతున్నారు. సంపద సృష్టికర్తలు యాజమానులే అని ప్రవచించే 'ఐదు ట్రిలియన్ డాలర్ల ఆర్థికాభివృద్ధి సాకార నేతల'కు లాక్‌డౌన్ కాలంలో నిలిచిపోయిన పనిని తిరిగి చేయించుకోవడానికి మానవ వనరుల అవసరం ఎక్కువగా ఉంటుంది. ఈ పరిస్థితి కొత్తగా ఉద్యోగ, ఉపాధి అవకాశాలను సృష్టిస్తుంది. అయితే లాభాపేక్షయే ప్రాథమిక లక్ష్యంగా ఉన్న పెట్టుబడిదారీ శక్తులకు ఇది అంగీకారంగా ఉండదు. కనుక పనిదినాన్ని 12 గంటలకు పెంచడం వల్ల ఒక షిఫ్టు ఉద్యోగులు, కార్మికులు తమ ఉద్యోగాలను కోల్పోతారు. ఇప్పటికే సంఘటిత, అసంఘటిత రంగాలలో కలిపి నిరుద్యోగిత రేటు 2020 మార్చ్ ఏప్రిల్ మధ్య కాలంలో 7.5 శాతం నుండి 23.6 శాతానికి పెరిగింది.

లాక్‌డౌన్ కారణంగా 14.65 కోట్ల మంది ఉపాధి, ఉద్యోగ అవకాశాలు కోల్పోయారు. పని గంటల పెంపు వల్ల కార్మికుల వ్యక్తిగత జీవితాలు దుర్భరం అవుతాయి. నిరుద్యోగ సమస్య, ఉపాధి రహిత పరిస్థితులు ఏర్పడతాయి. ముగ్గురు చేయవలసిన పనిని ఇద్దరి చేత చేయిస్తారు. ఈ విధంగా సుమారు 60 కోట్ల మంది పనిచేయగలిగే వారున్న మనదేశంలో 20 కోట్ల మంది పనిని కోల్పోతారు. కార్మికుల మీద పనివత్తిడి పెరిగి వ్యక్తిగత ఉత్పత్తిలో ప్రమాణాలు తగ్గిపోతాయి.

12 గంటల పనిదినంలో యాజమాన్యాలు కార్మికుల చేత రెండు షిఫ్టులతోనే తమ పనిని చేయించుకుంటారు. దీనివలన ఒక షిఫ్టు ఉద్యోగులను నిరుద్యోగులుగా మార్చడమే కాక వారికి ఇచ్చే జీతాలను మిగుల్చుకుంటారు. పైగా రెండు షిఫ్టుల్లో పనిచేసే కార్మికులతో అదనపు శ్రమ చేయించుకుంటారు. అంటే కార్మికులకు పనిభారం పెరుగుతుంది. 8 గంటల పనిదినంలోనే శ్రమశక్తి దోపిడి తీవ్రంగా ఉండగా 12 గంటల పనిదినంలో శ్రమశక్తి దోపిడీకి అడ్డు అదుపు లేకుండా పోతుంది. ఇది కార్మికులు, ఉద్యోగులను కట్టుబానిసలుగా మార్చే ప్రక్రియ. పెట్టుబడిదారులు తమ లాభాల శాతాన్ని పెంచుకోవడానికి ఉపయోగపడే చర్య. ఒక ఉదాహరణను పరిశీలిస్తే ఈ విషయం మరింత బోధపడుతుంది. ఒక కంపెనీలో 60 మంది కార్మికులు మూడు షిఫ్టుల్లో పని చేస్తున్నారనుకుందాం. ఒక రోజులో 8 గంటలు చొప్పున మూడు షిఫ్టుల్లో జరిగే పనికి షిఫ్టుకు 20 చొప్పున 60 మంది కేటాయించబడతారు. అదనపు విలువ నియమాన్ని ఇక్కడ అన్వయించి చూసినపుడు శ్రమశక్తి దోపిడి ఏవిధంగా ఉంటుందో ఒక ఉదాహరణ గమనిస్తే అర్థమవుతుంది. అవసర శ్రమకాలం, అదనపు శ్రమకాలం సారాంశమే పనిదినం. దీనిలో అవసర శ్రమ స్థిర పరిమాణం. అదనపు శ్రమ అస్థిర పరిమాణం కలిగి ఉంటాయి. అందువల్ల పనిదినం ఎప్పుడు స్థిరంగా ఉండదు. 8 గంటల పనిదినంలో కార్మికునికి చెల్లించే వేతనం లేదా కూలి వాస్తవానికి నాలుగు గంటలకే ఫిక్స్ అయి ఉంటుంది. ఇది వస్తుగత విషయం. కానీ పెట్టుబడిదారుడు తానిచ్చే వేతనానికి ఒకరోజుకు (8గంటలు) ఒప్పందం చేసుకుంటాడు. కనుక కార్మికుడు 8 గంటలు విధిగా పనిచేస్తాడు. అంటే తాను పొందే వేతనానికి నాలుగు గంటలు శ్రమచేస్తే సరిపోతుంది. ఇది అవసర శ్రమకాలం. కార్మికుడు చేసే 8 గంటల పనిలో అవసర శ్రమకాలం మినహాయిస్తే అదనంగా కార్మికుడు 4 గంటలు పనిచేస్తున్నాడు. ఈ అదనపు కాలంలో వచ్చే ఉత్పత్తి విలువే పెట్టుబడిదారుడికి లాభం. ప్రస్తుతం వివిధ రాష్ట్రాలు చట్టాల్లో తెచ్చిన మార్పులు ఫలితంగా కార్మికుడు 12 గంటలు పనిచేయాల్సి ఉంటుంది. అంటే ఉదాహరణకు 8 గంటల పనిదినంలో పెట్టుబడిదారుడికి కార్మికుల శ్రమశక్తి ద్వారా 50 శాతం లాభం వస్తే 12 గంటల పనిదినంలో 100 శాతం లాభాన్ని పొందుతాడు.

చట్టాలను నిషేధించడం అంటే కార్మికులను ఆధునిక బానిసలుగా మార్చడమే. 12 గంటల పనిదినంగా మార్చడం ఐఎల్ఓ నిర్దేశాలకు ప్రతికూలమైనది. ఆధునిక యంత్రాలు వచ్చిన నేపథ్యంలో పనిగంటలు తగ్గించాలన్నది ఒక డిమాండ్‌గా ఉన్నది. 12 గంటల పనిదినాన్ని నిర్దేశించే చర్య పెట్టుబడిదారుల పక్షం వహించేదే.

వాస్తవానికి చాలా చాలా పరిమితమైన రక్షణ, ప్రయోజనాలకు భరోసాగా ఉన్న ప్రస్తుత కార్మిక చట్టాలు శ్రామిక వర్గంలో మెజారిటీ కార్మికులను కలిగిఉన్న అసంఘటిత రంగ కార్మికులకు నామమాత్రంగా నైనా అమలుకాని పరిస్థితి చాలాకాలంగా కొనసాగుతుంది. ఈ చట్టాలను సైతం యాజమాన్యాలు యథేచ్ఛగా ఉల్లంఘిస్తున్నాయి. ఇప్పటికే ఐటి తదితర విభాగాల్లో 10 నుంచి 12 గంటలకు పైగా పనిచేస్తున్నారు.

కార్మికులు తమ శ్రమకు తగిన ప్రతిఫలం అడగకూడదు. కట్టుబానిసలుగా పనిచేయించుకున్నా అడ్డు చెప్పకూడదు. యాజమాన్యాల అదుపు అజ్ఞల్లో ఉండాలి. కార్మికులు కొత్తగా సంఘాలు పెట్టుకోకూడదు. కార్మికులు యూనియన్‌లలో సభ్యులుగా చేరకూడదు. అంటే ఉన్న సంఘాలను రద్దుచేయాలి. ఇది సాధ్యపడాలంటే ప్రస్తుతం అరకొరగా ఉపయోగపడుతూ కార్మికులకు రక్షణగా ఉన్న ఈ చట్టాలను సమూలంగా మార్చాలి. ఇది పెట్టుబడిదారుల విధానం. సామ్రాజ్యవాద ప్రపంచీకరణ ఆర్థిక నియమ సారాంశం కూడా. కానీ కార్మికుల అవసరం లేకుండా పెట్టుబడిదారుడు ఉత్పత్తి సాధనాలు పనిచేయలేవన్న విషయం, కార్మికుడే లేకపోతే ఉత్పత్తి లేదన్నది చారిత్రక సత్యం.

కరోనా సంక్షోభ సమయంలో ఇది మరోసారి రుజువైంది. అంటే సంపద సృష్టికర్తలు కార్మికులే. యాజమానులు కాదన్నది స్పష్టమైంది. అందువల్ల మానవ సమాజ అభివృద్ధి పురోగమనానికి అవసరమైన సంపదకు సృష్టికర్తలైన కార్మికవర్గాన్ని కాపాడుకోవాలి. వారి హక్కులపైన, మౌలిక ప్రయోజనాలపైన జరుగుతున్న దాడిని ప్రతిఘటించాలి. ఇందుకు బలమైన, స్థిరమైన సంఘటిత కార్మికోద్యమ నిర్మాణమే పరిష్కారమార్గం.

*(రచయిత ఇఫ్టూ కార్యదర్శి)* వీ

# అమెరికాలో ప్రజాగ్రహం - భారత్ నిశ్శబ్దం

***అమెరికాలో జార్జ్ ఫ్లాయిడ్ ఘటనలో నల్ల జాతీయుల నిరసనలో తెల్ల జాతీయులు పాల్గొంటుండగా అవే దుర్మార్గాలు మన దేశంలో జరిగినా ప్రజలు స్పందించక పోవడానికి కర్మ సిద్ధాంతమే కారణమని అంటున్నారు బి.ఎస్.రాజు***

ఇపుడు ప్రపంచమంతా 'జార్జ్ ఫ్లాయిడ్' అనేపేరు మార్మోగుతోంది. అతను మరణించి ప్రజల హృదయాల్లో జీవిస్తున్నాడు. అతని మరణం అమెరికాలో ఓ కార్చిచ్చును రాజేసింది.

2020, మే 25న ఓ దురహంకారపు తెల్లజాతి పోలీసు, జార్జ్ ఫ్లాయిడ్ అనే ఆఫ్రికన్ అమెరికన్ నల్లజాతీయుని మెడను తన మోకాలి కింద 8 నిముషాల 15 సెకండ్ల పాటు అదిమిపెట్టి ఊపిరాడకుండా చేసి ప్రాణంతీశాడు.

ఎందరో నల్లజాతి యువకులవలె జార్జ్ ఫ్లాయిడ్ కూడా ఆకాశాన్ని అందుకోవాలని అనుకున్నాడు. కానీ అమెరికా రాజ్య వ్యవస్థ అతని గొంతుపిసికి అతని బ్రతుకును భూమి లోనికి తొక్కేసింది.

లక్షలాది నల్లజాతి యువత పుట్టకతో, ఎదిగే క్రమంలో, నివాస ప్రాంతాల్లో, చదువుల్లో, అవకాశాల్లో, పనుల్లో, ఉద్యోగాల్లో వివక్షకు గురౌతూనే ఉంటారు. వీరిలో ఏకొద్ది మందో పైకెదిగితే, అత్యధిక శాతం 'నేర-చోర' చీకటి మురికి కూపంలోనికి నెట్టి వేయబడతారు. నల్లజాతి అంటే నేర జాతి అనే ముద్రతో జీవిస్తూ, ఏరోజు జైలో, ఏరోజు చావో తెలియని దుర్భరావస్థలో వేలాడుతుంటారు.

తెల్లజాతి దురహంకారానికి, రాజ్య-పోలీసు-ఫాసిస్టు దమనకాండకు అనునిత్యం బలైపోతున్న ఎందరో 'ఆఫ్రికన్ అమెరికన్' నల్లజాతి ప్రజల్లో, ఈ 46 ఏళ్ల జార్జ్ ఫ్లాయిడ్ ఒకడు. ఆజానుబాహుడు. అమెరికన్ ఆఫ్రికన్ల దుర్భర జీవితాలకు నిలువెత్తు నిదర్శనం. అణగారిన వారి జీవితాల ప్రతిరూపం. ఇప్పుడు తవ్వి తియ్యాలన్నా, ఎత్తి పొయ్యాలన్నా, ఆ పని 100 ఏళ్లపాటు కొనసాగిస్తే గాని తరగని దమనకాండ చరిత్ర వారిది.

ఈ అమానుష పోలీసు చర్య, జార్జ్ ఫ్లాయిడ్ మరణం, అమెరికా అంతరాత్మను తట్టిలేపింది. అంతేకాదు, అమెరికా సమాజాన్ని కుదిపివేసింది. ఆ సంఘటన అమెరికా యువతలో, నల్ల జాతీయుల్లో, ఇతర ప్రజా సమూహాల్లో అప్పటివరకు లోలోపల అన్యాయపు వ్యవస్థపై పేరుకుని ఉన్న ఆగ్రహావేశాలను ఓ నిప్పురవ్వై భగ్గున మండించింది.

'నల్లవారి ప్రాణాలు కూడా విలువైనవే' (బ్లాక్లైవ్స్ మేటర్) అనే ఉద్యమకారుల నాయకత్వం అందివచ్చింది. ముందు నిలిచింది. నల్ల జాతీయులతో తెల్ల జాతీయులు చేతులు, గొంతులు కలిపి కదంతొక్కుతూ తమ ధిక్కార స్వరాన్ని వినిపిస్తున్నారు. అమెరికా అంతటా నిరసనల దావానలం వ్యాపించింది. అమెరికా ప్రజాగ్రహ నిరసన కారులకు లక్షలాది ఐరోపా ప్రజలు మద్దతు తెలుపుతున్నారు. అక్కడ కూడా నిరసన ప్రదర్శనలు వెల్లువెత్తుతున్నాయి. విఫలమైన రాజ్యాలు (ఫెయిల్డ్ ఎంపైర్స్), విఫలమైన పెట్టుబడిదారీ విధానం (ఫెయిల్డ్ కాపిటల్ సిస్టమ్) అనే బలమైన ప్రజాభావన, ఈ నిరసనలన్నిటినీ ఒక్కతాటిపైకి తెస్తున్నది.

'బ్లాక్లైవ్స్ మేటర్', 'సైలెన్స్ఈజ్ వైలెన్స్', 'వుయ్ ఆర్ టుగెదర్-వుయ్ వాంట్ జస్టిస్', 'వుయ్ డోంట్వాంట్ రేసిస్ట్ పోలీస్, వుయ్ వాంట్ పీపుల్స్ పోలీస్, కమ్యూనిటీ పోలీస్'.... 'నల్లవారి ప్రాణాలు కూడా విలువైనవే', 'నోరు విప్పకపోవడం హింసే', 'మేం ఒక్కటిగా ఉన్నాం-ఒక్కటై న్యాయాన్ని కోరుతున్నాం', 'మాకు జాత్యహంకార పోలీసు వద్దు-ప్రజా పోలీస్, కమ్యూనిటీ పోలీస్ కావాలి' అని ఉద్యమకారులు ప్రకటిస్తున్నారు, పాలకులను నిలదీస్తున్నారు.

యువ ఆఫ్రికన్ అమెరికన్ సామాజిక కార్యకర్త, రచయిత్రి, నటి 'కింబర్లి జోన్స్' మే 31న అట్లాంటాలో రికార్డు చేసిన యూట్యూబ్ విడియో గురించి ఇక్కడ ప్రస్తావించాలి. ఈ వీడియో ఇప్పటివరకు 30 లక్షల మంది వీక్షించినట్టు మీడియా సమాచారం. నేను ఈ వీడియో జూన్ 10న చూశాను. ఈ వీడియోలో ఆమె ఉద్వేగంగా చెప్పిన విషయాలు, అమెరికా ప్రజలకు మించి ఇండియాలో మనకు అవసరం.

అంతరాల కుల వ్యవస్థ, దళిత ప్రజలపై అమలౌతున్న అగ్రవర్ణ దమనకాండ, అంటరానితనం, అణచివేత, ఆదివాసీలపై దాడులు, ఊచకోతలు ఇవేవీ మన చదువుల్లో చెప్పరు. తరతరాలుగా కొనసాగుతున్న దోపిడీ ఈ అంతరాలను, ధుర్భర సామజిక, ఆర్థిక, సాంస్కృతిక వ్యత్యాసాలను ఎలా స్థిరీకరించిందో, మతాలు వీటితో ఎలా అంటకాగుతాయో, కొందరి వద్దే ధన రాశులు ఎలా మేటలు వేస్తాయో, ఎందరో రోజూ పనులు వెదుక్కునే వారిగా మారిపోతారో ఎవరూ, ఎక్కడా పిల్లలకు చెప్పరు.

పైగా ఈ వ్యత్యాసాలకు సమర్థనగా కర్మ సిద్ధాంతాన్ని, పురాణేతిహాసాలను, బైబిల్, ఖురాన్, గీత, గోవిందాలను రంగరించి పోస్తుంటారు, మూటలు గట్టి మూపులపై పెట్టిమోయిస్తుంటారు. నిజాలు చెప్పేవాళ్ల నోళ్లునొక్కి, జైళ్లల్లో కుక్కుతారు, లేదా పీకలు పిసికి చంపుతారు.

దీని పర్యవసానమే ఇక్కడ అంతా సజావుగా ఉందనే నిశ్శబ్దం. నిశ్శబ్దమనే హింస. దీన్ని గుర్తించే అమెరికాలో యువత సైలెన్స్ ఈజ్ వయిలెన్స్ అంటున్నారు. మన పిల్లలేమో గాఢ నిద్రలో కూరుకుపోయారు. ఒకప్పుడు మన పిల్లలూ అన్నారు 'సహనం గాడిద లక్షణం' అని. ఇప్పుడు సహనమే మణిభూషణం అనుకుంటున్నారు. అసత్య ప్రచార ప్రవాహంలో, అబద్ధపు చరిత్ర సుడిగాలిలో కొట్టుకుపోతున్నారు.

అందుకే ఇక్కడ స్పందనలేదు, మన పిల్లల గొంతులు నినదించడం లేదు. అమెరికా, ఐరోపా పిల్లల గొంతులతో గొంతు కలపడంలేదు. అందుకే కింబర్లే ఏమి చెబుతాందో, చెప్పేది ఎంత ఉద్వేగంగా చెబుతాందో వినాలి. యుట్యూబ్లో 'Kimberly Jones / How can I win? వెదికి తప్పక చూడండి. ఆమె ఏమి చెప్పిందో వినండి. మన యువతరం వినాలి, అర్థం చేసుకోవాలి, మనకు అన్వయించుకోవాలి, ఈ అస్తవ్యస్త సమాజాలను సరిచేయడానికి పూనుకోవాలి.

సామాజిక కలకలం రేగినప్పుడు మూడు తరహాల ప్రజా సమూహాలు వీధుల్లోకి వస్తారు:

# మతం - సైన్స్

*శాస్త్రీయ ఆవిష్కరణలు చేసిన శాస్త్రవేత్తలను చంపేసిన మతం, ప్రకృతిలో జరిగే మార్పులపై భగవదేచ్ఛ ప్రకారమే జరుగుతున్నాయని, భ్రమింపజేసి ప్రజలను శాస్త్రీయ ఆలోచనల నుండి దూరం చేస్తోందని అంటున్నారు* **డా. ఎం. వెంగల్ రెడ్డి**

మతములన్నియు మాసిపోవును - జ్ఞానమొక్కటి నిలిచివెలుగును.
*- గురజాడ*

మతం మతానికి పునాది విశ్వాసం. మతమేదైనా దేవుడిని విశ్వసిస్తుంది. ఏ మతానికైనా పునాది దేవుడే. అన్ని మతాల సారం ఒకటేనంటారు. మరి ఇన్ని మతాలు ఎందుకు? భగవంతుని చేరుటకు దారులు వేరంటారు. అదే నిజమైతే అందరూ(అన్ని మతాలు) కలిసి ఏక మార్గాన్ని ఎందుకు ఏర్పాటు చేసుకోలేరు. 'మతం' ఒక జీవన విధానం అంటారు. మతం ఒక జీవన విధానం అయితే ఒకే మతానికి చెందిన ప్రజలలో ఇన్ని వైరుధ్యాలెందుకు? కొందరు సంపన్నులెందు కయ్యారు? మరికొందరు నిరుపేదలెందుకయ్యారు?

అష్ట ఐశ్వర్యాలు ఒకవైపు ఆకలి మంటలు మరొక వైపు ఎందుకు? అన్ని మతాల సారం ఒకటే అయితే మతాల మధ్య మారణ హోమా లెందుకు? అన్ని మతాలు మానవత్వాన్నే బోధిస్తుంటే మతాల మధ్య ఈ చిచ్చు ఎందుకు? తాను సృష్టించిన మనుషులు నిత్యం తన్నుక చస్తుంటే దేవుడు చూస్తూ ఆనందిస్తున్నాడా? దైవాన్ని నమ్మితే 'భక్తి భావన' పెరుగుతుందని, తద్వారా నైతిక విలువలు పెరుగుతాయని, అందువల్ల ప్రజలందరూ వసుధైక కుటుంబంలా కలిసి జీవించవచ్చుని, ప్రజల మధ్య ప్రేమానురాగాలు పెరుగుతాయని తద్వారా ప్రజలందరూ శాంతియుతంగా జీవించవచ్చునని అంటుంటారు. దైవభక్తి వల్ల పాపపుణ్యాలు ఏర్పడుతాయని అందువల్ల ప్రజలు 'పాప' కార్యాలు చేయరని సెలవిస్తుంటారు. నిరంతరం హింస, దోపిడి, దౌర్జన్యాలు తనను నమ్మే భక్తులే చేస్తుంటే ఈ దేవుడు (మనిషి సృష్టించిన దేవుడు) చూస్తూ ఆనందిస్తున్నాడా? 'సర్వాంతర్యామి' అయిన భగవంతుడు ఎందుకు నిరోధించలేక పోతున్నాడు?

ప్రకృతిలో కోటానుకోట్ల జీవరాశులలో మనిషి ఒక జీవి. కేవలం మనిషి మాత్రమే దేవుడిని ఎందుకు పూజిస్తున్నాడు? దేవుని పూజించని మిగిలిన సమస్త కోటి జీవరాశులు జీవిస్తూనే ఉన్నాయిగా! సమస్త జీవరాశులు భూమి మీద లేదా నీళ్లలో లేదా గాలిలో (ఆకాశంలో) జీవిస్తున్నాయి. ఇందులో మనిషి భూమిపై జీవించే ఒక జీవరాశి మాత్రమే. మనిషి అనే ఈ జీవరాశి, మిగిలిన జీవుల కంటే ఏ మాత్రం భిన్నమైనది కాదు. మిగతా జీవరాశులకు అవసరం లేని గుళ్లు గోపురాలు మనిషికెందుకు అవసరమైనాయి?

భక్తునికి, భగవంతునికి అనుసంధానంగా ఉన్న పూజారులారా మీరన్నా ఆ దేవునికి విన్నవించలేరా? అనునిత్యం ఆ స్వామి సేవలో ఉన్న మీరు చెప్పిన ఆ స్వామి ఆలకించడం లేదా? నువ్వు (పూజారి) చెప్పిన ఆలకించని ఆ స్వామి మాలాంటి అతి సామాన్యుల ఆవేదనను వినగలడా?

కనులుండి చూడలేక చెవులుండి వినలేక గుడిలో శిలగా ఉన్న ఓ దేవుడా - నువ్వుంటే మాకేంటి - లేకుంటే మాకేంటి?

'శ్రమ-ఉత్పత్తి'లో భాగస్వామ్యంకాని ఒక దోపిడీవర్గం సమస్త మానవ సమాజంపై, సమస్త సంపదలపై పెత్తనాన్ని చెలాయించుటకు తమచే సృష్టించబడిన 'కల్పిత ఆధ్యాత్మిక ఆయుధమే' దేవుడు. ఆ దేవుని ముద్దుల సంతానమే 'మతం'.

కులమతాల సృష్టికర్తలైన మనువాద బ్రాహ్మణులు కొన్ని సామాజిక వర్గాలను అంటరానివారుగా ముద్రవేసి గ్రామ బహిష్కరణకు గురి చేసింది. తరతరాలుగా ఈ సాంఘిక దురాచారం కొనసాగుతూనే ఉన్నది. 'హరిజనుల' పేరిట అణగారిన వర్గాలను మరింతగా సమాజం నుండి వేరు చేయుట జరిగింది. తోటి మనిషిని అంటరానివారుగా ముద్రవేసి సామాజిక దూరాన్ని పాటించాలని (గ్రామం బయట జీవించాలని) శాసించుట జరిగింది. తప్పని పరిస్థితులలో అనివార్యంగా హరిజనులు గ్రామం బయట నివాసం ఏర్పాటు చేసుకోవలసి వచ్చింది. తమ నివాస ప్రాంతానికి కనీసం పేరు పెట్టుకోవడానికి వీలులేదు. కేవలం హరిజన వాడగానే పిలువబడుతుంది.

కరోనా (కోవిడ్-19) వైరస్ వ్యాప్తిని నివారించుటకు సామాజిక దూరాన్ని పాటించాలని డాక్టర్లు, శాస్త్రవేత్తలు సూచించుట జరుగుతున్నది. ఇది కేవలం వైరస్ ఒక వ్యక్తి నుండి మరొక వ్యక్తికి సోకకుండా ఉండుటకు తీసుకోవలసిన జాగ్రత్త మాత్రమే. అయితే బ్రాహ్మణీయ మతోన్మాదం ఒక అడుగు ముందుకేసి తాము ఏనాడో సామాజిక దూరాన్ని (అంటరాని

---

ఒకరు: 'Protestors', ప్రొటెస్టర్స్ అంటే నిరసన తెలియచేసేవారు. నిరసనకార్లు.

రెండు: 'Rioters', రైయోటర్స్, అంటే విధ్వంసం చేసేవారు. విధ్వంసకార్లు.

మూడు: 'Looters', లూటర్స్ అంటే వస్తువులు అపహరించుకు పోయేవారు.

వీళ్ల చర్యలు, వాటి వెనుక ప్రేరణలను కింబర్లీజోన్స్ ఈ వీడియోలో కత్తి పదునుతో, కాదు కాదు, తూటాల్లా గుండెలపై తాకేట్టు చరిత్రను కవితాత్మకంగా, ఉద్వేగంగా, సస్రునతెగేసి చెప్పింది. ఆ ఉద్వేగపు భాష, భావపు లోతు అనువాదంలో పట్టుకోవడం కష్టమే! అందుకే ఎవరికి వారే చూడాలి, ఎవరికి వారే వినాలి, ఎవరికి వారే ఆ తీవ్రతను అనుభవించాలి. *(YtubeVedio Link: https://youtu.be/sb9_qGOa9Go. And also see: https://youtu.be/U1k9APedIUY)*

*(రచయిత శ్రామిక నేస్తం సంపాదకులు)* వీ

వారు (గ్రామం బయట జీవించుట) ప్రవేశ పెట్టామని నిస్సిగ్గుగా మాట్లాడటం జరిగింది. అంటరాని వారు పరిశుభ్రంగా ఉండరని, వాళ్ల నుండి ప్రమాదకరమైన సూక్ష్మక్రిములు వ్యాపించకుండా ఉండుటకు వాళ్లను దూరంగా ఉంచడం జరిగిందనే అర్థంలో మాట్లాడటం క్షమార్హం కాదు.

ఇకనుంచి బ్రాహ్మణులు నిష్ఠాగరిష్ఠంగా ఉండాలని మాట్లాడుతుంటే వాడి నాలుకను తెగనరుకాలనిపించింది. రోజుకు రెండుసార్లు స్నానాలు చేస్తూ నెయ్యితో సుష్టుగా తిని మంత్రాలు వల్లిస్తుంటే వాళ్లు శుభ్రంగానే ఉంటారు. నెయ్యి లేనిదే ముద్ద దిగదు. నెయ్యికి అంటు లేదంటారు. నెయ్యికి అంటు ఉందంటే వాడే పశువులను పోషించాలి. గడ్డి పెట్టాలి. కుడితి పోయ్యాలి. అది పెండ పెడుతుంది. ఉచ్చ పోస్తుంది. ఈ పనులన్నీ వాడు చెయ్యడు. అందుకే నెయ్యికి అంటు లేదంటాడు. అదేవిధంగా ధాన్యానికి, కూరగాయలు, ఇతర వ్యవసాయ వ్యవసాయేతర ఉత్పత్తులకు అంటు లేదంటారు. వీటికి అంటుంటే వాడే ఉత్పత్తి చేసుకోవలసి ఉంటుంది. కాని శ్రమతో ముడిపడి ఉన్న ఏ పనిని వాడు చెయ్యడు. కాని మన స్వేదం నుండి వచ్చిన సమస్త ఉత్పత్తులను అనుభవిస్తూ చివరకు మనలనే అంటరానివాళ్లుగా మార్చారు. ఏ ఉత్పత్తిలో భాగస్వామ్యం కాని ఈ వర్గం సమస్త ఉత్పత్తులను అనుభవిస్తూ, పెత్తనం చెలాయిస్తూనే ఉంది. ఈ వర్గం నిమ్న వర్గాలను విద్య నుండి దూరం చేసింది. నిమ్న జాతుల వాళ్లు వేదంలో ఒక ముక్క (ఆ వేదాన్ని వినాలని మనకేమి ఆసక్తి లేదు) విన్న వాళ్ల చెవుల్లో సీసం కరిగించి పొయ్యాలని శాసించింది. ప్రపంచంలో అనేక మతాలున్నాయి. కాని హిందూ మతానికి మిగిలిన మతాల మధ్య ఒక స్పష్టమైన తేడా ఉంది.

అది హిందూ మతంలో మాత్రమే అంతర్లీనంగా ఉన్న కుల వ్యవస్థ. ఇతర మతాలలో సాంఘిక అంతరాలు కనిపించవు. కానీ హిందూ మతంలో అంచల సాంఘిక వ్యత్యాసాలతో కూడిన కుల వ్యవస్థ ఉంది. భారతదేశంలో బ్రాహ్మణ, ఇతర అగ్ర వర్ణాల ఆధిపత్యం చాలా స్పష్టంగా కనిపిస్తుంది. ఈనాటి వరకు కూడా రాజకీయ, ఆర్థిక, సామాజిక, సాంస్కృతిక రంగాలలో అగ్రకుల ఆధిపత్యం ఒక వాస్తవం. బ్రాహ్మణ సంస్కృతి కుట్రలో భాగంగా అణగారిన వర్గాలను విద్య నుండి దూరంగా ఉంచింది. చివరకు ప్రపంచ స్థాయి మేధావి, భారత రాజ్యాంగ రచనా శిల్పి డా. బాబాసాహెబ్ అంబేద్కర్ కూడా కుల వివక్షకు గురైనాడు. తరతరాలుగా అణిచివేతకు గురైన అణగారిన వర్గాల పక్షాన పోరాడి, సామాజిక న్యాయం కోసం భారత రాజ్యాంగంలో చట్టపరమైన హక్కులు కల్పించిన ఘనత అంబేద్కర్‌కే దక్కుతుంది.

హిందూ మతంలో విసిగి వేసారిన బాబాసాహెబ్ అంబేద్కర్ బౌద్ధమతాన్ని స్వీకరించుట జరిగింది. అణగారిన వర్గాలకు విద్యావకాశాలు కల్పించుటలో అనితర సాధ్యమైన పోరాటాన్ని చేసిన మహాత్మ జ్యోతిరావు ఫూలె, సావిత్రి బాయి ఫూలెలు మన మొదటి గురువులు. తమిళనాట బ్రాహ్మణీయ మనువాద సంస్కృతిపై తిరుగుబాటు బావుటా నెగరేసిన పెరియార్ రామస్వామి తన జీవిత కాలం బడుగుల హక్కుల కోసం అవిశ్రాంత పోరాటాన్ని చేశాడు.

హిందూయిజం ఒక మతం కాదు. అదొక ఆలోచనా విధానం అని హిందూ మత సంస్థలు తరుచుగా అంటుంటాయి. తోటి మనిషిని అంటరానివాడిగా చూడడమే మన జీవన విధానమా? గోవుకిచ్చిన గౌరవాన్ని తోటి మనిషికి ఇవ్వకపోవడమే మన జీవన విధానమా? గుళ్లు గోపురాల లొల్లి తప్ప తోటి మనిషి బాధలను చూడలేకపోవడం మన జీవన విధానమా? తోటి మనిషి ఆహారపు అలవాట్లను అవహేళన చేయడమే మన జీవన విధానమా? అమాయక ప్రజలపై మూక దాడులు చేయడం మన జీవన విధానమా? ప్రశ్నించే గొంతుకలను నిర్బంధించడమే మన జీవన విధానమా? గోమూత్రాన్ని సేవించమని పిలుపునివ్వడం మన జీవన విధానమా? పరమత విశ్వాసాల పట్ల అసహనాన్ని కలిగి ఉండడం మన జీవన విధానమా? ఎదుటి వారి జీవన విధానాన్ని గౌరవించలేకపోవడమే మన జీవన విధానమా? పతాక స్థాయికి చేరిన మత రాజకీయాలకు 'కరోన' తాత్కాలిక బ్రేక్ వేసింది.

కరోనా తరువాత మనం ఎదుర్కొనబోయే అతి పెద్ద సమస్య మతోన్మాద ఉగ్రవాదం.మతమే ఒక మత్తై మనుషులను చిత్తు చేస్తుంటే అంతా దైవాజ్ఞే అంటే ఆ మతపెద్దలను ఏమనాలి? ప్రజలలో శాస్త్రీయ ఆలోచనా ధోరణి పెరిగితే మతం ప్రజలకు విశ్వాసం సన్నగిల్లుతుంది. సమస్త వనరులను, సంపదను మరియు సమస్త భౌతిక వసతులను అనుభవిస్తూ అంతా మిథ్యేనంటూ ప్రజలను చైతన్యరహితులుగా మార్చే ప్రయత్నం నిరంతరంగా జరుగుతూనే ఉంటుంది.

భగవంతుని ఆదేశం మేరకే ప్రకృతిలో సమస్త సంఘటనలు జరుగుతున్నాయని మతపెద్దలు ఊదరగొడుతున్నారు. ప్రజలపై తమ ఆధిపత్యాన్ని కోల్పోడానికి ఏ మతం అంగీకరించదు.

కరోనా నుండి కాపాడమని అన్ని మతాలు ప్రార్థిస్తున్నాయి. ఏదో ఒక రోజు శాస్త్రవేత్తలు కరోనాకు మందు కనుగొనగలరు. అపుడు తమ ప్రార్థన ఫలించిందనీ, భగవంతుని దయవల్ల మందు కనుగొనుట జరిగిందనీ అన్ని మతాలు సెలవిస్తాయి. ఈ విధంగా శాస్త్రవేత్తల శ్రమను, మేధస్సుని నిర్వీర్యం చేస్తాయి. ఈ విధంగా మతం ఎప్పుడూ మానవాళిని తన గుప్పిట్లో ఉంచుకొంటుంది.

అన్ని మతాల ప్రవక్తలు కరోనా గూర్చి ఆధ్యాత్మిక ప్రసంగాలు జేస్తున్నారు. భగవన్ నామ స్మరణతో కరోనాను జయించవచ్చని తమ భక్తకోటికి సందేశాన్నిస్తున్నారు. భగవంతునిపై పూర్తి విశ్వాసాన్ని ప్రకటిస్తే మనోనిబ్బరం వస్తుందని, తద్వారా రోగనిరోధక వ్యవస్థ బలపడి కరోనా వైరస్‌ను నిలువరించగలదని అంటున్నారు. ఒక రోగి ఆరోగ్యం మెరుగుపడితే భగవంతుని దయవల్ల ఆరోగ్యం మెరుగైందంటారు. ఒక వేళ రోగి మరణిస్తే భగవంతుడు తన దగ్గరకు తీసుకొనిపోయాడంటారు. ఎటుదిరిగి సమస్త కర్మల (పనుల)కు భగవంతుడే కారణమని ప్రజలను నమ్మించగలుగుతారు. మానవ నాగరికత వికాసానికి పెద్ద అవరోధం మతం. మతం ప్రజలను విశ్వాసం అనే చట్రంలో ఇరికిస్తుంది. ఒకసారి ఆ చట్రంలో యిరికితే బయటకు రావడం చాలా కష్టం. ప్రజలలో శాస్త్రీయ ఆలోచనా దృక్పథం రానంతవరకు మతాలు ప్రజలను తన గుప్పిట్లో ఉంచుకోగలుగుతాయి.

మార్క్స్ చెప్పినట్లు మతం ఒక మత్తు. ఈ మత్తు నుండి మనుషులు బయటికి రానంత కాలం మతం, దేవుడి ముసుగులో దోపిడి యథేచ్ఛగా జరుగుతూనే ఉంటుంది.

### సైన్స్

ఈ విశ్వాన్ని ఎవరూ సృష్టించలేదు. శూన్యం నుండి విశ్వావిర్భావం జరిగింది. – స్టీఫెన్ హాకింగ్

మనిషి నిరంతర అన్వేషి. అవసరం అన్వేషణకు దారి తీస్తుంది. ఆది మానవుడి నుండి ఆధునిక మానవుని దాకా సాగిన ప్రయాణంలో బుద్ధి జీవుడైన మానవుడు శాస్త్రీయ ఆలోచన దృక్పథాన్ని

పెంపొందించుకున్నాడు. తన జీవనయానంలో ఎదురైన సమస్యలను పరిష్కరించే క్రమంలో మనిషి అనేక ప్రకృతి దృగ్విషయాలకు సమాధానాలను కనుగొన్నాడు. సత్యాన్వేషణలో మనిషి అద్భుత ప్రగతిని సాధించాడు. ఈ రోజు మనం అనుభవిస్తున్న సకల సౌకర్యాలు, సదుపాయాలు అన్నీ కూడా సైన్స్, సాంకేతిక విజ్ఞాన ఫలితమే. ఈ అన్వేషణ నిరంతరం కొనసాగుతూనే ఉంటుంది.

అయితే పెట్టుబడి కార్పొరేటు వర్గాలు శాస్త్ర సాంకేతిక రంగాన్ని పూర్తిగా తన ఆధిపత్యంలోనికి తెచ్చుకోగలిగింది. శాస్త్ర సాంకేతిక రంగాలలో వచ్చిన విప్లవాత్మక మార్పులను ఉపయోగించుకుంటూ కులాల పేరిట – మతాల పేరిట ప్రపంచంలో మనుషుల మధ్య భావోద్వేగాలను సృష్టిస్తూ రాజకీయ ప్రయోజనాలను పొందుతున్న నేటి పరిస్థితులలో సమాజంలో తీవ్ర ఉద్రిక్తతలకు దారి తీస్తుంది. మత రాజకీయాలతో సమాజం విభజింపబడింది.

ఈ మతమౌఢ్యం సైన్స్ (సత్యం)ను అడ్డుకొన్నది. ఈ మతం 'సైంటిస్ట్'ను చంపగలిగింది. కాని సైన్స్ (సత్యాన్ని)ని చంపలేకపోయింది. సత్యాన్ని ప్రపంచానికి తెలియజేసే క్రమంలో శాస్త్రవేత్తలు చంపబడ్డారు, జైళ్లకు పంపబడ్డారు.

టాలమీ భూ కేంద్రక సిద్ధాంతాన్ని (భూమి చుట్టూ సూర్యుడు, ఇతర గ్రహాలు పరిభ్రమిస్తుంటాయనే ప్రతిపాదన) వ్యతిరేకిస్తూ కోపర్నికస్ సూర్య కేంద్రక సిద్ధాంతాన్ని (సూర్యుని చుట్టూ భూమి, ఇతర గ్రహాలు పరిభ్రమిస్తుంటాయనే ప్రతిపాదన) సమర్థించినందుకు బ్రూనో అనే ఖగోళ శాస్త్రవేత్తను ఆరు సంవత్సరాలు జైలులో పెట్టి ఆ తరువాత 1600 సంవత్సరంలో రోమ్ నగరంలో పెట్రోల్ పోసి దహనం చేయబడ్డాడు. భూ కేంద్రక సిద్ధాంతమే సరైనదని ప్రకటించమని ఆనాటి చర్చి బ్రూనోపై ఒత్తిడి చేసింది. కాని బ్రూనో సూర్య కేంద్రక సిద్ధాంతమే సత్యమని బహిరంగ ప్రచారం చేశాడు.

సూర్య కేంద్రక సిద్ధాంతాన్ని అంగీకరిస్తే 'బైబిల్' పట్ల ప్రజలకు విశ్వాసం పోతుందని భావించిన 'చర్చి' బ్రూనోని చంపింది. ఆ తరువాత సూర్యకేంద్రక సిద్ధాంతం సత్యమని కెప్లర్ (1511–1630) గణిత రీత్యా నిరూపించారు. ఆ తరువాత గెలీలియో(1564–1642) దూరదర్శినిని నిర్మించి సూర్యుని చుట్టూ భూమి, ఇతర గ్రహాల పరిభ్రమణాన్ని ప్రపంచానికి ప్రత్యక్షంగా చూపాడు. సూర్యకేంద్రక సిద్ధాంతం సత్యమనేది ప్రయోగపూర్వకంగా నిరూపించబడింది. మతం (చర్చి) గెలీలియోని తన జీవితంలో చివరి ఎనిమిది సంవత్సరాల కాలాన్ని గృహ నిర్బంధాన్ని ఉంచింది.

ప్రముఖ గణితవేత్త, ప్రయోగపూర్వక శాస్త్రవేత్త ఆర్కిమెడిస్ సూత్రాన్ని కనుగొన్న ఆర్కిమెడిస్ (287–212 బి.సి)ని తన 75వ ఏట రోమన్ సైనికునిచే చంపబడ్డాడు. ఈ విధంగా విజ్ఞాన శాస్త్ర చరిత్రను పరిశీలించినపుడు 'మతం'చే బాధింపబడిన శాస్త్రవేత్తలు మనకు కనిపిస్తారు. మనం శాస్త్రవేత్తలను ఆవిష్కర్తలుగానే గాక సత్యాన్ని ప్రపంచానికి తెలియజేయడానికి ప్రాణాలను సైతం లెక్కచేయని ధీరులుగా భావించాలి.

ఒక శాస్త్రవేత్త ఒక ప్రతిపాదన చేసి, ఆ ప్రతిపాదన ఆధారంగా ఒక సిద్ధాంతాన్ని ప్రతిపాదించి, ఆ సిద్ధాంతాన్ని గణిత రీత్యా సరిచూసుకొని అంతిమంగా ప్రయోగపూర్వకంగా నిర్వహిస్తారు. ఒక శాస్త్రవేత్త కనిపెట్టిన అంశం ఈ ప్రపంచంలో ఎక్కడ పరిశీలించిన అది 'సత్యం'గానే ఉంటుంది. ప్రపంచంలో ఏ శాస్త్రవేత్త ఏమి కనిపెట్టిన అది మా పురాణాలలో ఉంది అని చెప్పుకోవడం కొంత మందికి (ఓ మతానికి ప్రాతినిధ్యం వహించేవారు) ఒక అలవాటుగా మారిపోయింది. శాస్త్రవేత్తలు తమ జీవిత కాలాన్ని వెచ్చించి ప్రయోగాలు చేసి అనేక కష్టనష్టాలకు ఎదురీది, ఆరోగ్యాన్ని, ప్రాణాలను కూడా లెక్కచేయకుండా 'కొత్త ఆవిష్కరణను' చేస్తే, ఇదంతా మా వేదాలలో, పురాణాలలో ఉందని చెప్పడం అనైతికం. వీళ్లు డార్విన్ జీవ పరిణామ సిద్ధాంతం తప్పంటారు. సెల్ ఫోన్ గురించి చెప్పినపుడు తమ పూర్వీకులు మేఘాల ద్వారా సందేశాన్ని పంపేవారంటారు. టి.వి.ల గూర్చి చర్చ వచ్చినపుడు ఇవి తమ పూర్వీకులు ఉపయోగించారంటారు. తమ పూర్వీకులు ఎపుడో శస్త్ర చికిత్సలు చేశారంటారు. ఈ విధంగా ఆధునిక విజ్ఞానమంతా తమకు ఏనాడో తెలుసంటారు. ఇలాంటి కుహన అవకాశవాదులను పక్కన పెట్టి సత్యాన్వేషణ దిశగా శాస్త్ర విజ్ఞానం నిరంతరంగా ముందుకు సాగిపోతుంటుంది.

| సైన్స్ | మతం |
|---|---|
| సృష్టికి మూలం పదార్థం | దేవుడు |
| ప్రశ్నను ఆహ్వానిస్తుంది | ప్రశ్నను అనుమతించదు |
| సైన్స్‌కు పునాది నిరూపణ | విశ్వాసం (దేవుడు) |
| ప్రయోగానికి నిలబడుతుంది | ప్రయాగానికి నిలబడదు |
| విశ్వం ప్రకృతి సూత్రాలపై ఆధారపడి చలనంలో ఉంటుంది | విశ్వం దైవాదేశం ప్రకారం |
| సైన్స్ నిజం | మతం విశ్వాసం |
| ప్రకృతి సూత్రాలు సార్వజనీనం | ప్రకృతి సూత్రాలు భగవంతుని నిర్దేశం |
| మహా విస్ఫోటనం వల్ల విశ్వం ఏర్పడింది | భగవంతుని ఆదేశానుసారం ఏర్పడింది |

జ్ఞానం సమాజ సంపద. ఈ సంపద ఒక తరం నుండి మరొక తరానికి బదిలీ జరగాలి. మహోన్నతమైన శాస్త్ర ఆవిష్కరణలు చేసిన శాస్త్రవేత్తల జాబితాలో భారతీయ శాస్త్రవేత్తల పేర్లు లేకపోవడం యాదృచ్ఛికమేమి కాదు. తరతరాలుగా ప్రజలను విద్య నుండి దూరంగా ఉంచడం వల్ల ఈ పరిస్థితి ఏర్పడింది. సృష్టి లయలకు తామే కారకులమని మనువాదులు ప్రజలను నమ్మింప చేయగలిగారు. ఒక వైపు ప్లేటో, సోక్రటీస్ లాంటి గ్రీకు మేధావులు తార్కిక ఆలోచన దృక్పథంతో ప్రకృతి దృగ్విషయాలను కనుగొనే దిశగా ముందుకు సాగుతుంటే, భారతదేశంలో మనువాదులు ప్రకృతి చర్యలు భగవదేచ్ఛ ప్రకారమే జరుగుతున్నాయని ప్రజలను నమ్మింపచేయగలిగినారు. ఆ విధంగా శాస్త్రీయ ఆలోచనా విధానం నుండి ప్రజలను దూరంగా ఉంచగలిగారు. అవకాశాలను కల్పించి ఉంటే ఎంతో మంది 'అబ్దుల్ కలాం'లు సృష్టింపబడేవారు. సైన్స్‌కు మొదటి శత్రువు, చివరి శత్రువు మతమే. మతం అనే అవరోధాన్ని అధిగమించి సైన్స్ ముందుకు సాగుతుంది. విశ్వ పరిణామ (డార్విన్ సిద్ధాంతం) క్రమంలో జీవులు భగవంతుడు సృష్టించాడు. ఆవిర్భవించాయి. జీవపరిణామ క్రమం నిరంతరంగా కొనసాగుతుంది. జీవి మనుగడను భగవంతుడు నిర్ణయిస్తాడు. ప్రకృతిలో దృగ్విషయాలను సైన్స్ వివరించగలదు ప్రకృతిలోని దృగ్విషయాలు భగవంతుని లీల. వీ

*(రచయిత అధ్యాపకులు)*

# జీవంలేని ఆన్‌లైన్ విద్యా విధానం

*కరోనా నేపథ్యంలో ఆన్‌లైన్ విద్యా విధానానికి శ్రీకారం చుట్టిన ప్రభుత్వాలు దాని సాధ్యాసాధ్యాలను పట్టించుకోకుండా విద్యార్థులపై, వారి తల్లిదండ్రులపై తీవ్ర ఒత్తిడిని పెంచుతున్నారనీ, దీనిపై మరింత సమగ్రంగా పరిశీలించి, ప్రజలకు భారం కాని విధంగా చూడాలనీ అంటున్నారు* **గొడితాల వెంకటేశ్వర్లు**

ప్రపంచ మానవాళి చరిత్రలో మరో విషాద పేజీకి శ్రీకారం చుట్టిన కరోనా, యావత్ భూగోళాన్ని యుద్ధరంగం చేసి ఊపిరి పీల్చుకోలేని ఉత్పాతాన్ని సృష్టించింది. అది స్పృశించని వర్గం లేదు. అది తాకని రంగం లేదు. ప్రపంచ పటం మీది ప్రతి దేశమూ దాని విషకౌగిలికి గురికాక తప్పలేదు. అది మానవ మేధ కృత్రిమ సృష్టియా లేక ప్రకృతి ప్రకోపించిన వికృత చేష్ట అన్నది పక్కన పెడితే, ఆకలితో అలమటించే నిరుపేద చిరు దేశాలు మొదలు సంపదనంతా పోగేసుకున్న, సాంకేతికతను మూటగట్టుకున్న సామ్రాజ్యవాద దేశాలను చిన్నాభిన్నం చేసింది. ఆఖరుకు నడిసముద్రంలో దీవులను కూడా వదలలేదు. ఆయుధ సంపత్తికి భూమ్మీద ప్రతి సృష్టికి పేటెంటు మాదేనని విర్రవీగిన అగ్రరాజ్యాలు సైతం కరోనా యుద్ధంలో వెర్రిముఖం వేశాయి. ఒక సూక్ష్మజీవి విశృంఖలత్వానికి విశ్వంలోని ప్రతి దేశంలో సామాజిక, ఆర్థిక, పారిశ్రామిక, పర్యాటక, వ్యవసాయ, ఉత్పత్తి, సేవా రంగాలే గాక విద్య, వైద్యం అతలాకుతలం అయ్యాయి.

మరీ ముఖ్యంగా అత్యంత విలువైన మానవ వనరులను తయారుచేసే విద్యారంగాన్ని తీవ్రంగా కుదిపేసింది కరోనా. దీంతో ప్రతి రంగం ఏవో కొన్ని పాఠాలను ఎంతో కొంత గుణపాఠాన్ని నేర్చుకున్నాయి ఎప్పటికీ అంతమవుతుందో తెలియని దీని ప్రభావానికి ప్రత్యామ్నాయంగా పునశ్చరణ తరగతులు నిర్వహించుకుంటూ ఉన్నాయి. ఈ నేపథ్యంలో విద్యారంగంలో కోవిడ్-19 కొత్త కొత్త పోకడలకు, పాతవైనా ఇంకా అందుబాటులోనికి రాని విధానాలకు నాంది పలికింది. అదే ఆన్‌లైన్ విద్యా విధానం. అన్ని స్థాయిల్లో దాని అమలు సాధ్యాసాధ్యాలపై ఇప్పుడు చర్చోపచర్చలు బయలుదేరాయి.

**ప్రభుత్వ ప్రయత్నాల్లో ఆన్‌లైన్ విద్య**

ప్రాథమిక పాఠశాల స్థాయి నుండి విశ్వవిద్యాలయాల వరకు దేశవ్యాప్తంగా అన్ని విద్యా సంస్థలు ఐటిఐ నుండి ఐఐటి దాకా ప్రభుత్వ విద్యారంగమే కాకుండా ప్రైవేటు విద్యా వ్యవస్థలు, కోచింగ్ సెంటర్లు సైతం మూత పడక తప్పలేదు. పదో తరగతి పరీక్షలు సగంలో వాయిదా పడగా, ఇంటర్మీడియట్ వ్యాల్యుయేషన్‌తో సహా కళాశాల స్థాయి పరీక్షలు జాతీయస్థాయి ఎంట్రన్స్‌లన్నీ వాయిదా పడ్డాయి. కరోనా వైరస్ ప్రభావాన్ని ఆలస్యంగా గుర్తించిన ప్రభుత్వం అకస్మాత్తుగా లాక్‌డౌన్ విధించి కుప్పకూలిన వ్యవస్థలన్నిటిని పునర్ నిర్వచించుకుంటున్నది. ఎప్పటికీ అంతమవుతుందో తెలియని వైరస్ ప్రభావంతో ఈ అకాడమీ విద్యా సంవత్సరం పూర్తితోపాటు రానున్న విద్యా సంవత్సరాన్ని ఎలా గట్టెక్కించాలని కేంద్రం వ్యూహరచన చేస్తున్నట్లున్నది. అయితే సందిట్లో సడేమియా లాగా కరోనా కాలానికి కలిసొచ్చిన ఒకే దేశం ఒకే విద్య అనే పేరుతో అమలు జరపాలన్న ఆలోచనకు శ్రీకారం చుట్టింది. అందులో భాగంగానే ఆన్‌లైన్ విద్యావిధానం పేరుతో మరొకసారి కార్పొరేట్ సరస్వతీ కాళ్లకు గజ్జెలు కట్టాలి అనుకుంటోంది.

ఆగిపోయిన విద్యా వ్యవస్థను కొనసాగించడానికి అదే విధంగా వైరస్ ప్రభావం ఇప్పట్లో అంతమయ్యే అవకాశం లేనందున రానున్న విద్యా సంవత్సరానికి ప్రత్యక్ష విద్యాబోధనకు ఆలస్యమయ్యే నేపథ్యంలో కేంద్రం ఈ ఆన్‌లైన్ విద్యాబోధనకు తెరతీసింది. పి.ఎం.ఇ విద్యా ప్రోగ్రాం పేరుతో బహుళ నమూనా డిజిటల్ ఆన్‌లైన్ ఎడ్యుకేషన్‌ను ప్రారంభిస్తున్నట్లు పేర్కొంది. ఇందుకోసం ఒకే నేషన్ ఒకే డిజిటల్ ప్లాట్ ఫామ్ ఫెసిలిటీ కల్పిస్తున్నట్లు, దీక్ష పోర్టల్‌లో ఈ కంటెంట్‌ను అందిస్తూ దాదాపు 200 ఈ కంటెంట్ బుక్స్ అందుబాటులో ఉంచినట్లు తెలిపింది.

వెయ్యి మంది విషయ నిపుణులను డిజిటల్ పాఠాల బోధన కోసం సుశిక్షితులను చేసినట్లు చెబుతోంది. ఇప్పటికే దేశంలో 100 యూనివర్సిటీలో ఆన్‌లైన్ కోర్సులు మే 30 నుండి ప్రారంభించడానికి అనుమతులు ఆటోమేటిక్‌గా పొందినట్లు పేర్కొంది. కాగా పాఠశాల విద్య కోసం ఇప్పటికే మూడు ప్రత్యేక ఛానల్స్ ద్వారా అందిస్తున్న డిజిటల్ బోధనకు తోడుగా స్వయంప్రభ ఛానల్స్ మరో 12 ఛానల్స్ ప్రారంభిస్తున్నట్లు, తరగతికో ఛానల్ చొప్పున డిజిటల్ విద్యాబోధనకు సిద్ధమవుతున్నట్లు అవసరమైతే టాటా స్కై, ఎయిర్టెల్ వంటి ఇ చానళ్ల సహకారం తీసుకుంటామని వెల్లడించింది. ఇది గాక 2005 నేషనల్ కరిక్యులం ఫ్రేమ్‌ను సవరిస్తూ కొన్ని మార్పులను ప్రతిపాదిస్తూ 2023 నాటికి కొత్త సిలబస్ కోసం పుస్తకాలు సిద్ధపరుస్తున్నట్లు, నూతన జాతీయ విద్యా విధానంలో భాగంగా దాదాపు 50 శాతం డిజిటల్ బోధనకు ప్రాధాన్యత ఇస్తున్నట్లు వార్తలు వచ్చాయి.

ఇప్పటికైతే అటు యుజిసి, ఇటు కేంద్ర ప్రభుత్వం సూచనల మేరకు డిగ్రీ, పిజి స్థాయి విద్యార్థులకు ఏప్రిల్ 15 నుండి మే 15 దాకా ఈ డిజిటల్ ఆన్‌లైన్ పాఠాలు అందించినా అవి అందరు విద్యార్థులు అందుకోలేకపోయారు అని సర్వేలు తెలియజేస్తున్నాయి. కొన్ని ఇంజనీరింగ్ కళాశాలలు ప్రైవేట్ యూనివర్సిటీ కళాశాలలు ఆన్‌లైన్ పాఠాలు ప్రారంభించినా సంపూర్ణంగా అనుకున్న స్థాయిని చేరుకోలేక పోయాయి అన్నది నిర్వివాదాంశం.

**ఆన్‌లైన్ బోధన - అభ్యసన**

అసలు ఆన్‌లైన్ బోధనకు, అభ్యాసానికి కావాల్సిన పరికరాలు పరిస్థితులేమిటి? అవి అందుబాటులో ఉన్నాయా? అని పరిశీలించినప్పుడు ఇప్పటికే డిస్టెన్స్ మోడ్‌లో టీవీల ద్వారా పాఠ్యాంశాల ప్రసారం గురించి మనకు పరిచయం ఉన్నదే. ఇది నియమిత కాలానికి నియమిత పాఠ్యాంశాలకు మాత్రమే పరిమితమై ఉంది. రెగ్యులర్ తరగతి బోధనకు అనుగుణంగా కొన్ని డిజిటల్ పాఠ్యాంశాల పరిచయం కూడా తెలిసిందే.

ఇందుకోసం కాలెండర్ లాంటి పరికరాలు, టీవీలు పరిమిత సంఖ్యలో అందించి, రికార్డెడ్ పాఠ్యాంశాలతోపాటు సప్లై చేసిన కొన్ని పాఠశాలలకు వైఫై సౌకర్యం అంతంత మాత్రంగా ఉన్నా అరకొర టీవీ పాఠాలు అందించిన దాఖలాలు ఉన్నప్పటికీ, ప్రస్తుత పరిస్థితి చాలా తేడా ఉంది. ఈ ఆన్‌లైన్ డిజిటల్ పాఠ్యాంశాల బోధనాభ్యసన ఎంతవరకో తెలియని పరిస్థితుల్లో అన్ని తరగతులకు అన్ని సిలబస్‌లకు ఆన్‌లైన్ విద్యా విధానం అప్లై చేయడం అనివార్యమైనా సమస్యాత్మకమైంది.

ఈ నేపథ్యంలో ఆన్‌లైన్ విద్యాబోధనకు ప్రధానంగా ఇంటర్నెట్ సౌకర్యం, ఇన్‌పుట్ డివైసెస్, సాఫ్ట్‌వేర్ ఉంటేనే ఆన్‌లైన్‌లో లైవ్ ఇంటరాక్షన్ క్లాసులు గాని రికార్డెడ్ క్లాసులు గానీ చెప్పడానికి వీలు ఉంటుంది. రికార్డెడ్ క్లాసులు యూట్యూబ్ వాట్సప్ గ్రూపుల ద్వారా పంపించి బోధించడానికి అవకాశం ఉంటుంది. లైవ్ ఇంటరాక్షన్ తరగతులకు తప్పనిసరిగా సాఫ్ట్‌వేర్ కావాల్సి ఉంటుంది. అది స్కైప్, జూమ్, విజ్ ఐక్యూ వంటి యాప్ ద్వారా బోధించవచ్చు. కానీ ఇవి పార్టిసిపెంట్స్ సంఖ్యను బట్టి పెయిడ్ వర్షన్స్ ఉంటాయి. ఇన్‌పుట్ డివైసెస్‌లో స్మార్ట్‌ఫోన్లు, టాబ్లెట్స్, ల్యాప్‌టాప్స్, కంప్యూటర్స్ కెమెరాలు వంటివి తప్పనిసరి అవసరమవుతాయి. అటు విద్యార్థులతోపాటు ఇటు వివిధ స్థాయిల్లోని ఉపాధ్యాయులు, అధ్యాపకులు, ఆచార్యుల వరకు అంతా ఆ పరికరాలను సమకూర్చుకోవడం, బోధన రంగం లోని ప్రతి ఒక్కరూ తగిన శిక్షణ తీసుకోవాల్సి ఉంటుంది. ఆన్‌లైన్ విధానం పట్ల అవగాహన కలిగించుకోవాల్సి ఉంది. ఇంతా జరిగితే దీనివలన ఈ మేరకు ప్రయోజనం ఉంటుందో కచ్చితంగా నిర్ధారించే పరిస్థితి లేదు.

ఆన్‌లైన్ విద్యలో కోర్సు మెటీరియల్ ఈ టెక్స్ట్‌బుక్స్‌గా గాని, వెబ్ ఆధారిత మెటీరియల్ గాని అందిస్తారు. అవి రిసీవ్ చేసుకోవడానికి పట్టణ ప్రాంత విద్యార్థులకు ఉన్నంత సౌకర్యం గ్రామీణ విద్యార్థులకు లేదు. 2019 మెకెన్సీ నివేదిక ప్రకారం దాదాపు 40 శాతం మంది ఇంటర్నెట్ వాడుతున్నారని చెబుతున్నప్పటికీ 90 కోట్ల గ్రామీణ ప్రజలకు 20 కోట్ల స్మార్ట్‌ఫోన్లు మాత్రమే అందుబాటులో ఉన్నాయన్నది మరో నివేదిక. వెబ్‌సైట్, మొబైల్ యాప్‌లలో ఉండే సమాచారం ప్రాంతీయ భాషలో కాకుండా ఇంగ్లీషులో ఎక్కువగా ఉంటుంది. 90 శాతం ప్రజలకు ఇంటర్నెట్ ఉపయోగించే వీలుండదు. ప్రత్యేకించి 70 శాతం గ్రామీణ విద్యార్థులు కనుక వారికి ఇంటర్నెట్ ఆధారిత బోధన అందుబాటులో ఉండదు.

కంప్యూటర్లు స్మార్ట్‌ఫోన్లు కేవలం 8 శాతం మంది విద్యార్థులకు మాత్రమే అందుబాటులో ఉన్నాయని ఒక సర్వేలో వెల్లడైంది. తెలంగాణ రాష్ట్ర ఉన్నత విద్యా మండలి వారి సమాచారం మేరకు డిగ్రీ స్థాయి విద్యార్థుల్లో 20 శాతం మందికి మాత్రమే సాంకేతిక విజ్ఞానం, పరికరాలు అందుబాటులో ఉన్నాయి. ఈ నేపథ్యంలో ఆన్‌లైన్ విద్యతో డిగ్రీ, పీజి విద్యార్థులకు కొంత ప్రయోజనం ఉండవచ్చునేమో గానీ అందరు విద్యార్థులకు అందుబాటులో మాత్రం ఉండదు. పైగా ప్రాథమిక విద్యకు కేంద్రం ప్రతిపాదించిన 12 స్వయంప్రభ ఛానళ్ళ ద్వారా ఏమి ప్రయోజనం చేకూరదు అది ఉన్నత పాఠశాల ఇంటర్మీడియట్ విద్యకు కూడా ప్రయోజనం శూన్యమే ఎందుకంటే ఆ కంటెంట్ అంతా ఎన్‌సిఆర్‌టి రూపొందించిన సిబిఎస్ఇ సిలబస్‌కు సంబంధించి ఉంటుంది. తెలంగాణ వంటి రాష్ట్రాల్లో స్థానికంగా టీ సాట్ రూపొందించిన దీక్ష, నిపుణ విద్యా ప్రణాళికలతో కొంత ఉపయోగం ఉన్నట్లున్నా గ్రామీణ ప్రాంత విద్యార్థులకు సాంకేతిక పరికరాలు అందుబాటులో లేనప్పుడు ప్రయోజనం ఏమీ ఉండదు.

**ఆన్‌లైన్ విద్య ఎంతవరకు ప్రయోజనకారి?**

ఆన్‌లైన్ విద్య కోవిడ్-19 లాంటి విపత్కర పరిస్థితుల్లో విద్యార్థుల మనోధైర్యాన్ని దెబ్బతీయకుండా విద్యార్థుల సమయం వృథా కాకుండా ఉపయోగపడవచ్చు. సాంకేతిక పరికరాల ద్వారా, ఇంటర్నెట్ ద్వారా మరింత సమాచార సేకరణకు ఉపయోగపడవచ్చు. అంతేగాని సజీవమైన ప్రత్యక్ష తరగతి బోధనకు ఆన్‌లైన్ విద్యా విధానం ప్రత్యామ్నాయం ఎప్పటికీ కాదు.

ఆన్‌లైన్ తరగతుల్లో వ్యక్తిగత శ్రద్ధ, ఉపాధ్యాయుని పర్యవేక్షణ కరువవుతుంది. పరస్పర చర్చకు, ప్రత్యక్షంగా సందేహ నివృత్తికి ఆస్కారం లేదు. విద్యార్థికి స్వేచ్ఛాయుత వాతావరణం ఎక్కువ. తరగతులకు తప్పనిసరి హాజరుకావాలని ప్రేరేపించడం కుదరదు. పాఠశాల, ఇంటర్మీడియట్ వంటి అపరిపక్వ దశలో విద్యార్థులకు స్మార్ట్ ఫోన్లు, టాబ్లెట్స్ ఇవ్వడంతో విపరీత ధోరణులకు ఇతరేతర అంశాల పట్ల ఆకర్షితులయ్యే ప్రమాదం ఉంది. సైన్స్ ఇంజనీరింగ్ వంటి సాంకేతిక విద్య, వైద్య విద్య విధానంలో ప్రయోగాలు, ల్యాబ్, ఫిజికల్ ప్రాక్టికల్స్‌కి అవకాశం లేదు.

ఇప్పటికే మనదేశంలో 75 శాతం ఇంజనీరింగ్ విద్యార్థులకు, 90 శాతం సాధారణ డిగ్రీ విద్యార్థులకు నైపుణ్యం కొరవడడంతో ఉద్యోగ అవకాశాలు లభించడం లేదు. పైగా ఆన్‌లైన్ విద్యా విధానం సాధారణ గ్రామీణ ప్రాంత విద్యార్థులకు ఆర్థిక భారంతో కూడుకున్నది. కనీసం 3000 రూపాయలకు పైగా పెట్టి స్మార్ట్‌ఫోన్ కొనాల్సి ఉంటుంది. గంటలు గంటలు ఆన్‌లైన్ పాఠాలు వినడానికి నెట్ బ్యాలెన్స్ ప్యాకేజీ అవసరం అవుతుంది. కేవలం సమాచారం కోసం మాత్రమే డబ్బా ఫోన్‌లు వాడేవాళ్లు ఇప్పటికిప్పుడు ఇవి సమకూర్చుకోవడం కష్టమే పైగా మారుమూల ప్రాంతాల్లో నెట్ సిగ్నల్స్ కూడా తక్కువగా ఉంటాయి. లైవ్ ఇంటరాక్షన్ క్లాసులకు అంతరాయం విపరీతంగా ఉంటుంది.

**కార్పొరేట్ సంస్థలకు కలిసొచ్చిన ఆన్‌లైన్**

కరోనా వైరస్ విజృంభిస్తున్న నేపథ్యంలో మనదేశంలో ఆన్‌లైన్ విద్యా విధానానికి కేంద్రం నిపుణుల అభిప్రాయాలను సేకరించింది ఆన్‌లైన్ లెర్నింగ్‌కు భారత్‌లో ఇంటర్నెట్ సదుపాయాలు సానుకూలంగా లేవని కాక్వరెల్లి సైమండ్స్ నివేదిక తెలియజేస్తుంది. ఆన్‌లైన్ తరగతులకు సరైన సాంకేతిక పరిజ్ఞానంతో డేటా కనెక్టివిటీ అందించడంలో భారతదేశం వెనుకబడి ఉందని సర్వేలు తెలియజేస్తూ ఉండగా ప్రస్తుత పరిస్థితుల్లో ప్రత్యామ్నాయ విద్యాబోధనకు ఈ విధానాన్ని ఎంచుకుంది. ఇది ఒకవైపు ఆర్థికంగా వెనుకబడిన సౌకర్యాలు లేని విద్యార్థులు వివక్షకు గురికావడానికి దారితీయడమే కాక పెద్దఎత్తున విద్యా వ్యాపారానికి తెరతీసింది.

ఇప్పటికే ప్రైవేటు విద్యా రంగంలో ఉన్న పాఠశాలలు కళాశాలలు ఆన్‌లైన్ విద్య పేరుతో పెద్ద మొత్తంలో ఫీజులు వసూలు చేయడంతోపాటు, కట్టని విద్యార్థులకు నెట్ ప్రసారాలను కట్ చేస్తున్నారు. పైగా ఎలక్ట్రానిక్ పరికరాలైన స్మార్ట్‌ఫోన్, టాబ్లెట్, కంప్యూటర్, ఇయర్ ఫోన్స్, హెడ్‌సెట్ వంటి వాటిని విధిగా కొనుగోలు చేసేలా ప్రోత్సహిస్తున్నాయి. బైజూస్ లాంటి దేశీయ విదేశీ ఆన్‌లైన్ విద్యా వ్యాపార సంస్థలకు ప్రైవేటు కార్పొరేట్ కాలేజీలకు ఆన్‌లైన్ విద్య ఒక పెద్ద మార్కెట్‌ను అందించింది.

**ప్రభుత్వ చర్యలు ఎలా ఉండాలి?**

కరోనా వైరస్ సృష్టించిన కల్లోల పరిస్థితుల్లో అనివార్యంగా

# ఆర్థిక సంక్షోభ కారణాలు - ప్రత్యామ్నాయం

***ప్రభుత్వాలు ప్రజల కొనుగోలు శక్తి పెంచకుండా కార్పొరేట్లకు లాభాలను చేకూర్చే పెట్టుబడిదారీ విధానం వల్ల తీవ్ర ఆర్థిక సంక్షోభానికి దారితీసే ప్రమాదం ఉందని దీనికి ప్రత్యామ్నాయం సోషలిస్టు ఆర్థిక విధానమేనని అంటున్నారు ఎ. నర్సింహారెడ్డి***

**1947** ఆగస్టు 15న బ్రిటిష్ వలస పాలకుల నుండి అధికార మార్పిడి జరిగిన తరువాత దేశంలో అభివృద్ధి- సంక్షేమాన్ని కొనసాగించడానికి మిశ్రమ ఆర్థిక విధానాన్ని అమలు చేస్తామని ఆనాటి ప్రభుత్వం ప్రకటించింది. అంటే ప్రైవేట్ రంగంతో పాటు ప్రభుత్వ రంగాన్ని విశేషంగా పోషించి సాధారణ ప్రజల కనీస జీవనావసరాలకు ప్రభుత్వం పూచీ పడింది. అయితే క్రమ క్రమంగా ఆ విధానాన్ని వదిలి ప్రైవేట్ పెట్టుబడులను ప్రభుత్వమే అసాధారణంగా ప్రోత్సహించింది. ప్రజా సంక్షేమ పథకాల వ్యయాన్ని కుదింప చేసిన వర్తమాన స్థితి సాధారణ జనం శ్రమ మరింతగా దోపిడీకి గురయ్యేలా చేసింది. ఈ ఏడు దశాబ్దాల కాలంలో ప్రజల మౌలిక సమస్యల్లో ఏ ఒక్కటి నేటికి పరిష్కారం కాలేదు. పాలకుల ప్రజావ్యతిరేక విధానాలు దేశంలో ఆర్థిక అంతరాలను, నిరుద్యోగాన్ని, పేదరికాన్ని, వ్యవసాయ రంగ సంక్షోభాన్ని తీవ్రతరం చేసాయి.

నిజానికి ప్రతి పౌరుడికీ సామాజిక, ఆర్థిక రాజకీయ అవకాశాల్లో సమానత్వం సాధించాలన్న అంతస్సూత్రంపై 1950లో భారత రాజ్యాంగం రూపుదిద్దుకున్నది. రాజ్యాంగం స్ఫూర్తిగా అందరికీ సమన్యాయం దక్కేలా చూడాల్సిన బాధ్యత ప్రభుత్వాలది. పేదరికం, నిరుద్యోగం, నిరక్షరాస్యత, అనారోగ్యం లాంటి సామాజిక రుగ్మతలను రూపుమాపడానికి రాజ్యం పూనుకుంటుందని పాలకులు హామీనిచ్చారు. పౌర సమాజంలో భిన్న శ్రేణుల ఆదాయస్థాయిలో, సంపద సృష్టిలో తీవ్ర తారతమ్యాల దుష్పరిణామాలను నివారించి సామాజిక న్యాయం సాధిస్తూ, అసమానతలను తొలగించటానికి ప్రణాళికాబద్ధ అభివృద్ధి కోసం పంచవర్ష ప్రణాళికలతో దిశానిర్దేశం చేశామన్నారు. అయితే, నిజానికి జరిగిందేమిటంటే మిశ్రమ ఆర్థిక విధానంతో సమ సమాజ నిర్మాణం ముసుగులో పెట్టుబడిదారీ సమాజ నిర్మాణం జరిగింది. ప్రణాళికలు ప్రజల జీవన ప్రమాణాలు పెంచడానికి బదులు దేశీయ బడా దళారీ బూర్జువా వర్గం సంపదలు పెంచుకోవడానికి తోడ్పడ్డాయి. కాలక్రమంలో నామమాత్రపు ప్రాధాన్యతా క్రమాలు తారుమారై సమాజంలో అనేక అపసవ్యాలు చోటుచేసుకున్నాయి.

నూతన ఆర్థిక విధానాల అమలు పేరుతో 1991 నుంచి భారత పాలకులు పెట్టుబడిని, ప్రైవేట్ పెట్టుబడి రంగాన్ని విశేషంగా ప్రోత్సహించి ప్రభుత్వ వ్యయాన్ని, సంక్షేమానికి వ్యయాన్ని తగ్గిస్తూ వస్తున్నారు. ప్రపంచ బ్యాంకు చోదిత ఆర్థిక వ్యవస్థ వల్ల దేశంలో నిరుద్యోగం, పేదరికం, ఆర్థిక అంతరాలు మరింతగా పెరిగాయి. మన దేశ జనాభాలో ఒక శాతం మంది సంపన్నుల సంపద దేశంలోని 70 శాతం (93.5 కోట్లు) పేదల దగ్గర ఉన్న సంపదకంటే 4 రెట్లు ఎక్కువన్న దిగ్భ్రాంతికరమైన అంశాన్ని 'ఆక్స్‌ఫామ్' నివేదిక వెలువరించింది. సాధారణ ప్రజలు జీవించడానికి అవసరమైన కనీస పరిస్థితులు లేకుండా చేయగల దుర్భర భవిష్యత్తును గురించి ఆ నివేదిక హెచ్చరించడం గమనార్హం. ప్రభుత్వాలు ఖర్చు తగ్గించుకొని అన్ని రంగాలను ప్రైవేటు కోరలకు అప్పగించాలన్న వరల్డ్ బ్యాంకు విధానమే ఈ దారిద్ర్య దావానలం ఇలా రెచ్చిపోయి వ్యాపించడానికి కారణమని ఆక్స్‌ఫామ్ ఎత్తిచూపిన అంశాలను గమనిస్తే వాస్తవం బోధపడుతుంది.

మన భ్రష్ట ఆర్థిక వ్యవస్థ దేశంలోని సుసంపన్నమైన ప్రకృతి సహజ వనరులతో పాటు సాధారణ పురుషుల, మహిళల శ్రమను బిలియనీర్లు, బడా వ్యాపారుల జేబుల్లోకి తరలిస్తున్న కఠోర వాస్తవాన్ని చూస్తునే ఉన్నాం.

---

కొంతకాలం దానితో కలిసి నడవక తప్పదు కనుక మన జీవన విధానంతో పాటు విద్యావిధానంలో అభ్యసన విధానాన్ని కూడా మార్చుకోక తప్పదు. ఎంత కాదనుకున్నా సాంకేతిక పరిజ్ఞానాన్ని పరిస్థితులకు అనుగుణంగా వాడుకోక తప్పదు. కనుక ప్రభుత్వం చేపట్టిన ఆన్‌లైన్ విద్యా విధానం ఫలించడానికి తరగతికో చానల్ చొప్పున తెచ్చిన ప్రయత్నమూ, టీ సాట్ విద్య నిపుణ ఛానల్స్ ద్వారా డిజిటల్ పాఠాలు విజయవంతం కావడానికి గ్రామీణ ప్రాంత వెనుకబడిన విద్యార్థులకు ఉచిత మధ్యాహ్న భోజనం, దుస్తులు, పుస్తకాల మాదిరిగానే, విద్యా కార్యక్రమాలకు మాత్రమే పరిమితమయ్యే లా రూపొందించిన స్మార్ట్‌ఫోన్‌లు ఉచిత డేటా సౌకర్యం కల్పించాలి. తద్వారా ప్రైవేటు విద్యా వ్యవస్థలో ధనిక వర్గాల పిల్లలకు ప్రభుత్వ విద్యా వ్యవస్థలోని పిల్లలకు మధ్య విద్యాపరమైన సమతుల్యాన్ని సాధించాల్సి ఉంటుంది. ఇది కనీసం కోవిడ్ వైరస్ ప్రభావం ఉన్నంత మేరకైనా కొనసాగించాలి. అనంతరం తరగతి బోధనకే ప్రాధాన్యత నివ్వాలి. తరగతులు భౌతికంగా ప్రారంభించడానికి ప్రభుత్వాలు, ప్రపంచ ఆరోగ్య సంస్థ యూనిసెఫ్‌తో కలిసి రూపొందించిన నియమావళిని అనుసరించి విద్యారంగంలో మౌలిక సౌకర్యాలను ఏర్పాటు చేయాలి. తరగతి గదులను ప్రతిరోజు కడిగి శానిటైజర్ చేయడం విద్యార్థులకు శానిటైజర్ సబ్బులు అందుబాటులో ఉంచడం, చేతులు శుభ్రపరచుకోవడానికి నిరంతర నీటి సదుపాయం కల్పించాలి. ఉపాధ్యాయులు విద్యార్థులు తప్పక మాస్కులు ధరించేలా చూడాలి. భౌతిక దూరం పాటించడానికి తరగతులను షిఫ్ట్ పద్ధతిలో నిర్వహించాలి హాస్టల్లో ఎప్పటికప్పుడు శానిటైజర్ చేస్తూ నిరంతర వైద్య సదుపాయం అందుబాటులో ఉంచాలి. పిల్లల ఆరోగ్యం పట్ల శ్రద్ధ వహిస్తూనే వారి విద్యాభివృద్ధికి ఆటంకాలు లేని విధానాలకై అన్వేషించాలి. ప్రభుత్వం కొత్త ఒక వింత పాత ఒక రోత అన్నట్లు పాత విధానాలకు పూర్తిగా తిలోదకాలు ఇచ్చి కొత్త విధానాల వెంటపడి పరుగెత్తకుండా ఆలోచించి జాగ్రత్తగా అడుగు వేయాల్సి ఉంది.

*(రచయిత ఉపాధ్యాయులు)* వీ

ప్రభుత్వ ఆర్థిక విధానాలు నిరుపయోగమై నిరుద్యోగం, పేదరికం పెరిగిపోతుంది. ఆర్థిక సరళీకరణ ద్రవ్యోల్బణాన్ని పెంచుతోంది. ఆదాయం పంపిణీ అపసవ్యత తీవ్రతరమైంది. భారత దేశంలోని 63 మంది బిలియనీర్ల మొత్తం సంపద గత ఏడాది కేంద్ర బడ్జెట్ కంటే ఎక్కువన్న సమాచారం కళ్లు బైర్లు కమ్మేలా ఉంది. అంటే వీరి సంపద మొత్తం దాదాపు రు. 30 లక్షల కోట్లన్నమాట. ఎన్ని కోట్ల మంది సాధారణ ప్రజల అదనపు శ్రమ విలువ కలిస్తే ఇంత సంపద పోగుపడిందో సులభంగానే అర్థం చేసుకోవచ్చు. అంతేకాదు పాలకులు ఏ వర్గం ప్రయోజనాలు కాపాడుతున్నారో స్పష్టంగా తెలుస్తోంది. ఫలితంగా అత్యధిక జనాభా ఎంతగా కనీస జీవన సౌకర్యాలకు దూరమయ్యారో అవగతం చేసుకోవచ్చు.

ఇవాళ దేశంలో ఆర్థిక అసమానతలు సామాజిక అశాంతికి దారితీస్తున్న దుస్థితి స్పష్టంగా కనిపిస్తోంది. అవినీతి, పాలకుల ఆశ్రిత పక్షపాతం, రాజ్యాంగ ఉల్లంఘనలు, అడ్డగోలుగా పెరిగే నిత్యావసరాల ధరలు వంటివే ఆర్థిక అంతరాల వృద్ధికి కారణం. అవకాశాల అంతరాలే ఆర్థిక అసమానతలకు కారణం. ఉన్నవాళ్లకు అన్నీ సమకూరుతాయి. తద్వారా వాళ్లు సంపదను పెంచుకుంటున్నారు. అవకాశాల్లోనే అన్యాయం వల్ల పేదలు తమ పరిస్థితిని ఎప్పటికీ మెరుగు పరచుకోలేకపోతున్నారు. ఉద్యోగాలుండవు, ఉపాధి దొరకదు, జీవన ప్రమాణాలు మెరుగు పరచుకునే ఆస్కారమే శూన్యం! అరకొర సంపాదన కూడా రోజువారీ ఖర్చులకు తోడు విద్య, వైద్యం వంటి అత్యవసరాలకే కరిగిపోతోంది. వారి ఆర్థికాభివృద్ధికి దోహదపడకుండా, ఎంతసేపూ వారిని ఓటు బ్యాంకుగా పరిగణించే పాలనా వ్యవస్థలు ఎప్పటికప్పుడు తృణమో, పణమో తాయిలాలు అందించి పబ్బం గడవుకుంటున్నాయి. 'అయినవారికి ఆకుల్లో కానివారికి కంచాల్లో వడ్డించే... పద్ధతిలో ఎర్ర తివాచీలు పరచి కార్పొరేట్లకు దాసోహమంటున్నాయి.

2014 మేలో మోడీ ప్రభుత్వం ఏర్పడ్డాక సామ్రాజ్యవాద పెట్టుబడి అనుకూల సంస్కరణలు వేగం పుంజుకున్నాయి. పెద్దనోట్ల రద్దు, వస్తుసేవల పన్ను అమలు వంటి అనాలోచిత చర్యలతో మన ఆర్థికవ్యవస్థ కుదేలయింది. రూపాయి పతనం, ద్రవ్యోల్బణం, నిరుద్యోగం, అవినీతి పెచ్చరిల్లింది. పర్యావసానంగా మన దేశ ఆర్థిక వ్యవస్థ సంవత్సర కాలంగా మాంద్యంలో కొట్టుమిట్టాడుతుందని అందరు అంగీకరిస్తున్న విషయమే. మాంద్యం దెబ్బతో సంవత్సర కాలంగా విలవిలాడుతున్న ఆర్థిక వ్యవస్థకు ఇప్పుడు కరోనా మహమ్మారి తోడవ్వడంతో మరింత క్షీణించింది. కేంద్ర-రాష్ట్ర ప్రభుత్వాలు అనాలోచితంగా లాక్‌డౌన్ ప్రకటించాయి. అసంఘటిత రంగ కార్మికులు, వలస కార్మికుల రోధనలు, చావులు, బాధలు నిత్యం దిన పత్రికల్లో చూశాం. పరిశ్రమలు, రవాణా, నిర్మాణ, తయారీ రంగాలు మూతపడ్డాయి. దీంతో పెనం నుంచి పొయ్యిలో పడ్డ చందంగా దేశ ఆర్థిక వ్యవస్థ మాంద్యం నుంచి సంక్షోభంలోకి పడిపోయింది.

**మూడు దశాబ్దాల ప్రపంచీకరణ దుష్పరిణామాలు**

1991 నుంచి అమలులోకి వచ్చిన సామ్రాజ్యవాద ప్రపంచీకరణ ఆర్థిక విధానాల ఫలితంగా ప్రభుత్వం ప్రజాహిత కార్యక్రమాలను ఉపసంహరించుకుంది. దీన్నే ప్రపంచ బ్యాంకు 'మార్కెట్ అనుకూల ప్రభుత్వ జోక్యం' గా నిర్వచించింది. ఇక ఉపాధి, విద్య, వైద్యం మొదలైన సమస్యల పరిష్కారం కోసం వ్యక్తి మార్కెట్‌కు వెళ్లి సొంతంగా పరిష్కరించుకోవాలి. అంటే ప్రభుత్వం ఫెసిలిటేటరుగా మారింది. దీంతో పేదలకు విద్య, వైద్యం లాంటి సౌకర్యాలు అందకుండా పోయాయి. ఇకమీదట పేదరిక నిర్మూలన, ఉపాధి కల్పన వ్యక్తి కృషి ద్వారా మాత్రమే జరగాలి. వారి సమస్యల పరిష్కారం కోసం ప్రభుత్వం బాధ్యత వహించదు. మరోవైపు ఉచ్ఛ స్థితిలో ఉన్న ప్రభుత్వ రంగాలన్నింటిని నిర్వీర్యపరచి అసమర్థంగా తయారు చేసింది. ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో దేశ ఆర్థిక వ్యవస్థను సంలీనం చేసి స్వేచ్ఛా వాణిజ్యానికి పెద్దపీట వేయడంతో జాతీయ అభివృద్ధి వ్యూహాలు తారుమారయ్యాయి. గత దశాబ్ద కాలంగా కొనసాగుతున్న ప్రపంచ ఆర్థిక వ్యవస్థ సంక్షోభం మూలంగా 2008 నుంచి భారత ఆర్థిక వ్యవస్థ ప్రతికూల దిశలో పయనిస్తోంది.

ఆర్థిక సంక్షోభానికి ప్రధాన కారణం ప్రణాళిక రహితంగా లాభాపేక్షతో ప్రజల కొనుగోలు శక్తికి మించి ఉత్పత్తి జరిగి, ఆ అదనపు ఉత్పత్తి అమ్ముడు పోనందున 'అధికోత్పత్తి సంక్షోభం' సంభవించింది. 'అధికోత్పత్తి సంక్షోభం' అంటే ప్రజల అవసరాలకు మించి ఉత్పత్తి జరగడం కాదు. ప్రజల వద్ద ఉన్న కొనుగోలు శక్తి పరిమితంగా ఉన్నందున ఉత్పత్తి జరిగినదంతా అమ్ముడు పోకపోవడమని గమనించాలి. ఇది ఎందుకు జరుగుతుంది? పెట్టుబడిదారులు కార్మికులకు అంతకంతకూ తక్కువ జీతాలు చెల్లించడం ఒక కారణం. ఎప్పటికప్పుడు కొత్త టెక్నాలజీని తెచ్చి తక్కువ మంది కార్మికులతో ఎక్కువ పని చేయించుకోవడంతో కార్మికుల సంఖ్య తగ్గడం రెండో కారణం. అయితే ఒకసారి అధికోత్పత్తి సమస్య రాగానే పెట్టుబడిదారులు ఏం చేస్తారు? ఉత్పత్తిని తగ్గిస్తారు. దాంతో మరింత మంది కార్మికులు పనులు కోల్పోతారు. ఉత్పత్తి తగ్గడంతో 'మాంద్యం' ఏర్పడుతుంది. మరోవైపు కొనుగోలు శక్తి తగ్గిపోతుంది. దీనికి ఆర్థిక వేత్తలు ఉపాధి రహిత ఉత్పత్తి విధానం కారణమంటున్నారు.

మనదేశ ఆర్థిక వృద్ధిరేటు 2019-20 ఆర్థిక సంవత్సరంలో 4.2 శాతమే. కరోనా ప్రభావంతో 2020-21 ఆర్థిక సంవత్సరంలో వృద్ధిరేటు ప్రతికూలంగా ఉంటుందన్న విశ్లేషణలు వస్తున్నాయి. వృద్ధికి శోధక శక్తులైన వినియోగం, మదుపు, ఎగుమతులు అనే మూడు పూర్తిగా తిరోగమన బాటలో ఉన్నాయి. వీటిలో వినియోగం గత నాలుగు దశాబ్దాలలో కెల్లా కనిష్ట స్థాయికి పడిపోయింది. అందులోనూ గ్రామీణ వినియోగం 8.8 శాతానికి తగ్గిపోగా, పట్టణ వినియోగంలో పెరుగుదల లేదు. మదుపు 2018-19 ఆర్థిక సంవత్సరంతో పోల్చితే 2019-20లో 1 శాతం వృద్ధి మాత్రమే ఉంది. ఇక ఎగుమతులు ప్రతికూల వృద్ధిని నమోదు చేశాయి. ఈ తిరోగమన ఆర్థిక స్థితికి నాలుగు అంశాల సమ్మిళిత ప్రభావాన్ని గమనించవచ్చు. ఒకటి విధానపరమైన నోట్ల రద్దు- జిఎస్‌టి అమలు, రెండు వ్యవసాయ సంక్షోభం, మూడు ఉపాధి కొరత-వేతనాల్లో కోత, నాలుగు ద్రవ్య సంక్షోభం. ఇవన్నీ గత మూడు దశాబ్దాలుగా ఆర్థిక వ్యవస్థను కుళ్లబొడుస్తున్న వ్యవస్థాగత అవరోధాలుగా చెప్పవచ్చు.

పెట్టుబడిదారీ వ్యవస్థలో ఇటువంటి 'ఆర్థిక మాంద్యం' పరిస్థితులు అప్పుడప్పుడు ఏర్పడడం సహజమేనని, మళ్లీ మార్కెట్ పుంజుకుని మాంద్యం నుండి బైటపడి, ముందుకు పురోగమిస్తుందని కొందరు పెట్టుబడిదారీ విధాన అనుకూల ఆర్థిక పండితులు చెప్తూ ఉంటారు. అయితే ఇది వాస్తవం కాదు. 1930 దశకంలోని ఆర్థిక మాంద్యం ఒక దశాబ్దం పైగా కొనసాగింది. ఆ తర్వాత వచ్చిన ప్రపంచ యుద్ధంతో మిలిటరీ వ్యయం పెరిగి తద్వారా సంక్షోభం నుండి బైట పడింది. అంటే సంక్షోభానికి మూల్యంగా అపార జన నష్టం, ఆస్తి విధ్వంసం, రక్తపాతం చెల్లించాల్సి వచ్చిందన్నమాట. ఇప్పుడు 2008 నుండి మళ్లీ 'అధికోత్పత్తి సంక్షోభం' మొదలైంది. నేటికీ అది కొనసాగుతూనే ఉంది. సంక్షోభ పరిస్థితులను దాటేశామని బూర్జువా ఆర్థిక నిపుణులు కొందరు

నమ్మబలుకుతున్నా, సంక్షోభం నానాటికీ ముదురుతూనే ఉంది. ఫలితంగా నిరుద్యోగం పెరుగుతూనే ఉంది. ప్రజల కొనుగోలు శక్తి తగ్గుతూనే ఉంది. మరోవైపు ప్రభుత్వాలు ప్రజా సంక్షేమం మీద కోతలు విధిస్తూ కార్పొరేట్లకు అదనపు రాయితీలు ఇస్తూనే ఉన్నాయి.

నిజానికి సంక్షోభానికి మూలాలు పెట్టుబడిదారీ వ్యవస్థలోనే ఉన్నాయి. అవసరాల కొరకు ఉత్పత్తి కాకుండా లాభం కోసమే ఉత్పత్తి అన్న సూత్రమే దీనికి ప్రధాన కారణం. గత మూడు దశాబ్దాలుగా అమలవుతున్న సామ్రాజ్యవాద ప్రపంచీకరణ ఆర్థిక విధానాలు మహా సంపన్నులకు మహా లాభాలు సాధించి పెట్టాయి. పెట్టుబడిదారుల విశృంఖలమైన పేరాశ 'ప్రపంచీకరణ శకం'లో మునుపెన్నడు లేనంత పెద్ద సంక్షోభం కలుగజేసింది. ఈ పెట్టుబడిదారుల పేరాశ గూర్చే మార్క్స్ 'లాభం పెరుగుదల కోసం పెట్టుబడి ఎంత నికృష్టపు పనినైనా చేయిస్తుందన్నాడు. 2008 నుంచి ప్రపంచ వ్యాప్తంగా నెలకొన్న సంక్షోభానికి తోడు కొవిడ్-19 మహమ్మారి విజృంభన ప్రపంచ ఆర్థిక వ్యవస్థల్లో నెలకొన్న అనివార్యమైన వైరుధ్యాలను మరింత స్పష్టంగా వెల్లడిస్తోంది. ఈ చేదు నిజాన్ని ప్రపంచీకరణ సమర్థకులు ఇంకెంత మాత్రం దాచలేరు. పెట్టుబడిదారీ విధానంలోని సహజ సిద్ధమైన స్వభావం సమాజం లోపల అనివార్యంగా వైరుధ్యానికి దారితీస్తుంది. పెట్టుబడిదారీ విధానంలోని దోపిడీ పీడనలు ఎంతగా పెరిగితే ఈ వైరుధ్యం కూడ అంతగా పెరుగుతుంది. దాని వ్యక్తీకరణ స్వభావం మారవచ్చు కాని ప్రాథమిక లక్షణమైన దోపిడీ విధానం మారదు.

**క్షీణించిన దేశీయ, విదేశీ డిమాండ్**

'కెఎల్ఎంఇఎస్ డేటాబేస్' ఒక ప్రాజెక్ట్ వర్క్‌లో భాగం. దీనిని ఆర్‌బిఐ చేపడుతుంది. ఒక నిర్ణీత సమయంలో పరిశ్రమల, సేవల అభివృద్ధి - అందులో ఉత్పాదకత వృద్ధి, ఉపాధి వృద్ధి, వేతనాల వృద్ధి వంటి గణాంకాలు సేకరించి ఆర్‌బిఐ ప్రకటిస్తుంది. అందులో భాగంగా పట్టణ రంగానికి సంబంధించి ఆర్‌బిఐ 2019 జూలై 12న సమర్పించిన కెఎల్ఎంఇఎస్ డేటాబేస్ ప్రకారం 2011 నుంచి 2017 వరకు వస్తూత్పత్తి రంగంలో ఉపాధి పెరుగుదల 1.4 శాతం పడిపోగా, సేవ రంగంలో 7.2 నుంచి 6.1 శాతానికి పడిపోయాయని ఆర్‌బిఐ సమర్పించిన నివేదిక తెలిపింది. ఒకవైపు గ్రామీణ ఆదాయం, మరోవైపు కార్మికుల వేతనాలు పడిపోవడానికి తోడుగా ఆదాయ పంపిణీలో అసమానతలు కొనసాగుతుండడంతో దేశీయ డిమాండ్ తగ్గింది. అలాగే విదేశీ డిమాండ్ కూడ కునారిల్లడంతో ఎగుమతులు తగ్గాయి.

ప్రభుత్వ ప్యాకేజిలన్నీ దివాళ తీసిన బ్యాంకులకు, మూతపడ్డ పరిశ్రమల యాజమాన్యాలకు లక్షలాది కోట్ల రూపాయల రాయితీలు, ఉద్దీపనలకు అందజేసేటివిగా ఉన్నాయి. అంటే, సరఫరా రంగంలో ఉద్దీపనకు సంబంధించినవి కావటం మూలాన డిమాండ్ పెంచడంలో ఇవేమంత ప్రభావం చూపడం లేదు. అందుకే వినియోగంపై ఖర్చు చేయాలన్న ఆకాంక్ష అధికంగా ఉండే సగటు మనిషికీ కొనుగోలు శక్తిని ఎక్కువగా అందించడం అనేది ఆర్థిక వ్యవస్థ వృద్ధికి కీలకాంశమవుతుంది. ప్రజల కొనుగోలు శక్తి పెంచకుండా ఆర్థిక సంక్షోభాన్ని నివారించలేం. అందుకు ఉపాధి కల్పన పెంచాలి. కార్మికుల వేతనాలు పెంచాలి. దినసరి కూలీల కనీస వేతనం పెంచాలి. కింది స్థాయి ఉద్యోగులు, కూలీల ఆదాయం పెరిగితే... వారి కొనుగోలు శక్తి పెరుగుతుంది. తద్వారా వారు చేసే వ్యయం పెరుగుతుంది. దీంతో వ్యవస్థలోని పలు పరిశ్రమల ఉత్పత్తులకు డిమాండ్ పెరగడంతో సంక్షోభం నుంచి బయట పడగలం.

**వ్యవసాయ వ్యతిరేక విధానాలు**

1960 దశకంలో ప్రవేశపెట్టిన హరిత విప్లవం రైతుపై బహుళజాతి సంస్థల (ఎరువులు, విత్తనాలు, పురుగు మందులు) ఆధిపత్యాన్ని పెంచింది. పెట్టుబడి వ్యయాన్ని పెంచింది. ప్రపంచ వాణిజ్య సంస్థలో మన వ్యవసాయాన్ని చేర్చడంతో రైతు కష్టాలు పరాకాష్టకు చేరాయి. మొత్తంగా వ్యవసాయ అభివృద్ధి నమూనా వ్యవసాయ రంగ ప్రయోజనాలకు వ్యతిరేకంగా మార్చి వేశారు. హరిత విప్లవంతో పెరగడం ప్రారంభమైన సేద్యపు ఖర్చులు, నూతన ఆర్థిక విధానాల అమలు, ప్రపంచ వాణిజ్య సంస్థ ఒప్పందంలో వ్యవసాయాన్ని చేర్చడంతో సేద్యపు ఖర్చులు పరాకాష్టకు చేరాయి. ఫలితంగా జనాభాలో 55 శాతానికి ఆధారభూతంగా ఉంటున్న వ్యవసాయ రంగం వాటా గణనీయంగా పడిపోయింది. వ్యవసాయంలో యాంత్రీకరణ ప్రవేశమవ్వడంతో ఉపాధి అవకాశాలు భారీగా పడిపోయాయి. వ్యవసాయ రంగంలో ఉపాధి వృద్ధిరేటు చాల తగ్గిపోయిందని 'ది పిరియాడిక్ లేబర్ ఫోర్స్ సర్వే' (2017 -18) స్పష్టం చేసింది. దేశీయ స్థూల ఉత్పత్తిలో వ్యవసాయ రంగం వాటా 1990లో 30 శాతం ఉండగా 2019 నాటికి 14 శాతానికి దిగజారింది.

2011 జనాభా లెక్కల ప్రకారం దేశంలో సేద్యం చేసే రైతుల సంఖ్య 11.89 కోట్లు. దేశంలో మొత్తం శ్రామికుల్లో 48.1 కోట్ల మందిలో సేద్యం చేసేవారు 24.6 శాతం. ఇక దేశ వ్యాప్తంగా వ్యవసాయ కూలీలుగా పనిచేస్తున్న వారు 14.4 కోట్ల మంది ఉన్నారు. సేద్యం చేసేవారు, వ్యవసాయ కూలీలు అందరినీ కలిపితే మొత్తం 26.3 కోట్ల మంది ఉన్నారు. దేశ జనాభాలో ఇది 22 శాతం. ఇటీవలి నీల్సన్ నివేదిక ప్రకారం వ్యవసాయ సంక్షోభం, గిట్టుబాటు ధరలు తక్కువగా ఉండడం, కూలిరేట్లు తగ్గడం వంటి వన్నీ వినియోగ డిమాండ్‌ను దెబ్బతీశాయి. కొనుగోలు శక్తి లేమి అన్నది ఉపాధి లేమి వల్ల, తగినంత సంపాదించుకోలేక పోవడం వల్ల తలెత్తుతుంది. పేదరికం వల్ల అన్నార్తుల సంఖ్య పెరగడం అన్నది ఆర్థిక వ్యవస్థ వైఫల్యానికి నిదర్శనం. అధికార మార్పిడి తర్వాత డెబ్బయి సంవత్సరాలకు కూడా దాదాపు 30 శాతం జనాభా ఈ సమస్యను ఎదుర్కోవడానికి కారణం మనదేశ ఆర్థిక విధానాల వైఫల్యమని నిస్సందేహంగా చెప్పవచ్చు.

వ్యవసాయ- వ్యవసాయేతర రంగాల మధ్య వృద్ధిరేటులో వ్యత్యాసం పెరిగింది. గ్రామీణ-పట్టణ ప్రాంతాల మధ్య, సంఘటిత-అసంఘటిత రంగాల మధ్య అసమానతలు బాగా పెరిగాయి. గ్రామీణ పేదరికం, వ్యవసాయ సంక్షోభం తీవ్రమైంది. ఈ దుస్థితి నివారించడానికి 2005లో నియమించబడిన జాతీయ రైతు కమిషన్ (ఎన్ఎఫ్‌సి) పంటలకు మద్దతు ధర ప్రకటించడం ద్వారా రైతులకు కాస్త ఉపశమనం కలిగించాలని నొక్కి చెప్పింది. జాతీయ రైతుల కమిటీ చేసిన సిఫార్సులను యుపిఎ, ఎన్‌డిఎ ప్రభుత్వాలు అమలు చేయలేదు. వ్యవసాయం గిట్టుబాటు కాక రైతులు వ్యవసాయేతర రంగాలలోకి వెళ్తున్నారు. వ్యవసాయం చేస్తున్న రైతులు గిట్టుబాటు కాక అప్పుల పాలై గత దశాబ్దన్నర కాలంలో మూడున్నర లక్షల మంది ఆత్మహత్యలు చేసుకున్నారు. 2014-15లో వ్యవసాయ వృద్ధిరేటు 3.3 శాతం ఉండగా 2019 నాటికి 2.7 శాతానికి పడిపోయింది. ఈ రెండు పరిణామాలు గ్రామీణ డిమాండ్‌ను స్తంభింప చేశాయి.

**ఉపాధికి శరాఘాతం**

దేశంలో రోజు రోజుకు నిరుద్యోగం పెరిగిపోతోంది. కరోనా కారణంగా దాదాపు రెండు మాసాల లాక్‌డౌన్ ఫలితంగా రోజువారి

కూలీలు ఉపాధికి దూరమయ్యారు. వివిధ రంగాల్లో లక్షలాది మంది ఉద్యోగాలు కోల్పోయారు. కరోనా ప్రభావం అసంఘటిత రంగంపై తీవ్రంగా పడింది. మార్చి 1 నాటికి దేశంలో నిరుద్యోగం 7.9 శాతం ఉండగా ఏప్రిల్ చివరి నాటికి 26 శాతానికి చేరుకుంది. అనూహ్య స్థాయిలో ఉపాధి అవకాశాలు తగ్గిపోతున్నాయి. దేశీయంగా అసంఘటిత రంగంలోని అసంఖ్యాకుల బతుకు వీధిన పడింది. ఖరారయ్యాయనుకున్న ఐటీల ప్రాంగణ కొలువులూ ఆరిపోతున్నాయి. అంతర్జాతీయ కార్మిక సంస్థ (ఐఎల్ఓ) తాజాగా భారత్‌లోని అసంఘటిత రంగంలో 40 కోట్ల మంది వరకు కార్మికులు దుర్భర పేదరికంలోకి జారిపోయే ప్రమాదం పొంచి ఉందనీ అది హెచ్చరించింది.

సెంటర్ ఫర్ మానిటరింగ్ ఇండియన్ ఎకానమీ అంచనా ప్రకారం మార్చ్ ఒకటో తేదీన పట్టణ ప్రాంతాల్లో నిరుద్యోగం 8.63 శాతం ఉంటే ఏప్రిల్ చివరి నాటికి 26 శాతానికి చేరుకుంది. ఇక గ్రామీణ ప్రాంతాల్లో 7.58 శాతం నుంచి 24 శాతానికి పెరిగింది. సుదీర్ఘ లాక్‌డౌన్‌తో దేశంలో కార్మిక భాగస్వామ్యం తగ్గిపోయింది. దినసరి వేతన కూలీలు, భవన నిర్మాణ కార్మికుల ఉపాధి అవకాశాలు పూర్తిగా దెబ్బతిన్నాయి. సేవా రంగంలోనూ పనులు లేకుండా పోయాయి. దీంతో కార్మిక భాగస్వామ్యం రేటు 41.96 శాతం నుంచి 35.01 శాతానికి పడిపోయింది. ఉద్యోగ, ఉపాధి రేటు కూడా భారీగా పడిపోయింది. మార్చ్ ఒకటో తేదీ నాటికి ఉపాధి 39.84 కోట్ల మందికి ఉంటే ఏప్రిల్ చివరి నాటికి 6 కోట్ల మందికే ఉపాధి ఉన్నట్లుగా తేల్చింది. అంటే దేశంలో కార్మికులు, చిన్న ఉద్యోగులు 33.84 కోట్ల మంది ఉద్యోగ, ఉపాధిని కోల్పోయారు. గత రెండు మాసాల్లో దేశంలో నిరుద్యోగిత మూడింతలైందని స్పష్టీకరించింది. నిజానికిది, దెబ్బమీద దెబ్బ.

కరోనా దెబ్బకు భారత్ సహా వర్ధమాన దేశాల్లోని అసంఘటిత రంగ ఉద్యోగులు, కార్మికులు తీవ్రంగా నష్టపోయారు. అమెరికా, బ్రిటన్ తదితర దేశాల్లో మాదిరిగా ఇక్కడ నిరుద్యోగ భృతిని ప్రభుత్వాలు అందించవు. భారత్‌లో ఇప్పటికే నిరుద్యోగం తీవ్రరూపం దాల్చి ఉంటే, ఇప్పుడు ఈ కరోనా, లాక్‌డౌన్ కారణంగా అనేక సూక్ష్మ చిన్న మధ్యతరహా పరిశ్రమలు ఆర్థికంగా నష్టాల ఊబిలో చిక్కుకుని మూతపడే అవకాశం కనిపిస్తోంది. అంతేకాదు పెద్ద పెద్ద ఉత్పత్తి రంగాలు కూడా ఆర్థిక నష్టాలకు గురై ఉద్యోగుల సంఖ్యను కుదించడం, ఉన్నవారి జీతాల్లో కోత విధించడం చేస్తున్నాయి. నిరుద్యోగ సంఖ్యే కాదు వారిపై ఆధారపడి జీవించే సంఖ్య మూడు రెట్లు ఉంటుంది. భారత్‌లో ఈ లాక్‌డౌన్ వల్ల ఆర్థిక వ్యవస్థకు దాదాపు 22 లక్షల కోట్ల నష్టం వాటిల్లిందని ఒక అంచనా. అసంఘటిత కార్మికుల్లో చాలా మంది వలస కూలీలు. లాక్‌డౌన్ కారణంగా వీరిలో పలువురు ఆకలి చావులకు గురై మరణించారు. వలస కూలీలను కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు ఆదుకోవడం లేదు.

మోడీ ప్రభుత్వం పూర్తిగా ప్రైవేటు కార్పొరేట్ సంస్థల సంపద పెంచడం ద్వారానే భారత దేశంలో ఆర్థిక అభివృద్ధి జరుగుతుందన్న తరహా ధోరణి ప్రస్ఫుటమవుతుంది. ఇప్పటికే సంక్షోభంలో చిక్కుకున్న బ్యాంకులు, బాంకేతర విత్తసంస్థలు కూడా అసంఘటిత రంగానికి ఉదారంగా రుణాల్విడంతో చేతులెత్తేశాయి. మూలిగే నక్కపై తాటికాయ పడ్డట్లు, అప్పటికే ద్రవ్య కొరతతో సతమతమవుతున్న అసంఘటిత రంగంపై అదనంగా వచ్చిన వస్తు సేవల పన్ను విధానం తీవ్ర ప్రతికూల ప్రభావం చూపి, ఈ రంగం చతికిలపడేలా చేసింది. అధిక శాతం ఉద్యోగ ఆదాయాలు సమకూర్చే అసంఘటిత రంగాన్ని కేంద్రం విస్మరించింది. దాన్ని గాడిలో పెట్టే ప్రయత్నాలేవీ కనుచూపు మేరలో లేకపోవడం బాధాకరం. భారతదేశ ఆర్థిక వ్యవస్థ ఆత్మ ఇప్పటికీ అసంఘటిత రంగంలోనే ఉంది. ప్రస్తుతం దేశంలో 94 శాతం మంది కార్మికులు అసంఘటిత రంగంలో ఉన్నారు. కాబట్టి, ప్రస్తుతం ఇబ్బందుల్లో ఉన్న అసంఘటిత రంగాన్ని గాడిలో పెట్టడానికి తక్షణ చర్యలు అవసరం. ఈ రంగంలో పనిచేసే ఉద్యోగులందరికీ సామాజిక, ఆరోగ్య భద్రత కల్పించాలి. దీర్ఘ కాలంలో క్రమబద్ధంగా అసంఘటిత రంగాన్ని సంఘటితంగా మార్చాలి.

### దివాళా అంచున బ్యాంకులు

బ్యాంకులకు వేలకోట్లు ఎగ్గొట్టడంపై పార్లమెంటులో ప్రతిపక్షాలు మార్చిలో ప్రశ్నించినప్పుడు ఆర్థిక శాఖ సహాయమంత్రి అనురాగ్ ఠాకూర్ ఇచ్చిన వివరాలు చాల ఆసక్తికరంగా ఉన్నాయి. దేశంలో మొండి బాకీల మూలంగా పంజాబ్ నేషనల్ బ్యాంకు, స్టేట్ బ్యాంకు ఆఫ్ ఇండియా, యెస్ బ్యాంకు అగ్ర స్థానంలో ఉన్నాయి. దేశంలో 18 ప్రభుత్వ రంగ బ్యాంకులు, 9 ప్రైవేట్ బ్యాంకులు వేల కోట్ల రూపాయల అప్పులు ఇచ్చి వాటిని వసూలు చేసుకోలేని దుస్థితిలో ఉన్నాయి. పంజాబ్ నేషనల్ బ్యాంకుకు ఎగవేసిన మొత్తం రు. 13,473 కోట్లు, స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియాకు ఎగవేసిన మొత్తం రు. 13,432 కోట్లు, యస్ బ్యాంకుకు ఎగవేసిన మొత్తం రు. 60,000 కోట్లు. బ్యాంకులు ఇచ్చిన రుణాలు వసూలు చేసుకోలేని పరిస్థితిలో ఉన్నాయి.

దేశంలోని మొత్తం ప్రభుత్వ, ప్రైవేట్ బ్యాంకులు వేల కోట్ల అప్పులు పెట్టుబడిదారులకు ఇచ్చి వాటిని మాఫీ చేయాల్సిన దుస్థితిలో ఉన్నాయి. గత డిసెంబర్ నాటికి వసూలు గాని మొండి బాకీలు మొత్తం రు. 9,56,167 కోట్ల మేరకు నిరర్థక ఆస్తులుగా ఉన్నాయని ఆర్థికమంత్రి పార్లమెంట్‌లో గత ఏప్రిల్‌లో తెలిపారు. మంత్రి గారు మొండి బాకీలు ఎంత ఉన్నాయో చెప్పారు కానీ ఎవరెవరు ఎంత ఎగ్గొట్టారన్నది మాత్రం చెప్పలేదు. వీరంత సంపద సృష్టికర్తలని ప్రభుత్వం భావించడం సిగ్గుచేటు. అయితే బిజెపి మాజీ ఎంపి ఒకరు యస్ బ్యాంకుకు రిలయెన్స్ ధీరుబాయి అంబాని గ్రూప్ రు. 12,800 కోట్లు, ఎస్సెల్ గ్రూప్ రు. 8,400 కోట్లు, డిహెచ్ఎఫ్ఎల్ గ్రూప్ రు. 4735 కోట్లు, ఐఎల్అండ్ఎఫ్ఎస్ రు. 2500 కోట్లు, జెట్ ఎయిర్ వేస్ రు. 1000 కోట్లు బకాయి ఉన్నట్లు తెలిపారు. మోడీ ప్రభుత్వం మొండి బాకీల రద్దు ద్వారా అస్మదీయ కార్పొరేట్ల కొమ్ముకాసింది.

### ఉద్దీపనలు సరే – డిమాండ్ మాటేది?

మనదేశ ఆర్థిక సంక్షోభ నివారణకు కేంద్ర ప్రభుత్వం గత సంవత్సరంలోనే కార్పొరేట్ పన్ను తగ్గింపు, రియల్ ఎస్టేట్, ఆటోమొబైల్స్, ఎగుమతి రంగాలకు ప్రోత్సాహకాలుగా పలు ఉద్దీపన ప్యాకేజీలు ప్రకటించింది. కానీ విచారకరమైన విషయం ఏమిటంటే ప్రభుత్వ ప్యాకేజీలన్నీ సరఫరా రంగాలకు ప్రకటించినవే. అయితే ప్రజలకు ఉపాధిలేక, సరైన ఆదాయాలు లేక డిమాండ్ పడిపోయిన ఆర్థిక రంగంపై అవి ఏమాత్రం ప్రభావం చూపవన్నది యదార్థం. నిజానికి ఆర్థిక వ్యవస్థను నిలబెట్టాలంటే ప్రజలకు ఉపాధి లభించి ఆదాయాలు పెరిగితే మార్కెట్‌లో వస్తువులను కొంటారు. వస్తువులు అమ్ముడుపోతే పరిశ్రమలు సరుకులు ఉత్పత్తి చేస్తాయి. కొనేవాడు లేనప్పుడు సరుకుల ఉత్పత్తి ఎవరు చేయరు. అందువలన అధికంగా వినియోగం చేయగలిగేలా ప్రజల కొనుగోలు శక్తిని పెంచడానికి ఏ ప్రభుత్వమైన ప్రాధాన్యత ఇవ్వాలి. జాతీయ గ్రామీణ ఉపాధి పథకం, విద్యా, వైద్యం, రవాణా, గ్రామీణ మౌలిక వసతుల కల్పన వంటి రంగాలలో అధికంగా మదుపు చేయడం ద్వారా మాత్రమే

ఆర్థిక వ్యవస్థను సంక్షోభం నుంచి కాపాడుకోగలుగుతాం.

ప్రభుత్వం రు. 1.7 లక్షల కోట్లతో ప్రభుత్వం రిలీఫ్ ప్యాకేజీ ప్రకటించింది. ఈ ప్యాకేజీ ఏ మేరకు అవసరమున్న వారికి చేరుతుందన్నది మిలియన్ డాలర్ల ప్రశ్న. మోడీ ప్రభుత్వం మే 13న 'స్వావలంబన, స్వయం సమృద్ధి' లక్ష్యంగా 20 లక్షల కోట్ల ప్యాకేజీని అట్టహాసంగా ప్రకటించింది. గతంలో బడ్జెట్‌లో పేర్కొన్నవి, రిజర్వ్ బ్యాంకు ప్రకటించిన ఉద్దీపనలు ఇందులో కలగలసి ఉన్నాయి. పూచికత్తు లేకుండా 12 నెలల మారిటోరియంతో రుణాలు ఇస్తున్నట్లు ఆర్థిక మంత్రి ప్రకటించారు. సూక్ష్మ, చిన్న, మధ్యతరహా సంస్థల (ఎంఎస్ఎంఇ) నిర్వచనం మార్చడం ద్వారా కార్పొరేట్ల దురాక్రమణకు వీలు కల్పించింది. ఈ ప్యాకేజీ దేశంలోని పేదలు, అసంఘటిత కార్మికులకు ఏమాత్రం ఉపయోగపడదు. కాబట్టి కార్మికుల కొనుగోలు శక్తి పెరుగదు. ఉత్పత్తిని పెంచినా ప్రజలకు కొనుగోలు శక్తి లేనప్పుడు ప్రయోజనం ఏముంటుంది. ఇదంతా ప్రజల్ని మరోసారి మోసగించేందుకు మోడీ ప్రభుత్వం చేస్తున్న ప్రయత్నమే. ఈ ప్యాకేజీ ఎంత అస్పష్టంగా ఉందో, సంస్కరణల పేరుతో కార్మికులపై, పేదలపై దాడి అంత స్పష్టంగా గోచరిస్తుంది. మొత్తం 20 లక్షల కోట్ల ప్యాకేజీలో 90 శాతం రుణ సదుపాయమే. నేరుగా దినసరి కూలీలకు, వలస కులీలకు, రైతుకు అందేది శూన్యమే.

**కరోనా నుంచి పాఠాలు నేర్వకపోతే ఉపద్రవమే**

అవసరాలలో ఉన్న ప్రజలను విస్మరిస్తే వినాశకర ప్రతికూల ప్రభావాలు చోటు చేసుకొని సామాజిక సంక్షోభం మరింత తీవ్రమవుతుంది. దేశంలో 94 శాతం కార్మికులు అసంఘటిత రంగంలో ఉన్నారు. రోజువారీ కూలీతో బతుకులీడ్చే వలస కూలీలు, కాంట్రాక్ట్ కార్మికులు, భవన నిర్మాణ కార్మికులు, ఇటుక, క్వారీలో పనిచేసే కార్మికులు, వ్యవసాయ కూలీలు.. ఇలా పలు రంగాల్లో పనిచేస్తున్న కోట్లాది మంది కార్మికులు లాక్‌డౌన్ వలన పనులు కోల్పోయి నగరాల నుంచి స్వస్థలాలకు తిరుగు వలసలు కట్టారు. ఇంతా జరుగుతున్నా మోడీ ప్రభుత్వం వారి సమస్యను అర్థం చేసుకోవడానికి కూడ ప్రయత్నించలేదు. భారతీయ పరిశ్రమల సమాఖ్య (సిఐఐ) వివరణాత్మకంగా ప్రభుత్వానికి కొన్ని సూచనలు చేసింది. వందమందిలోపు ఉద్యోగులున్న సంస్థల్లో పిఎఫ్ వాటాను కేంద్రమే చెల్లించాలని, ఇఎస్ఐ పరిధిలో ఉన్నవారికి కేంద్రమే వేతనం ఇవ్వాలని, జిఎస్‌టి రిజిస్ట్రేషన్ కలిగిన సంస్థల ఉద్యోగుల జీతాల్నీ ప్రభుత్వమే చెల్లించాలని సిఐఐ కోరింది. ఆవిరైపోయిన ఉపాధి అవకాశాల స్థానే కొత్తవాటి సృష్టి, జీవిక కోల్పోయిన వారికి కొన్నాళ్లపాటు ఆర్థిక తోడ్పాటు- ప్రభుత్వాల జంట లక్ష్యాలు కావాలని అది సూచించింది.

మన దేశ తయారీ రంగంలో 45 శాతం, ఎగుమతుల్లో 40 శాతం వాటా కలిగిన సూక్ష్మ చిన్న మధ్యతరహా పరిశ్రమ (ఎంఎస్ఎమ్ఇ)లెన్నో ఆపన్న హస్తం కోసం నిరీక్షిస్తున్నాయి. వాటిలో 70 శాతానికి పైగా మార్చి నెల జీతాలు ఇవ్వలేకపోయాయి. నిరుద్యోగ రక్కసి రెచ్చిపోకుండా ఉద్యోగుల్ని, పరిశ్రమల్ని ఆదుకునేలా ప్రభుత్వ ఉదార సంక్షేమ చర్యలు.... సూక్ష్మ చిన్న, మధ్యతరహా సంస్థలతోనే మొదలు కావాలి! దేశ ఆర్థిక వ్యవస్థకు ఊపు రావాలంటే ప్రభుత్వ వ్యయం పెరగాలి. ఇందుకు కావాల్సిన అదనపు ఆదాయం శ్రామిక వర్గం నుంచి గాక సంపన్నుల నుంచి రాబట్టాలి. పేదలు వారి ఆదాయాన్నంతా ఖర్చు చేస్తారు. అదే సంపన్నులైతే కొంత మాత్రం ఖర్చు చేసి తక్కినది దాస్తారు. ఇలా దాచకుండా దానిని ఖర్చులోకి తేవాలంటే వారి మీద పన్నులు వేయాల్సిందే. కానీ సంపన్నులపై పన్ను పెంచడం అంటే అంతర్జాతీయ ద్రవ్య పెట్టుబడికి, దేశీయ సంపన్న వర్గాలకీ అంగీకారం కాదు. సంపన్నులపై పన్ను వేస్తే వారి సంపదేమీ తరగదు. దానిపై వచ్చే లాభంలో కొంత భాగం మాత్రమే పన్నుగా ప్రభుత్వానికి చేరుతుంది. దానివలన ఆర్థిక వ్యవస్థకి అదనపు వనరులు చేకూరి ఆర్థిక పురోగతి ఊపందుకుంటుంది. కార్పొరేట్లు, ధనాధిపతుల నుంచి వారు చెల్లించి తీరవలసిన స్థాయిలో పన్నులు వసూలు చేసి ప్రజల సేవలు, మౌలిక సదుపాయాలకు కేటాయింపులు భారీగా పెంచాలి.

**ప్రజా ప్రత్యామ్నాయం**

ఫైనాన్షియల్ టైమ్స్ పత్రిక మే 8 నాటి సంపాదకీయంలో ప్రపంచీకరణ ఆర్థిక విధానాలకు కాలం చెల్లిందని, ఇంకెంత మాత్రం మనగలుగదని, ఈనాటి ఆర్థిక రాజకీయ పరిస్థితి 1930ల నాటి పరిస్థితిని పోలి ఉందని పేర్కొనడం గమనార్హం. ఉదార పెట్టుబడిదారీ విధానం, ఉదార ప్రజాతంత్ర స్వభావంతో తన మనుగడ కొనసాగించాలంటే ప్రపంచీకరణ విధానాలను తిరగరాసే విప్లవాత్మక విధానాలు అమలులోకి రావాలని పేర్కొంది. ఫైనాన్షియల్ ట్రైమ్స్ పత్రిక పేర్కొన్నట్లు గత మూడు దశాబ్దాలుగా అమలవుతున్న సామ్రాజ్యవాద ప్రపంచీకరణ ఆర్థిక విధానాలను పూర్తిగా విరమించుకోవాలి. ప్రభుత్వం ఆర్థిక వ్యవస్థలో మరింత ప్రభావశీలంగా జోక్యం చేసుకోవాలి. ప్రజా సర్వీసులను భారంగా భావించకుండా భవిష్యత్తు పెట్టుబడిగా పరిగణించాలి. కార్మికుల అభద్రత పోగొట్టాలి. సంపద పునఃపంపిణీ చేయాలి. కనీస వేతనాన్ని గ్యారంటీ చేయాలి. ఉపాధి కల్పన పెద్ద ఎత్తున చేపట్టి తద్వారా డిమాండ్‌ను పెంచుకోవడమనే విధానాన్ని ప్రభుత్వం అనుసరించాలి.

నేడు దేశం ఎదుర్కొంటున్న ఆర్థిక సంక్షోభానికి తోడుగా కరోనా మహమ్మారి వ్యాధి ప్రభావం వల్ల కుంచించుకుపోతున్న ఆర్థిక వ్యవస్థ పునరుజ్జీవం పొందాలంటే ప్రభుత్వం వెంటనే దిగుమతి ప్రత్యామ్నాయ ఉత్పత్తి విధానం అమలు చేయాలి. భూ సంస్కరణలు తక్షణమే చేపట్టాలి. రైతుల రుణాలు పూర్తిగా మాఫీ చేయాలి. విద్యా, వైద్యం, రవాణా, టెలికమ్యూనికేషన్, బ్యాంకింగ్ వంటి రంగాలను ప్రభుత్వమే నిర్వహించాలి. సంపన్నుల సంపదపై పన్నులు పెంచాలి. సూక్ష్మ, చిన్న మధ్యతరహా పరిశ్రమలను ప్రోత్సాహించాలి, దిగుమతులపై సుంకాలు పెంచాలి, ప్రపంచ వాణిజ్య సంస్థ నుండి వైదొలగాలి. అధునాతన సాంకేతిక పరిజ్ఞానాన్ని పెంచుకోవడానికి వైజ్ఞానిక, పారిశ్రామిక పరిశోధన మండలి (సిఎస్ఐఆర్), భారత వ్యవసాయ పరిశోధనా మండలి (ఐసిఎఆర్), భారత వైద్య పరిశోధనా మండలి (ఐసిఎంఆర్) లను ప్రభుత్వం ప్రోత్సాహించాలి. ప్రపంచ మార్కెట్‌లో మన ఎగుమతిదారులు పోటీని తట్టుకోవడానికి రాయితీలు ఇవ్వాలి. శాస్త్ర, సాంకేతిక పరిశోధనలకు అగ్రస్థానం కల్పించాలి.

**ముగింపు**

ప్రస్తుత ఆర్థిక సంక్షోభం నుంచి గట్టెక్కాలంటే విధానపరమైన మౌలిక మార్పులు అనివార్యం. మనదేశం 1990 దశకం నుండి ప్రపంచ ఆర్థిక వ్యవస్థలో పరిపూర్ణ భాగస్వామి కావాలనే ఆరాటంలో మన పాలకులు గత మూడు దశాబ్దాలుగా అనుసరించిన ప్రజా వ్యతిరేక విధానాలను ఇకనైనా త్యజించాల్సిన అవసరం ఉంది. కరోనా కల్లోలం మనకు ఒక మంచి అవకాశాన్ని కల్పించింది. కరోనా తేటతెల్లం చేసిన ప్రజారోగ్యం డొల్లతనాన్ని పరిగణలోకి తీసుకుని జాతీయ ప్రయోజనాల కొరకు అంటే

# క్రూడ్‌ధర పతనమైనా సుంకాల మోత

***ప్రపంచ వ్యాప్తంగా చమురు ధరలు తగ్గినా ఆ తగ్గుదలను వినియోగదారులకు అందించకుండా సుంకాల పేరుతో ప్రభుత్వం, కార్పొరేట్ సంస్థలు ఆర్జిస్తున్నాయని అంటున్నారు వెంకట్***

ప్రపంచాన్ని కరోనా వైరస్ వణికిస్తుంటే మరోవంక చాపకింది నీరులా చమురు రాజకీయాలు విస్తరిస్తున్నాయి. కరోనా మహమ్మారి వ్యాధితో ప్రపంచ ఆర్థిక వ్యవస్థ అతలకుతలమవుతోంది. అంతర్జాతీయ మార్కెట్‌లో ముడిచమురు ధర మార్చి 9న 30 ఏళ్ల కనిష్టానికి పడిపోవడంతో ప్రపంచం నివ్వెరపోయింది. 2014 డిసెంబర్‌లో బ్యారెల్ ధర 100 డాలర్లు వరకు వెళ్లింది. చమురు ధరల చరిత్రలో ఇదే గరిష్టం. జనవరిలో పీపాకు 70 డాలర్లు పలికింది. ఫిబ్రవరి చివరిదాక బ్యారెల్‌కు 60 డాలర్లు పలికింది. మార్చి మొదటి వారంలో ఆకస్మాత్తుగా ముడిచమురు ధర పీపాకు 20 డాలర్లకు పడిపోయింది. ముడిచమురు ధరలు ఒక్కసారిగా పతనం కావడంతో స్టాక్ మార్కెట్లన్నీ కకావికలయ్యాయి. ఒక్క మన దేశంలోనే 7 లక్షల కోట్ల రూపాయల మదుపరుల సంపద స్టాక్ మార్కెట్ నుంచి ఆవిరైంది. ముడిచమురు ధర అంతకంతకు పడిపోవడానికి కారణాలు చాలానే ఉన్నాయి. సహజంగా ఏ వస్తువు ధరైనా గిరాకి–సరఫరా (డిమాండ్–సప్లై) ఆధారంగానే నిర్ధేశిత మవుతుంది. ఒక్కసారిగా డిమాండ్ ఆవిరై సరఫరా అదే స్థాయిలో కొనసాగితే ధర కుప్పకూలక తప్పదు. ముడి చమురు (క్రూడ్) విషయంలోనూ అదే జరిగింది.

కరోనా వైరస్ వ్యాప్తిని అరికట్టేందుకు చాలా దేశాలు లాక్‌డౌన్‌లను ప్రకటించడంతో ఆర్థిక వ్యవస్థలు స్తంభించి పోయాయి. ప్రపంచ ఆర్థిక వ్యవస్థ మాంద్యం కోరల్లోకి వెళ్లింది. మరోవైపు అమెరికా–చైనా వాణిజ్య యుద్ధం, సౌది– రష్యాల మధ్య ముడిచమురు ధరపై పోరుతో పాటు అమెరికా మార్కెట్లో చమురు ధర క్షీణతతో అంతర్జాతీయ చమురు మార్కెట్లు కుదేలయ్యాయి. ప్రపంచంలో అత్యధికంగా చమురు వినియోగించే చైనా, భారత్‌లలో కరోనా విజృంభణ కారణంగా వినియోగం పడిపోవడంతో ఈ ప్రభావం సహజంగానే ముడిచమురు ధరలపై పడింది. మరోవైపు నిల్వచేసే కేంద్రాల్లో ముడిచమురు నిల్వలు నిండుకుండల్లా పేరుకు పోయాయి. ఇప్పటికే బుక్ చేసిన చమురును డెలివరి చేసుకొనే స్థితిలో ట్రేడర్స్ లేరు. అందువల్లనే ఆసియా నుంచి అమెరికా వరకు మార్చి 9న బెంచ్ మార్క్ ఇండెక్స్‌లు భారీ నష్టాలతో ముగిశాయి. ముడిచమురు ధర అంతర్జాతీయ మార్కెట్లో 30 శాతం కుప్పకూలింది.

ఫ్యూచర్స్ మార్కెట్లో తలెత్తే సాంకేతిక అంశాలు కూడా క్రూడ్ ధరల పథనానికి ఆజ్యం పోశాయి. వాస్తవానికి క్రూడ్ కొనుగోలుదారులు (ప్రధానంగా రిఫైనరీలు, విమానయాన సంస్థలు, ట్రేడర్లు) భవిష్యత్తులో రేట్లు పెరుగుతాయన్న అంచనాతో తాజా కనిష్ట ధరల వద్ద క్రూడ్‌ను నిల్వ చేసుకుంటూ వస్తున్నారు. దీంతో నిల్వ సామర్థ్యం గరిష్ట స్థాయికి చేరుకుంది. తగినంత స్టోరేజీ లేకపోవడంతో లక్షలాది బ్యారెళ్ల క్రూడ్‌ను డెలివరీ తీసుకోవడం అసాధ్యమైంది. దీంతో అయినకాడికి అమ్ముకోవడంతో క్రూడ్ ధర ఒక్కసారిగా క్రాష్ అయింది. అయితే, కొనుగోలుదారులు ఎవరూ ముందుకురాకపోవడంతో ఎదురు

---

స్వావలంబన, స్వయం పోషకం కొరకు ప్రభుత్వ విధి విధానాలను రూపొందించుకోవాల్సి ఉంది. మొత్తంగా సామ్రాజ్యవాద ప్రపంచీకరణ ద్రవ్య పెట్టుబడి అనుకూల విధానాలను విడిచిపెట్టి జాతీయ విధానాలు రూపొందించుకొని అమలు చేయాల్సిన అనివార్యత మనముందు ఉంది.

దేశ ఆర్థిక వ్యవస్థను నిర్వహించడంలో ప్రభుత్వానికి స్థూల ఆర్థిక దృష్టి కొరవడిందని ప్రభుత్వ ప్రజా వ్యతిరేక కార్పొరేట్ అనుకూల విధానాల ద్వారా స్పష్టంగా తెలుస్తోంది. ఈ విధాన లోపం వల్ల ఆర్థిక వ్యవస్థను అతలాకుతలం చేస్తున్న మాంద్యం తీవ్రత సంక్షోభంలోకి జారుకునే ప్రమాదం అంచున ఉంది. ఆర్థిక సంక్షోభం విస్తరిస్తున్న నేపథ్యంలో ప్రజల్లో కొనుగోలు శక్తి పెంచేలా అనువైన ప్రణాళికలను రూపొందించుకుంటే తప్ప మన దేశ ఆర్థిక వ్యవస్థ సంక్షోభం నుంచి బయట పడదు. ఆర్థిక వ్యవస్థ మొత్తంగా కుంచించుకు పోతున్నా కార్పొరేట్ కంపెనీలు లాభాలను ఆర్జిస్తున్నాయి. వ్యవసాయం సంక్షోభంలో కూరుకుపోతోంది. ఆర్థిక వ్యవస్థ సంకోచం నిరుద్యోగాన్ని, పేదరికాన్ని, సామాజిక, ఆర్థిక అంతరాలను పెంచుతుండగా కార్పొరేట్ సంస్థల లాభాలు పెరిగి ప్రపంచ కుబేరులవుతున్నారు.

ప్రభుత్వం స్వదేశీ, విదేశీ కార్పొరేట్ల ప్రయోజనాలను బట్టి కాక ప్రజల అవసరాలను, ఆకాంక్షలను దృష్టిలో ఉంచుకొని వ్యూహాలు, ప్రణాళికలు రూపొందించి అమలు చేస్తేనే సంక్షోభం నుంచి బయటపడతాం. లేకుంటే ఆర్థిక సంక్షోభం సామాజిక సంక్షోభంగా మారే ప్రమాదం ఉంటుంది. పెట్టుబడిదారీ అనుకూల ప్రభుత్వం అంత సులభంగా ప్రజానుకూల విధానాలను పెట్టుబడిదారులకు వ్యతిరేకంగా రూపొందిస్తుందని భావించలేం. మోడీ ప్రభుత్వం అందుకు అనుకూలంగా ఉంటుందనుకోవడం అత్యాశే అవుతుంది.

అందువల్ల పెట్టుబడిదారీ విధానాన్ని సంక్షేమ రాజ్య దిశగా మళ్లించాలన్నా అందుకు కార్మిక–కర్షకులు ఐక్యంగా పోరాటం చేయక తప్పదు. నిత్యజీవన పోరాటమే ప్రజాపోరాటాన్ని నిర్ణయిస్తుంది. ఆ పోరాటం జరిగే తీరును బట్టి 'సంక్షేమ రాజ్య పునరుద్ధరణ' దగ్గరే ఆగిపోతుందా లేక పెట్టుబడిదారీ వ్యవస్థనే కూలదోసి సోషలిస్టు ప్రత్యామ్నాయం వైపు సాగిపోతుందా అనేది ఉద్యమ స్వీయాత్మక శక్తులపై ఆధారపడి ఉంటుంది.

*(రచయిత ఉపాధ్యాయ ఉద్యమ నాయకుడు, రాజనీతి శాస్త్ర విద్యార్థి)* వీ

డబ్బులిచ్చిమరీ ఉత్పత్తిదారులు తమ పొజిషన్లను వదిలించుకున్నారు. దీనివల్లే రేటు మైనస్‌లోకి జారిపోయింది. అంటే మార్చి 9 లోగా కాంట్రాక్టును కొన్నవారు డబ్బులేవీ చెల్లించకపోగా వాళ్లకే ఒక్కో బ్యారెల్‌కు ఎదురు 37-40 డాలర్లు లభించాయన్నమాట! ఈ క్రూడ్ క్రాష్‌లో ట్రేడర్లు (ప్రధానంగా కొన్ని బ్యాంకులు, ఇన్వెస్ట్‌మెంట్ సంస్థలు) కోట్లాది డాలర్ల నష్టాలను చవిచూశాయి.

కరోనా వైరస్ ప్రపంచాన్ని చుట్టేయడంతో రవాణాతో పాటు పారిశ్రామిక ఉత్పత్తి రంగమూ స్తంభించిపోయింది. అత్యధిక దేశాలు లాక్‌డౌన్‌లో ఉండటంతో చమురు వినియోగం గణనీయంగా పడిపోయింది. సౌదీ, రష్యాలు పోటాపోటీగా ధరలు తగ్గించడమూ చమురు విపణిని దెబ్బతీసింది. పీపా చమురు ధర 50 డాలర్లకన్నా తక్కువకు పడిపోతే అమెరికా షేల్ చమురు కంపెనీలకు గిట్టుబాటు కాదు. కాబట్టి ఉత్పత్తిని పెంచి ధరలను పడగొడితే అమెరికన్ షేల్ ఉత్పత్తి దారుణంగా దెబ్బతిని, మళ్ళీ తనదే రాజ్యం అవుతుందని రష్యా అంచనా. అందుకు తగ్గట్లే పలు అమెరికన్ షేల్ కంపెనీలు దివాలా అంచున వేలాడుతున్నాయి. చమురు ధరలు అట్టడుగుకు పడిపోతే అవి మార్కెట్ నుంచి అదృశ్యమైతే, తమకు ఎదురే లేకుండా పోతుందని రష్యా భావనా. తమకు ప్రధాన ప్రత్యర్థిగా మారిన అమెరికాను అదుపు చేయడమెలా అన్న అంశంలో ఇప్పుడు సౌది, రష్యాలు వాదులాడుకుంటున్నాయి.

2014 వరకు అమెరికా రష్యా, సౌది నుంచి చమురు దిగుమతి చేసుకునేది. ఇప్పుడు చమురు ఉత్పత్తిలో అగ్రస్థానంలో ఉంది. 2014లో రోజుకు 4 లక్షల పీపాల చమురు ఉత్పత్తితో ప్రారంభించిన అమెరికా 2018 నాటికి 40 లక్షల పీపాల చమురును ఉత్పత్తి చేసే దిగ్గజంగా మారింది. ఒపెక్ చమురుపై ఆధారపడాల్సిన అగత్యం నుంచి బయటపడింది. ప్రపంచ చమురు సరఫరాపై ఒపెక్ గుత్తాధిపత్యాన్ని దెబ్బతీసింది. షేల్ చమురును అధికంగా ఉత్పత్తి చేయడం ద్వారా అమెరికా అంతర్జాతీయ చమురు ధరలను శాసిస్తోంది. దశాబ్దకాలంగా అమెరికా, రష్యాలు అంతర్జాతీయ వేదికపై చమురు ధరలను ప్రభావితం చేయగల స్థాయిలో ఉన్నాయి. అమెరికా నుంచి గిరాకీ తగ్గడంతో సహజంగానే అంతర్జాతీయ విపణిలో చమురు ధరలు దిగివచ్చాయి. ఉత్పత్తిని తగ్గించి చమురు ధరలను మళ్లీ పెంచి తమ మార్కెట్‌ను నిలబెట్టుకోవాలని ఒపెక్ ప్లస్ ప్రయత్నిస్తున్న తరుణంలో కరోనా సంక్షోభం వచ్చిపడింది. సౌదీ-రష్యా మధ్య విబేధాలు తీవ్రమయ్యాయి.

మామూలుగా అయితే ఇంటర్నేషనల్ మార్కెట్లో చమురు ధరలు పెరగడమే తప్ప తగ్గే సందర్భాలు తక్కువ! ఎందుకంటే పెట్రో ప్రొడక్టులకు డిమాండ్ అలా ఉంటుంది మరి! చమురును తయారు చేసే దేశాల మధ్య విబేధాలు ఏర్పడడంతో పరిస్థితి మారింది. ఆర్గనైజేషన్ ఆఫ్ పెట్రోలియం ఎక్స్‌పోర్టింగ్ కంట్రీస్ (ఒపెక్), రష్యా దేశాల మధ్య తేడాలు రావడంతో ధరలు రికార్డు స్థాయిలో దిగివస్తున్నాయి. కరోనా వైరస్, ఎకానమీ స్లోడౌన్ కారణంగా పెట్రో ప్రొడక్టులకు డిమాండ్ పడిపోయింది. దీంతో సహజంగానే ధరలూ పడిపోయాయి. పులిమీద పుట్రలాకరోనా వైరస్ కారణంగా ముడిచమురుకు డిమాండ్ తగ్గి... మార్కెట్లో క్రూడ్ నిల్వలు పెరిగిపోయాయి. ఇలాగైతే లాభం లేదని సౌదీ అరేబియా సారథ్యంలో పెట్రోలియం ఎగుమతి దేశాల కూటమి (ఒపెక్)... చమురు ఉత్పత్తిని మరింతగా తగ్గించాలని మార్చి 5న జరిగిన సమావేశాల్లో ప్రతిపాదించింది. ముడి చమురు ఉత్పత్తి తగ్గించుకునే విషయంలో ఒపెక్ కూటమి, రష్యా మధ్య డీల్ కుదరకపోవడంతో సౌదీ అరేబియా ధరల పోరుకు తెర తీసింది. భారీగా రేట్లు తగ్గించేసింది. ఒక దశలో ప్రామాణిక బ్రెంట్ క్రూడ్ ధర బ్యారెల్‌కు 19 డాలర్ల స్థాయికి పడిపోయింది.

తాము ఉత్పత్తి తగ్గించిన పక్షంలో అమెరికా చమురు ఉత్పత్తి సంస్థలు మార్కెట్లో దూసుకుపోయే రిస్కులు ఉన్నాయనే ఉద్దేశంతో సౌదీ ప్రతిపాదనను రష్యా విభేదించింది. ఉత్పత్తి తగ్గింపు ప్రతిపాదనను పక్కనపెట్టి రష్యా గరిష్టంగా ఉత్పత్తి చేసింది. చమురు ఉత్పత్తిలో సౌదీ, రష్యా... రెండు, మూడో స్థానాల్లో ఉన్నాయి. తాజా పరిణామంతో తన మార్కెట్ వాటాను కాపాడుకునే దిశగా... అదే సమయంలో రష్యాపై ఒత్తిడిని పెంచే దిశగా సౌదీ అరేబియా పావులు కదిపింది. చమురు ఉత్పత్తిలో అగ్రస్థానంలో ఉన్న సౌదీ అరేబియా... క్రూడాయిల్ రేట్లను తగ్గించడంతో పాటు ఉత్పత్తినీ పెంచనున్నట్లు ప్రకటించింది. ఏప్రిల్‌లో కాంట్రాక్టుకు సంబంధించిన రేట్లను బ్యారెల్‌కు 6 నుంచి 8 డాలర్ల దాకా తగ్గించేసింది. ఇది మార్కెట్లో కలకలం రేపడంతో క్రూడాయిల్ రేట్లు భారీగా పతనమయ్యాయి. రష్యాను చర్చలకు ఒప్పించే ప్రయత్నాల్లో భాగంగానే సౌదీ అరేబియా ఈ వ్యూహాలు అమలు చేసింది.

చమురు సంపన్న దేశాలు వ్యూహాత్మకంగా చమురు ఉత్పత్తులను తగ్గిస్తూ, పెంచుతూ అవసరానుగుణంగా ఎగుమతులను నియంత్రిస్తూ ధరల సరళిని ఇన్నేళ్లూ ఇష్టారీతిన శాసించాయి. తమకున్న చమురు వనరును ఉపయోగించుకుని చమురు ఉత్పత్తి దేశాలు ప్రపంచ ఆర్థిక వ్యవస్థను, భౌగోళిక రాజకీయాలను ప్రభావితం చేశాయి. 1970ల లోనే ప్రపంచ చమురు ధరల నియంత్రణకు 15 దేశాలు (చమురు ఉత్పత్తి దేశాల సంస్థ) ఒపెక్‌ను ఏర్పాటు చేసుకున్నారు. ఈ కూటమిలో రష్యా భాగస్వామి కాకున్న ఒపెక్ సమావేశాలకు హాజరవుతోంది. ఇవాళ అంతర్జాతీయ వేదిక పైనా చమురు ధరలను ప్రభావితం చేయగల స్థాయికి అమెరికా-రష్యాలు చేరాయి. భౌగోళిక రాజకీయ ఆధిపత్యాలు కూడ చమురు ధరలను ప్రభావితం చేస్తున్నాయి. చమురు ధర పీపాకు 40 డాలర్లకు పతనమైతే అందరికి చేటు కలిగిస్తుందని ఒపెక్ దేశాలు ఆందోళన చెందుతున్నాయి. ఒకవేళ రేట్లు గానీ భారీగా పతనమైతే... చమురు ఆదాయాలపై ఆధారపడిన దేశాలు దెబ్బతినడంతో పాటు క్రూడాయిల్ అన్వేషణ ప్రాజెక్టులపైనా ప్రతికూల ప్రభావం పడుతుంది.

2015లో ముడిచమురు ధరలు పీపాకు 37 డాలర్లకు చేరినప్పుడు రష్యా దారుణంగా దెబ్బతింది. ఆ దేశ ఆర్థిక వ్యవస్థ పతనమైంది. ఈ ఘటనతో రష్యా చమురుతో సంబంధం లేకుండా ద్రవ్య వ్యవస్థను పటిష్ట పరుచుకుంది. బంగారం నిల్వలను భారీగా పెంచుకుంది. 2015 ఉక్రెయిన్ వివాదం కారణంగా పశ్చిమ దేశాలు రష్యాపై ఆంక్షలు విధించాయి. అంతర్జాతీయ ఆంక్షల వల్ల తలెత్తే ఉత్పాతాలను గమనంలోకి తీసుకున్న రష్యా ఎంతటి ఒడిదొడుకుల నైనా తట్టుకొనే యుద్ధ సన్నద్ధతతో తన ఆర్థిక వ్యవస్థలను బలోపేతం చేసుకుంది. దుర్భేద్య ఆర్థిక వ్యవస్థను నిర్మించుకున్న రష్యాను చమురు ధరల పతనం పెద్దగా ప్రభావితం చేయలేదు. కానీ పూర్తిగా చమురుపైననే ఆధారపడిన అరబ్ దేశాలను, ఒపెక్ లోని సభ్య దేశాలను మాత్రం తీవ్రంగా ప్రభావితం చేస్తోంది. చమురు ఉత్పత్తి దేశాల ఆర్థిక వ్యవస్థలు సజావుగా సాగాలంటే ముడిచమురు పీపా 70 డాలర్లకు విక్రయించాల్సిందే. లేకుంటే వాటి జిడిపి పడిపోయి ఆర్థికంగా కష్టనష్టాల పాలవుతాయి.

సిరియాలో అసద్ ప్రభుత్వానికి రష్యా సహకరించి, సైనిక మద్దతు అందించి పశ్చిమాసియాలో తనదైన శైలిలో రాజకీయంగా పావులు

కదిపింది. సిరియాలో రష్యా జోక్యాన్ని సౌది తీవ్రంగా వ్యతిరేకిస్తోంది. సౌదికి అమెరికా మద్దతు ఉన్నందున ఎట్లాగైనా సౌదికి గుణపాఠం చెప్పాలన్నది రష్యా అభిమతం. సౌది-రష్యాల మధ్య నెలకొన్న తగువు అమెరికాకు అంటుకున్నది. ప్రపంచంలో అతిపెద్ద చమురు ఉత్పత్తి చేసే దేశంగా ఎదిగిన అమెరికాపైనా ఈ ప్రభావం పడింది. పర్యావసానం అది చమురు ఉత్పత్తిని తగ్గించడంతో పాటు ధరలను తగ్గించుకోవల్సి వచ్చింది. పర్యావసానంగా ఆ దేశ చమురు ఉత్పత్తి చేసే కంపెనీలు సంక్షోభంలో చిక్కుకున్నాయి. అమెరికా, రష్యా ఆధిపత్య పోరులో గల్ఫ్ దేశాలు నలిగిపోతున్నాయి. మే నుంచి చమురు ధరలు మళ్లీ పీపాకు 40 డాలర్లకు చేరుకుంది.

### క్రూడ్ ధరలు తగ్గినా దేశంలో పెట్రోల్ మంటలు

ముడిచమురు ధర పీపా 100 డాలర్లు ఉన్నప్పుడు మోడీ అధికారంలోకి వచ్చాడు. 2016 నాటికి పీపా ధర 30 డాలర్లకు పడిపోయినా మన దేశంలో డిజిల్, పెట్రోల్ ధరలను తగ్గించకుండా సుంకాలు, ఎక్సైజు డ్యూటీలతో మోడీ ప్రభుత్వం ప్రజలపై భారం మోపింది. ఈ విధంగా ఏటా రెండున్నర లక్షల కోట్ల రూపాయలు ఖజానాలో వేసుకుంటోంది. పెట్రోల్, డిజిల్‌లను జిఎస్‌టిలో చేర్చలేదు. అయితే మనం గమనించవల్సిన విషయమేమంటే డిజిల్, పెట్రోల్ ధరలు అంతర్జాతీయ మార్కెట్ల కంటే మనదేశంలో ఎక్కువగా ఉండటంతో వ్యవసాయ, పారిశ్రామిక ఉత్పత్తుల ధరలు పెరిగి అంతర్జాతీయ మార్కెట్లో విదేశీ వస్తువుల ధరలతో అవి పోటీపడలేక ఎగుమతి ఆధారిత పరిశ్రమలు మూతపడుతున్నాయి. చమురు దిగుమతి పైనే ప్రధానంగా ఆధారపడే మనలాంటి దేశాలకు తాజాగా పతనమైన చమురు ధరల వల్ల ప్రయోజనమే ఉంటుంది. మనదేశ దిగుమతుల్లో చమురు వాటా 82 శాతం. గత సంవత్సరం దాదాపు 11,500 కోట్ల డాలర్లు (రు. 8.5 లక్షల కోట్లు) చమురు బిల్లు చెల్లించాం. చమురు ధర పతనమైతే ఈ బిల్లు తగ్గుతుంది. విదేశీ మారక ద్రవ్య నిల్వలు అదా అయ్యి కరెంట్ ఖాతా లోటు తగ్గుతోంది. దీనివల్ల మన దేశానికి కొంతలో కొంత ఉపశమనం లభిస్తుంది. ధర తక్కువగా ఉన్నప్పుడు కొనుగోలు చేసి నిల్వ చేసుకునే సామర్థ్యం భారత్‌కు లేదు.

చమురు ధరలు పాతాళానికి పడిపోతున్నా ఆ అవకాశాన్ని మనదేశం అందిపుచ్చుకోలేకపోతుంది. ప్రపంచంలో మూడో అతిపెద్ద చమురు దిగుమతి దేశం. అత్యధికంగా చమురు వినియోగించే దేశాల్లో భారత్ ఒకటి. పాలకుల్లో కొరబడిన ముందుచూపు, అతి తక్కువ నిల్వ సామర్థ్యం కారణంగా ఈ అరుదైన అవకాశాన్ని భారత్ చేజార్చుకుంటోంది. అత్యవసర పరిస్థితులు తలెత్తితే తట్టుకునేలా ప్రతీ దేశానికి మూడునెలల వినియోగానికి సరిపడా వ్యూహాత్మక ఇంధన నిల్వలు ఉండాలని అంతర్జాతీయ ఇంధన సంస్థ (ఐఇఏ) సూచిస్తోంది. కానీ మనదేశంలో కేవలం తొమ్మిది రోజులకు సరిపోయే నిల్వ సామర్థ్యం మాత్రమే ఉంది. ఆంధ్రప్రదేశ్‌లోని విశాఖ, కర్ణాటకలోని మంగళూరు, పదూర్‌లలో వ్యూహాత్మక ఇంధన నిల్వ కేంద్రాలున్నాయి. వీటి సామర్థ్యం 3.90 కోట్ల బ్యారెళ్లు. అత్యధికంగా చమురు వినియోగించే అమెరికాకు 73 కోట్ల బ్యారెళ్లు, చైనాకు 55 కోట్ల బ్యారెళ్లు. జపాన్‌కు 52.80 కోట్ల బ్యారెళ్ల నిల్వ సామర్థ్యం ఉంది. మనకన్నా చిన్న దేశమైన దక్షిణకొరియా సైతం అత్యవసరాల కోసం 21.40 కోట్ల బ్యారెళ్లు నిల్వ చేసుకుంటోంది.

ప్రపంచ మార్కెట్‌లో ముడిచమురు ధరలు గత మూడు సంవత్సరాలుగా తక్కువగానే ఉంటున్నాయి. భారత్ ఏటా 140 కోట్లు పీపాల చమురు దిగుమతి చేసుకుంటుంది. పీపా ధర 50-60 డాలర్లకు చేరువలో ఉన్నా తగ్గిన చమురు ధరల ప్రయోజనాన్ని ప్రజలకు అందకుండా కేంద్ర-రాష్ట్ర ప్రభుత్వాలు పన్నులతో వినియోగదారులను కుమ్మేస్తున్నాయి. డిజిల్ బేస్‌ధర లీటర్‌కు రు. 18.49, పెట్రోల్ బేసు ధర లీటర్‌కు రు. 17.96. రవాణా చార్జీలు, డీలర్ కమీషన్ కలిపితే పెట్రోలియం అసలు ధర లీటర్‌కు రు.27.96 మాత్రమే. అలాగే డిజిల్ లీటర్ అసలు ధర రు.31.49 మాత్రమే. అయితే కొనుగోలుదారు పెట్రోల్ బంకుల్లో రు.70 పైగా కట్టాల్సి వస్తోంది. అంటే లీటర్‌కు కేంద్ర-రాష్ట్ర ప్రభుత్వాలు కలిసి రు.40 వరకు పన్నులు విధిస్తున్నారు. తగ్గిన ధరల ప్రయోజనాల్ని వినియోగదారునికి బదిలీ చేయనందున లాభాల రూపంలో కంపెనీలకు, పన్నుల రూపంలో కేంద్ర-రాష్ట్ర ప్రభుత్వాల ఖజానాకు చేరుతోంది. ఇప్పటికే అత్యధిక పన్ను వసూలు చేస్తోన్న ప్రభుత్వం మార్చ్‌లో రు.10 పెట్రోల్ పైనా, రూ 13 డిజిల్ పైన ట్యాక్స్ పెంచి రు. 45 వేలు ఖజానాకు అదనంగా సమకూర్చుకుంది.

మోడీ ప్రభుత్వం ప్రజా ప్రయోజనాలను గాలికొదిలేసి, ఆశ్రిత పెట్టుబడిదార్ల ప్రయోజనాల పరిరక్షణే పరమావధిగా ప్రజావ్యతిరేకంగా నియంతృత్వ పాలన సాగిస్తోంది. వినియోగదారులపై భారం మోపుతూ మార్చి 14న మోడీ ప్రభుత్వం పెట్రోల్, డిజిల్ ధరలు పెంచడానికి నిర్ణయించుకోవడం విషాధకరమైంది. 2017 నుండి 'డైనమిక్ ప్రైసింగ్' పేరుతో అంతర్జాతీయ చమురు మార్కెట్‌లో క్రూడ్ ధరల కనుగుణంగా పెట్రోల్, డిజిల్ ధరలను ప్రతిరోజు సవరించే విధానాన్ని అమలులోకి తెచ్చింది.

ఆరు సంవత్సరాల్లో పదకొండుసార్లు పెట్రోల్, డిజిల్ ధరలు పెరిగాయి. ధరలు పెరిగినప్పుడల్లా వాటి ప్రభావం ప్రజలపై పడింది. ప్రపంచ దేశాలన్నింటిలో వినియోగదారులందరూ తగ్గిన చమురు ధరల ప్రయోజనాన్ని పొందుతుండగా, అందుకు విరుద్ధంగా మోడీ ప్రభుత్వం వ్యవహరించడం శోచనీయం. ఏదేమైనా పడిపోయిన చమురు ధరల వల్ల కలిగే ప్రయోజనాన్ని లబ్ధిదారులకు బదిలీ చేయడం అవసరం.

ప్రభుత్వ నిర్వాహణకు కావల్సిన ధనాన్ని ఉత్పాదక, సంపద సృష్టి ద్వారా సమీకరించుకోవాలి. ప్రజల నడ్డివిరిచి కార్పొరేట్ల బొక్కసాలు నిపంపడమే మోడీ ప్రభుత్వ వైఖరిగా ఉంది. సామ్రాజ్యవాద ప్రపంచీకరణ ఆర్థిక విధానాల అమలు వల్లనే ఇదంతా జరుగుతుందన్నది నిర్వివాదాంశం. అధికార మార్పిడి జరిగి ఏడు దశాబ్దాలు గడిచిపోయినా ప్రజల జీవన విధానాల్లో వీసమెత్తు మార్పు కనిపించకపోవడం అత్యంత శోచనీయం. ప్రజలను దోచుకోవడానికి మోడీ ప్రభుత్వానికి పెట్రోల్, డిజిల్ ఒక సాధనంగా మారిందన్నది వాస్తవం. ప్రభుత్వ ఖజానాను నింపుకోవడానికి చమురును 'పాడి పశువు'గా పరిగణించడమే అసలు కారణం. ప్రభుత్వ ఆదాయానికి ప్రత్యామ్నాయ మార్గాలు ఎన్నో ఉన్నాయి. సంపన్నుల జోలికి వెళ్లకుండా ప్రజలపై భారాలు మోపడం మోడీ దోపిడీ విధానాలకు పరాకాష్ట.

### ముగింపు

ఒపెక్ దేశాల మధ్య ఇటీవల కుదిరిన ఉత్పత్తి కోత డీల్ మే నెల 1 నుంచి పట్టాలెక్కింది. కాని తాజా ధరల పతనంతో ఈ ఒప్పందాన్ని ఎన్ని దేశాలు అమలు చేస్తాయన్నది మిలియన్ డాలర్ల ప్రశ్నే! ఒకవేళ ఈ డీల్ అమలైనా... ప్రస్తుతం ప్రపంచవ్యాప్తంగా నెలకొన్న డిమాండ్

# ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర బడ్జెట్ 2020-21

***ఈ ఏడాది బడ్జెట్‌లో రాష్ట్ర మౌలిక సదుపాయాలకి, సమగ్రాభివృద్ధికి గత ఏడాది కంటే కూడ కేటాయింపులు భారీగా తగ్గించారని, కేవలం ఓట్లు కురిపించే పథకాలకు మాత్రం నిధులు కేటాయించారని అంటున్నారు చిమ్మె జాన్ బర్నబాస్***

**2020,** జూన్ 16న ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర శాసనసభ అమరావతిలో రాష్ట్ర బడ్జెట్‌ను రాష్ట్ర ఆర్థిక మంత్రి బుగ్గన రాజేంద్రనాథ్‌రెడ్డి ప్రవేశపెట్టారు. రెండు రోజులు మాత్రమే జరిగే రాష్ట్ర అసెంబ్లీలో తొలిరోజున బడ్జెట్‌ను ప్రవేశపెట్టడం జరిగింది. మొత్తం రు. 2,29,789 కోట్ల బడ్జెట్ ఇది. గత సంవత్సరం బడ్జెట్‌తో పోల్చితే ఈసారి రు. 3,186 కోట్లు తక్కువే.

మౌలిక సదుపాయాలు, వ్యవసాయం, సాగునీటి ప్రాజెక్టులతో పాటు రాష్ట్ర సమగ్రాభివృద్ధికి బాటలు పరిచే రంగాలకు గతంలో కంటే కేటాయింపులు పెంచడం సహజం. కాని ఈసారి అన్నింటికీ కోతలే విధించారు. వ్యవసాయం, సాగునీరు, గ్రామీణాభివృద్ధి, పరిశ్రమలు, కార్మికులు, విద్య మొదలైన వాటిన్నింటికీ నిధులను తగ్గించేశారు. ప్రభుత్వానికి వ్యక్తిగత లబ్ధిని చేకూర్చే వాటికి మాత్రం 'పంపకాల'ను చేపట్టారు. మాకు అభివృద్ధి ముఖ్యం కాదు, నేరుగా నగదు పంచి 'ఓటు బ్యాంక్'ను సుస్థిరం చేసుకోవడమే ముఖ్యం అన్నట్లుగా ఈ బడ్జెట్‌ను రూపకల్పన చేశారు.

చంద్రబాబు నాయుడు ప్రభుత్వం దిగిపోయే నాటికి (2018-19) ప్రభుత్వ అప్పు అనగా ప్రజా రుణాలు రు. 2,57,509 కోట్లు. వై.ఎస్. జగన్మోహన్‌రెడ్డి ముఖ్యమంత్రిగా పదవి చేపట్టి ఏడాది ముగిసే నాటికి రు. 3,02,202 కోట్లకు చేరింది. అనగా ఏడాది కాలంలో కేవలం ప్రజా రుణాల ద్వారా ఏకంగా రు. 45,000 కోట్ల అప్పులు చేశారు. ఇదే ఈ ఆర్థిక సంవత్సరం చివరకు (2020-21) రు. 3,48,998 కోట్లకు చేరుకుంటుందని అంచనా. అంచనా వేసిన జిడిపిలో ఈ అప్పులు 34.55 శాతం. దీనితో పాటుగా వివిధ కార్పొరేషన్లు, ప్రభుత్వరంగ సంస్థలు రు. 67,171 కోట్ల అప్పులు చేశాయి. ఇది అంతకు ముందు ఆర్థిక సంవత్సరం రెవెన్యూ ఆదాయంలో 60.49 శాతంగా ఉన్నాయి.

గత ఏడాది బడ్జెట్‌లో 'సంక్షేమం' వాటా 6.20 శాతం. ఇప్పుడు అది 193.12 శాతానికి పెరిగి 18.44 శాతానికి చేరింది. చేసేది ప్రజలకు బాకా వాయించడానికి సమాచార శాఖకు 39 శాతం పెంచారు. సామాజిక భద్రతకు 28.5 శాతం పెరిగింది. సంక్షేమానికి కేటాయింపులు పెంచడం స్వాగతించవలసిన విషయమే అయినా 'సంక్షేమం, అభివృద్ధి రెండూ బండికి రెండు చక్రాల లాంటివి. అదే సూత్రాన్ని ఈ ప్రభుత్వం మరిచిపోయింది. రాష్ట్రానికి ఆస్తులు చేకూర్చి, సంపద సృష్టించే సమగ్రాభివృద్ధికి బడ్జెట్‌లో చోటివ్వలేదు. ఆర్థిక సేవలు పెరుగుతున్న కొద్దీ ప్రజా సంక్షేమ ప్రాధాన్యం పెరగాలి. కాని దీనికి భిన్నంగా ఆర్థిక సేవలకు కోతలు పెట్టారు. గత ఏడాది ఈ రంగం వాటా 37.80 శాతం ఉండగా, ఇప్పుడది 28.57 శాతానికి పడిపోయింది. గత బడ్జెట్‌తో పోల్చితే వ్యవసాయానికి 25 శాతం, సాగునీటికి 10 శాతం, సాధారణ విద్యకు 23 శాతం, క్రీడలు, యువజన సేవలకు 54 శాతం నిధులు తగ్గిపోయాయి. చివరకు దేశానికి పట్టుగొమ్మలైన గ్రామాల అభివృద్ధికి కూడా 48 శాతం కేటాయింపులు తగ్గించారు. ఇలా భారీ కోతకు గురైన రంగాలు అనేకం ఉన్నాయి. ఇదిలా ఉండగా సంక్షేమ పథకాల ద్వారా నగదు బదిలీ లేదా ప్రత్యక్ష ప్రయోజనం రూపంలో ప్రభుత్వం అందించే సొమ్ము భారీగా పెంచారు. ఇది గత ఏడాది రు. 24,719 కోట్లు. ఇప్పుడు మరో రు. 12,949 కోట్లు చేర్చి రు. 37,668 కోట్లు చేశారు.

---

పతనాన్ని ఉత్పత్తి కోతలతో పూడ్చుకోవడం అంత సులభమైనదేమి కాదు. చమురు సంక్షోభం త్వరలో పరిష్కారం కాకపోతే చమురు ఎగుమతి చేసే చిన్న దేశాలు ఇబ్బందుల పాలవుతాయి. అంతేకాదు గల్ఫ్ దేశాల్లో చమురు పరిశ్రమలు దెబ్బతింటే, వాటిలో పనిచేసే లక్షలాది కార్మికులు ఉపాధి కోల్పోతారు. భారతీయులు 80 లక్షల మంది గల్ఫ్ దేశాల్లో పనిచేస్తున్నారు. మనదేశానికి వచ్చే విదేశీ కరెన్సీ కూడ తగ్గుతుంది. దీర్ఘకాలం చమురు సంక్షోభం కొనసాగడం ఏ దేశానికి క్షేమకరం కాదు.

పరిశ్రమల నిర్వహణకు, పలు రకాల వస్తువుల తయారీకి, వాహనాలు నడపడానికి పెట్రోల్ ఎంతో అవసరం. ప్రపంచ చమురు వనరులు మరో 50 సంవత్సరాలకు మించి లభ్యం కావన్న అంచనా ఉంది. మరోవైపు చమురు వాడకంతో ఉద్గారాలు విడుదలై భూమిపై ఉష్ణోగ్రత పెరగడం వల్ల అనేక పర్యావరణ సమస్యలు తలెత్తుతున్నాయి. మనదేశం చమురు కొరకు 80 శాతం దిగుమతులపైనే ఆధారపడుతోంది. అగ్ర రాజ్యాల చమురు చదరంగం, పర్యావరణ కాలుష్యం నేపథ్యంలో ప్రత్యామ్నాయ ఇంధనం కొరకు (హైడ్రో, సోలార్, విండ్) పరిశోధనలు విస్తృతంగా జరుపవల్సి ఉంది. అలాగే పెట్రోల్‌ను జిఎస్‌టిలో చేర్చి ప్రజలకు ఉపశమనం కల్గించాల్సి ఉంది. కీలక రంగమైన చమురు, సహజ వాయువు, సోలార్ విద్యుత్ రంగాలను ప్రభుత్వమే నిర్వహించాలి. చమురు ధరలను ఇష్టమొచ్చినట్లు పెంచడం మన ప్రభుత్వం అనుసరిస్తున్న అభివృద్ధి నమూనా వల్లనే జరుగుతుందన్నది నిర్వివాదాంశం. సామ్రాజ్యవాద అభివృద్ధి నమూనాను విడనాడి జాతీయ అభివృద్ధి నమూనాను చేపట్టాలి. అందుకు ప్రజలు సంఘటితపడి ప్రభుత్వంపై ఒత్తిడి తీసుకురావడం తప్ప మరో మార్గం లేదు.

*(రచయిత ఉపాధ్యాయులు)*

వీ

2019-20 ఆర్థిక సంవత్సరంలో రాష్ట్రానికి సొంతంగా పన్నుల ఆదాయం రు. 58,107 కోట్లు వచ్చింది. అంతకు ముందు ఐదేళ్లలో ప్రతి ఏటా పది వేల కోట్ల రూపాయల దాకా పెరుగుదల నమోదైంది. కానీ వైఎస్ఆర్ పార్టీ అధికారంలోకి వచ్చిన తర్వాత తొలి ఏడాది సొంత పన్నుల ఆదాయం గతం కంటే పడిపోయిందన్న మాట. అయినప్పటికీ ఈ సంవత్సరం సొంత పన్నుల ఆదాయం రు. 70,679 కోట్లు వస్తుందని చూపారు. అసలు విషయం ఏమిటంటే, కరోనా కారణంగా ఈ ఆర్థిక సంవత్సరం తొలి రెండున్నర నెలల్లో వచ్చిన సొంత పన్నుల ఆదాయం కేవలం నాలుగు వేల కోట్ల రూపాయలు మాత్రమే.

గత ఐదేళ్లలో ఎన్నడూ లేని స్థాయిలో రెవెన్యూ లోటు నమోదైంది. గత ఆర్థిక సంవత్సరం రెవెన్యూ లోటు ఏకంగా రు. 26,646 కోట్లు ఉందని సవరించిన అంచనాల్లో పేర్కొన్నారు. ఈ బడ్జెట్‌లో రెవెన్యూ లోటు రు. 18,434 కోట్లు ఉంటుందని అంచనా వేశారు.

అభివృద్ధి, మౌలిక సదుపాయాల కోసం 2019-20లో గత ప్రభుత్వం రు. 19,976 కోట్లు ఖర్చు చేస్తే, ఈ పద్దు కింద వైకాపా ప్రభుత్వం గత సంవత్సరం పెట్టిన ఖర్చు రు. 12,854 కోట్లు మాత్రమే. అవి కూడా గత ప్రభుత్వ హయాంలో విదేశీ రుణసౌకర్యంతో ప్రారంభమై, పురోగతిలో ఉన్న ప్రాజెక్టులే ఉన్నాయి. ఇప్పటి వరకూ ఈ ప్రభుత్వం ఒక్క ప్రాజెక్టు కూడా చేపట్టలేదు. కనీసం పునాది కూడా వేయలేదు. ఇట్లుండగా ఈ ఏడాది మూలధన వ్యయం కింద రు. 29,907 కోట్లు ఖర్చు చేస్తామంటూ భారీ అంచనా చూపించారు.

తాజాగా ప్రవేశపెట్టిన రాష్ట్ర బడ్జెట్‌లో పురపాలక పట్టణాభివృద్ధి శాఖకు రు. 8,150.24 కోట్లు కేటాయించారు. 2019-20 ఆర్థిక సంవత్సరంలో ఈ మొత్తం రు. 6,587 కోట్లు కాగా మొత్తం ఈ శాఖకు అంచనా వ్యయం గణనీయంగా పెరిగింది. అయితే రాజధాని అమరావతికి అరకొర విదిలింపులతో సరిపుచ్చి నూతన రాజధాని నగరానికి (విశాఖపట్టణం పరిసరాలకు) మాత్రం భారీగా నిధులు కేటాయించారు. అదే సమయంలో గత ప్రభుత్వం ప్రారంభించిన 'అన్నా క్యాంటీన్'లను మూసివేసి, మళ్లీ త్వరలోనే ప్రారంభిస్తామని చెప్పినప్పటికీ, ప్రస్తుత బడ్జెట్‌లో ఆ ఊసే ఎత్తలేదు. ఆ తరహా మరో పథకమైనా ప్రారంభించడానికి నిధులు కేటాయించలేదు.

అమరావతిలో సాగుతున్న ప్రాజెక్టులను నిలిపివేయడమే కాకుండా ఆయా పనులు చేస్తున్న కాంట్రాక్ట్ కంపెనీలకు సుమారు వెయ్యి కోట్ల రూపాయిల బకాయిలను చెల్లించకుండా నిలిపివేసిన జగన్ సర్కార్ తాజా బడ్జెట్‌లోనూ తగిన కేటాయింపులు జరుపలేదు. ఎపిసిఆర్‌డిఎ రు. 564.50 కోట్లను మాత్రం కేటాయించింది. (ఎపిసిఆర్‌డిఎ రద్దు బిల్లు శాసనసభలో ఆమోదం పొంది, మండలిలో చర్చకు ఉన్నది).

అమరావతి కాపిటల్ సిటీ ప్రాజెక్ట్‌కు గత బడ్జెట్‌లో రు. 50 కోట్లయినా ఇస్తామన్న ప్రభుత్వం ప్రస్తుత బడ్జెట్‌లో దీని ప్రస్తావన చేయలేదు. అమరావతి మెట్రో రైల్ ప్రాజెక్ట్‌కు గత బడ్జెట్‌లో రు. 8.90 కోట్లను ప్రతిపాదించగా, ఇప్పుడు రు. 3.60 కోట్లకు తగ్గించారు. విజయవాడ మెట్రో రైల్ ప్రాజెక్ట్ ఊసెత్తలేదు.

'నూతన రాజధాని' నగర నిర్మాణానికి రు. 500 కోట్లను, దీనికి అవసరమైన భూ సమీకరణకు మరో రు. 190 కోట్లను కేటాయించారు.

మున్సిపల్ స్కూళ్లకు గత బడ్జెట్‌లో రు. 50 కోట్లు ఇవ్వగా, తాజాగా దీనిని రు. 20 కోట్లకు తగ్గించారు. పట్టణ ప్రాంతాల అభివృద్ధి కోసం ఉద్దేశించిన 'అమృత్' పథకానికి గతంలో రు. 347.35 కోట్లను ప్రతిపాదించగా, తాజాగా దీనిని రు. 255.67 కోట్లకు తగ్గించారు. 'స్మార్ట్ సిటీస్' పథకం కోసం గత బడ్జెట్‌లో రు. 1,123 కోట్లను చూపగా, ప్రస్తుతం రు. 300 కోట్లతో సరిపెట్టారు. 'స్వచ్ఛ భారత్' కోసం కేటాయింపులు రు. 86.92 కోట్ల నుంచి రు. 46.12 కోట్లకు తగ్గించారు.

ప్రధానమంత్రి ఆవాస్ యోజన (పిఎంఎవై) అర్బన్‌కు గతంలో రు. 170 కోట్లను ప్రతిపాదించగా ప్రస్తుతం రు. 900.90 కోట్లకు, ఎపి టిడ్కోకు రు. 456.68 కోట్ల నుంచి రు. 526.58 కోట్లకు పెంచారు. పట్టణ స్వయం సహాయక సంఘాలకు వై.ఎస్.ఆర్ సున్నా వడ్డీ రుణాల కోసం కేటాయింపులను గతంలోని రు. 126 కోట్ల నుంచి రు. 389.89 కోట్లకు పెంచారు. వెలుగు పథకానికి కూడా రు. 23.40 కోట్ల నుంచి రు. 62 కోట్లకు పెంచారు. పట్టణాల్లో మౌలిక వసతుల అభివృద్ధికి నిధులను రు. 186.61 కోట్ల నుంచి రు. 739.69 కోట్లకు పెంచారు.

వ్యవసాయం చేస్తూ ప్రమాదాలకు గురయ్యే, సాగు ఒత్తిళ్ల వల్ల ఆత్మహత్యలు చేసుకునే రైతుల కుటుంబాలను ఆదుకునేందుకు ఉద్దేశించిన బడ్జెట్ కేటాయింపులను రాష్ట్ర ప్రభుత్వం బాగా కుదించింది. గత ఏడాది బడ్జెట్‌లో ఈ పరిహారం కోసం రు. 100 కోట్లు కేటాయించగా, తాజా బడ్జెట్‌లో రు. 20 కోట్లు మాత్రమే కేటాయించారు. గత ఏడాది 1.58 లక్షల మంది కౌలు రైతులకు రు. 213.47 కోట్లు పెట్టుబడి సాయం అందించగా, ఈ ఏడాది కౌలు రైతు సాయం ప్రకటించలేదు. కౌలు రైతుల సంఖ్య పెరిగిందో లేదో స్పష్టత లేదు ఈ బడ్జెట్‌లో.

రైతు భరోసా పథకం కేటాయింపులకు గత ఏడాదితో పోల్చితే భారీ కోత పెట్టారు. ఈ మేరకు రు. 11,891.20 కోట్లతో వ్యవసాయ బడ్జెట్‌ను రాష్ట్ర అసెంబ్లీకి వ్యవసాయ మంత్రి కన్నబాబు సమర్పించారు. మార్కెట్ యార్డులను ఆధునికీకరించేందుకు రు. 200 కోట్లను ప్రతిపాదించారు. రైతు భరోసా కేంద్రాల్లో పంట కొనుగోలు చేసేలా ఈ-మార్కెటింగ్ విధానాన్ని ఈ సంవత్సరం నుంచి తీసుకొని వస్తామన్నారు. ధరల స్థిరీకరణ కోసం నిధిని మూడు వేల కోట్ల రూపాయలను ప్రతిపాదించారు. రైతు భరోసా కేంద్రాల్లో మౌలిక వసతుల కోసం రు. 100 కోట్లు కేటాయించారు. రాష్ట్రంలో 160 వైఎస్ఆర్ వ్యవసాయ పరీక్షా కేంద్రాలను బడ్జెట్‌లో ప్రతిపాదించారు.

ప్రజాపంపిణీ వ్యవస్థకు 2019-20లో రు. 4,429 కోట్లు కేటాయిస్తే, ఈ ఆర్థిక సంవత్సరానికి రు. 3,520 కేటాయించింది. అందులో మూడు వేల కోట్లు బియ్యంపై రాయితీ, రు. 100 కోట్లు బియ్యం సంచులకు అని వివరించింది. ప్యాకింగ్ సంచుల స్థానంలో తీసుకొస్తున్న వాహనాలతో డోర్ డెలివరీ విధానానికి వాహనాల కొనుగోలుకు దాదాపు రు. 400 కోట్లు అవసరం అవుతాయని అంచనా వేశారు. దీనికి కూడా బడ్జెట్‌లో కేటాయింపులు జరగలేదు.

మొత్తం మీద ఈ బడ్జెట్‌లో అభివృద్ధి-సంక్షేమం సమపాళ్లలో జరగలేదు. అభివృద్ధి పూర్తిగా కుంటుబడి, సంక్షేమం పాక్షికంగా జరిగే అవకాశం ఉంది. అది కూడా ఈ రాష్ట్ర ప్రభుత్వ చిత్తశుద్ధిపై ఆధారపడి ఉంటుంది. ప్రజలను 'ఓటు బ్యాంక్'గా చూసిన బడ్జెట్ ఇది.

*(రచయిత ఒపిడిఆర్ రాష్ట్ర కమిటీ సభ్యుడు, అడ్వకేట్)* వీ

# ప్రజలను పాలిమర్స్‌కు బలిచ్చిన పాలకులు

***కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాల అవినీతి వల్ల పరిశ్రమల్లో పాటించాల్సిన కనీసమైన నిబంధనలు పాటించకపోవడంతో దుర్ఘటనలు జరిగినప్పుడు సామాన్యుల ప్రాణాలు బలికావాల్సి వస్తోందని అంటున్నారు జి. రఘురాం***

పెట్రోల్ డాలర్లు ఉంటాయని మనకి తెలుసు కానీ ఆక్సీజన్ డాలర్లు కూడా ఉంటాయని మనకి ఇప్పుడే తెలుస్తోంది గాలిలోని ఆక్సీజన్‌ని అమ్ముకుంటే వచ్చేదే ఆక్సీజన్ డాలర్లు. విశాఖ తీరం వెంబడి ఉన్న గాలిలోని ఆక్సీజన్‌ని మన ప్రభుత్వాలు, కాలుష్య నియంత్రణ బోర్డులు ఏనాడో బహుళజాతి కంపెనీలకి డాలర్ల లెక్కలో అమ్మేశాయి. దాని స్థానంలో కావలసినంత పాదరసం, భాస్వరం, గంధకామ్లం, ఇనుప రజను బూడిద బొగ్గుపులుసు వాయువు మందుల ఫ్యాక్టరీల విసర్జకాలు, హెచ్.పి.సి.ఎల్. పెట్రో రసాయనాలు గాలిలో దట్టించి మన శ్వాస నాళాలకి అప్పనంగా అందజేస్తున్నారు. వీటిని పీల్చుకోవడం మన విశాఖ ప్రజలకు ఎప్పుడో అలవాటయిపోయింది ఇప్పుడు సౌత్ కొరియన్ కంపెనీ ఎల్‌జి పాలిమర్స్ వీటన్నిటితో పాటు కొత్తగా 'స్టైరీన్' అనే ప్లాస్టిక్ విష రసాయనాన్ని పీల్చుకొని బతకమని దీనివల్ల ఏ హానీ లేదని కోటి రూపాయల పందెం కాసింది. అయితే ఇక్కడ షరతులు వర్తిస్తాయి. పందెం డబ్బులు బతికున్న వాళ్లకు కాక చనిపోయిన శవాల గుట్టలకి చెల్లిస్తారు.

మే 7 తెల్లవారుజామున రెండు గంటలకు విశాఖపట్నంలోని వెంకటాపురం దగ్గర ఉన్న ఎల్‌జి పాలిమర్స్ కంపెనీలోని రెండు ట్యాంకుల నుండి స్టైరీన్ అనే ప్రాణాంతక రసాయనం ఆవిరి రూపంలో బయటికి వచ్చి 12 మంది ప్రాణాలను మింగేసింది 1000 మంది తీవ్ర అస్వస్థతకు గురై కెజిహెచ్ ఆసుపత్రిలో చేరారు. ఈ విష వాయువు మరో ఐదు వేల మంది పీల్చుకున్నారని అక్కడి నేల నీరు గాలి స్టైరీన్ వాయువుతో కలుషితమైందని పర్యావరణ వేత్తలు చెబుతున్నారు. పరిగెత్తుతూ చనిపోయే ఈ మృత్యుకేళికి ప్రభుత్వం ఎల్‌జి పాలిమర్స్ కంపెనీ పెట్టిన పేరు పారిశ్రామిక ప్రమాదం. నిజంగా ఇది ప్రమాదమా అజ్ఞానం వల్ల నిర్లక్ష్యం వల్ల జరిగిన ఘోర దుర్ఘటనా లేక దేశ ప్రజల జీవితాలను డాలర్లతో కొనవచ్చనే అహంబావమా?

ఈ నేరానికి కారణం ప్రభుత్వమా, విశాఖ పర్యావరణ కాలుష్య నియంత్రణ మండలా, ఎల్‌జి పాలిమర్స్ యాజమాన్యమా? లేక ఈ మూడింటికి ఉన్న సామాన్య ధోరణి ఈ ప్రమాదానికి దారి తీసిందా?.

స్టైరీన్ అంటే ఏమిటి దీన్ని ఇతనైల్ బెంజిన్, ఫినైల్ ఇథిలీన్, ఫీనైల్ ఎథిన్, సిన్నమొని లేదా స్టైరీన్ మోనోమర్ అంటారు. ఇది రంగులేని ద్రవ పదార్థం, తియ్యటి సుగంధ పూరిత వాసనతో ఉంటుంది. అనేక కర్బన రసాయనాలతో కలుస్తుంది. దీనికి సింథటిక్ రబ్బర్‌తో బాగా కలిసే గుణం ఉంది. అందుకే దీన్ని అనేక ప్లాస్టిక్ ఇండస్ట్రియల్, ప్లాస్టిక్ టైర్లు, రబ్బర్ షీట్‌లు ఇంకా అనేక ప్లాస్టిక్ ఉత్పత్తులలో విరివిగా ఉపయోగిస్తారు.

ఇది నీటిలో అంత బాగా కరుగదు. నీటిలో తేలియాడే వాయువుగా ఫ్లోటర్ ఈవాపా రెట్టర్‌గా దీనిని పిలుస్తారు. దీనికి మండే గుణం ఉంది. దీన్ని కొద్దిసేపు పీలిస్తే శ్వాస సంబంధమైన వ్యాధులు గొంతులో నుస, కంటి దురద వస్తుంది, నరాలమీద తీవ్ర ప్రభావం చూపుతుంది. ఇది కార్సినో జెనిసిస్ అంటే క్యాన్సర్ కారకము ఎక్కువ ఆ మోతాదులో పీలిస్తే శ్వాస ఆగిపోయే మరణం సంభవిస్తుంది విశాఖలో జరిగింది అదే.

ప్లాస్టిక్ ఉత్పత్తిలో వాడే ఈ ప్రధానమైన రసాయనం స్టైరీన్‌ను నిల్వ చేయడం ఎంతో కష్టం ప్రమాద భరితం కూడా. ఏమాత్రం నిర్లక్ష్యం చేసిన నిల్వచేసిన ట్యాంక్‌లో పాలిమ రైజేషన్ జరిగి ఉష్ణోగ్రత పెరిగి వాయు రూపంలో లీక్ అవటమో, ట్యాంకర్ పగిలి వ్యాపించడం లాంటివి జరుగుతాయి. అందుకే అంతర్జాతీయ పాలిమర్ పరిశ్రమలు ముఖ్యంగా యురోపియన్ పరిశ్రమలు 'అసోసియేషన్ ఆఫ్ ప్లాస్టిక్ మాన్యుఫ్యాక్చరర్స్ ప్లాస్టిక్ యూరోప్'గా ఏర్పడి, స్టైరీన్‌ను పాలిమర్ పరిశ్రమలలో ఉపయోగించడం, నిల్వచేయడం, రవాణా చేయడం వంటి ప్రక్రియలలో ప్రమాదాలను నివారించడానికి ఖచ్చితమైన నిర్దిష్టమైన తు.చ. తప్పకుండా పాటించవలసిన భద్రత ప్రమాణాలను ప్రకటించుకుని ఆచరిస్తున్నారు వాటిలో కొన్ని.

1. స్టైరీన్ ఒక చోటి నుండి మరోచోటికి రవాణా చేస్తున్నప్పుడు లేదా దాన్ని నిల్వచేసి ఉపయోగించేటప్పుడు తప్పనిసరిగా శిక్షణ పొందిన ప్రత్యేకంగా దానికై కేటాయించబడిన నిపుణులతో పని చేయించాలి.
2. స్టైరీన్ బదిలీ చేసే ట్యాంకర్ అంతకుముందు రెండు ట్రిప్పులలో క్యాస్టిక్ సోడా కానీ, బెంజిన్, పైరాలసిస్ గ్యాసోలిన్ (పెట్రోల్) ఇతర మండే ద్రవాలను గాని లూబ్రికేట్ ఇంగ్ ఆయిల్స్ కానీ రవాణా చేసి ఉండకూడదు.
3. ఆఖరికి స్టైరీన్ తీసుకెళ్లే ట్యాంకర్ లోపలి భాగాన్ని స్టైరీన్‌తో పాలిమరైజేషన్ జరిపే పెయింట్‌లతో కోటింగ్ వేయకూడదు.
4. దీన్ని ట్రాన్స్ పోర్ట్ చేసేటప్పుడు సబ్ కాంట్రాక్ట్ ఇవ్వకూడదు తప్పనిసరి అయితే యజమానిని అడిగి చేయాలి.
5. 30 డిగ్రీల సెంటిగ్రేడ్ కన్నా ఎక్కువ ఉన్నా ట్యాంకర్లలో స్టైరీన్ రవాణా చేయకూడదు. స్టైరీన్ పంపు చేసే పంపులు కూడా ప్రత్యేకంగా దీనికై కేటాయించినవై ఉండాలి.
6. స్టైరీన్ నిల్వచేసిన ట్యాంకర్ వద్ద ఎప్పుడు నీటిని నురగాను చిమ్మే వ్యవస్థ సిద్ధంగా ఉండాలి. అలాగే ట్యాంకర్‌లో టెంపరేచర్ పెరిగే అవకాశం ఉండడంవల్ల ట్యాంకర్ వద్ద శీతలీకరణ వ్యవస్థ సిద్ధంగా ఉండాలి.

7. నిల్వ ఉంచిన ట్యాంకర్‌లో ఉష్ణోగ్రత 50 డిగ్రీల సెంటిగ్రేడ్ దాటితే పెరుగుతున్న ప్రతి ఒక డిగ్రీ సెంటిగ్రేడ్ సమాచారాన్ని ప్రధాన నిర్వహణ అధికారికి తెలియజేయాలి.
8. టెంపరేచర్ 15 డిగ్రీల సెంటిగ్రేడ్ కన్నా తక్కువగా ఉంటే వారానికి ఒకసారి నమూనా తీసుకొని పాలిమరైసేషన్ జరుగుతుందో లేదో పరీక్షించాలి అదే 25 డిగ్రీలు దాటితే ప్రతిరోజు నమూనాను పరీక్షించాలి.
9. ట్యాంకర్‌లోని స్టే గ్రీన్ 20 డిగ్రీల నుండి 10 డిగ్రీలు పెరగడానికి 25 రోజులు పడుతుంది అది 65 డిగ్రీలకు చేరుకుంటే అక్కడి నుండి 20 నిమిషాలలో ప్రమాదకరమైన ఉష్ణోగ్రతకు చేరుకుంటుంది.
10. రోజుకి మూడు డిగ్రీల సెంటిగ్రేడ్ టెంపరేచర్ పెరుగుతుంటే స్టైరీన్ రన్ వే టెంపరేచర్‌కి అనగా త్వరలో వేగంగా టెంపరేచర్ పెరిగి పాలిమరైజేషన్ ప్రక్రియకు సిద్ధమవుతోందని అర్థం.
11. ట్యాంకర్ 85 డిగ్రీలకు చేరుకుంటే 100 నిమిషాల్లో టాంకర్ లో ఒత్తిడి పెరిగి పగుళ్లు రావడం సేఫ్టీ వాల్ ఇతర వ్యవస్థలు నాశనం అవ్వడం జరుగుతుంది. ఒక్కొక్కసారి ట్యాంకర్ పేలి పోవచ్చు కూడా. ఈలోపల అలారం మోగించడం దగ్గరిలోని ప్రజలకు హెచ్చరికలు జారీ చేసి ఇల్లు ఖాళీ చేయించడం చేయాలి.

ఇవి కొన్ని ముఖ్యమైనవి మాత్రమే. యూరోపియన్ యూనియన్ ప్రమాణాలను ఇలా నిర్ణయించి తప్పకుండా పాటిస్తుంటే విశాఖలోని ఎల్జి పాలిమర్స్ బహుళజాతి సంస్థ స్టైరీన్ నిల్వలో ఎంతటి అజాగ్రత్త వహించినదో ప్రజల ప్రాణాలని ఎలా తీసిందో చూద్దాం.

ప్రమాదం గురించి రాష్ట్ర పారిశ్రామిక మంత్రి ఏం.జి. రెడ్డి పోలీస్ ఆఫీసర్ స్వరూపరాణి మాట్లాడుతూ 43 రోజుల లాక్‌డౌన్ తర్వాత ఎలాంటి శిక్షణలేని, నిపుణులను కానీ వాళ్లు ఫ్యాక్టరీని తెరవడం వల్ల వాళ్లు స్టైరీన్ ట్యాంకుల నిర్వహణ చేపట్టడం వల్ల ఈ ప్రమాదం సంభవించిందని అన్నారు. యాజమాన్యం వాళ్లు నలభై మూడు రోజులు లాక్‌డౌన్‌లో ఎవరు లేకపోవటం వల్ల ట్యాంకర్‌లో పాలిమరైసేషన్ జరిగి ఉంటుందని అలాగే టెంపరేచర్ పెరగగానే కూలింగ్ సిస్టం పాడైపోయి టెంపరేచర్ తగ్గలేదని, సేఫ్టీవాల్ స్టక్ అయి గ్యాస్ లీక్ అయిందని అన్నారు.

ఇక్కడ మనకొచ్చే ప్రశ్నేంటంటే లాక్‌డౌన్ సమయంలో బ్యాంకులు పని చేశాయి. ఎన్నో అత్యవసర సర్వీసులు పనిచేశాయి, ప్రమాదకరమైన స్టైరీన్ ట్యాంకులను పరిశీలించడం అత్యవసర సర్వీసులు కాదా, స్టైరీన్ ట్యాంక్ దగ్గర ఎప్పుడు పరిశీలిస్తూ ఉండే నిపుణుల బృందం ఉండాలి. ఎప్పటికప్పుడు టెంపరేచర్ గమనిస్తూ ఉండాలి. ట్యాంకర్‌లో పాలిమరైజేషన్ మొదలైతే ఆపడానికి, నిర్వీర్యం చేయడానికి కావలసిన రసాయనిక పదార్థాలు సిద్ధంగా ఉంచుకోవాలి. అలాంటి రసాయనిక పదార్థాలు కంపెనీ ఆవరణలోనే ఉండాలి. ఇది అంతర్జాతీయ భద్రతా నియమం. దీన్ని కంపెనీ ఏమాత్రం పాటించకపోవడంతో ప్రభుత్వం గుజరాత్ నుండి 500 కిలోల రసాయనాలను మే 7 సాయంత్రం విమానంలో హుటాహుటిన తరలించింది. ఇది కంపెనీ చేసిన ఘోర తప్పిదం. ఫ్యాక్టరీని తెరిచేటప్పుడే సుశిక్షితులైన సాంకేతిక నిపుణులతో కంపెనీ తెరవాలని ఆదేశించామని రాష్ట్ర పారిశ్రామిక మంత్రి అంజి రెడ్డి గారు విలేకరులు అడిగిన ప్రశ్నకు సమాధానంగా చెప్పారు. అంటే ప్రభుత్వానికి ఫ్యాక్టరీలో ప్రమాదకరమైన స్టైరీన్ ఉన్నదని ముందే తెలుసా? లేక విలేకరులు అడిగిన ప్రశ్నలకి మా తప్పేంలేదని చేతులు దులుపుకోవడానికి మంత్రిగారు అలా మాట్లాడారా?

ఏ వాయువు అయినా జడత్వంగా స్థిరంగా 40 రోజులు ఉండదని ఇంటర్మీడియట్ కెమిస్ట్రీ చదివే విద్యార్థికి కూడా తెలుసు, కానీ సంవత్సరానికి 20 వేల కోట్ల డాలర్ల వ్యాపారం నడుపుతూ 2500 కోట్ల డాలర్ల లాభాన్ని గడుస్తున్న ప్రపంచ ప్లాస్టిక్ దిగ్గజం ఎల్‌జి పాలిమర్స్ యాజమాన్యానికి తెలియదా?

ప్రమాదం జరిగిన తరువాత ఫ్యాక్టరీని పరిశీలించిన నేషనల్ డిజాస్టర్ మేనేజ్‌మెంట్ టీం (ఎన్‌డిఎంఏ) నిపుణులు ఫ్యాక్టరీలో స్టైరీన్‌ను నిల్వ ఉంచిన ప్రదేశాలను పరిశీలించి నిర్ఘాంతపోయారు ఎందుకంటే అవి మరింత ప్రమాదకరమైన దారుణమైన రీతిలో నిల్వ చేయబడి ఉన్నాయి. ఇక్కడే కాదు పోర్టులో నిల్వ ఉంచిన స్టైరీన్ పరిస్థితి కూడా దారుణంగా ఉంది. వెంటనే రాష్ట్ర ప్రభుత్వం 13 వేల టన్నుల రసాయనాన్ని లాక్‌డౌన్ సమయంలో దేశం ఆవలికి తరలించి వేయమని ఆదేశించింది. దీన్ని 8000 టన్నులు 5000 టన్నులుగా 2 ఓడలలో అంతటి లాక్‌డౌన్ సమయంలో తరలించి వేశారు.

ప్రమాదకరమైన వ్యర్థాల నిర్వహణ, వినియోగం, బదిలీ చేయడం లాంటి వాటికి సంబంధించిన 1989 చట్టం ప్రకారం, ప్రమాదకర రసాయనాల ఉత్పత్తి నిల్వచేయడం, దిగుమతి చేసుకోవడం, వినియోగించడం లాంటి వాటికి సంబంధించిన 1989 చట్టం ప్రకారం దిగుమతి చేసుకునే వారు కానీ ఉత్పత్తి చేసే వారు కానీ వినియోగించేవారు కానీ ఆ రసాయనాల గురించి పూర్తి వివరాలు సంబంధిత అధికారులకు ప్రభుత్వాలకు తెలియజేయాలి. మరి స్టైరీన్ గురించి స్థానిక పర్యావరణ కాలుష్య నియంత్రణ మండలికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి కేంద్ర ప్రభుత్వానికి తెలియజేశారు. తెలియజేస్తే వారు తనిఖీలు జరిపారు. స్టోరేజీ ట్యాంకుల వద్ద అంతర్జాతీయ ప్రమాణాలకు అనుగుణంగా భద్రతా చర్యలు కంపెనీవారు చేపట్టినట్టు గమనించారా? అలా గమనిస్తే దాన్ని ధ్రువీకరించి అనుమతులు ఇచ్చారా? నిజానికి ఇవేవీ జరగలేదు. అసలు కేంద్రం నుంచి కంపెనీకి సరైన అనుమతులు లేవు. ఫ్యాక్టరీని పరిశీలించిన ఎన్‌డిఎంఏ టీం రసాయనాన్ని నిల్వ ఉంచే ట్యాంకుల నాణ్యత సరిగాలేదని అవి పాతవని ఆధునికమైన పరిజ్ఞానాన్ని అవి వినియోగించుకోలేవని వీటిలో రసాయనాన్ని పదిహేను రోజుల కన్నా ఎక్కువ నిల్వ ఉంచలేమని ఖాళీ చేయాలని అలా చేయకపోతే స్టైరీన్ పాలిమరైజేషన్ యాక్షన్ ట్యాంకులో మొదలవుతుందని చెప్పారు. ఈ టీంకి డాక్టర్ అంజన్ రే డైరెక్టర్ ఇండియన్ ఇన్‌స్టిట్యూషన్ ఆఫ్ పెట్రోలియం, సెంతన్ గౌతీ అనే పారిశ్రామిక నిపుణులు ఈ బృందానికి నాయకత్వం వహించారు.

పాడైపోయిన వాల్వ్ లీకేజీకి కారణమని ట్యాంకులో పాలిమరైజేషన్ జరిగి ఒత్తిడి పెరిగి లీక్ అయిందని అంటున్నారు. ఒకవేళ అలా లీక్ అవ్వకుండా వాల్ అడ్డుపడి ఉంటే మొత్తం ట్యాంక్ ఒత్తిడికి గురై పగుళ్లు ఇచ్చి లేదా పేలిపోయి మొత్తం వాయువు ఒక్కసారిగా వ్యాపించేది అప్పుడు ట్యాంక్‌లో టెంపరేచర్ 180 డిగ్రీలు. పొద్దున్నుంచి సాయంత్రం దాకా సుమారు నాలుగు టన్నుల రసాయనం ట్యాంకుల నుండి లీక్ అయింది.

ఏడవ తారీకు సాయంత్రం నలుగురు సభ్యులతో కూడిన కోర్ కమిటీ తొమ్మిది మంది సభ్యులతో కూడిన నిపుణుల టీం వచ్చి లీకేజీని ఆపారు అంటే ఫ్యాక్టరీ ఆవరణలో గాని దగ్గర ప్రాంతాలలో గాని ఇలాంటి చర్యలు జరిగితే ఆపగలిగే ఫ్యాక్టరీ నిపుణుల బృందం లేదు ఇది అంతర్జాతీయ భద్రతా సూత్రాలకి విరుద్ధం. ట్యాంక్ టెంపరేచర్ మే 8 నాటికి 120 డిగ్రీల టెంపరేచర్‌కి తీసుకురావడం జరిగింది. అంతవరకూ ప్రమాద సూచిక కదులుతూనే ఉంది. 180 డిగ్రీల టెంపరేచర్‌లో వాయు రూపంలో పొంగుతున్న స్టైరీన్‌నీ బయటికి తీసుకురావడం ఏంకాదు దీన్ని వచ్చిన నిపుణుల బృందం పిటిబిసి అంటే పేరా టెరిటరీ బ్యుటైల్ కేటకొల్ అనే రసాయనాన్ని గుజరాత్ నుండి విమానంలో తెచ్చి కలిపారు. దీని ద్వారా అన్ని ట్యాంకుల్లో ఉన్న 50 శాతం స్టైరీన్ అనగా 18 వేల టన్నుల స్టైరీన్‌ను ఘన పదార్థంగా మార్చారు అంటే ఇంకా 18 వేల టన్నుల రసాయనం మిగిలే ఉంది దీన్ని తరువాత రోజు మార్చారు. దీన్ని బట్టి చూస్తే మిగతా లీక్ అవని ట్యాంకులలో రక్షణ వ్యవస్థ ఎంత అద్భుతంగా ఉందో అర్థం అవుతోంది నిజానికి వీటిలో కూడా పాలిమరైజేషన్ మొదలయి టెంపరేచర్ పెరుగుతోంది. దీంట్లో ఏ ఒక్కటి అయినా ఒత్తిడి ఎక్కువయి ట్యాంక్ పగుళ్లు వచ్చి ఉంటే జరిగే ప్రమాదం ఊహించడానికి కూడా భయంకరంగా ఉంది.

**ఎల్‌జి పాలిమర్స్ చరిత్ర**

ఈ ఎల్‌జి పాలిమర్స్ ఫ్యాక్టరీ 1961లో హిందుస్థాన్ పాలిమర్స్ చేత స్థాపించబడింది. అప్పట్లో పాలిస్టిన్ ఇతర ప్లాస్టిక్ ఉత్పత్తులను హిందుస్థాన్ పాలిమర్స్ ఉత్పత్తి చేసేది. తరువాత 1978లో యునైటెడ్ బేవరేజెస్ యూనిట్ మెట్రో వర్క్ లిమిటెడ్‌తో కలిసి ఉత్పత్తి కొనసాగించింది. 1997లో నూతన ఆర్థిక విధానాల వల్ల దక్షిణ కొరియా కంపెనీ అయినా ఎల్‌జి పాలిమర్స్ దిగ్గజం భారతదేశం పాలిమర్స్ బిజినెస్‌కి మంచి మార్కెట్ అని అంచనావేసి దేశంలోకి ప్రవేశించింది. అందుకు పాత టెక్నాలజీతో నడుస్తున్న హిందుస్థాన్ పాలిమర్స్ అనువైనదిగా భావించి టేకోవర్ చేసింది. ఎల్‌జి పాలిమర్స్ ప్రపంచంలోనే ఒక పెద్ద బహుళజాతి సంస్థ 1947లో దక్షిణ కొరియాలో స్థాపించ బడింది. దీంట్లో 2015 నాటికి 20000 ఉద్యోగులు పని చేస్తున్నారు. 2012 నాటికి దీని టర్నోవర్ 20.4 బిలియన్ డాలర్లు సంవత్సరానికి లాభం రెండువేల కోట్ల డాలర్లకు పైమాటే. దీని ప్రధాన ఉత్పత్తులు ముడి పదార్థాలు రసాయనాలు ఐ.టి., ఎలక్ట్రానిక్ పరికరాల ఉత్పత్తులు విద్యుత్ పరికరాలు విద్యుత్ ఉత్పత్తి సామాగ్రి. దక్షిణ కొరియాలో ఈ కంపెనీ జాతీయ అంతర్జాతీయ పర్యావరణ చట్టాలను కాలుష్య నివారణ చట్టాలను అనుసరిస్తూ ఎప్పటికప్పుడు తన ఉత్పత్తి యంత్రాంగాన్ని సామర్థ్యాన్ని ఆధునికరిస్తూ లాభాలను గడిస్తున్న కంపెనీ. ఈ కంపెనీని భారతదేశ కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాల దేశభక్తిని, మన చట్టాలను వాటిలోని ఖాళీలను అధికారుల లంచగొండితనాన్ని బాగా అర్థం చేసుకుంది కాబోలు 1997లో భారతదేశంలోని పాలిమర్ ఇండస్ట్రీలో కాలు పెట్టింది.

**ఎల్‌జి కంపెనీ స్థాపనలో చట్టబద్ధత పర్యావరణ అనుమతులు**

ఎల్‌జి కంపెనీ ప్రతినిధి చావో సాంగ్ – కుయి మాట్లాడుతూ తూ.గో కంపెనీ ఎల్లవేళలా చట్టాలను అనుసరిస్తూ కేంద్ర రాష్ట్ర అధికారుల ఆదేశాలను పాటిస్తూ ఉత్పత్తిని కొనసాగిస్తోందని నొక్కివక్కాణించారు. కానీ ప్రాథమిక సమాచారం ప్రకారం 2019లో కంపెనీ క్లియరెన్స్ కోసం పెట్టిన అప్లికేషన్‌తో పాటు ఒక అఫిడవిట్‌ని (వాంగ్మూలాన్ని) సమర్పించింది. దాంట్లో తాను ఇప్పుడు పనిచేస్తున్నా పరిమాణానికి కావలసిన అనుమతి పత్రాన్ని పొందవలసిన అధికారి నుండి పొందలేదని తెలియజేసింది. ఇదేంటి ఇది తప్పు కదా అని ప్రశ్నిస్తే ఆ అఫిడవిట్ భవిష్యత్తులో రాబోయే చట్టాలను అనుసరిస్తామని ప్రమాణం చేయడమే తప్ప చట్టాల ఉల్లంఘనకు పాల్పడినట్లు ఒప్పు కోవడం కాదని బుకాయించింది.

నిజానికి భారతదేశంలో ఎన్నో కంపెనీలు సంవత్సరాల నుండి పర్యావరణ స్థానిక ప్రభుత్వాల అనుమతులు లేకున్నా పని చేస్తూనే ఉన్నాయి. అన్నింటికి ఎన్నో పర్యావరణ చట్టాలు, పొల్యూషన్ కంట్రోల్ బోర్డులు ఉన్నాయి కానీ వాటికి కోరలు లేవు.

ఎల్‌జి కంపెనీ 1997లో టేక్ ఓవర్ చేసుకుని పని ప్రారంభించింది. 1997 నుండి 2006 వరకు రాష్ట్ర ప్రభుత్వ అనుమతి కావాలి. ఈ అనుమతి ఉంది కానీ 2006లో వచ్చిన చట్టం ప్రకారం దేశంలోని ప్రతి కంపెనీ మెట్రో కంపెనీలతో సహా వాళ్ల ఉత్పత్తి పరిమాణాన్ని పెంచినప్పుడు లేదా ఉత్పత్తులను మార్చినప్పుడు పరిశ్రమను విస్తరించినప్పుడు తప్పనిసరిగా ఫెడరల్ అనగా కేంద్రం అనుమతి తీసుకోవాలి. ఎల్‌జి పాలిమర్స్ 2006 నుండి 2018 వరకు ఐదుసార్లు కంపెనీ సామర్థ్యాన్ని ఉత్పత్తిని పెంచింది. కానీ అది ఎప్పుడూ ఎలాంటి పర్యావరణ అనుమతులు పొందలేదని 2019 ఇది మేలో ఇచ్చిన వాంగ్మూలంలో పేర్కొంది.

దీని గురించి అడిగితే చావు గారు...? 2006లో జాతీయ చట్టాలు మారినప్పుడు కేంద్రానికి సంబంధించిన శాఖలను సంప్రదించాలని వారు ఎలాంటి పర్యావరణ అనుమతులు అవసరం లేదని చెప్పారని సమాధానం ఇచ్చారు. అంతేకాక మేము పర్యావరణ చట్టాలు 2006లో పొందుపరచడానికి ముందునుంచే పర్యావరణ సూత్రాలను భద్రతను అనుసరించి ఉత్పత్తిని కొనసాగిస్తున్నామని ఇచ్చారు. ఈ విషయంలో పర్యావరణ కార్యదర్శి సిఎస్‌కె మిశ్రా 2006 వరకు వారు పర్యావరణ అనుమతుల కోసం సంప్రదించవలసిన అవసరం లేదని 2006 తరువాత వాళ్లు ఎప్పుడైతే ఉత్పత్తి సామర్థ్యాన్ని పెంచుతూ కంపెనీని విస్తరణ చేశారో అప్పుడు అలా మార్పు చేస్తున్న ప్రతి సారి పర్యావరణ అనుమతుల కోసం అర్జీ పెట్టుకోవాల్సిందే అని అన్నారు.

ఎల్‌జి పాలిమర్స్ ఎన్నడూ పర్యావరణ అనుమతుల కోసం కేంద్ర కాలుష్య నియంత్రణ మండలిని సంప్రదించలేదు. కానీ 2017లో రాష్ట్ర పర్యావరణ కాలుష్య నియంత్రణ మండలిని మారిన ఉత్పత్తి సామర్థ్యానికి అనుగుణంగా అనుమతుల కోసం సంప్రదించింది. రాష్ట్రం అందుకు నిరాకరించి ముందు వెదర్ నుండి అంగీకారం తెచ్చుకోవాలని సూచించింది. ఏమైనప్పటికీ రాష్ట్ర సంఘం కంపెనీని పరిశీలించడం గాని ఉత్పత్తిని లేదా కంపెనీ కార్యకలాపాలను నిలిపివేయమని ఆదేశించడం గాని జరగలేదు. 2018లో ప్లాస్టిక్ బాటిల్స్‌ని ఇతర ప్లాస్టిక్ సామాగ్రిని తయారుచేయటానికి ఉత్పత్తి పరిమాణాన్ని పెంచడానికి మొట్టమొదటిసారిగా ఎల్‌జి కంపెనీ పర్యావరణ అనుమతుల కోసం కేంద్ర మంత్రిత్వ శాఖకు అర్జీ పెట్టుకున్నట్లు కంపెనీ డాక్యుమెంట్ల ద్వారా తెలుస్తోంది. అందుకు పర్యావరణ మంత్రిత్వ శాఖ జెండా ఊపి ఎల్‌జి కంపెనీ అప్లికేషన్‌ని పరిశీలించింది దాంట్లో వాళ్లకి తెలిసిందేమిటంటే ఎల్‌జి పాలిమర్స్‌కి ఎలాంటి అనుమతులు లేకుండానే ఉత్పత్తులు

కొనసాగిస్తోందని రికార్డులు చూసి అర్థం చేసుకున్నారు. దాంతో మంత్రిత్వ శాఖ వారు కంపెనీకి ఒక సూచన చేశారు. గడిచిన కాలానికి జరిగిన ఉత్పత్తికి ఒకేసారిగా క్షమాపణ మంజూరు చేస్తూ తూ.గో అనుమతిస్తామని అందుకుగాను అర్జీ పెట్టుకోమని చెప్పింది. ఎల్‌జి కంపెనీ క్షమాపణకు పర్యావరణ అనుమతికి మళ్లీ అప్లై చేసింది. ఏం జరిగిందో ఏమో బహుశా కంపెనీలో భద్రతా చర్యలను పర్యావరణ రక్షణ చర్యలను ఇతర విషయాలను ఒక నిపుణుల కమిటీ తోటి పరిశీలించకుండా అందుకు ఎలాంటి ఆదేశాలు జారీ చేయకుండా క్షమాపణ ఇస్తే ఎక్కడ అభాసుపాలు అవుతామో ఏమో? అని మిన్నకుండిపోయారో, లేక మరే ఇతర కారణాలవల్లనో అప్లికేషన్ ఇంతవరకు పెండింగ్లోనే ఉంది. చివరకి జరిగింది ఏంటంటే కేంద్ర రాష్ట్ర సంబంధాల మంత్రిత్వశాఖల అనుమతి లేకుండానే ఎప్పట్లాగే ఎల్‌జి కంపెనీ ఉత్పత్తి కొనసాగిస్తోంది. అయినా చావో గారు మేము ఉత్పత్తిని పెంచిన ప్రతిసారి కేంద్ర రాష్ట్ర అనుమతులు ఉన్నాయని బుకాయిస్తున్నారు. నిజానికి రాష్ట్ర అధికారులు రెండుసార్లు మాత్రమే అనుమతులు జారీ చేశారు 1) కొత్త వ్యాపారాన్ని మొదలు పెట్టడానికి 2) ఉత్పత్తిని నిర్వహించడానికి, ఈ రెండు అనుమతులు పర్యావరణానికి తీవ్ర విఘాతం కలిగించే ప్రతి కంపెనీకి ప్రాథమికంగా జారీచేసి కంపెనీని పరిశీలిస్తారు. ఈ అనుమతిని ప్రతి ఐదు సంవత్సరాలకి పరిశీలన అనంతరం రెన్యూవల్ చేసుకోవాలి కానీ అలాంటిది జరిగినట్లు దాఖలాలు లేవు.

ఎల్‌జి పాలిమర్స్ రెన్యువల్ కోసం వెళ్లిన ప్రతిసారి ఎపి పొల్యూషన్ అధికారులు కంపెనీకి జాతీయ చట్టాలను అనుసరించి జరిమానా విధించవచ్చు లేదా కంపెనీని పరిశీలించి అనుమతించటం కానీ నిరాకరించటం గాని చేయవచ్చు అయితే ఇవన్నీ ఫెడరల్ అనుమతులు అందిన తర్వాత జరుగుతాయి.

కేంద్రం అనుమతి ఫ్యాక్టరీని పరిశీలించి కాలుష్య కారక పదార్థాలను వ్యాప్తిని ప్రమాదాన్ని ప్రజలపై దాని ప్రభావాన్ని అంచనావేసి తగిన నివారణ చర్యలు, భద్రతా చర్యలు వాటి యంత్రాంగాలను అమర్చిన తర్వాతే అనుమతి ఇస్తుంది. కానీ ఇలాంటివేవీ జరగకుండానే కంపెనీ యధావిధిగా తన ఉత్పత్తిని కొనసాగిస్తోంది.

సేన్ గుప్తా అనే మాజీ కాలుష్య వ్యతిరేక ఏజెన్సీ అధికారి, కేంద్రం కేవలం పట్టించుకుంటుంది అని రాష్ట్రం ప్రాంతీయ బోర్డులు పరిశ్రమలలోని విష రసాయనాలను వాటి ప్రమాదాలను భద్రతా చర్యలను పట్టించుకుంటాయి అని ఆ బాధ్యత రాష్ట్రానిదేనని అన్నారు. విలేఖరులు స్టేట్ బోర్డ్ పర్యావరణ అధికారి వివేక్ యాదవ్ ఫెడరల్ అనుమతులు లేకపోయినా పరిశ్రమకి అది కొనసాగించే ఉత్పత్తికి రెన్యువల్ చేస్తున్నారు. ఎందుకని ప్రశ్నిస్తే దానికి ఆయన సమాధానం విషయం పరిశీలనలో ఉంది అని దాటేస్తున్నారు. ఎవరికి వారు బహుళ జాతి కంపెనీలకి వారి అక్రమాలకు అనుకూలంగా బాధ్యతలను విభజించుకొని వాటిని అమలు చేయకుండా కూర్చున్నారు. దీన్ని అవకాశంగా తీసుకొని ఎల్‌జి పాలిమర్స్ ఎలాంటి అనుమతులు లేకపోయినా తన ఉత్పత్తిని యథేచ్ఛగా కొనసాగిస్తోంది.

**పర్యావరణ చట్టాలు గాలిలో ఎగిరే చిత్తు కాయితాలు**

భోపాల్ గ్యాస్ దుర్ఘటన తర్వాత పర్యావరణ పరిరక్షణ చట్టం 1986, పబ్లిక్ లైఫ్ ఇన్సూరెన్స్ యాక్ట్ 1991, ప్రమాదకర రసాయనాల ఉత్పత్తి నిల్వ రవాణా, దిగుమతి చట్టం 1989 ఇలాంటి ఎన్నో పటిష్టమైన చట్టాలు పర్యావరణ రక్షణ కోసం, ప్రజల రక్షణ కోసం చేశారు. ఎల్‌జి పాలిమర్స్ బహుళజాతి సంస్థ దేశంలోని ఈ చట్టాలు వేటిని అనుసరించలేదు సరికదా కనీసం గమనించినట్లు కూడా లేదు. ఫ్యాక్టరీ అమైండ్మెంట్ యాక్ట్ 1987 ప్రకారం-1 ఫ్యాక్టరీ ప్రమాదకర ఉత్పత్తి విభాగాలను వాటి నిర్మాణాలను వివరించి ప్రభుత్వానికి నివేదిక ఇవ్వాలి. ఫ్యాక్టరీలోని కార్మికుల రక్షణ ఫ్యాక్టరీ దగ్గర నివసించే ప్రజల రక్షణ వాటికోసం తీసుకునే నివారణ చర్యలు ఆ యంత్రాంగం గురించి ఒక నివేదిక సమర్పించాలి కానీ ఇలాంటివి ఏవి చేయలేదు.

ఎల్‌జి పాలిమర్స్ బహుళజాతి సంస్థ, అంతర్జాతీయ ప్రమాణాలను అనుసరించి పర్యావరణ సూత్రాలను పాటించి భద్రతా చర్యలను తీసుకొని ఉత్పత్తిని కొనసాగిస్తున్నాం అని పదే పదే చెప్పుకుంటోంది. కానీ జాతీయ పర్యావరణ, అటవి వాతావరణ పరిరక్షణ మంత్రిత్వ శాఖ (యూనియన్ మినిస్ట్రీ ఆఫ్ ఎన్విరాన్మెంట్ ఫారెస్ట్ అండ్ క్లైమేట్ చేంజ్)కి సమర్పించిన అఫిడవిట్లో కంపెనీ ఎన్విరాన్మెంట్ అసెస్మెంట్ నోటిఫికేషన్ (ఇఐఏ) 2006 చట్టం కింద ఎలాంటివి పొందలేదని స్పష్టమవుతోంది కేవలం ఆంధ్రప్రదేశ్ పొల్యూషన్ కంట్రోల్ బోర్డ్ నుండి కంపెనీ స్థాపించడానికి కార్యక్రమాలు నిర్వహించడానికి మాత్రమే అనుమతులు పొందింది. ప్రమాదాన్ని పరిశీలిస్తే కంపెనీ ఎలాంటి భద్రతా ప్రమాణాలను పాటించలేదని, స్టెరీన్ వినియోగానికి సంబంధించి తీసుకోవలసిన పర్యావరణ అనుమతులు భద్రతా చర్యలు వాటి వివరణలు కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలకు అందజేయలేదని తెలుస్తోంది.

కేంద్ర ప్రభుత్వం చట్ట బాహ్యంగా కొనసాగుతున్న ఉత్పత్తిని పట్టించుకోలేదు కానీ 1996 చట్టాన్ని అనుసరించి కేంద్రం ఏర్పరుచుకున్న ఎన్‌డిఎంఏ టీంని సాయంత్రం కల్లా పంపింది. నిజానికి ఆ తత్వం ప్రకారం ఇలాంటి టీంలు ప్రతి రాష్ట్రంలో కూడా ఉండాలి.

2017 మార్చ్‌లో కేంద్ర ప్రభుత్వం ఒక ప్రకటన ద్వారా ఎవరైనా కొత్తగా పరిశ్రమ స్థాపిస్తున్నా, విస్తరణ చేస్తున్నా లేదా ఆధునికరిస్తున్నా అలాంటి వారికి పర్యావరణ అనుమతులు వివిధ చట్టాలు కింద పర్యావరణ అనుమతులు లేకపోతే వెంటనే అప్లై చేసుకోమని ప్రకటించింది. ఆ రకంగా దేశవ్యాప్తంగా కొన్ని వందల కంపెనీలు ఎలాంటి ప్రమాణాలు లేకపోయినా కేంద్రం నుంచి అనుమతులు పొందాయి.

పర్యావరణ చట్టాలను, భద్రత చట్టాలను, కార్మిక చట్టాలను అనుసరించకుండా అభివృద్ధి పేరిట ఉత్పత్తిని కొనసాగిస్తున్న పరిశ్రమల పట్ల చర్యలు తీసుకోవాల్సింది పోయి, వారికి అనుమతులు ఎలా ఇస్తున్నారో ఈ సంఘటన తెలియజేస్తుంది.

యూనియన్ మినిస్ట్రీ ఆఫ్ లేబర్ అండ్ ఎంప్లాయిమెంట్ మార్చ్ 16న లోక్‌సభలో ఆంధ్రప్రదేశ్లో 2012 నుంచి 2017 వరకు పారిశ్రామిక ప్రమాదాలలో 383 మంది మరణించగా 1047 మంది కార్మికులు గాయపడ్డారని, కేవలం విశాఖపట్నంలో 2007 నుంచి 2017 వరకు జరిగిన జరిగిన ప్రమాదాలలో 54 మంది మరణించారని ఇవన్నీ ఆయా కంపెనీలలో సరైన రక్షణ వ్యవస్థ లేకపోవడం వల్ల జరిగినవే అని ప్రకటించింది.

స్టాండర్డ్ ఆపరేటింగ్ ప్రోటోకాల్ అనగా నాణ్యమైన ఉత్పత్తి ప్రమాణాలను అనుసరించకపోవడం, ప్రమాదకర రసాయనాలను నిర్లక్ష్యంగా నిర్వహించటం, ప్రమాదం జరగకుండా ఒకవేళ జరిగిన

# ఎల్.జి. పాలిమర్స్ నిర్లక్ష్యానికి అమాయకుల బలి

***ఎల్.జి. పాలిమర్స్ కంపెనీ నుండి ప్రమాదకరమైన విషవాయువు బయటికి రావడం, దాన్ని అదుపుచేసే వ్యవస్థ లేకపోవడంతో ఆ వాయువు పీల్చిన ప్రజలు ఊపిరాడక పిట్టల్లా రాలిపోవడానికి యాజమాన్యం నిర్లక్ష్యమే కారణం అంటున్నారు* అన్నపూర్ణ**

ప్రముఖ పారిశ్రామిక నగరంగా ప్రసిద్ధి చెందిన విశాఖపట్నంలో ఎల్.జి.పాలిమర్స్ ప్లాంట్ నుండి వెలువడిన పోలీ స్టైరీన్ విషవాయువు సంఘటన అత్యంత ఘోరమైంది. మే 7 తెల్లవారు జామున 3.30 గంటలకు ఆర్ఆర్ వెంకటాపురం గ్రామంలో ఉన్న ఎల్.జి కంపెనీ నుంచి విషవాయువు విడుదలయ్యింది. దీని కారణంగా పరిశ్రమను ఆనుకుని ఉన్న వెంకటాపురం, నందమూరి నగర్, జనతాకాలనీ, కంపరపాలెం, పద్మనాభనగర్, ఆర్.ఆర్.వి.పురం, గొల్లపేట సుమారు తొమ్మిది గ్రామాల ప్రజలు తీవ్ర అస్వస్థతకు గురయ్యారు. నిద్రలోనే విషవాయువును పీల్చి ఏం జరిగిందో తెలియకుండానే ఎనిమిది మంది ప్రాణాలు కోల్పయారు. ఇంకా 250 మంది ఆసుపత్రిలో ప్రాణాపాయ స్థితిలోకి నెట్టబడ్డారు. సుమారు 600 మంది వైద్య చికిత్స పొందారు. లక్ష మంది తీవ్ర భయభ్రాంతులకు గురయ్యారు. వందలాది మంది పసి పిల్లలతో ప్రాణ భయంతో దిక్కుకొక్కరుగా పరుగులు తీశారు. పశువులు, పక్షులు, జంతువులు మరణించాయి. చెట్లు మాడిపోయాయి. గాలి, నీరు, పంట కలుషితమైపోయాయి. ఆ తర్వాత నాలుగు రోజుల పాటు ప్లాంట్‌కి 10 కిలోమీటర్ల దూరంలో ఉన్న గ్రామాల ప్రజలు సైతం ఆ విషవాయువు వాసనకి భయపడ్డారు. అధికారులు ఊళ్లు ఖాళీ చేయమన్నారు. భయంతో వాళ్లంతా అర్ధరాత్రులు పిల్లా పాపలతో రోడ్లెక్కారు. నగరంలోని బి.ఆర్.టి.ఎస్ రోడ్లన్నీ నిండిపోయాయి. 40, 50 కిలోమీటర్లు కాలినడకన నగర శివారులకి చేరి రోడ్డువారన, బీచ్ ఒడ్డున పడుకున్నారు. షెల్టర్ హోమ్‌లలో ఎక్కడపడితే అక్కడ నాలుగైదు రోజుల పాటు మండుటెండల్లో అనేక ఇబ్బందులకు గురయ్యారు.

నెల రోజులు గడుస్తున్నా గ్రామాల్లో ప్రజలు ఇంకా ఇళ్లకు చేరుకోలేదు. ఇప్పటికీ ఆ గ్రామాలు ఖాళీగానే ఉన్నాయి. ప్రజలు భయభ్రాంతులకు గురై బయటే బంధువులు, స్నేహితుల ఇళ్లల్లో తల దాచుకుంటున్నారు. గ్రామాల్లో కనిపించిన ఎవరినీ కదిలించినా కన్నీరే. ఇంకా అక్కడ వాతావరణం మామూలు స్థితికి రాలేదు. ఎందుకంటే కళ్ల ముందే పోయిన ప్రాణాలు, భవిష్యత్తులో ఇక్కడి ప్రజల ఆరోగ్యాల మీద ఈ విష ప్రభావం ఎంత తీవ్రంగా ఉండబోతుందో? అనే ఆందోళన. అక్కడక్కడా కొంతమంది ఇళ్లను, ఇంటిలో వస్తువులను శుభ్రం చేసుకుంటూ అనారోగ్యంతో కనిపిస్తున్నారు. విషం కమ్మిన ఆహార దినుసులు పారబోసారు. నీళ్లు తాగొచ్చా లేదా, పంటలు పండించవచ్చా లేదా ఆవులు, గేదెల పాలు వినియోగించాలా వద్దా ఇలా అనేక అనుమానాలతో బతుకుతున్నారు. అంతేకాదు కళ్ల మంటలు, కడుపునొప్పి, ఒంటి మీద బొబ్బలుతో అనేక మంది ఇబ్బంది పడుతున్నారు. ఇంకా మనుషులు, పశువుల మరణాలు కొసాగుతూనే ఉన్నాయి. ఘటన తర్వాత మరో ఆరుగురు మరణించారు. పశువులు మరణిస్తున్నాయి. అసలే లాక్‌డౌన్ కారణంగా ఎన్నో ఆర్థిక ఇబ్బందులు ఎదుర్కొంటున్నారు. ఇప్పుడు ఈ విపత్తు వచ్చి పడింది. వాళ్లంతా జీవనాధారం కోల్పోయి మరింత ఆర్థిక సంక్షోభంలోకి నెట్టబడ్డారు.

ఆనాటి ఘటనలో ప్రజలు పిట్టల్లా రాలిపడిపోవడం దేశం మొత్తం చూసింది. ప్రమాదకరమైన స్టైరీన్ విషవాయువును అదుపుచేసే వ్యవస్థ యాజమాన్యానికి లేనపుడు ఆ పరిశ్రమకు అనుమతులెలా ఇచ్చాయో ప్రభుత్వాలు చెప్పాలి. యాజమాన్యం తీవ్రమైన నిర్లక్ష్యంతో ప్రజల ప్రాణాలు అంటే లెక్కలేనితనంతో కనపడుతుంది. జనావాసాల మధ్య ఒక పరిశ్రమ నడుస్తుంది. అందులో ఎలాంటి ప్రమాదకర వాయువులు వెదజల్లే అవకాశం ఉందో ప్రభుత్వాలు, అధికార యంత్రాంగ నిరంతర పర్యవేక్షణ ఉండాలి. భద్రతతో వ్యవహరించాలి. ఆ విషయం తెలిసిన పరిశ్రమ యాజమాన్యాలు అప్రమత్తంగా ఉండాలి. ఇటు యాజమాన్యం గానీ, అటు ప్రభుత్వం కానీ ఎక్కడా జవాబుదారీతనం లేకుండా వ్యవహరించాయి.

ఘటన జరిగినపుడు పరిశ్రమ యాజమాన్యం ఎక్కడా కనపించలేదు. లాక్‌డౌన్ తర్వాత ప్లాంట్‌ను ప్రారంభించినపుడు ట్యాంకులో ఉష్ణోగ్రత స్థితిగతులు ఎలా ఉన్నాయో? నిర్వాహకులు చెప్పాలి. గ్యాస్ లీకయినపుడు నివారించగలిగే యంత్రాంగం సాంకేతిక నిర్మాణం ప్రణాళికలు లేకపోవడం వల్ల, చట్టాలున్నా వాటిని పటిష్టంగా కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు అమలు చేయకపోవడం అభివృద్ధి పేరిట పరిశ్రమలకు సరైన ప్రమాణాలు లేకపోయినా అనుమతించటం వల్ల జరిగిన నిర్లక్ష్యపూరిత మారణకాండ మే 7న వైజాగ్‌లో జరిగిన దుర్ఘటన. ఇది మొదటిది కాదు చివరిదీ కాదు. ఎందుకంటే వైజాగ్ సముద్ర తీరం వెంబడి ఎన్నో ఫార్మాస్యూటికల్ కంపెనీలు సరైన పర్యావరణ అనుమతులు లేకపోయినా భద్రతా చర్యలు పాటించకపోయినా వాటి విసర్జనాలతో కలుషిత రసాయనాలతో పర్యావరణాన్ని సముద్ర తీరాన్ని కలుషితం చేస్తున్న అడ్డదారుల్లో ఉత్పత్తిని కొనసాగిస్తున్నాయి. వీటన్నిటిలో రసాయనిక చర్యలు జరపటానికి ఎన్నో రియాక్టర్లు ఉన్నాయి. ఇవి సరైన ప్రమాణాలతో నిర్మించారా లేదా అని చూసేవాళ్లు లేరు. తనిఖీ చేసేవాళ్లు లేరు. ఇవి ఎప్పుడు పేలతాయో ఇంకా ఎంతమంది చనిపోతారో తెలియదు. ఇంక రాబోయే కాలంలో ప్రమాదం జరిగిన ప్రతిసారి కింద నుండి కార్మికుల, ప్రజల ఆత్మలు పైకెగురుతుంటే పైనుంచి డాలర్ల వర్షం కురుస్తూ ఉంటుంది.

*(రచయిత న్యాయవాది)*

వీ

ప్రమాద సూచికను తెలియజేసే అల్లారం మోగించలేదు. గ్యాస్‌ను అదుపు చేసే చర్యలు లేవు. ప్రజలను అప్రమత్తం చేసే ప్రయత్నం జరగలేదు. బాధితులను ఆదుకోవడానికి ఏ చర్యలూ తీసుకోలేదు. ఆ గ్రామాల్లో ఉన్న యువకులు చొరవతోనే చాలా మంది ప్రాణాలు నిలబడ్డాయి. ఇంత విషాదం జరిగాక ఇప్పుడు పరిహారాలు, కమిటీలు, విచారణలు ఏమి శోధిస్తాయి. నిందితులెవరు? శిక్షలు ఉంటాయా? నిందితుల జాబితాలో ప్రభుత్వాన్ని ఎందుకు చేర్చలేదు.

విశాఖపట్నంలో ఇలాంటి విషాలను చిమ్మే పరిశ్రమలు అనేకం ఉన్నాయి. ఆయా పరిశ్రమల్లో పనిచేస్తున్న కార్మికులు, వాటి చుట్టూ నివసిస్తున్న ప్రజలు పరిశ్రమల నుండి వెదజల్లే అనేక విష తుల్యాలకు బలైపోతున్నారు. నీళ్లు గాలి కలుషితమైపోయాయి. అనారోగ్య అపరిశుభ్ర వాతావరణంలో బతుకులు వెళ్లదీస్తున్నారు. రాత్రులు ఆ పరిశ్రమల నుండి వెదజల్లే వాయువుల వలన ఒంటి మీద పడి బొబ్బలు రావడం, ఇంకా అనేక అనారోగ్య ఇబ్బందులకు గురవుతున్నారు. ఒక్క పరవాడ ఎన్‌టిపిసి పవర్ ప్లాంట్ వలన అక్కడ ప్రజలు కాలుష్య విష వాయువుల వలన కనీస అవసరమైన నీటికి కూడా నోచుకోవడంలేదు. బోరుల్లోంచి వచ్చే ఎర్రటి నీటితో బతుకులు దీరిబోతున్నాయి. అనేకమంది శ్వాస కోస వ్యాధుతలో, చర్మ వ్యాధులతో, దీర్ఘకాలిక రోగాలతో బతుకుతున్నారు. మహిళల ప్రత్యుత్పత్తి ప్రశ్నార్థమైపోయింది. ఆ ప్రజలంతా పరిశ్రమనో వాళ్ల గ్రామాలనో అక్కడి నుండి తరలించమని వాళ్ల పిల్లలకు బతికే అవకాశాలను కల్పించమని ఎన్నో ఏళ్లుగా అర్థిస్తున్నారు. పారిశ్రామిక ప్రాంతమైన గాజువాకలోని చుట్టు పక్కల ప్రాంతాల్లోని ప్రజలంతా ఇదే వాతావరణంలోనే బతుకుతున్నారు. పరిశ్రమలు, యాజమాన్యాలు ఏ పర్యావరణ నిబంధనలు, ప్రమాణాలు పాటించకపోయినా, చట్టాలను ధిక్కరించినా పాలుకులు పట్టించుకునే బాధ్యతను విస్మరిస్తున్నాయి. ఏదో పెద్ద పెను ప్రమాదం జరిగితే తప్ప ప్రభుత్వాలు స్పందించడం లేదు. ఇక్కడ పారిశ్రామిక వాడ చుట్టూ అనేక ప్రాణాంతక సమస్యలు చుట్టిముట్టి ఉన్నాయి.

ఇక్కడే కాదు ఈ దేశంలో వేల పరిశ్రమలు ఎటువంటి పర్యావరణ ప్రమాణాలు, నిబంధనలు పాటించకుండానే నడుస్తున్నాయి. పర్యావరణ చట్టాల అమలుకి అతీగతీ లేదు. ఎప్పుడైనా ప్రమాదాలు జరిగితే నాలుగు రోజులు హడావిడి చేసి పరిహారాలు ప్రకటించి చేతులు దులుపుకుంటున్నాయి. ప్రమాదం జరిగాక చెల్లించే పరిహారాలు ఈ సమస్యకు శాశ్వత పరిష్కారం కాదు. ఈ పరిశ్రమల యాజమాన్యాల మీద గానీ నిర్లక్ష్యంగా అనుమతులిస్తున్న అధికారుల మీద గానీ ఎటువంటి క్రిమినల్ చర్యలు ఉండడం లేదు. ఫలితంగా పేద ప్రజలు మళ్లీ మళ్లీ మూల్యం చెల్లించుకుంటూనే ఉన్నారు.

అధికారంలోకి వచ్చిన పాలకులందరిదీ ఒకటే దారి. అది కార్పొరేట్ రహదారి. గత 30 యేళ్లుగా దేశంలో ఉన్న ప్రభుత్వ రంగ సంస్థలు, సహజ వనరులు, మానవ వనరులు అంగడిలో సరుకులయ్యాయి. రోజు రోజుకి విదేశీ పెట్టుబడులు, బహుళజాతి కంపెనీల పెత్తనం పెరిగిపోయింది. ఈ దేశంలో సరళీకరణ ఆర్థిక విధానాలు ప్రారంభం నుండే దేశంలో ప్రభుత్వాల బాధ్యత పక్కకు వెళ్లిపోయింది. ప్రజల బాధ్యత పెట్టుబడిదారుల చేతుల్లోకి వెళ్లిపోయింది. ఫలితం ప్రజల దైనందిన జీవితాల్లో ఏ పరిహారాలకు అందని విధ్వంసాన్ని చూస్తున్నాం.

పచ్చని భూముల్లో కాంక్రీట్ కార్ఖానాలు వెలుస్తున్నాయి. తీరం వెంబడి విచ్చలవిడిగా సాగుతున్న రసాయనిక పరిశ్రమలు, పోర్టులు, పవర్ ప్లాంట్‌ల నిర్మాణాలు. విచ్చల విడిగా సాగుతున్న చెట్లు, అడవుల నరికవేత, ప్రాజెక్టుల పేరుతో జరుగుతున్న మైనింగ్. నూతన గనుల చట్టం అమల్లోకి వచ్చిన తర్వాత 3.36 లక్షల ఎకరాల అడవి నాశనం అయ్యింది. మొత్తంగా ఈ దేశంలో 40 శాతం అడవి నాశనం అయ్యిందని లెక్కలు చెబుతున్నాయి. వ్యవసాయం, ప్రకృతి వనరుల వినాశనం, పరిశ్రమల కాలుష్యం నిరాఘాటంగా సాగుతుంది. దీనివలన వాతావరణంలో పెను మార్పులు చోటుచేసుకుంటున్నాయి. అధిక ఉష్ణోగ్రతలు, అతి వేడి పెరిగిపోయాయి. వాతావరణంలో చెలరేగుతున్న ఈ విపరీత మార్పుల వలన సంవత్సరానికి 3.50 లక్షల మంది మరణిస్తున్నారు. సుమారు 33 కోట్ల మంది ప్రజలు అనేక అనారోగ్యాలకు లోనవుతున్నారు. దేశానికి 125 బిలియన్ డాలర్ల ఆర్థిక నష్టం వాటిల్లుతుందని గణాంకాలు చెబుతున్నాయి.

ఈ విధ్వంసానికి కారకులెవరు? సంపదను పోగుచేసుకోవాలనే ఒక 57 మంది సంపన్నుల దాహం కోసం 70 శాతం అట్టడుగు జనాభా తమకు ఏ సంబంధంలేని విధ్వంసానికి మూల్యం చెల్లిస్తున్నారు. ఇది అత్యంత అమానవీయం. అన్యాయం. ఈ ఘోరాన్నే ఈ దేశ పాలకవర్గాలు ప్రజాస్వామ్యం పేరుతో పాలనను కొనసాగిస్తున్నాయి. ప్రజలను నమ్మిస్తున్నాయి. దీనిని ఈ దేశంలోని న్యాయ వ్యవస్థ, సమాచార వ్యవస్థ, ప్రసార మాధ్యమాలు బలపరుస్తున్నాయి. ప్రజావ్యతిరేక పాత్రను పోషిస్తున్నాయి.

అంతేకాదు ప్రజలకు జరగబోయే నష్టాన్ని గుర్తించిన ఎంతోమంది మేధావులు ఉన్నారు. వాళ్లంతా ఈ విధ్వంసానికి వ్యతిరేకంగా ప్రజల పక్షాన నిలబడి మాటాడారు. రాశారు. పోరాడారు. వాళ్లందరినీ అడ్డుతొలగించు కోవడానికి ఈ రోజు మోదీ ప్రభుత్వం జైళ్లలో నిర్బంధించింది. శిక్షలు విధించింది. రాజ్యాంగాన్ని, న్యాయ వ్యవస్థను, చట్టాలను మింగేస్తుందీ. వృద్ధులు, వికలాంగులు, అనారోగ్యాలతో ఉన్న వీళ్లందరి పట్ల ఎంతో పాశవికంగా వ్యవహరిస్తుంది. ఎందుకంటే ఈ దేశంలో అట్టడుగున పడి మగ్గిపోతున్న ప్రజలకు నిజమైన శ్రేయస్సుని కోరుకుంటున్న వీళ్ల నుండి జ్ఞానం అందకుండా చేయాలనే దురుద్దేశం తప్పా మరేమీ లేదని ప్రజలు గుర్తించాలి.

ఈ దేశంలో ఎల్‌జి విష వాయువు ఘటన మొదటిదీ కాదు చివరదీ కాదు. దీనికి భోపాల్ ఘటన నుండి ఇప్పటి వరకు జరిగిన అనేక ఘటనలే నిదర్శనం. ఎందుకంటే ఈ వ్యవస్థ ఇలాగే నడిచినంత కాలం ప్రజల ధన మాన ప్రాణాలకు భరోసా ఉండదు. ప్రకృతినీ, సహజ వనరులను బతికించుకుంటేనే మానవ మనుగడ నిలకడగా సాగుతుంది. ఎడతెరిపి లేకుండా సాగుతున్న ఈ ఆర్థిక విధ్వంసం, మానవ వనరుల విధ్వంసం ఆగాలంటే ఈ దోపిడీ వ్యవస్థను మార్చుకోవాలి. అది ఓటు ద్వారా మారదనే సత్యం ఏడు దశాబ్దాల చరిత్రగా మన ముందు నిలబడింది. కాబట్టి మన భవిష్యత్తరాల బతుకు బాట మార్చేది పోరాటమొక్కటే. అందునా ఈ కరడు గట్టిన పాలకులను తరిమి కొట్టాలంటే విశాల ప్రజా ప్రతిఘటనా పోరాటమే అంతిమ లక్ష్యంగా ఉండాలి.

*(రచయిత ప్రగతిశీల కార్మిక సమాఖ్య ఎపి రాష్ట్ర కమిటీ సభ్యురాలు)* వీ

# జివో నెం. 3 రద్దుకు గిరిజనేతరుల కుట్ర

*గిరిజనులకు రక్షణ కల్పిస్తున్న జి.ఓ. నెం.3ను రద్దుచేయడానికి గిరిజనేతరులు, కార్పొరేట్ సంస్థలు, ఆర్ఎస్ఎస్ కలిసి కుట్రపన్నాయనీ, దీన్ని సమ్మక్క, సారలమ్మ స్ఫూర్తితో ఆదివాసి సమూహం ఎదుర్కోవాలనీ అంటున్నారు* **వూకె రామకృష్ణ దొర**

సమాజ పరిణామ క్రమంలో ఆదివాసి సమాజంలో వలసలుగా బతకుదెరువు కోసం వచ్చిన గిరిజనేతరులు నేడు ఆదివాసి సమాజాన్ని ఆదివాసి అస్తిత్వాన్ని అంతంచేసే విధంగా తయారవుతున్నారు. ఆదివాసి సమాజంలో గిరిజనేతర సామ్రాజ్యవాదాన్ని పెంచి పోషిస్తున్నారు. ఏజెన్సీలోకి వలసలుగా వచ్చిన గిరిజనేతరులు కాలక్రమేన ఏజెన్సీని అన్ని విదాలుగా కొల్లగొడుతున్నారు. ఏజెన్సీలో ఆదివాసీలకు దక్కాల్సిన ఉద్యోగ అవకాశాలను సైతం ఆక్రమిస్తు ఆదివాసీల నోటి కాడి కూడు కూడా లాక్కుంటున్నారు. ఏజెన్సీలో 5వ షెడ్యూల్ భూబాగంలో ఆదివాసీల రిజర్వేషన్‌ను కబ్జా చేస్తున్నారు. ఏజెన్సీలో జి.ఓ. నెం 3 రద్దు చేయాలనే కుట్రతో సుప్రీంకోర్టును ఆశ్రయించి సామాజిక న్యాయాన్ని సమాధి చేస్తున్నారు.

ఏజెన్సీలో గిరిజనేతర రాజకీయ పార్టీలు, ఏజెన్సీలో ఎర్రజెండా పార్టీలు జి.ఓ. నెం. 3ని నిర్వీర్యం చేయాలనే దురుద్దేశ్యంతో కుట్రలు కుయుక్తులు పన్నుతున్నాయి. ఏజెన్సీలో ఆదివాసీలకు ప్రధాన శత్రువులుగా గిరిజనేతరులు, వారికి నాయకత్వం వహిస్తున్న భూర్జువా పార్టీలు, ఎర్రజెండా పార్టీలు మారుతున్నాయి. 2000 సంవత్సరంలో ప్రభుత్వం తెచ్చిన జి.ఓ. నెం. 3 ఆదివాసి సమాజంలో ఆదివాసీలకు, ఆదివాసీలచే విద్యని బోదించడం, ఆదివాసి సమాజంలో నిరుద్యోగాన్ని తొలగించడం ముఖ్య ఉద్దేశ్యం ఉన్నప్పటికిని ఆచరణలో లంబాడీలకే ఎక్కువ ఉద్యోగాలు వచ్చిన చరిత్ర ఉంది. జి.ఓ. నెం. 3ని కుదించడం మూలంగా ఆదివాసి సమాజంలో ఉపాద్యాయ ఉద్యోగాలు ఇక పగటికలగా మారే అవకాశం ఉంది. ఏజెన్సీలో 100 శాతం ఉద్యోగాలు ఉన్నప్పుడే సగం చట్ట విరుద్ధంగా లంబాడీలు దోచుకున్నారు. జి.ఓ. నెం. 3లో 50 శాతం అంటే ఆదివాసీలకు ఏమాత్రం ఇక ఉపాద్యాయ ఉద్యోగాలు వచ్చే అవకాశం లేదు. భారత రాజ్యాంగంలో 343 ఆర్టికల్ 2 ప్రకారం గిరిజనేతరులు ఏజెన్సీలో నివసించడానికి అవకాశం లేనప్పుడు అదే ఏజెన్సీలో ఉద్యోగం ఎలా చేస్తారో ఆదివాసీలకు ఈ రాజకీయ పార్టీలు, న్యాయవ్యవస్థ సమాధానం చెప్పాలి. ఆదివాసి సమాజంపై అవగాహన లేకనా గిరిజనేతర దనదాహానికి లోనయి ఇలాంటి తీర్పులు వెలువడుతున్నాయా... అనేది మేదావులు ఆలోచన చేయాలి. భారత దేశంలో ఆదివాసి అడవి బిడ్డలకు ఉన్న రిజర్వేషన్లు, చట్టాలు, జి.ఓ.లు కాలక్రమేణ సమాజ పరిణామ క్రమంలో గిరిజనేతర సామ్రాజ్యవాద వత్తిడితో నిర్వీర్యం చేయడం ఏ సామాజిక న్యాయానికి స్ఫూర్తో ఏజెన్సీలో ఉన్న గిరిజనేతర పార్టీలు, ఎర్రజెండా పార్టీలు ఆలోచన చేయాలి. 2000, జనవరి 10న ప్రభుత్వం జారీ చేసిన జి.ఓ. నెం. 3 ప్రకారం 100 శాతం ఉపాద్యాయ నియమాకాలు జరిపి ఆదివాసి ప్రాంతాల్లో నిరక్ష్యరాస్యతను నిరుద్యోగాన్ని పారదోలాలనీ సామాజిక సంకల్పంతో ప్రభుత్వం తీసుకవచ్చిన జి.ఓ.ను సవాల్ చేస్తూ గిరిజనేతరులు సుప్రీం కోర్టును ఆశ్రయించడం తిన్నింటి వాసాలు లెక్క పెట్టడమే అవుతుంది. బారత రాజ్యాంగం ప్రకారం ఏజెన్సీ ప్రాంతాల్లో నివసించడానికి అర్హులు కానీ గిరిజనేతరులు, అదే ఏజెన్సీలో ఏ చట్టం ప్రకారం ఉద్యోగం చేస్తారో సుప్రీంకోర్టు ఆదివాసి సమాజానికి సమాదానం చెప్పాలి. ఇదే సుప్రీంకోర్టు సమత జడ్జిమెంట్‌లో ఏజెన్సీలో కూడ ప్రభుత్వాన్ని గిరిజనేతరుడి గానే చూడాలని తీర్పు వెలువరించలేదా...? సమాజ పరిపరిణామ క్రమంలో ఆదివాసి సమాజ వ్యతిరేక తీర్పులు న్యాయస్థానాల నుండి వెలువడడం ఇది ఖచ్చితంగా అగ్రవర్ణ గిరిజనేతర బాహ్మణ మతోన్మాద న్యాయస్థానాల తీర్పులుగానే పరిగణించాలా...? ఈ దేశంలో ఉన్న అత్యున్నత న్యాయస్థానాలు కూడా ఆదివాసీలకు అన్యాయం చేస్తే ఆదివాసీల పరిస్థితి ఏమిటి...?

ఆదివాసీలు తమ గోడు ఎవరికి చెప్పకోవాలి. ఇటు పాలకులు అటు న్యాయవ్యవస్థలు ఆదివాసీల పట్ల అన్యాయంగా మాట్లాడితే ఆదివాసీల అస్తిత్వం అంతమై పోదా...? ఆదివాసీల విద్య, ఉపాధి, ఉద్యోగ అవకాశాలు గిరిజనేతరులు, లంబాడీలు అక్రమంగా దోచుకుంటే అదే ఏజెన్సీలో ఉన్న గిరిజనేతర పార్టీలు, ఎర్రజెండా పార్టీలు నిమ్మకు నీరెత్తినట్లు వ్యవహరిస్తు నిద్రపోతున్నాయి. జి.ఓ. నెం. 3 పైనే గిరిజనేతరులు ఆధిపత్యం చెలాయిస్తే మిగతా చట్టాల పరిస్థితి ఏమిటి...? ఆదివాసీల చట్టాలు జి.ఓ. అమలు చేయాల్సిన పాలకులు నిర్లక్ష్యంగా వ్యవహరిస్తే ఆదివాసీల జీవన విదానం ధ్వంసం అవుతుంటే ఎందుకంత నిర్లక్ష్యం నిర్లిప్తత నిస్సహాయత ...? ఏజెన్సీలో ఉన్న గిరిజనేతర పార్టీలు, ఎర్రజెండా పార్టీలు కూడ జి.ఓ. నెం. 3 పై తక్షణమే స్పందించాలి. స్పందించని పక్షంలో అన్ని గిరిజనేతర పార్టీలు ఏజెన్సీ వదిలి మైదాన ప్రాంతాలకు వెళ్లాలి. ఏజెన్సీలోకి విచ్చలవిడిగా గిరిజనేతరుల వలసలు పెరగడమే జి.ఓ. నెం. 3 పై సుప్రీంకోర్టు జడ్జిమెంట్‌గా ఆదివాసీలు గుర్తించాలి. న్యాయం ఎక్కడ ఉన్న ఒకటే. న్యాయాన్ని కాపాడడం న్యాయస్థానాల ప్రధాన బాద్యత. దోపిడి చేసే గిరిజనేతరులకు, అమాయకులైనా ఆదివాసీల మధ్య తలెత్తిన వివాదంలో ఎటువైపుతాము నిలుచుంటే న్యాయం సిద్ధిస్తుందో ఈ బూర్జవ న్యాయమూర్తులకు తెలియనిది కాదు. ఈ దేశంలో అడ్డు అదుపు లేకుండా చెలరేగుతున్న అగ్రవర్ణ గిరిజనేతర ఆధిపత్య శక్తులు, ఆదివాసీల పై ఎలా ఆధిపత్యం చెలాయిస్తున్నారో ఈ న్యాయమూర్తులకు తెలియనిది కాదు. ఈ పరిణామాల పై సమీక్ష చేయకుండా కోర్టులు రిజర్వేషన్ల పై వ్యాఖ్యనాలు చేయడం సామాజిక న్యాయాన్ని సమాధి చేయడమే అవుతుంది. దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించి ఏడు దశాబ్దాలు అయినా ఆదివాసి సమాజంలో గిరిజనేతర దోపిడీ, దగా, మోసం పోలేదు. కేంద్రంలో బిజెపి వచ్చినప్పటి

# భారత్‌పై మిడతల యుద్ధం

***దేశ సరిహద్దు రాష్ట్రమైన రాజస్తాన్‌లో మిడతల వల్ల లక్షల ఎకరాల పంటనష్టం జరగడానికి కారణం ప్రకృతి సంపదయిన అడవులను నరికివేయడమేనని అంటున్నారు* ఎం.కె. కుమార్**

ఏప్రిల్ చివరన భారతదేశంలో రాజస్తాన్ రాష్ట్రంలోని ఒక చిన్న గ్రామంలో తన భార్య, నలుగురు పిల్లలతో నివసిస్తున్న ఉమ్మద్ సింగ్ 30 ఎకరాల పంటను మిడతలు కేవలం 2 గంటలలో తినేశాయి. అతని కళ్ల ఎదుట ఈ దారుణ ఘటన జరిగింది. అతని ఊరి నుండి జైసల్మేర్ (పాకిస్తాన్) కేవలం ఒక గంట ప్రయాణం మాత్రమే. 'మేము ఈ రకమైన మిడుతల దాడిని చూడడం ఇదే మొదటిసారి' అని సింగ్ చెప్పారు. 'ఇది చూసిన తర్వాత, నేను ఆత్మహత్య చేసుకోవాలని అనుకుంటున్నాను' అని ఆయన చెప్పారు. మిడుతలు సుమారు 15 లక్షల రుపాయల నష్టాన్ని కలిగించాయి. పరిహారంగా ప్రభుత్వం కేవలం కొద్ది శాతం మాత్రమే ఇచ్చింది.

డిసెంబర్ 2019లో ఆసియా, ఆఫ్రికా, మధ్యప్రాచ్యంలో అసాధారణంగా మిడుతలు వ్యాప్తి చెందాయి. 2019లో, భారతీయ మహాసముద్రపు పశ్చిమ భాగంలో ఎనిమిది తుఫానులు వచ్చాయి. వ్యవసాయ భూములకు మంచి పంట వచ్చే అవకాశం వుంది. అయితే మిడతల దాడి నుండి పంటలను రక్షించడం పెద్ద సవాలుగా మారనుందని ఐక్యరాజ్యసమితి ఆహార వ్యవసాయ సంస్థ(ఎఫ్ఏఓ)తో సీనియర్ మిడుత అంచనా అధికారి కీత్ క్రెస్మాన్ చెప్పారు. మిడుత పెంపకం నేల తేమ, ఆహార లభ్యతతో ముడిపడి ఉంటుంది. కాబట్టి వర్షాలు మిడుత జనాభాపై బలమైన ప్రభావాన్ని చూపుతాయి.

మిడత సమూహాల నష్టాన్ని తగ్గించడానికి భారతదేశం, పాకిస్తాన్లు

---

నుండి సామాజిక అసమానతలు పెరుగుతున్నాయి. నేటికి ఆదివాసి సమాజంలో ఆర్థిక, రాజకీయ, సాంఘిక, సామాజిక, సాంస్కృతిక పరిస్థితులు మారలేదు. ఆదివాసీలకు రాజ్యాంగం కల్పించిన రక్షణలు చట్టాలు జి.ఓ.లు అమలు చేయాలని కోరుతూ న్యాయస్థానాలను ఆశ్రయించడమే చాలా అరుదు కాగా... న్యాయం కోరుతు తమ ముందుకు వచ్చిన అలాంటి వ్యాజ్యాల్లో సైతం కోర్టులు ఆదివాసి అడవి బిడ్డలకు న్యాయం చేయాల్సిన కనీస బాధ్యతను విస్మరించి, ఆదివాసీల పై పూర్తిగా వ్యతిరేకంగా వ్యవహరించడం సామాజిక న్యాయాన్ని సమాధి చేయడమే అవుతుంది. దేశ వ్యాప్తంగా ప్రభుత్వ ఉద్యోగాలు తగ్గి కార్పొరేట్ రంగం విస్తరిస్తున్న నేపథ్యంలో, కార్పొరేట్స్ సామాజిక న్యాయం తమ బాధ్యత కాదనీ కేవలం లాభాలు పోగేసుకోవడమే తమ లక్ష్యమనీ రిజర్వేషన్లను నిర్ద్వంద్వంగా వ్యతిరేకిస్తున్నాయి. ఏజెన్సీలో ఉన్న అన్ని గిరిజనేతర పార్టీలు కూడ కార్పొరేట్ల వాదనకు జై కొడుతున్నాయి. వారి భావజాలాన్ని, వారి ఎజెండాను తలకెక్కించుకొని జి.ఓ. నెం. 3ను నిర్వీర్యం చేయాలనే తీర్పులు చెబుతున్నది. ఆర్.ఎస్.ఎస్ మార్గదర్శ కత్వంలో నడుస్తున్న కేంద్రంలోని బిజెపి ప్రభుత్వం అగ్రవర్ణ గిరిజనేతర హిందూ మనువాద మతోన్మాద సిద్ధాంతాన్ని, ఆ భావజాలాన్ని అన్ని రాజ్యాంగ బద్ధ సంస్థల్లోకి నిదానంగా ఎక్కిస్తున్నది. ఇటీవలే ఆర్.ఎస్.ఎస్. చీఫ్ మోహన్ భగవత్ రిజర్వేషన్ల పై సమీక్షించాలన్నారు. అంతకు ముందు వాజపేయి హయాంలో రాజ్యాంగాన్ని సమీక్షించాలన్నారు. ఆ ప్రభావం ఇపుడు న్యాయవ్యవస్థలో కనిపిస్తుంది.

రామజన్మభూమి తీర్పు, శబరిమల తీర్పుల పై రాజ్యాంగ ధర్మాసనం నెలకొల్పే యత్నం ఈ కోవలోకే వస్తాయి. ఎస్.సి., ఎస్.టి. అట్రాసిటీ నిరోధక చట్టాన్ని నీరుగార్చి నిర్వీర్యం చేసే విధంగా గతంలో సుప్రీంకోర్టు ఇలాంటి తీర్పు ఇచ్చింది. గిరిజనేతర కుట్రలో భాగంగా జి.ఓ. నెం.3ని నిర్వీర్యం చేసే విదంగా సుప్రీంకోర్టు ఇలాంటి తీర్పు చెప్పింది. జి.ఓ. నెం.3 పై తీర్పు ఇది పక్కా ఆర్.ఎస్.ఎస్. తీర్పుగానే ఆదివాసి సమాజం భావిస్తున్నది. సుప్రీంకోర్టు జి.ఓ. నెం.3 పై అన్యాయమైన తీర్పు ఇచ్చినందుకు ఆదివాసి యువతరం, ఆదివాసి నిరుద్యోగులు ఆవేశ ఆగ్రహాలకు, నిరాశ నిస్పృహలకు లోనయి మళ్లీ నక్సలిజం వైపు మళ్లితే దానికి పూర్తి బాధ్యత ఈ పాలకులే వహించాలి. శ్రీకాకుళం సాయుధ పోరాటం, తెలంగాణ సాయుధ పోరాటం లాగా ఏజెన్సీలో జి.ఓ. నెం.3 కోసం ఆదివాసి సాయుధ పోరాటాలు మళ్లీ పురుడుపోసుకోక ముందే పాలకులు మేలుకోవాలి... ఆదివాసి రిజర్వేషన్లతో గెలిచి అసెంబ్లీలో అడుగు పెట్టిన ఆదివాసి శాసన సభ్యులు, పార్లమెంట్ సభ్యులు ప్రభుత్వంపై ఒత్తిడి తెచ్చి తక్షణమే జి.ఓ. నెం.3 పై రివ్యూ పిటిషన్ ప్రభుత్వం చే వేయించాలి. లేని పక్షంలో ఆదివాసి ఆగ్రహానికి గురికావాల్సి ఉంటుంది.

జి.ఓ. నెం.3ని చట్టంగా రూపొందించి ఆదివాసి యువతరానికి ఉద్యోగ అవకాశాలు కల్పించాలి. ఏజెన్సీలో ఆదివాసీలకు అత్యంత ప్రమాదకరంగా తయారైన లంబాడీలను, గిరిజనేతరులను గిరిజనేతర పార్టీలను, ఏజెన్సీలో ఎర్రజెండా పార్టీలను ఏజెన్సీ నుండి బహిష్కరించాలి. ఏజెన్సీలో గిరిజనేతర వలసలు అరికట్టాలి. ఏజెన్సీలో గిరిజనేతరుల ఓటు హక్కు రద్దు చేయాలి. ఏజెన్సీలో ఆదివాసీల చట్టాలు జి.ఓ.లు పకడ్బందీగా అమలు చేయాలి. ఏజెన్సీలో అదివాసి స్వయంపాలన కోసం పోరాడి అమరులైన సమ్మక్క సారలమ్మ విప్లవ స్ఫూర్తితో నేడు ఆదివాసి యువతరం జి.ఓ. నెం.3 కోసం గళమెత్తి గర్జించాల్సిన అవసరం ఎంతైనా ఉంది. ఏజెన్సీలో గిరిజనేతర సామ్రాజ్యవాదం పై సమర శంఖ పూరించాల్సిన అవసరం ఎంతైనా ఉంది. ఆ విప్లవ స్ఫూర్తితోనే ఆదివాసి చట్టాలు, జి.ఓ.లు కాపాడుకోవాలి.

*(రచయిత ఆదివాసి రచయితల వేదిక తెలంగాణ, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర కమిటీ)*

వీ

తమ ప్రయత్నాలను సమన్వయం చేసుకోవాలి. పాకిస్తాన్ నేషనల్ ఫుడ్ సెక్యూరిటీ అండ్ రీసెర్చ్ ఏజెన్సీ శాఖ అయిన ప్లాంట్ ప్రొటెక్షన్ డిపార్ట్‌మెంట్ సాంకేతిక డైరెక్టర్ ముహమ్మద్ తారిక్ ఖాన్ మాట్లాడుతూ, మిడుత మంటలు భారత–పాకిస్తాన్ సరిహద్దుకు ఇరువైపులా తీవ్రమైన ముప్పుగా ఉన్నాయి. మిడుత సమస్యను పరిష్కరించడానికి ఇప్పటివరకు రెండు దేశాలు తమ రాజకీయ విభేదాలను పక్కన పెట్టగలిగాయని ఖాన్ చెప్పారు. కానీ ఎక్కడైనా సరిహద్దు వివాదం ఆర్థిక వ్యవస్థలను, ఆహార భద్రతను దెబ్బతీసే అవకాశం ఉంది. గత సంవత్సరం, పాకిస్తాన్ ఉగ్రవాద సంస్థ ఆత్మాహుతి దాడి కారణంగా భారతదేశం, పాకిస్తాన్ మధ్య సంబంధాలు దెబ్బతిన్నాయి. పోయిన వేసవిలో, సమాచార మార్పిడి, వాణిజ్య కార్యకలాపాలు నిలిపివేయబడ్డాయి. సరిహద్దు వద్ద ఉద్రిక్తతలు పెరిగినప్పటికీ, మిడతల దాడులను ఎదుర్కోవడానికి ఎఫ్ఏఓ గొడుగు కింద చర్చలు జరిగాయి. ఎడారి మిడుత ముప్పును నివారించడానికి పాకిస్తాన్, భారత అధికారులు సరిహద్దు వెంబడి జీరో పాయింట్ వద్ద కలిశారు.

ఇరాన్లో 1979 విప్లవం ఇరాన్, పాకిస్తాన్ మధ్య మిడుత నిర్వహణ సహకారాన్ని దెబ్బతీసిందని ఆయన పేర్కొన్నారు. 1990 వ దశకంలో, ఇరు దేశాలు ఎఫ్ఏఓకి విజ్ఞప్తి చేశాయి. మధ్యవర్తిగా పనిచేయడంతో పాటు, ఎఫ్ఏఓ ప్రపంచంలోని అన్ని ప్రభావిత ప్రాంతాల నుండి డేటాను సేకరిస్తుంది. వాటిని ఆన్‌లైన్‌లో ఉంచుతుంది. అందువల్ల అన్ని దేశాలు పర్యవేక్షణ చర్యలు, పురుగు మందుల పిచికారీలను ప్లాన్ చేసుకోవచ్చు. ఎడారి మిడుత ప్రతిరోజూ తన బరువంత ఆహారాన్ని తీసుకుంటుంది. ఒక మిడుత రెండు గ్రాముల బరువు మాత్రమే ఉంటుంది. సాపేక్షంగా చిన్న సమూహంలో 40 మిలియన్ మిడుతలు ఉంటాయి. అలాంటి సమూహం ఒక రోజులో 35,000 మంది తినే ఆహారం కన్నా ఎక్కువ తీసుకుంటుంది. మిడుతలు రోజుకు దాదాపు 100 మైళ్ల దూరం ప్రయాణించగలవు. అంటే యెమెన్‌లో బయలుదేరిన మిడత సమూహం కేవలం రెండు వారాల్లోనే భారతదేశానికి రాగలదు. భారత్‌కు సుమారు 5 కోట్ల మిడతలు దండుగా వచ్చినట్టు శాస్త్రవేత్తలు అంచనా వేశారు.

ఎడారి మిడుతలకు భారతదేశ వాతావరణం అనుకూలంగా ఉంటుంది. వీటిలో పెద్దవి గోధుమ రంగులో ఉంటాయి. ఎడారి వాతావరణంతో కలిసిపోవడానికి వీటి రంగు వీలు కల్పిస్తుంది. సమీపంలోని వృక్ష సంపదతో కలపడానికి, తేమతో కూడిన నేలలో అభివృద్ధి చెందడానికి కొన్ని జాతుల మిడతలు ఆకుపచ్చగా ఉంటాయి.

పురుగు మందుల వల్ల చంపబడిన మిడుతలు భారతదేశంలోని జైసల్మేర్ సమీపంలోని ఒక గ్రామంలో భూమిని చెత్తకుప్పలుగా మార్చేశాయి. ఈ ప్రాంతంలో మిడుత నిర్వహణ భారతదేశం–పాకిస్తాన్ వివాదానికి ముందే ఉంది. పాకిస్తాన్ రాజధాని కరాచీలో 1926 నుండి 1931 వరకు క్రూరమైన మిడుత దాడులు జరిగాయి. తరువాత మిడత నివారణ కేంద్రం ఏర్పాటుచేయబడింది. సంవత్సరానికి ఆరుసార్లు, వేసవి సమయంలో, సరిహద్దు ఇరువైపుల నుండి ప్రతినిధులు కలుస్తారు. తెగులు, పెంపకం పద్ధతులు, నియంత్రణ వ్యూహాలు, పర్యవేక్షణ నివేదికలు, స్థానిక రైతుల సూచనలు తదితర అంశాలపై చర్చిస్తారు.

లోకస్ట్ వాచ్ అనే పోర్టల్ ద్వారా, భూమిపై మిడుత ప్రతిస్పందనను సమన్వయం చేయడానికి ఎఫ్ఏఓ దేశాలకు సహాయపడుతుంది. ఇది సకాలంలో వివరణాత్మక సమాచారాన్ని సేకరిస్తుంది. మిడత దాడులను నిర్ధారించడానికి, ఇది పర్యవేక్షణ బృందాలను ఇంటర్నెట్‌కు అనుసంధానించే ఉపగ్రహ యాంటెన్నాలను పంపిణీ చేస్తుంది. మిడుతలు, వాటి అభివృద్ధి దశ, అలాగే నేల తేమ, వృక్షసంపద వంటి డేటాను నమోదు చేయడానికి నూతన సాంకేతికత ఉపయోగడుతుంది.

లోకస్ట్ వార్నింగ్ ఆర్గనైజేషన్ (ఎల్‌డబ్ల్యుఓ) శాస్త్రవేత్తలు రాజస్తాన్‌లోని శ్రీ గంగానగర్, జైసల్మేర్ జిల్లాల్లో మిడత సమూహాలను ఏ ప్రెల్‌లోనే గుర్తించారు. మిడుతలు సాధారణంగా జూలై–అక్టోబర్ సమయంలో వస్తాయి. సాధారణ మిడతలకు ఇవి దూరంగా ఉంటాయి. తూర్పు ఆఫ్రికాలోని మొక్కజొన్న, జొన్న, గోధుమ పంటలను ప్రస్తుతం ఇవి మింగేశాయి. మిడుతలు భారతదేశంలో కూడా కనిపిస్తాయి. ఇది సాధారణంగా జూలై–అక్టోబర్ సమయంలో మాత్రమే కనిపిస్తాయి. ఎక్కువగా ఒంటరి కీటకాలుగా, చిన్న సమూహాలలో కనిపిస్తాయి. ఈ సారి ఏప్రిల్ మధ్యకాలంలోనే భారత–పాకిస్తాన్ సరిహద్దులో వీటిని గుర్తించారు.

పశ్చిమ రాజస్తాన్, ఉత్తర గుజరాత్‌లోని కొన్ని ప్రాంతాలలో రబీ పంటల ఉత్పత్తి పెరుగుతున్నాయి. భారతదేశం కరోనావైరస్ వైపరీత్యంతో పోరాడుతున్నప్పుడు మిడతల దండు పంటలపై దాడులు చేస్తూ సమస్యలను సృష్టిస్తోంది. ప్రజలు రబీ పంటను ఇప్పటికే పండించారు. కొత్త ఖరీఫ్ సీజన్ కోసం రైతులు ఇంకా మొక్కల పెంపకాన్ని ప్రారంభించలేదు. ప్రస్తుతం ఆందోళన చెందాల్సిన అవసరంలేదని కేంద్ర మంత్రిత్వ శాఖ పేర్కొంది. కేంద్ర వ్యవసాయ మంత్రిత్వ శాఖ మొక్కల రక్షణ డైరెక్టరేట్‌లో ఎల్‌డబ్ల్యుఓ ఒక భాగం. రాజస్తాన్‌లోని జోధ్‌పూర్‌లో దానికి కార్యాలయం ఉంది. ఏప్రిల్ మూడవ వారం నుండి పాకిస్తాన్ సరిహద్దుకు ఆనుకొని ఉన్న పంజాబ్‌లోని ఫాజిల్కాలో భారీ మిడత సమూహాలను గుర్తించారు. కానీ ఇవి ఇంకా పరిపక్వ దశలలోనే ఉన్నాయి. అపరిపక్వ రెక్కలతో ఉన్నాయి. ఇప్పటివరకు సంతానోత్పత్తి, సమూహ కదలికలు కూడా కనిపించలేదు.

భారతదేశంలో మిడుతలు సాధారణ సంతానోత్పత్తి కాలం జూలై–అక్టోబర్. కానీ ఈసారి, ఏప్రిల్ మధ్యలోనే అవి కనిపించాయి. గత సంవత్సరం మే చివరిలో కనిపించాయి. అయినప్పటికీ, రాజస్థాన్‌లో (ముఖ్యంగా గంగానగర్, హనుమన్‌గర్, బికానెర్, జైసల్మేర్, జోధ్‌పూర్, నాగౌర్, జలోర్, సిరోహి), గుజరాత్ (బనస్కాంత)లో రబీ సీజన్లో మిడత సమూహాలు కనిపించాయి. వినాశనానికి కారణమయ్యే అధిక సంతానోత్పత్తిని ఇవి చేయగలవు. ఒంటరి, హానికరం కాని మిడతలకు భిన్నంగా ఇవి ఉంటాయి. వీటి సమూహాలను నిర్మించడానికి ఎక్కువ సమయం ఉండడం వల్ల సంతానోత్పత్తికి అనుకూలంగా ఉంటుంది.

అంచనాలకు తగ్గట్టుగానే మిడతలు భారత్ లోకి ప్రవేశించాయి. గత ఏడాది ఆఫ్రికా ఖండంలో అధిక వర్షపాతం నమోదు అయింది. అందువల్లే ఎడారి మిడతలు సంతానోత్పత్తిని అధికం చేయగలిగాయని భారత్ శాస్త్రవేత్తలు ఒక అంచనాకు వచ్చారు. సౌదీ అరేబియా, ఆఫ్ఘనిస్థాన్, పాకిస్థాన్ మీదుగా భారత్‌కు చేరే ప్రమాదం వుందని పర్యావరన వేత్తలు ముందుగానే కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలను హెచ్చరించారు. అయినా ప్రభుత్వాలు ఎటువంటి చర్యలు చేపట్టలేదు. మిడతల దండు దాడులను జాతీయ సమస్యగా కేంద్రం గుర్తించడం లేదు. రాజస్థాన్, ఉత్తరప్రదేశ్,

మధ్యప్రదేశ్, పంజాబ్, గుజరాత్, ఛత్తీస్‌గఢ్ రాష్ట్రాల్లోని 60 జిల్లాల్లో మిడతల దండులు వచ్చినట్టు 28.5.20న అధికారులు ప్రకటించారు. మే 1 నాటికి తమిళనాడు, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలకు మిడతల దండులు వచ్చాయి. అయితే వీటి సంఖ్య చాలా తక్కువుగా వుందని భయపడాల్సిన పనిలేదని రెండు తెలుగు రాష్ట్రాల వ్యవసాయ మంత్రులు మీడియాకు చెప్పారు.

జూన్, జులై నెలల్లో తెలుగు రాష్ట్రాల్లో మిడతల ప్రభావం అధికంగా ఉండొచ్చునని శాస్త్రవేత్తలు అంటున్నారు. ప్రధాన పంటలైన వరి, పత్తి, మిర్చిలపై మిడత దండులు దాడులు చేస్తే రైతులు తీవ్రంగా నష్ట పోతారు. కరోనా వల్ల ఇప్పటికే గిట్టుబాటు ధర లేక ఆంధ్రప్రదేశ్ రైతులు కష్టాలు పడుతున్నారు. 1993లో మిడతల ప్రభావంతో తెలంగాణ రాష్ట్రంలో కొన్ని పంటలు దెబ్బ తిన్నాయి. 18 సంవత్సరాల తర్వాత మళ్లీ ఈ ముప్పును తెలంగాణ, ఆంధ్రప్రదేశ్ ఎదుర్కోబోతోంది. మిడతలను సంహరించడానికి ఉత్తరాదిన ట్రాక్టర్లకు స్ప్రేయర్లను బిగించి రసాయనాలు పిచికారీ చేస్తున్నారు. కొన్ని చోట్ల డ్రోన్లను వినియోగిస్తున్నారు. ఈ రసాయనాల వల్ల పంటలు దెబ్బతినే అవకాశం వుంది. వేప ఆకులతో రసం చేసి, చెట్లు, మొక్కలపై స్ప్రే చేయడం ద్వారా మిడతల దండు దారిని మరిలించవచ్చని శాస్త్రవేత్తలు అంటున్నారు.

రాసాయనాల పిచికారీతో వాటిని చంపితే పర్యావరణ సమతుల్యానికి విఘాతం ఏర్పడుతుందని వారు ఆరోపిస్తున్నారు. మరోవైపు మిడతల సంహారానికి స్ప్రేయర్ల కొరతను భారత్ ఎదుర్కొంటోంది. విదేశాల నుండి దిగుమతి చేసుకుంటున్నామని కేంద్ర ప్రభుత్వ అధికారులు చెప్తున్నారు. బ్రిటన్ నుండి 60 స్ప్రేయర్లను కొనుగోలు చేశారు. కానీ వాటిలో జూన్ రెండవ వారంలో 15, చివరి వారంలో 20, జులైలో 25 భారత్‌కు వస్తాయని అధికారులు అంటున్నారు. ఈ లోపల మిడతలు లక్షల ఎకరాల్లో పంటను నాశనం చేస్తే రైతులు రోడ్డున పడతారు. తీవ్రమైన ఆహారకొరత ఏర్పడే ప్రమాదముంది.

మిడుతలు అక్రిడిడే కుటుంబంలోని కొన్ని జాతులకు సంబంధించినవి. మిడతలు సమూహ దశను కలిగి ఉంటాయి. ఈ కీటకాలు సాధారణంగా ఏకాంతంగా ఉంటాయి. కానీ కొన్ని పరిస్థితులలో అవి మరింత సమృద్ధిగా సంతానోత్పత్తిని చేస్తాయి. వాటి ప్రవర్తన, అలవాట్లను మార్చుకుంటాయి. మిడత జాతుల మధ్య వర్గీకరణ వ్యత్యాసం లేదు. ఒక జాతి అడపాదడపా తగిన పరిస్థితులలో సమూహాలను ఏర్పరిచే అవకాశం ఉంది. కొన్ని జాతి మిడతలు హానికరం కావు. వాటి సంఖ్య తక్కువగా ఉంటుంది. వ్యవసాయానికి పెద్ద ఆర్థిక ముప్పు కలిగించవు. ఏదేమైనా, వేగవంతమైన వ్యవసాయ అభివృద్ధి జరిగిన తరువాత, కరోనా లాంటి విపత్కర పరిస్థితులలో, వాటి మెదడుల్లోని సెరోటోనిన్ మార్పులను ప్రేరేపిస్తుంది. అవి సమృద్ధిగా సంతానోత్పత్తి చేయడం ప్రారంభిస్తాయి. వాటి జనాభా తగినంత దట్టంగా మారినప్పుడు అవి పెద్దగా, సంచారంగా మారుతాయి. ఇవి వలసలు ప్రారంభిస్తాయి. తరువాత ఇవి రెక్కలున్న పెద్ద సమూహంగా మారుతాయి. తర్వాత వేగంగా పొలాల్లోని పంటలకు నష్టం కలిగిస్తాయి. శక్తివంతమైన ఫ్లైయర్స్‌గా మారతాయి. ఇవి చాలా దూరం ప్రయాణించగలవు. సమూహం వెళ్లేటప్పుడు తన దారిలో అడ్డువచ్చిన ఆకుపచ్చ మొక్కలను తినేస్తాయి.

ఐక్యరాజ్యసమితి ఫుడ్ అండ్ అగ్రికల్చర్ ఆర్గనైజేషన్ (ఎఫ్ఏఓ) ప్రస్తుతం మిడుత కార్యకలాపాల వల్ల నష్టపోయే మూడు హాట్‌స్పాట్‌లను గుర్తించింది. ఈ హాట్ స్పాట్‌లలో పరిస్థితి చాలా భయనకంగా ఉంటుంది. హార్న్ ఆఫ్ ఆఫ్రికా, ఎర్ర సముద్ర ప్రాంతం, నైరుతి ఆసియాలను హాట్ స్పాట్‌లుగా ఎఫ్ఎఓ గుర్తించింది. ఆఫ్రికా హార్న్ ఎక్కువ ప్రభావిత ప్రాంతంగా పిలువబడింది. ఇక్కడ ఎఫ్ఏఓ ఆహార భద్రత, జీవనోపాధికి ఎక్కువ ముప్పు ఉందని పేర్కొంది. ఇథియోపియా, సోమాలియా నుండి మిడుత సమూహాలు దక్షిణాన కెన్యా ఖండంలోని 14 ఇతర దేశాలకు ప్రయాణించాయి. ఇథియోపియాలోని రిఫ్ట్ వ్యాలీ కూడా తెగులుతో బాధపడుతోంది.

ఈ వ్యాప్తి 25 సంవత్సరాలుగా ఇథియోపియా సోమాలియాను తాకుతోంది. గత 70 సంవత్సరాలలో కెన్యా అత్యంత ఘోరమైన ముట్టడి ప్రాంతంగా మారింది. అంతర్జాతీయ సమాజ సహాయం లేకుండా, జూన్ నాటికి ఈ ప్రాంతం అంతటా మిడుతలు 500 రెట్లు పెరుగుతాయని ఎఫ్ఏఓ తెలిపింది. ఎర్ర సముద్రం ప్రాంతంలో, సౌదీ అరేబియా, ఒమన్, యమన్‌లలో మిడుతలు వచ్చేశాయి. ఇండో-పాకిస్తాన్ సరిహద్దు ప్రాంతం నుండి ఈ సమూహాలు ఇక్కడకు వచ్చాయని భావిస్తున్నారు. నైరుతి ఆసియాలో, మిడుతల సమూహాలు ఇరాన్, భారతదేశం, పాకిస్తాన్లలో నష్టాన్ని కలిగించాయి.

యుఎన్ ఫుడ్ అండ్ అగ్రికల్చర్ ఆర్గనైజేషన్ ఇచ్చే డిజిటల్ మ్యాపులు మిడుతలు ఉన్న ప్రాంతాలను, వాటి కదలికలను చూపిస్తాయి. భారతదేశంలో నాలుగు జాతుల మిడుతలు కనిపిస్తాయి. ఎడారి మిడుత (స్కిస్టోసెర్కా గ్రెగారియా), వలస మిడుత (లోకస్టా మైగ్రేటోరియా), బొంబాయి లోకస్ట్(నోమాడాక్రిస్ సక్సింక్టా), చెట్టు మిడుత (అనాక్రిడియం). ఎడారి మిడుత భారతదేశంలోను, అంతర్జాతీయంగా కూడా అత్యంత వినాశకరమైన తెగులుగా పరిగణించబడుతుంది. ఒక చదరపు కిలోమీటరు విస్తీర్ణంలో ఒక చిన్న సమూహంతో (35,000 సంఖ్యతో) ఒకే రోజులో పచ్చని పంటలను తినగలుగుతాయి. ఈ కీటకాలు వ్యవసాయ భూములను, మిలియన్ డాలర్ల విలువైన పంటలను దెబ్బతీశాయి. రాజస్తాన్, గుజరాత్ రాష్ట్రాలు ఎక్కువగా ప్రభావిత మయ్యాయి. పశ్చిమ రాజస్తాన్ మిడతల నుండి ఇబ్బందులు పడుతూనే వుంది. 10 జిల్లాల్లో కనీసం 3.6 లక్షల హెక్టార్ల విస్తీర్ణంలో మిడుతలు పంటలను దెబ్బతీశాయి.

మిడుత జనాభాను నియంత్రించే సాంకేతిక పరిజ్ఞానం ఇప్పుడు అందుబాటులో ఉంది. అయితే ప్రభుత్వాల నిర్లక్ష్యం వల్ల నష్టాన్ని తగ్గించే ప్రయత్నాలు జరగడం లేదు. మిడుతలు సంచార దశకు చేరుకోవడానికి ముందే వాటిని పురుగుమందులతో నాశనం చేయవచ్చు. మొరాకో, సౌదీ అరేబియా వంటి ధనిక దేశాలలో వారు నూతన సాంకేతిక పద్ధతులతో వాటిని ముందుగానే నాశనం చేస్తున్నారు. కాని పొరుగున ఉన్న పేద దేశాలకు (మౌరిటానియా, యెమెన్, మొదలైనవి) వనరులు లేవు. ఆయా ప్రాంతాలలోని పంటలను మిడుత సమూహాలు నాశనం చేస్తున్నాయి.

ప్రపంచంలోని అనేక సంస్థలు మిడుతల నుండి వచ్చే ముప్పును పర్యవేక్షిస్తాయి. సమీప భవిష్యత్తులో మిడుత తెగుళ్లతో బాధపడే ప్రాంతాలను గుర్తించి ముందుగానే సమాచారాన్ని ఇస్తున్నారు.

సూచనలను అందజేస్తున్నారు. ఈ వివరాలను ఆస్ట్రేలియన్ ప్లేగు లోకస్ట్ కమిషన్ అందిస్తోంది. అభివృద్ధి చెందుతున్న మిడతల వ్యాప్తిని నివారించడానికి, వాటితో జాగ్రత్తగా వ్యవహరించడానికి ఈ కమిషన్ ఉపయోగపడుతోంది. కాని మిగతా చోట్ల నుండి మిడుత దండయాత్రలు లేకుండా పర్యవేక్షించడానికి, రక్షించడానికి సరైన సంస్థలు లేవని చెప్పచ్చు. మధ్య దక్షిణాఫ్రికా కొరకు అంతర్జాతీయ లోకస్ట్ కంట్రోల్ ఆర్గనైజేషన్ సేవలను అందిస్తుంది. పశ్చిమ, వాయువ్య ఆఫ్రికాలో, ఈ సేవను పశ్చిమ ప్రాంతంలోని ఎడారి మిడుతలను నియంత్రించడానికి ఆహార, వ్యవసాయ సంస్థ కమిషన్ పని చేస్తోంది. ప్రతి దేశానికి చెందిన మిడుత నియంత్రణ సంస్థలు శక్తివంతంగానే పనిచేస్తున్నాయి. కాకసస్, మధ్య ఆసియాలో 25 మిలియన్ హెక్టార్ల సాగు భూమిని కూడా ఎఫ్ఏఓ పర్యవేక్షిస్తుంది.

భారతదేశంలో మిడుత నియంత్రణకు కొన్ని సంప్రదాయక పద్ధతులను ఉపయోగిస్తున్నారు. అవసరమైనప్పుడు ట్రాక్టర్ ఆధారిత స్ప్రేయర్‌లను ఉపయోగిస్తారు. నీటి ఆధారిత పురుగుమందులను వేయడం ద్వారా హోప్పర్‌లను ప్రారంభంలోనే నాశనం చేస్తున్నారు. ఇది ప్రభావవంతమైనది అయినప్పటికి, శ్రమతో కూడుకున్నది. ఎందుకంటే మిడతల దండు వేల ఎకరాల పంటలను కొద్ది రోజులలోనే నాశనం చేస్తుంది. అటువంటపుడు, సాధ్యమైన చోట, కీటకాలపై, అవి తినే వృక్ష సంపదపై విమానం నుండి సాంద్రీకృత పురుగుమందులను చల్లాలని నిపుణులు సూచిస్తున్నారు. పెద్ద ప్రాంతాలను వేగంగా చికిత్స చేయడానికి ఉపయోగించవచ్చు. మిడుత నియంత్రణ ప్రణాళిక కోసం ఉపయోగించే ఇతర ఆధునిక సాంకేతిక పరిజ్ఞానాలలో జిపిఎస్, జిఐఎస్ సాధనాలు ముఖ్యమైనవి. ఉపగ్రహ చిత్రాల ద్వారా కంప్యూటర్లు వేగంగా డేటా నిర్వహణ, విశ్లేషణలను అందిస్తాయి.

మిడతలను నియంత్రించడానికి పురుగుమందును 1997లో ఆఫ్రికా అంతటా చల్లి ఒక బహుళజాతి బృందం పరీక్షించింది. సంతానోత్పత్తి ప్రదేశాలలో పిచికారీ చేయించారు. మెటార్జియం యాక్రిడమ్ అనే ఈ మందు ఎండిన ఫంగల్ బీజాంశపు అంకురోత్పత్తిపై పనిచేస్తుంది. మిడుత శరీర కుహరంపై దాడి చేసి వాటి మరణానికి కారణమవుతుంది. మిడుత నియంత్రణకు ఈ విధానం 2009లో టాంజానియాలో ఉపయోగించబడింది. మిడుతలు సోకిన ఇకు-కటావి నేషనల్ పార్క్‌లో సుమారు 10,000 హెక్టార్లలో చికిత్స చేయడానికి ఈ మందు ఉపయోగించబడింది. మందు చల్లినప్పిటికీ ఈ ప్రాంతంలో ఉన్న ఏనుగులు, హిప్పోపొటామస్, జిరాఫీలు క్షేమంగా ఉన్నాయని ఆ దేశం తెలిపింది. మిడుత నియంత్రణలో అంతిమ లక్ష్యం పర్యావరణాన్ని కాపాడటమే. క్రియాశీల పద్ధతులను ఉపయోగించి పర్యావరణ కాలుష్యాలను తగ్గించాలి. స్థానిక ప్రజల మనుగడకు పంటలు పండించడం అత్యవసరం. సహజంగా సంభవించే ఫంగస్ మెటార్జియం చేత మిడుతలు చంపబడటం ఉత్తమమైన మార్గమని పర్యావరణ వేత్తలు భావిస్తారు. జీవ నియంత్రణకు, పర్యావరణకు ఈ మార్గం అనుకూలమైనది.

నియంత్రణ కార్యకలాపాలు లేకపోతే, మిడతల దాడి పరిమాణం 2019-20 రబీ సీజన్ కంటే ఘోరంగా ఉండవచ్చు. ఎల్‌డబ్ల్యుఓ ప్రకారం, గత సంవత్సరం లోకస్ట్ (1993 తరువాత) వల్ల రాజస్తాన్, గుజరాత్‌లోని స్థానిక అధికారులు ట్రాక్టర్లు, ఇతర వాహనాలపై స్ప్రేయర్‌లతో 4.30 లక్షల హెక్టార్లకు పైగా ప్రభావిత ప్రాంతాలలో మందును పిచికారి చేయాల్సి వచ్చింది. ఆర్గానోఫాస్ఫేట్ పురుగు మందులు, మలాథియాన్ (96 శాతం అల్ట్రా తక్కువ వాల్యూమ్‌తో) మిడుతలకు వ్యతిరేకంగా ప్రభావశీలంగా పనిచేస్తాయని వ్యవసాయ శాస్త్రవేత్తలు అంటున్నారు.

మిడత విశ్రాంతి తీసుకునే చెట్లతో సహా, వాటి సంతానోత్పత్తి ప్రాంతాలలో ఒక హెక్టార్ విస్తీర్ణ చికిత్స కోసం ఒక లీటరు రసాయనం అవసరమవుతుంది. అయితే ఈ రసాయనాల వల్ల పంట ఉత్పత్తి కలుషితమయ్యే ప్రమాదముందని పర్యావరణవేత్తలు హెచ్చరిస్తున్నారు. ఏ రకమైన మిడుతలను నియంత్రించడానికైనా పురుగు మందుల నిల్వలు తగినంతగా ఉన్నాయని ఎల్‌డబ్ల్యుఓ పేర్కొంది. నియంత్రణ కార్యకలాపాలకు పరికరాల కొనుగోలు, క్షేత్ర స్థాయిలో బృందాలకు శిక్షణ, ప్రధాన సంతానోత్పత్తి ప్రదేశాలలో సరఫరా తయారీ, ఆకస్మిక ప్రణాళికలను రచించడం అవసరమవుతంది. ఆధునిక నాగరికత, నూతన సాంకేతికత ఎంతగా అభివృద్ధి చెందినా ప్రకృతి మానవ మనుగడకు సవాలు విసురుతూనే వుంది. ఈ సవాలును స్వీకరిస్తూ, ప్రకృతికి నష్టం వాటిల్లకుండా నివారణ చర్యలు తీసుకోవాల్సిన అవసరముంది. కరోనా మనుషులను నాశనం చేస్తే, మిడతలు మనుషులు తినే పంటలను నాశనం చేస్తాయి.

ఈ మిడత దండులు అధిక సంఖ్యలో తయారవడానికి, లక్షల ఎకరాల్లో పంటలను నాశనం చేయడానికి అడవులను నరికివేసే పారిశ్రామికీకరణే ప్రధాన కారణంగా వుంది. కేంద్ర ప్రభుత్వంతోను, ఇతర రాష్ట్రాలతోనూ సమన్వయం చేసుకోవడం, పాలనాపరమైన చర్యలు చేపట్టడంతోబాటు రైతాంగాన్ని అప్రమత్తం చేయాలి. మిడతలు పొలాల్లోకి ప్రవేశించకుండా ముందుగానే మంటలు వేయడం వంటివి క్షేత్రస్థాయిన జరగాలి. తెలంగాణ ముఖ్యమంత్రి ఇప్పటికే శాస్త్రవేత్తలతో సమీక్షా సమావేశం నిర్వహించారు. పంటల సంరక్షణకు, సమాజానికి సంబంధించిన అంశం కనుక రాజకీయ పార్టీలు, రైతు, వ్యవసాయ కార్మిక సంఘాలు, స్వచ్ఛంద, ప్రజాస్వామ్య సంస్థలను ఇందులో ప్రభుత్వాలు భాగస్వామ్యం చేయాలి. కరోనాతో ఏర్పడిన ఆహార కొరతను, మిడతల దాడులు మరింత తీవ్రతరం చేయనున్నాయి. ఈ ప్రమాదాన్ని నివారించడానికి ప్రభుత్వాలతో పాటు ప్రజలు తమ వంతు కృషి చేయాలి.

*(రచయిత పౌరహక్కుల సంఘం సభ్యులు)* వీ

*మానవ ఆలోచన భౌతిక సత్యాన్ని గ్రహించగలదా అనేది సైద్ధాంతిక ప్రశ్న కాదు. అది ఆచరణలో తేలే ప్రశ్న. సత్యాన్ని, అంటే, తన ఆలోచనకు సంబంధించిన వాస్తవికతనూ, శక్తినీ, తాను చూసే పార్శ్వాన్నీ మనిషి ఆచరణలోనే రుజువు చేయవలసి ఉంటుంది. ఆలోచన వాస్తవికమైనదా, అవాస్తవికమైనదా అనే వివాదాన్ని ఆచరణ నుంచి వేరు చేస్తే అది కేవలం పండిత చర్చే అవుతుంది.*

**- కార్ల్ మార్క్స్**

## డా. కె. మధుసూదన రావు



డా. కేశవరం మధుసూదనరావు మార్చ్ 5న క్యాన్సర్‌తో చనిపోయారు. మధుసూదన్ రావు మొదటి నుండి తెలుగునాట జరిగిన అన్ని ప్రగతిశీల ఉద్యమాలలో చురుకుగా పాల్గొనేవాడు. 1969 తెలంగాణ ఉద్యమంలో మర్రి చెన్నారెడ్డితో విభేదించి పోటీ ప్రజాసమితి నెలకొల్పిన శ్రీధర రెడ్డితో కలిసి పనిచేసిన అభ్యుదయవాది. ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘం ప్రారంభమయిన తొలి రోజులలో పత్తిపాటి వెంకటేశ్వర్లు కార్యదర్శిగా ఉన్నప్పుడు ఆయనకు చేదోడువాదోడుగా ఉంటూ సంఘ కార్యకలాపాలలో పాలు పంచుకొనేవాడు. 'జీవనాడి' పత్రిక నిలదొక్కు కోవడంలో తనవంతు పాత్ర పోషించాడు. న్యూ ఢిల్లీలోని ప్రతిష్టాత్మక ఆల్ ఇండియా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ మెడికల్ సైన్సెస్‌లో ప్రత్యేక శిక్షణ పొంది పర్యూజన్ రంగానికి హైదరాబాద్‌లో పాదులు నాటినవాడు మధుసూదన్ రావు. దేశంలో ఎక్కడా పర్ఫ్యూజను రూపురేఖలు లేని దశలో 'పోస్ట్ గ్రాడ్యుయేట్ డిప్లొమా ఇన్ పర్ఫ్యూజన్ టెక్నాలజీ' అన్న కోర్సుకు రూపకల్పన చేసి దానికి ప్రభుత్వం నుండి అనుమతులు పొంది, నిజాం ఇన్స్ ట్యూట్ ఆఫ్ మెడికల్ సైన్సస్‌లో ప్రవేశపెట్టడానికి కృషిచేసిన ప్రముఖుల్లో ముఖ్యులు. కుడిచేతితో చేసిన సహాయం ఎడమచేతికి తెలియనట్టుగా మధుసూదన్ రావు మిత్రులకు, ఉద్యమాలకు తోడ్పాటునందించేవాడు.

## జె. కృష్ణమోహన్



ఉద్యోగక్రాంతి వ్యవస్థాపకులలో ఒకరైన జె.కృష్ణమోహన్ (81) అనారోగ్యంతో జూన్ 10న హైదరాబాద్‌లో మృతిచెందారు. ఆయన ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ సచివాలయంలో వివిధ హోదాల్లో అత్యంత సమర్థవంతంగా నిజాయితీగా పనిచేశారు. ఉద్యోగుల హక్కుల కోసం నడుస్తున్న ఉద్యోగక్రాంతికి సంపాదకులుగా, ఎంప్లాయిస్ కోఆర్డినేషన్ కమిటీ కోశాధికారిగా సేవలందించారు. ప్రజాస్వామిక ఉద్యమాల పట్ల స్నేహపూర్వకంగా ఉండేవారు. ఆయన జీవించినంత కాలం మానవ విలువతో జీవించారు.

## హోస్బెట్ సురేశ్



హక్కుల ఉద్యమకారుడు జస్టిస్ హోస్బెట్ సురేశ్(91) ముంబైలో జూన్ 11న మృతిచెందారు. సురేశ్ కర్ణాటకలోని సూరత్ కల్ జిల్లా హోస్బెట్ పట్టణంలో 1929 జూలై 20న జన్మించారు. ముంబైలో ఎల్ఎల్ఎం పూర్తిచేసి అక్కడే హైకోర్టులో న్యాయవాద వృత్తిని ప్రారంభించి 1991లో ముంబై హైకోర్టు జడ్జిగా పదవీ విరమణ చేశారు. భారత రాజ్యాంగ విలువలను సామాన్య ప్రజలకు తెలియజేసిన వ్యక్తి జస్టిస్ సురేశ్. 1964లో సంజయ్ గాంధీ నేషనల్ పార్కును పరిరక్షించదానికని బొంబాయి కార్పొరేషన్ మురికి వాడలను కాల్చివేసి, భయపెట్టి బలవంతంగా ఖాళీ చేయించే ప్రయత్నం చేసింది. ఆ సందర్భంలో జస్టిస్ సురేశ్ బృందంగా ఏర్పడి దాన్ని ఆపించగలిగింది. 'ముందు బొంబాయి చుట్టూ ఇనుప ముళ్ల కంచె వేసి తరువాత మురికివాడలను ఖాళీ చేయించండి' అన్న మాటను సుమోటోగా తీసుకొని కార్పొరేషన్ పిటిషన్‌ను హైకోర్టు కొట్టివేసింది. దీని ఫలితంగా సుమారు 60,000 మంది తిరిగి అక్కడే ఇల్లు నిర్మించుకోగలిగారు. 1992-93లో ముంబైలో జరిగిన అల్లర్లపై విచారణకు మానవహక్కుల కమిషన్ సురేశ్‌ను నియమించింది. దానిపై ఆయన తయారు చేసిన నివేదికను 'ప్రజల తీర్పు' అన్నారు.

## బి.పి.ఆర్. విఠల్



ప్రముఖ ఆర్థిక నిపుణుడు, రిటైర్డ్ ఐఏఎస్ అధికారి బారు పాండురంగ విఠల్ (93) కొద్దిరోజులుగా అనారోగ్యంతో హైదరాబాద్‌లోని ఓ ప్రైవేటు ఆస్పత్రిలో చికిత్స పొందుతూ జూన్ 19 మరణించారు. ఆయన తూర్పు గోదావరి జిల్లా కాకినాడలో జన్మించారు. ఆయన తండ్రి ఆచార్య బివి రాజనర్సు ఉద్యోగరీత్యా హైదరాబాద్‌లో స్థిరపడ్డారు. నిజాం కాలేజీలో ఇంటర్ చదువుతున్న సమయంలో 'క్విట్ ఇండియా' ఉద్యమంలో పాల్గొన్నారు. విఠల్ ఉన్నత విద్య మద్రాసు క్రిస్టియన్ కాలేజీలో పూర్తయింది. ఆ కళాశాల విద్యార్థి సంఘానికి అధ్యక్షుడిగా ఎన్నికైన తొలి భారతీయుడు విఠలే. ఉమ్మడి ఆంధ్రప్రదేశ్ ఆర్థిక, ప్రణాళికా శాఖల కార్యదర్శిగా దశాబ్దకాలం పని చేశారు. ప్లానింగ్ అండ్ డెవలప్‌మెంట్ బోర్డు వైస్ చైర్మన్‌గానూ వ్యవహరించారు. ఐఎంఎఫ్ సలహా దారుగా, పదో ఆర్థిక సంఘం సభ్యుడిగా సేవలందించారు. జనవిజ్ఞాన వేదిక అనుబంధ సంస్థ 'భారత జ్ఞాన, విజ్ఞాన సమితి' చైర్మన్‌గా రెండు దశాబ్దాలు కొనసాగారు. ఆర్థిక రంగంలో నిష్ణాతుడైన విఠల్ పలు పుకాలు రాశారు. తెలంగాణ ఉద్యమానికి మద్దతుగా నిలిచారు.

## గుల్యం అంపయ్య



గత నాలుగు దశాబ్దాల పైగా పాలమూరు జిల్లాలో ప్రజా ఉద్యమాలన్నిటికీ నాయకుడుగా, కార్యకర్తగా, ప్రతినిధిగా వేలాది మందికి తలలో నాలుకగా ఉన్న గుల్యం అంపయ్య సారు (1948-2020) నిన్న గుండెకు జరిగిన శస్త్ర చికిత్స తర్వాత జూన్ 22న మరణించారు. 1979 వరంగల్ సాహిత్య పాఠశాల లోనో, 1980 హైదరాబాద్ దశాబ్ది సభలలోనో ఆయన విరసంలో చేరారు. అంపశ్రీ పేరుతో కవిత్వం రాశారు. అంతకు ముందు నుంచే ఉపాధ్యాయుడుగా పనిచేస్తూ మహబూబ్‌నగర్ జిల్లా రాడికల్ విద్యార్థి, యువజన ఉద్యమాలకు అండగా ఉన్నారు. ఆంధ్రప్రదేశ్ టీచర్స్ ఫెడరేషన్‌లోనూ, డెమొక్రటిక్ టీచర్స్ ఫెడరేషన్ లోనూ జిల్లా స్థాయిలోనూ, రాష్ట్ర స్థాయిలోనూ కీలక బాధ్యతలు నిర్వహించారు. గద్వాల విరసం సాహిత్య పాఠశాల (1984)కి ప్రధాన బాధ్యులలో ఒకరుగా ఉన్నారు. విరసం నుంచి దూరమైనప్పటికీ, ఉపాధ్యాయ ఉద్యమంలో చివరిదాకా ఉన్నారు.

## మౌలానా నసీరుద్దీన్



వహదత్-ఏ-ఇస్లామీ వ్యవస్థాపక అధ్యక్షుడు మౌలానా నసీరుద్దీన్ (75) జూన్ 27న సైదాబాద్‌లోని తన నివాసంలో మృతి చెందారు. మౌలానా నసీరుద్దీన్ సిఏఏ-ఎన్ఆర్‌సికి వ్యతిరేకంగా జాయింట్ యాక్షన్ కమిటీ ఏర్పాటులో కీలకపాత్ర పోషించారు. 1990వ దశకంలో తహరీక్ తహఫూజ్-ఎ-షేర్-ఎ-ఇస్లాం(టిటిఎస్ఎ) అనే సంస్థను స్థాపించారు. 2002లో గుజరాత్ మాజీ హోం మంత్రి హరేన్ పాండ్య హత్య కేసులో ఆరేళ్ల పాటు జైలు జీవితం కూడా గడిపారు. వీ

